అట్టలోపలి వైపున అచ్చు వేసిన శిల్ప చిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు, గౌతమబుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవికన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది.

— నాగార్జునకొండ క్రీ. శ. 2వ శతాబ్దం.

— జాతీయ పురావస్తుశాల, న్యూఢిల్లీవారి సౌజన్యం

# కలకత్తాకి దగ్గరలో

(సాహిత్య అకాదెమీ బహుమతి పొందిన బెంగాలీ నవల)

మూలం :

గజేంద్ర కుమార మిత్ర

తెలుగుసేత :

మద్దిపట్లసూరి



సాహిత్య అకాదెమీ

*Kalakattaki Daggiralo* — Telugu translation by Sri Maddipatla Suri of Gajendrakumar Mitra's Award Winning Bengali Novel *Kalakatar Kachhie*. Sahitya Akademi, 1990. Rs. 40.


First Edition : 1990

సాహిత్య అకాడెమీ

ప్రధాన కార్యాలయం :

రవీంద్ర భవన్, న్యూఢిల్లీ - 110001.

విక్రయ విభాగం :

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110001

ప్రాంతీయ కార్యాలయాలు :

29, ఎల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాసు - 600 018.
బ్లాక్ V - బి, రవీంద్ర స్టేడియమ్, కలకత్తా - 700 029.
172, ముంబయ్ మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్,
బొంబాయి - 400 014.

రూ : 40

Stree Seva Mandir Press, Madras - 93.

సాహితీరసజ్ఞులు

ప్రసిద్ధ సినీనటులు, ప్రముఖ చిత్ర కథా రచయిత, నిర్మాత, దర్శకులు

**శ్రీ డాక్టరు యమ్. ప్రభాకరరెడ్డి గారికి**

గౌరవపురస్సరంగా

అనువాదకుడు

ఈ నవల రచనా కాలం— 1949 - 1955

ఈ నవలలోని పాత్రలు, సంఘటనలు - అన్నీ కల్పితాలు. ఏ వాస్తవిక సంఘటనలతో కాని, వ్యక్తులతో కాని, దైవికంగా సాదృశ్యం కలిగితే అది కేవలం కాకతాళీయం. ఈ పాత్రల్ని తీసుకుని, ఇంకా ఒకటి రెండు నవలలు రాయాలని నా కోరిక. కాని యింకా చాలా రోజుల తర్వాత -

—రచయిత

# ఒకటవ పరిచ్ఛేదం

## 1

కలకత్తాకి దగ్గిర. చాలా దగ్గిర. నగరాని కింత దగ్గిరలో ఇలాంటి ప్రదేశమున్నదని కళ్లతో చూడకపోతే నమ్మటం కష్టం. హౌరా నుంచి బి. యన్. ఆర్. రైలెక్కితే యెనిమిది తొమ్మిది మైళ్లకంటె యెక్కువ దూరం ఉండదు. రెండుచోట్ల మారటానికిష్టపడితే, బస్‌లో కూడా వెళ్లొచ్చు - వర్షాకాలంలో తప్ప. వర్షాకాలంలో ఈదారి నడవశక్యం కాకుండా తయారవుతుంది.

స్టేషన్‌లో దిగి, సూటిగా వెళ్లేదారి వెంట, మూడు నాలుగు నిమిషాలు నడవగానే, మీ కేదో అరణ్యంలో ప్రవేశించామనిపిస్తుంది. దారి అంతా గుంటలతో, గోతులతో ఆనవాలు లేకుండా పోయింది. అసలిది పక్కా రోడ్డేట ! కాని యిప్పుడా గుర్తులు వెతికినా కనిపించవు. వర్షాకాలంలో అంతా మోకాళ్లలోతు బురదవుతుంది. అందులోంచి పెద్దపెద్ద లారీలు, యెడ్లబళ్లు వెడుతూండటంతో యేర్పడిన గోతులు - వర్షాకాలం వెళ్లిపోగానే కొండల ప్రక్కన లోయల్లా తయారవుతాయి. ఇంక చైత్రవైశాఖమాసాల్లో ఆ గడ్డలన్నీ నలిగి, మైదాపిండిలా మెత్తటి దుమ్ముగా మారి, మట్టి యెడారిలా తయారవుతుంది. ఈ దుమ్ములో నడుస్తూంటే మడమల వరకు మునిగిపోతాయి. దారి కటుయిటూ నీళ్లలో లెక్కలేనన్ని దొరువులు మీ కంటపడతాయి. ఒకటి రెండు చెరువులు కనపడినా ఆశ్చర్యం లేదు. ఇళ్లూ వాకిళ్లూ ఉన్నాయి. వాటి ఉనికి కూడా బాగా తెలుస్తూనే ఉంటుంది. కాని అవి యెప్పుడయినా కన్పిస్తాయి కళ్లకి. ఎంచేతంటే మీ దృష్టి ఆ యిళ్లన్నిటి మీదికి ఒరిగిపడిన వెదురు, చింత, గంగరేగి, చెట్లమీద అతుక్కుపోతుంది. అంతేకాక పైగా అడవి తీగెలెన్నో వాటికి పెనవేసుకొని పోయి ఉంటాయి. రోజూ ఆదారిన నడిచి వెళ్లేవాళ్లు తలలు వంచుకొని వెడుతుంటారు. కాని వాటిని నరికివెయ్యాలని, నరికించాలన్న సంగతి మాత్రం యెవ్వరికీ తోచదు.

దారికటూ - యిటూ పెద్ద పెద్ద గోతులు వాననీటితో, ఆ తర్వాత చాలా రోజులు బురదతో నిండి ఉంటాయి. చాలా యిళ్లలోంచి మురికి, చెత్తా అంతా యీ దారిలోనే పడుతుంది. బయటికి పోవటమంటూ ఉండదు. దాని మూలంగా ఒక విధమైన దుర్వాసన ఈ యిళ్లలోని గాలి నిండాకమ్ముకుని ఉంటుంది. ఈ గోతులు ఉడుములు, పునుగుపిల్లులు మొదలయిన జంతువులకు స్థావరాలు. ఈ ప్రమాదకరమైన ఉడుములు పగటి వెలుగులోనే బాహాటంగా అటు - యిటు తిరుగుతూంటాయి. ఇక్కడ దోమలు పగలు చాటున ఉండాలని అనుకోవు. పగలు, రాత్రి సర్వనాశకరమైన మలేరియా విషాన్ని వ్యాపింప చేస్తూంటాయి.

దాని ఫలితంగా ఎప్పుడూ యిక్కడ స్థిరంగా ఉండే ప్రజ సగం చచ్చినవారిలా ఉంటారు. మలేరియా జీర్ణకోశ వ్యాధులు వారి జీవనశక్తి నేదో బయటికి త్రోసేశాయనిపిస్తుంది. వీరు ప్రతిక్షణం జీవితాన్నేదో వెట కారంగా భావిస్తున్నట్లుంటారు. ఆఫీసుల్లో పని చేసేవాళ్లయినా ఆరోగ్యంగా ఉంటారా అంటే అదేం లేదు. వారు జ్వరం వచ్చినా వణకుతూ తమ ఆఫీసులకు వెడుతూనే ఉంటారు. సాయంత్రం తిరిగివచ్చేప్పుడు బజారు నుంచి సరుకులు తెచ్చుకునే సంచులు చేతుల్లోనే ఉంటాయి. కనుక ఆ మాత్రం ప్రాణశక్తి ఇంకా అంతరించిపోకుండా మిగిలి ఉంది. వారిలో కొంచెం మంచి ఉద్యోగాలు చేసేవారు. అంటే – వి. గుప్త లేదా ఎడ్వర్డ్స్ టానిక్‌లు కొనుక్కోగల స్తోమత కలవారు - వారి పరిస్థితి కాస్త నయం. అంతకంటె పెద్ద ఉద్యోగాలు చేసేవారు యిక్కడ ఉండరు. పనిలేకుండా ఉన్న ఆత్మీయులకు ఇళ్లు వదిలేసి, కలకత్తా వెళ్లి ఇళ్లు తీసుకొని ఉంటూంటారు.

అయితే యిక్కడ రాజాలు కూడా ఉన్నారు. రాజాలకంటె ధన వంతులైన జమీందార్లూ ఉన్నారు. వారు ప్రజలు కష్టపడతారనే ఉద్దేశంతో ఈ ఊరిని మున్సిపాలిటీ కానివ్వలేదట. రాజాలు, జమీందార్లు ఇక్కడ కాపురముండరు. చాలామంది కలకత్తాలో బాలీగంజ్‌లో యిళ్లు తీసుకొని ఉంటారు. అయితే గ్రామస్థులు కనుక ప్రయత్నం చేస్తే వారేమీ అడ్డు పడరు నిజమే ! కాని ప్రయత్నంచేసే దెవరు ? ఏడాదిలో తొమ్మిది నెలలు వారు అస్వస్థతగానే ఉంటారు. ఇటీవల యుద్ధం ధర్మమా అని కొంత మంది జనం వచ్చారు. ఇళ్లుకూడా కొన్ని అక్కడక్కడ కన్పిస్తూంటాయి. రాస్తాల్లో వీధుల్లో మనుషులు తిరుగుతూండటం కన్పిస్తుంది. అప్పుడప్పుడు బిగ్గరగా నవ్వులు కూడా విన్పిస్తుంటాయి. అంతమాత్రాన వీధులు, దారులు కొంచెం మెరుగయాయని, అడివి తరిగిపోయిందని అనుకుంటే అది మీ

భ్రమ. మీరు నాలుగణాల టిక్కెట్ కొనుక్కుని అక్కడికెళ్లటానికిష్టపడితే ఆ భ్రమ కరిగి పోవటానికెంతోసేపు పట్టదు.

అయితే దారే వెడుతూంటే నాలుగయిదిళ్లు బాగా కన్పిస్తాయి, నిజమే కాని అంతమాత్రాన అడవి యేమీ తగ్గిపోలేదు. కొంచెం ముందుకి వెళ్లి, కాలవ వంతెన దాటి, కుడి వైపునుండే అంగళ్లు వదిలి, వీధిప్రక్కనుంచి వెడుతూంటే. - మీకు మధ్యాహ్నమే సూర్యుడస్తమించాడా అనిపిస్తుంది. ఒక విధమైన దుర్గంధం మీ ఉచ్ఛ్వాస విశ్వాసాలను అడ్డగిస్తుంది. అప్పుడింక మీరు శ్యామాఠాకూరానీ యింటి దగ్గర కొచ్చామని గ్రహిస్తారు.

చాలా పెద్దస్థలంలో ఉన్న యిల్లు ఆమెది. అది ఆమె స్వంత యిల్లు. ఆమె భర్తది కాదు, ఇంతవరకు కొడుకులదీ, కూతుళ్లదీ కూడా కాదు. ఆ స్థలంలో ఒక చెరువు ఉంది. పాతిక కొబ్బరి చెట్లు, ఇంచు మించు వంద అరటిచెట్లు, జామ, మామిడి, నేరేడు, మారేడు, పోకచెట్లు యెన్ని ఉన్నాయో అంతులేదు. వాటి మధ్య వెదురుచెట్లు కూడా ఉన్నాయి. శ్యామా ఠాకూరానీ తన స్థలంలో అంగుళం చోటు కూడా వృథాగా విడిచి పెట్టటానికి ఒప్పుకోదు. దాంతో చెట్లు మరీ దగ్గిర దగ్గిరగా ఉండటం మూలంగా యే చెట్టూ బాగా కాపుకురావు. ఆమె యిరుగు పొరుగు వారి చెట్ల కాపుకేసి చూసేది 'నా ఖర్మ నా రాత !' నేల మీద గుమ్మడికాయను చూసి, తన అదృష్టాన్ని తిట్టుకునేది. "నా రాత, నా ఖర్మ ! అదృష్టం బాగుండకపోతే చెట్ల కాపు కూడా వెనక పడుతుంది. ఏం ? ఏం ? నేనేం చేశాను మీకు ? బోఖ్ కాకీ (ఒకరకమైన పిట్ట) లన్నీ వాళ్లిళ్లకీ వీళ్లిళ్లకి వెళ్లి చావకపోతే - నా యింటికి రాకూడదూ ?"

కోపంతో పళ్లు పట పటలాడిస్తుంది. ఇప్పటికి ఆమెకి డెబ్బైతొమ్మి దేళ్లయినా – ఇంకా చాలా పళ్లు - ఇంచుమించు యెదుటి పళ్లు అన్నీ ఉన్నాయి. కాని నడుం వంగిపోయింది. వీధిన నడిచి వెడుతూంటే రాస్తా మీద యేదో బోర్లగా పడుకుని పాకుతున్నట్లుంటుంది. నడుం బాగా నొప్పిపుట్టినప్పుడు, నడుంమీద చెయ్యి ఆనించుకుని ఒక్కసారి నిటారుగా నుంచోటానికి ప్రయత్నిస్తుంది. కాని నడుం అంతా లేవదు. ఏదో విచిత్రమైన త్రిభంగిమ ఆకారం యేర్పడుతుంది.

అలా అని ఆమె నడవటం తిరగటం తక్కువేమీ చెయ్యదు ఇక్కడి నుంచి నడిచి, 'హౌద్‌డా' 'శాలిమార్' శివపూర్‌దాకా నెలకి మూడుసార్లు వడ్డీలు వసూలు చేసుకోటానికి వెడుతూంటుంది. వెళ్లటానికి రావటానికి ఒక రోజు పడుతుంది. ఎవరింట్లో అయినా ఏదయినా కాస్త వీలుపడితే

తింటుంది. లేకపోతే ఉపోషంతోనే తిరిగివస్తుంది. ఆమె అందరి యిళ్లలోనూ తినదు. ఎందుకనంటే ఆమెకిప్పటికీ ఇంకా మడి, ఆచారం పట్టింపు పోలేదు. ఆమె తక్కువజాతి అనుకునే వారి యిళ్లల్లో మంచినీళ్లు కూడా తాగదు.

అదీకాక ఆమె యింట్లో ఉన్నా, ఒక్కక్షణం ఊరికే కూచోదు. ఎండిపోయిన కొమ్మలు, ఆకులు, తీగెలు, అరటి దొప్పలు, కొబ్బరి, పోక చిప్పలు అన్నీ పోగుచేసుకుంటూ, రోజంతా తీరికలేకుండా తిరుగుతూ ఉంటుంది. ఇంట్లో ఓగదినిండా, వసారానిండా చాలా పోగుచేసింది. అయినా ఇంకా ఊరుకోకుండా పోగుచేస్తూనే ఉంటుంది. దానికి అంతు ఉండదు. "ఎవరయినా నాకు మణుగు కట్టెలు, బొగ్గులు కొన్ని యిచ్చి సాయం చేస్తారా? ఇవి నాకు యేడాది పొడుగునా వంట చెరుకుగా ఉపయోగపడతాయి. వానకాలంవస్తే నేనేం మీలాగా వంద అరణాలిచ్చి పిడకలు కొనుక్కొగలనా?" అంటూంటుంది.

ఒకవేళ యెవరయినా - "ఏం బాపనమ్మగారూ! మీకింకా నిరుడు పోగుచేసినవి చాలా మిగిలి ఉన్నాయిగా!" అని అడిగితే, ఆమె మండిపడుతూ - "చాల్లేవమ్మా? నీ కళ్లెప్పుడూ నే పోగుచేసిన ఆకులమీదే ఉంటాయేం? ఓ యేడు వాన ఎక్కువగా కురిశాయనుకో అప్పుడు అప్పు చెయ్యటాని కెవరిదగ్గిర కెళ్లను చెప్పు?" అనేది.

ఎండు ఆకులు, చితుకులు పోగుచెయ్యటం, వడ్డీలు వసూళ్లు చెయ్యటం తప్ప ఇంకో ఆలోచనే ఉండదు. వడ్డీ మీద ఆశతో ఆమెకి అసలు చాలాసార్లు మునిగిపోయింది. తాకట్టు పెట్టుకుని యిచ్చిన అప్పులన్నీ వసూలవటం, వసూలు చెయ్యటం సాధ్యంకాదు. చెంబులు బిందెలు తాకట్టు పెట్టుకుని ఆమె చాలా అప్పులిచ్చింది. అవన్నీ ఆమె మంచం కింద గుట్టలా పేరుకున్నాయి. ఏవస్తువు యెవరిదో, యెన్ని రూపాయలకు, లేదా యెన్ని అణాలకు తాకట్టు పెట్టించుకుందో, ఆ లెక్కలన్నీ కట్టక్కర్లేదు. బహుశా వారు దాన్ని తాకట్టుపెట్టి ఒక రూపాయి అప్పు తీసుకుని ఉండొచ్చు. దాని మీద అర్ధరూపాయి వడ్డీవేసి, వడ్డీ అసలు చెల్లించి దాన్ని వదిలించుకుని వెళ్లాలి.

దానివల్ల ఆమెకి పెద్ద లాభంకాని, నష్టంకాని ఉన్నదా అంటే అదేంలేదు. ఆమెకి ముగ్గురు కొడుకులు, ముగ్గురు కూతుళ్లు, బోలెడంత మంది మనుమలు, మనుమరాళ్లు. మనుమరాళ్లకి కూడా పిల్లలు పుట్టారు.

అయినా ఇప్పుడామెకి యెవరూలేరు. అంత పెద్ద యింట్లో ఆమె పూర్తిగా ఒంటరిది. ఇంటి కిటికీల పక్కన అంతులేనన్ని తీగెలు. ఇంటి ముంగిటలో యిన్ని చెట్లు ఉండటం మూలంగా యెటునుంచి రవంత గాలి కాని వెలుతురుకాని లోపలికిరావు. చైత్ర, వైశాఖ మాసాల్లో గాలి దుమారాలు రేగినప్పుడు కొబ్బరిచెట్ల తలలు ఒకదానికొకటి రాచుకుంటూం టాయి. పెద్ద పెద్ద వెదుళ్లు ఒరిగి పడిపోయినప్పుడు - ఆ యింట్లో గదుల్లో కాని, వసారాలోకాని రవంతగాలి ఆడటమనేది కనిపించదు. నాలుగు గంటలవగానే ఆ యింట్లో దీపాలు వెలిగించవలసిన అవసరం వస్తుంది. గదుల్లో ప్రతిమూలా దోమలు గుయ్‌మని రొద చేస్తుంటాయి. గాలి ఆడని ఈ చీకటియింట్లో శ్యామ ఒక్కతే తిరుగుతూంటుంది. రోజంతా పోగుచేసిన ఆకులవీ ఒకసైజుకి కోస్తూంటుంది. లేదా వడ్డీలు లెక్క చూస్తూంటుంది. కాని రాత్రిళ్లు చాలా దుస్సహంగా ఉంటుంది. ఆమెకి మొదట్లో నిద్రవచ్చేదికాదు. చమురు ఖర్చవుతుందని దీపం వెలిగించదు. పగలు భోజనమయేసరికి మధ్యాహ్నం మూడవుతుంది. కనుక రాత్రిళ్లు భోజనం అవసరం ఉండదు. ఒకవేళ ఉన్నా, చీకట్లోనే లేచి తడుముకుంటూ డబ్బామూతతీసి వేపుడు బియ్యం పైకితీస్తుంది. చీకట్లోనే కాస్త నూనె రాచు కుని, ఆ తర్వాత రాత్రిపొద్దూ పోయేవరకు నములుతూ కూచుంటుంది. ఆ కారుచీకటిలో నక్షత్రాల వెలుగయినా వచ్చే ఉపాయంలేదు. అంత దుస్సహమైన చీకట్లో శ్యామ దయ్యంలాగా మేల్కొని కూచుని ఉంటుంది. కళ్లుకనిపించనపుడు దీపం వెలిగిస్తే యేం, వెలిగించకపోతే యేం? అని మనస్సుని సమాధానపరచుకుంటూ ఉంటుంది. పగటివేళ కళ్లు అసలు, సరిగా కనిపించవు. ఎవరైనా వచ్చి "శ్యామమ్మగారూ"! అని పల్కరిస్తే నుదుటి మీద ముడతలన్ని ఒకచోటుకి వచ్చేట్లుగా కుంచించుకుని, అతికష్టంమీద చూస్తున్నటు నటించి, లోపల్లోపల కంఠస్వరాన్ని గుర్తుకి తెచ్చుకోటానికి ప్రయత్నించి - "ఓ! ఎవరు? మహాదేవమ్మా రా, రా, ఇంకా యెవరో అనుకున్నాను నేను" అంటుంది.

ఆ వచ్చిన ఆమె ఆమాటను ఖండించి, "శ్యామమ్మగారూ! కాదండీ - నేను మీ కోడలు సీతమ్మని" అంటుంది.

"అయమ్మా! సీతమ్మవా? నేను మహాదేవమ్మనుకున్నాను. చూడమ్మా ఈమధ్య కళ్లు బొత్తిగా కనపడటంలేదు. ఇదిగో నువ్వొచ్చి నుంచున్నావా? నాకు యేదో మసక మసకగా కనిపిస్తున్నావు. ముఖం, కన్ను, ముక్కు యెక్కడున్నాయో తెలుస్తున్నాయనా?" అంటూ చివరికి ఎలాగో ఒప్పుకునేది.

వచ్చినవారు బహుశా యెవరయినా, కళ్లలో శుక్లాలు కోయించుకోవు యెందుకనమ్మా? ఈరోజుల్లో చాలామంది కోయించుకుంటున్నారు అని అన్నా రనుకో - ఆఁ నేనింకా యెన్నాళ్లనిఉంటాను. ఈ భాగ్యానికి కోయించుకుందామా వద్దా? అని గుంజాటనపడటం యెందుకు? ఏమయినా పోయినకళ్ళు మళ్లీ వస్తాయా? పుస్తకాలు చదవగలనా? యేదో యిలా బాగానే జరిగిపోతోంది అని, కొంచెంసేపాగి, "ఊరికే బోలెడంత డబ్బు ఖర్చు" అంటుంది.

"అలా అయితే ఆస్పత్రికెళ్లొచ్చుగా! ఇక్కడి వాళ్లందరూ ఆస్పత్రికే వెళ్లి కోయించుకువస్తున్నారు"

"ఎవరు తీసుకెడతారు నన్ను? ఎవరేం చేశారు నాకు? నీవొకతెవి. నాకింకా యెవరున్నారు చెప్పు? వద్దు ఇంక ఆ ఆశలన్నీ వదిలెయ్. ఏదో యిలా మీరందరూ ఉండగానే వెళ్లిపోగలిగితే చాలు"

ఆ వచ్చినవాళ్ళు ఓ చెంబు తాకట్టుపెట్టి, నాలుగణాలు అప్పు తీసుకుని వెడుతూంటారు. మళ్ళీ శ్యామ ఆ కపిరి కపిరి చీకట్లో ఒంటరిగా తిరుగు తూనే ఉంటుంది. ఎండిపోయిన ఆకులు పోగుచేస్తూ, లేదా ఏదో ఒక చెట్టుకి పోటీ నిలబెడుతూ ఉంటుంది. అక్కడ మట్టి తవ్వుతుంది. ఇలా తోటంతా పర్యవేక్షణ చేస్తూంటుంది. పంట పండితే మాత్రం యేం లాభం? ఎవరు బజారుకి తీసుకెళ్లి అమ్ముకునివస్తారు? మనుమడు బాలా ఉన్నాడంటే వాడూ అత్తారింటికెళ్లి కూచున్నాడు. విశ్వాసఘాతకులు విశ్వాస ఘాతకులు, విశ్వాసఘాతకులు, అందరూ విశ్వాసఘాతకులగుంపు." శ్యామ మనస్సులో గొణుక్కుంటూ ఉంటుంది. భర్త ఉన్నప్పుడే సుఖం లేన ప్పుడు జన్మలో సుఖముండదు అని అందుకనే అంటారు. నాకు సుఖమా? మొహంమండ! యముడు మరిచిపోయాడు, అందుకని ఇవన్నీ యెవరికోసం చేస్తున్నానో అదీ తెలియదు. అందరు చచ్చి మురిగిపోయారు. యముడి ద్వారంలోకి వెళ్లారందరూ."

అయినా ఆమె అన్నీ చేస్తూనే ఉంటుంది. తోట శ్రద్ధవిషయంలో లోపం రానీయదు. సంజాయిషీ చెప్పుకుంటున్నట్లు అంటూ ఉంటుంది తనలో తాను - అవి నాకు పరాయివా? ఇంటి చెట్లంటే చంటిబిడ్డలు!

## 2

ఇవాళ మీరు చూస్తున్న శ్యామసుందరినిబట్టి ఊహించటం కష్టమే అయినా, శ్యామ ఒకప్పుడు నిజంగా అందకత్తె. ఏదో సామాన్యమైన కళ

గల ముఖమున్న యువతికాదు. అసాధారణమయిన అందకత్తె అని చెప్పతగిన యువతి. ఇప్పుడు విల్లులాగా వంగిపోయిన ఆమె శరీరం ఒక ప్పుడు అరటిబొండులాగా నిటారుగా బలంగా పుష్టిగా ఉండేది. ఇప్పుడు బట్టతలగా మారిన ఆమె తలమీద జుట్టు - ఒకప్పుడు కారుమబ్బులా నల్లటి ఒత్తయిన జుట్టు వీపు అంతా కప్పి నడుందాటి, మోకాళ్లపైవరకు వచ్చేది. ఇప్పుడు శుక్లాలు యేర్పడిన ఆమె కళ్లల్లో ఒకప్పుడు విద్యుత్ తొణకుతూండేది. ఆ క్రీగంటిచూపులు మగవాళ్ల గుండెల్లో మంటలు రేపేవి. ఇక ఆ కనుగుడ్లు పూర్తిగా నలుపుకాదు. కొంచెం పసుపు పచ్చగా ఉండేవనొచ్చు. అయినా దానివల్ల ఆమెకు కలిగిన నష్టమేమీలేదు. ఉజ్వలమయిన యెర్రటి ఆమె శరీరచ్ఛాయకు నప్పినట్లుండేవి. పల్చటి ఆమె పెదవుల మీద చిరునవ్వు తొణికినప్పుడు, ఆ నవ్వువెనుక ముత్యాల కోవలాంటి పలువరుస కన్పించేది. ఆ పలువరుస చిహ్నాలు యిప్పటికీ కొంచెం కన్పిస్తూంటాయి. ఈ రూపం సంగతి మీరొకవేళ నమ్మలేకపోతే, నాతో ఊహల్లో అరవైతొమ్మిదేళ్ల కిందటి శ్యామ పెళ్ళిమంటపంలోకి రండి, నేను నిరూపిస్తాను.

శ్యామకి పదేళ్లప్పుడు పెళ్లి అయింది. ఆ రోజుల్లో ఆ వయస్సులోనే అయేవి పెళ్లిళ్లు. ఆమె అక్క పెళ్లి ఇంకాస్త వయసు పెరిగాక అయింది. అప్పటికామెకి పన్నెండేళ్లు. ఆ మాత్రానికే అందరూ ఆమెని పెళ్లికాని గడేకారి అనేవాళ్లు. శ్యామ అక్క కొంచెం నల్లగా ఉంటుంది. అంచేత వరుడు దొరకటం కాస్త ఆలస్యమయింది. శ్యామ తన పేరుని అబద్ధం చేస్తూ, గులాబీరంగు శరీరచ్ఛాయలో, అసామాన్య సుందరిలా తయారయింది. అందువల్ల 'ఘటకీ' (పెళ్లి సంబంధాలు కుదర్చటమే వృత్తిగాగల ఆమె) దబాయించి సంబంధం కుదిర్చింది. "ఒకవేళ అందరూ కలసి ఒకేమాటతో నచ్చలేదని అంటే - నేను యీ వృత్తినే మానేస్తా నమ్మగారూ! చెప్పుకో దగ్గ అందమైన పిల్ల. ఈ పిల్ల నచ్చకపోవడమా? భలేవారే?"

ఆ ఘటకీ కూడా మంచి సంబంధమే కుదిర్చింది. శ్యామ తల్లికి కూడా తృప్తిగా ఉంది. వరుడు పద్దెనిమిదేళ్ల యువకుడు. చక్కటి మొహం, బలమైన శరీర సౌష్ఠవం. నల్లటి శరీరచ్ఛాయతో, కాటుకపెట్టినట్లుండే నల్లటి పెద్దకళ్లు, చక్కటి ఆరోగ్యానికి తగినట్లు మంచి కళగల మొహం. వంక పెట్టటానికి వీల్లేదు. అదీకాక ఖిదిర్‌పూర్‌లో స్వంత యిల్లుంది. వరుడితండ్రి పౌరోహిత్యం చేసేవాడు. కొద్దిమంది శిష్యులు కూడా ఉన్నారు. అన్నగా రెక్కడో నౌకరీ చేస్తున్నాడు. తమ్ముడు కూడా యేదో ఒకనౌకరీ సంపాదించుకో గలడు. బెంగాలీ చదవటం, వ్రాయటం కొంచెం వచ్చు. అదీ కాక

యేదో కొంత నగదు, బోలెడన్ని సామాన్లు ఉన్నాయి. విధవ అత్త గారున్నది. బావగారు, తోటికోడలు, వారికొక కొడుకు. సంసారం చిన్నదే.

ఒక్క మాటతో చెప్పాలంటే - అన్నివిధాల యోగ్యుడైన వరుడు. శ్యామ తల్లి ఇంక తటపటాయించలేదు. వాకబుచెయ్యటానికి వీలైనంత వరకు చేసి తెలుసుకుంది. ఆమెకి అంతకంటె యెక్కువ తెలుసుకో గల గటం కష్టం. కారణం ఆమె వితంతువు. ముగ్గురు పిల్లల తల్లి అయి, చిన్న వయసులోనే వితంతువయింది. ఆస్తిపాస్తులేమీ రాలేదు. దైవికంగా యేదో కొంచెం నగదు తీసుకుని, గౌరవ కుటుంబానికి చెందిన అమె కలకత్తా పారిపోయి రావలసి వచ్చింది. అంచేత మళ్లీ తమ ఊరు వెళ్ల టానికి ఆమెకి మొహం చెల్లలేదు. జ్ఞాతులు కూడా ఆమెని గురించి యేమీ తెలుసుకోలేదు. చెడ్డ పేరు ప్రచారం చేసి మెదలకుండా ఊరుకున్నారు. ఇక్కడ ఆమెని ఒక అన్నగారు కొంచెం కనిపెట్టుకుని ఉండేవాడు. అతడు కూడా చనిపోయాడు. పెద్ద అల్లుడు చాలా మంచివాడు. ఆర్థిక సహాయం కూడా చాలా చేస్తూంటాడు. కాని అతడికి తీరిక ఉండదు. ఇంక ఈ పను లన్నీ అతడివల్ల జరగవు. ఇతరులచేత యెన్నిపనులని చేయించుకోటానికి వీలవుతుంది ? అదీకాక తెలుసుకోవలసింది మాత్రం యేముంది ? ఈ సంబంధం కుదిర్చిన ఘటకీయే పెద్దకూతురు సంబంధం కూడా కుదిర్చింది. కనుక ఆమెని నమ్మకుండా యెలా ఉంటుంది ?

శ్యామకి కూడా అప్పుడు అసంతృప్తి యేమీ కలగలేదు. ఒంటి నిండా నగలు పెట్టుకుని, బెనారస్ చీరెకట్టుకుని, కాళ్ల అందెలు గలగల్లా డించుకుంటూ అత్తారింటికెళ్లటం - అంత చక్కటి వరుడు, అందరూ అలాగే అన్నారు. శ్యామసుందరికికూడా - అప్పటి కంతకంటె తెలుసుకునేంత జ్ఞానంలేదు. అన్నీకలసి అప్పుడామెకి మైకం కమ్మినట్లయింది. గ్యాస్‌లైట్లు, మేళాలు, ఇంటినిండా జనం, అత్తగా రాపేక్షగా మాట్లాడటం - అంతా ఆ స్థితిలో మనస్సుకనుకూలంగానే ఉంది. శ్యామకి మొదటి పెద్దదెబ్బ పూల పాన్పునాటి రాత్రే తగిలింది. అందరూ వధూవరులను వదిలి గదిలోంచి బయటికెళ్లారు. శ్యామ గుబగుబలాడుతున్న గుండెతో యెదురు చూస్తోంది. ఏదో ఒక తెలియని ఆశ. పూల పాన్పునాటి రాత్రి భర్తలు యెన్నోరకాల ఆప్యాయతలు కన్పరుస్తారు ఎన్నెన్నో తియ్యటి మాటలు మాట్లాడతారని పెళ్లయిన స్నేహితురాళ్ల మాటల్లో అస్పష్టంగా తెలుసుకుంది. అక్క మాడల్లోకూడా అలాంటి సూచనలే కన్పించాయి. అయినా పూర్తిగా యెవరూ వివరించి చెప్పలేదు. ఆ కాలంలో అక్కలు - పిల్లల తల్లులు

కాకముందు చెల్లెళ్లతో ఈ సంగతులన్నీ చర్చించేవారు కాదు. అదీకాక పదహారేళ్ల అక్క పదేళ్ల చెల్లెలితో యేం చెపుతుంది?

ఏమయితే యేం ? యెంత ఆశగా ఉందో, సిగ్గుకూడా అంతకంటె తక్కువగా యేం లేదు. ఎక్కణ్ణుంచో లోకంలోని సిగ్గంతా వచ్చి ఆమెని ఆవరించింది. చెమటలతో తడిసిపోతూ కూచుని ఉంది. కాని నరేన్ చాలా చురుకైనవాడు. గదిలోంచి అందరూ వెళ్లిపోగానే గభాల్న లేచి ఒక్క అంగలో వెళ్లి తలుపులుమూసి, మళ్ళీ మంచంమీదికి వచ్చి కూచున్నాడు. తర్వాత ఒక్క నిమిషం తటపటాయించి, అణచుకున్న గొంతుతో "ఇదిగో మాట" అని పిలిచాడు. శ్యామ ఈ పిలుపుకోసమే యెదురు చూస్తున్నట్లుంది. కాని ఆమాట సరిగ్గా వినపడలేదు. అదీకాక పిలవగానే బదులుపలకాలా యేం ? "ఇదిగో పలకవేం ? ఆటకాయతనంగా ఉందా ?"

నరేన్ ఆమెని చెయ్యిపట్టుకుని మెలిపెడుతూ, ఒక్కగుంజు గుంజి దగ్గిరకు లాక్కున్నాడు. శ్యామ ఆగుంజుకి సిద్ధంగాలేదు. సరాసరి నరేన్ మీదికొచ్చి పడింది. ఆశ్చర్య సూచకమైన స్వరమేదో ఆమె నోటి నుంచి వెలువడింది.

"వాహ్ ! ఆ వాలకం చూడండి. సిగ్గు చూడలేకచస్తున్నా, కాస్త నిటారుగా కూచో, ముఖం ఒకసారి చూస్తాను. అందకత్తె, అందకత్తె అని అందరూ అంటున్నారు. కాని వెధవది నాకు ఒక్కసారి సరిగ్గా చూడటమే పడలేదు"

అతడు శ్యామ ముఖాన్ని బలవంతంగా చిన్న చిమ్నీదీపం వెలుగులో యెంతపైకి యెత్తి పట్టుకోబోతే - అంత సిగ్గుతో ఆమె ముఖం ముడుచుకు పోయింది. ఎర్రగా గుండ్రంగా - గంధపు బొట్లు పెట్టి ఉన్ననుదురు, గులాంచల్లినట్లున్న రెండు బుగ్గల యెరుపు కన్పించిందే కాని, ఏమైనా నరేన్ పూర్తిగా స్పష్టంగా చూడలేకపోయాడు. ఇలా ఒకనిమిషం ప్రయత్నం చేశాక, నరేన్ ఆమె తలమీద ఒక మొట్టికాయమొట్టి, "మళ్లీ యేం తిక్క వచ్చింది ? నిటారుగా కూచో, చెపుతున్నా. లేకపోతే తాట యెగరకొడతాను. నేనలాంటిలాంటి మొగుణ్ణికాను. నేను మగటిమికల మొనగాణ్ణి. ఆడదాని ముందు గొర్రెలా తలవంచే బానిసనుకాను. సరిగ్గా ఉన్నావో నేనూ సరిగ్గా ఉంటాను, తలబిరుసుతనంతో వెర్రిమొర్రివేషాలు పోయావో, నేను మంచివాణ్ణి కాను"

శ్యామ అంతలో కొయ్యబారిపోయింది. ఇదేం పూలపాన్పు తనది ' ఇదా తన భర్త తొలిప్రేమ సంభాషణ !

అదీకాక అకాలంనాటి పరిస్థితుల దృష్ట్యా శ్యామ తల్లి బాగా చదువు కున్న ఆమె. ఆమె పెట్టెలో చాలా బెంగాలీ సాహితీ గ్రంధాలుండేవి. శ్యామ అక్కచెల్లెళ్లు యిద్దరూ స్కాలర్‌షిప్ ఉన్నంతవరకు చదువుకున్నారు. ఇలాంటి భాష వినటం ఆమె కలవాటులేదు. సభ్యసమాజంలో ఇలాంటి భాష మాట్లాడరని తెలుసు. అందువలన శారీరక బాధ సంగతి యెలా ఉన్నా, యేదో తెలియని భయంతో, ఆశాభంగవ్యధతో ఆమె అందమైన కళ్లురెండూ నీళ్లతోనిండి, చెక్కిళ్ల మీద నుంచి జలజల కారసాగాయి.

"హూః ఇంత అందమైన కళ్లనిండా నీళ్లు తిరిగాయి. స్పర్శ సోకనిలత ! ఇదిగో ! ఈ యెత్తులన్నీ నాదగ్గిర సాగవు నేను అనుకున్నది చేసి తీరుతాను. నువ్వు యెరగవేమో నాసంగతి ! మంచి కావాలనుకుంటే మొహంపైకెత్తు ! ఆః ఇటు ఈవెలుతురు వైపుగా"

శ్యామ భయభయంగా ముఖమెత్తక తప్పలేదు.

కాని ఊరికే మొహం యెత్తగానే సరిపోదు.

"కళ్లు తెరిచిచూడు, యెంత పెద్దకళ్లో చూస్తాను".

కళ్లు తెరిచి చూడటమే అన్నిటికంటే కష్టం. పైగా ఇలాంటి పరిస్థితిలో శ్యామ యెంత ప్రయత్నించినా, కళ్లు తెరిచి చూడలేకపోయింది.

"మళ్లీ పెంకెతనం పోతున్నావా ? కళ్లు సరిగ్గా తెరచి చూడలేవూ ?" అని నరేన్ ఆమె చంకలదగ్గిర గిల్లాడు. పదేళ్ల పిల్ల లేత చర్మం నీలిరంగుకి తిరిగింది. దాంతో కళ్ల వెంబడి నీళ్లు ఇంకా బొట బొటా కారసాగాయి. ఈసారి బాధమూలంగా - ఏమయినా యింక కళ్లు తెరిచి చూడటం జరగలేదు.

"ధూత్ ! చెప్పినమాట వినని మొండిఘటాని వెక్కడో !"

ఒక్కత్రోపుతో ఆమెని మంచం మీది నుంచి క్రిందికి త్రోసేసి, నరేన్ హాయిగా కాళ్లు చాచుకుని పడుకున్నాడు. కాసేపటికల్లా ఉచ్ఛ్వాస నిశ్వాసాల ధ్వనిని బట్టి, అతడికి గాఢనిద్ర పట్టిందని తెలిసింది.

శ్యామ ఆ స్థితిలో రాత్రంతా కొయ్యబారిపోయినట్లయి, కిందనేల మీద కూచుండిపోయింది. కళ్ల నీళ్లు పెట్టుకోటానిక్కూడా ఆమెకి భయ మేసింది.

మర్నాడు ప్రొద్దున - రాత్రంతా జాగరణ చెయ్యటంవల్ల కళ్లు యెర్ర బడి ముఖం వాడిపోయి ఉన్న శ్యామను చూసేసరికి అత్తగారికేదో

అవమానం కలిగింది. ఎంతో ఆదరంగా శ్యామను ఒళ్లోకి తీసుకుని కూచో పెట్టుకుని, మెల్లిగా "చూడమ్మాయ్; మావాడు చదువు సంధ్యలు రాని మొద్దు. బండకొయ్య. నిన్నేమీ బెదరకొట్ట లేదుకదా!" అని అడిగింది. ఏం సమాధానం చెప్పాలో తోచక, శ్యామ మెదలకుండా ఊరుకుంది. దానివల్ల ఆమెకి మరింత అనుమానం కలిగింది. మెల్లిగా వీపు నిమురుతూ "చెప్పమ్మా, సిగ్గు పడతావెందుకు! నేనూ నీకు తల్లినేనమ్మా అంటూ బలవంతంగా పైకెత్తి పట్టుకుని, అప్యాయంగా ఒక్క ముద్దుపెట్టుకుంది.

ఈసారి శ్యామ యింక ఊరుకోలేకపోయింది. ఆమె కళ్లల్లో నీళ్ల సహజమయిన లజ్జాసంకోచాలను ఛేదించుకుని బయటి కొచ్చాయి. ఇంతలో చంకలో గిల్లిన యెర్రటి గుర్తు క్షమాసుందరి కంట పడింది. ఆమె యించుమించు ఆర్తకంఠంతో "శ్యామా!" అని అరిచింది. శ్యామ ఈసారి ఒక్కటొక్కటే జరిగిన సంగతులన్నీ చెప్పింది. క్షమాసుందరికి సిగ్గుతో అసహ్యతతో తల నేలకేసి కొట్టుకోవాలనిపించింది. శ్యామ చేతులు రెండూ పట్టుకుని, "అమ్మాయ్! వాడు బ్రాహ్మణయింట కట్టేసిన దున్నపోతు. గౌరవ కుటుంబాల్లో పుట్టినవాళ్లు కాస్త కూడా చదువుకోకపోతే ఇలాగే తయారవుతారు. అయినా అమానుషంగా తయారవుతాడని నేనెన్నడూ అనుకో లేదమ్మా! అనుకుంటే కనీసం నీలాంటి ముత్యాలపేరుని వాడి మెళ్లోవేసే దాన్నే కాను, నువ్వేమీ అనుకోకమ్మా!" అన్నది.

నిజంగా ఆమె మనస్సుకి చాలా కష్టం కలిగింది. రోజంతా అటు యిటు తారట్లాడుతూ తటపటాయించి, సాయంత్రానికి పెద్ద కొడుకు దేవేన్‌కీ సంగతంతా చెప్పింది. దేవేన్ కూడా తక్కువ కోపిష్ఠికాదు. ఆ సంగతి శ్యామకి తర్వాత జీవితంలో తెలిసివచ్చింది. అతడు వెంటనే బయటికి వచ్చి తమ్ముడిగది ముందుకెళ్లి -

"నరేన్" అని పిలిచాడు.

నరేన్ అప్పటికే నిద్రపోతున్నాడు. ఆ పిలుపుకి కొంచెం ఆశ్చర్య పోయాడు. రుసరుసలాడుతూ బయటికి వచ్చాడు.

"ఎందుకు?"

"ఎందుకా? గాడిదా! అన్నిటిలోనూ మూర్ఖత్వమేనా?"

"చూడన్నయ్యా, అనవసరంగా తిట్టొద్దు చెపుతున్నా. ఏం జరిగింది?"

"మరదల్ని యెందుకుకొట్టావ్?"

"కొట్టానని యెవరు చెప్పారు?"

"ఎవరు చెప్పాలి ? దెబ్బలు ఒంటిమీద కన్పిస్తూంటే !"

"కొట్టానేమో మంచి పని చేశాను." నరేన్ బుంగ మూతి పెట్టుకుని చెప్పాడు సమాధానం. "నా పెళ్లాన్ని నేను కొట్టాను కాని నీపెళ్లాన్ని కొట్ట డానికి వెళ్లలేదుగా !"

దేవేన్ దభీమని నరేన్ చెంప మీద ఒక్కటి కొట్టాడు. "ఇంకా యెదిరించి మాట్లాడుతున్నావా, అడ్డగాడిద వెక్కడో !"

ఆదెబ్బ తట్టుకోటానికి నరేన్‌కి కొంత వ్యవధి పట్టింది. దేవేన్‌ది కూడా సన్నగా గట్టిగా ఉండే చెయ్యి. నరేన్ చెంపమీద అయిదువేళ్లూ తేలాయి.

నరేన్ కూడా ఒక్కసారి రెచ్చిపోయాడు. అతనికి కళ్ల వెంబడి నీళ్లొచ్చాయి. అయినా చేత్తో చెంప నిమురుకుంటూ, ముఖం వికృతంగా పెట్టి వెక్కిరిస్తూ చెప్పాడు సమాధానం. "మళ్లీ ఇంకా యెదిరిస్తున్నావా ? ఎందుకెదిరించనో చెప్పు. నువ్వేం నన్ను పెట్టి పోషిస్తున్నావా ? నీసొమ్ము తింటున్నానా ? నీయబ్బ సొమ్ము తింటున్నానా ?"

"ఇంకా ఇంకా మాట్లాడుతున్నావా దున్నపోతా ! నా అబ్బసొమ్ము కాక యెవరబ్బసొమ్ము తింటున్నావ్ ? నీయబ్బ వేరు నాఅబ్బ వేరూనా? మూర్ఖపు వెధవ్వి యెక్కడో !"

"నువ్వెవరివి నన్ను కొట్టటానికి ? నన్ను తిట్టటానికి నువ్వెవరివి ? నా యిష్టం వచ్చింది నేను చేస్తాను."

నరేన్ కోపంతో గర్జిస్తూ, ఒకొక్కమాటే అంటూ, దేవేన్ ముందు కొచ్చి కాలు నిగడతన్ని నుంచున్నాడు ?

"చూస్తావా ? చూస్తావా ఒకసారి." దేవేన్ తటాల్న ముందు కొచ్చాడు. ఇంకగజకచ్ఛప పోరాటం మొదలయింది. దేవేన్ అతణ్ణి జుట్టు పట్టుకుని తలవంచి వీపుమీద గబగబా గుద్దాడు. ముందుకి చాచిన అతని చేతిని నరేన్ బలంగా పట్టుకుని, గట్టిగా కొరికాడు. ఎంత గట్టిగా కొరికాడంటే అతడి పళ్లకాటుకి కొన్ని బొట్లు రక్తం కూడా వచ్చింది.

దాంతో ఇంక దేవేన్ భార్య శోకాలు మొదలెట్టింది. శ్యామ మొదట్లో ఆ గొడవ చూసి కొయ్యబారిపోయింది. రాధారాణి బిగ్గరగా యేడ వటం మొదలెట్టగానే తానూ యేడ్చేసింది. అపుడింక క్షమాసుందరి

వారి ముందు కొచ్చి తలనేలకేసి కొట్టుకోటం మొదలెట్టింది. "రేయ్ మీపోరు భరించలేక నేను తల పగలకొట్టుకుని చస్తానురా. రేయ్, యెవ రయినా నాకింత నల్లమందు కొనివ్వండిరా మింగిచస్తాను. ఇహ నేను సహించలేను."

పెళ్ళికి వచ్చిన చుట్టాలు ఇంకా అందరూ వెళ్లిపోలేదు. వారిలో అయిదారుగురు పరుగెత్తుకొచ్చి అన్నదమ్ములిద్దర్నీ విడతీశారు. నరేన్‌ని గదిలోకితోసి బయట గొళ్లెం పెట్టవలసి వచ్చింది. అతడు లోపల కాళ్ళు నేలకేసి బాదుతూ గర్జించసాగాడు. ఇంక దేవేన్ - నరేన్ కొరికిన గాయాన్ని పటిక నీళ్లలో కడిగి, కట్టు కట్టుకుంటూ తిట్టటం మొదలెట్టాడు. ఆ తిట్లలో తమ తల్లి తండ్రుల పేర్లు కలపకుండా విడిచిపెట్టలేదని చెప్పక్కర్లేదు.

ఆ రోజున పొద్దుకూకి చీకటి పడ్డాక, శ్యామ భయంతో కాసేపు అటు యిటు తారట్లాడి, సిగ్గంతా దిగమింగి, "అత్తగారూ! ఇవాళ నేను మీదగ్గర పడుకుంటాను" అన్నది.

క్షమాసుందరి చకితురాలయి, సిగ్గుతో ముఖం యెర్రపడినా ఆదరంగా వీపు నిమురుతూ, "అలాగే పడుకోమ్మా! ఇంక ఆ కోతిదగ్గిర కెళ్లాల్సిన పనిలేదు" అన్నది.

కాని ఆ యేర్పాటు సంగతి నరేన్‌కి తెలియదు. అతడు పడుకుని కొంచెంసేపు యెదురుచూసి, చెవిఒగ్గి ఇల్లంతా సద్దు మణిగి ఉండటం గమ నించి - అంటే అందరూ నిద్రపోయారని గ్రహించి ఇంకఊరుకోలేకపోయాడు. తల్లి గదిముందుకు వచ్చి, తలుపు గొళ్లెం చప్పుడు చేస్తూ, "అమ్మా, నీకోడ లెక్కడ ?" అని అడిగాడు.

శ్యామ భయంతో వణకిపోయింది. అత్తగార్ని గట్టిగా కావిలించుకుంది.

క్షమ కాసేపు మెదలకుండా ఊరుకుని, "కోడలిక్కడ నాదగ్గిర పడుకుందిలే, నువ్వెళ్లి పడుకో" అన్నది.

"లేపరాదూ ? నిద్రపోతేయేం ? నవాబు కూతురాయేం ?"

"ఇవాళ వద్దులే, అమ్మాయి వంట్లో బాగుండలేదు.

"వాహ్! కోడలు నీదగ్గిరే ఉండేట్లయితే నాకు పెళ్లి చెయ్యటం దేనికి ?"

''చాల్లే వాగుడు! ఇక్కడ నాముందు నిలబడి యెదిరించి మాట్లాడటానికి సిగ్గులేదూ? వెళ్లు. వెళ్లి పడుకో. ఒక్క రాత్రి కోడలు నా దగ్గిర పడుకున్నంత మాత్రాన మునిగిపోయిందేమీ లేదులే''.

ఇంతలో దేవేన్ కిటికీలోంచి ముఖం బయటికిపెట్టి. "మళ్లి యెవరి గొంతు అయినా వినపడిందంటే, నరికి రెండు ముక్కలు చేస్తా చెపుతున్నా" అన్నాడు.

వెనకనుంచి రాధారాణి గట్టిగా పట్టుకోకపోతే అతడు బయటికి వచ్చేసేవాడే!

ఎందుకనో తెలియదుకాని, ఇంక నరేన్ కూడా యెక్కువ గొడవ చెయ్యలేదు. కాని ఈ యేర్పాటుకి కోపాన్ని, అభ్యంతరాన్ని వ్యక్తం చెయ్యటానికి, కాళ్లు గట్టిగా నేలకేసి కొడుతూ, తన గదిలోకి వెళ్లి ధపీమని తలుపులు మూసుకున్నాడు.

ఇంత అయినా, పెళ్లయిన యెనిమిది రోజుల తర్వాత, శ్యామ ఒక యేడాది పుట్టింట ఉండటానికి వచ్చినప్పుడు, ఆమె మనస్సేమిటో యువకుడైన భర్త కోసం లాగుతూండేది. ఈ కొద్దిరోజుల్లో భర్తని గురించి తనకు తెలిసిన సంగతులు ఆశాజనకమైనవీ కావు. ఆనందకరమైనవీకావు. అయినా యేదో ఆకర్షణ ఆమె మనస్సులో ఉత్సుకతను రేకెత్తించేది. తీరిక ఉన్నప్పుడల్లా కిటికీలో కూచుని, నరేన్ సంగతే ఆలోచించేది.

పుట్టింటికి వచ్చేప్పుడు నరేన్ - "వెళ్లాక ఉత్తరాలు రాస్తూఉండు" అని చెప్పాడు.

''అమ్మో! అదేమిటి? ఉత్తరం రాయటమేమిటి?''

"ఏం? నీకు చదవటం రాయటం వచ్చుగా! నాకేం తెలియదనుకున్నావా? ఈ రోజుల్లో చాలామంది ఉత్తరాలు రాస్తుంటారని విన్నాను"

చటుక్కున తల అడ్డంగా తిప్పుతూ చెప్పింది సమాధానం. ''అహఁహఁ నేను రాయలేను. ఆ ఉత్తరం ఒకవేళ బావగారి చేతిలో పడొచ్చు. లేదా అక్కయ్య చేతిలో పడొచ్చు. అసలు అత్తగారి చేతిలోనే పడిందనుకోండి అది చాలా సిగ్గు చేటయిన సంగతి. దానికి మీరురాసే సమాధానం అమ్మ కనుక చూస్తే: అమ్మో!"

నరేన్ మంచంమీద కాళ్లు కిందికి వేళ్ళాడేసుకుని, గోళ్లు కొరుక్కుంటూ కూచున్నాడు. అతడు దానికి సరి అయిన సమాధానం చెప్పలేకపోయాడు "అయితేమరి ?" అని మాత్రం అడిగాడు.

"ఇదిగో, ఇక్కడినుంచి ఇక్కడికేగా ! మీరు ప్రతిరోజూ వస్తూ ఉండొచ్చు"

"ఆఁ ఒకవేళ మీ అమ్మ పిలవకపోతే ?"

ఆ రోజుల్లో పిలవందే అత్తారింటికి వెళ్లటమనేది యెవరికీ ఊహ కందని విషయం.

"మళ్లీ మీ అమ్మ అంటారేమిటి ? ఆమె మీకూ అమ్మలాంటిదే అని చెప్పానుగా ! ఊరికే 'అమ్మా' అని పిలవండి"

(వంగదేశంలో అత్తగారిని 'అమ్మా' అని, మామగారిని 'బాబా' అని పిలవటం సంప్రదాయం)

"ధూత్, సిగ్గేస్తుంది"

ఆప్రసక్తి అక్కడితోనే ఆగిపోయినా, శ్యామ మాత్రం మరచిపోలేదు. ఆమె కవల చెల్లెలు ఉమ ద్వారా ఆ సంగతి తల్లి ముందు బయట పెట్టించింది. తల్లి కూడా విచక్షత లేనిది కాదు. ఆమె మొదట్లో వరుస వరుసన తరచు ఆహ్వానాలు పంపటం మొదలెట్టింది.

దాని ఫలితంగా అల్లుడి స్వభావం బయటపడకుండా అణగిఉండ లేదు. ప్రేమ సంభాషణలోని దురుసుతనం, దుడుకుతనం కేవలం పక్క గదుల్నే కాదు, మధ్యమధ్య మొత్తం యింటినే దద్దరిలేట్లు చేసేవి. ముఖ్యంగా ఆ రోజున అయిదువేళ్లూ తేలిన శ్యామ చెంపను - ప్రొద్దున గదిలోంచి బయటికి రాగానే చూసినప్పుడు - శ్యామ తల్లి రాసమణి మెదలకుండా ఊరుకుని ఉండలేకపోయింది. ఆమెది చాలా గంభీరస్వభావం. అడది ఒంటరిగా ముగ్గురు పిల్లల్ని పెట్టుకుని కాపురముంటున్నా, యెవరూ ఆమెని పల్లెత్తు మాటనటానికి సాహసించేవారుకాదు. ఆమె గదిలోకి వచ్చి తర్జనితో వీధిగుమ్మంకేసి చూపిస్తూ "వెళ్లు, తక్షణం బయటికెళ్లు. మళ్లీ ఇంకెప్పుడూ ఈ గడపలో అడుగుపెట్టకు. నా కూతుర్ని కూడా యింక నేను పంపను, నా కూతురు విధవ అయిందనుకుంటాను. వెళ్లు, చెపుతున్నా" అన్నది అల్లుడితో.

రణచండికలా ఉన్న ఆమె ముఖంకేసి చూసి నరేన్ భయపడి పోయాడు. అతడు మాటలు తడబడుతూ - "ఒట్టు, అత్తగారూ! మీామీద ఒట్టు. హఠాత్తుగా యేదో కోపంలో - అంటే మీ అమ్మాయి కూడా చెప్పినమాట వినేరకంకాదు. మీ కాళ్ళు పట్టుకుంటాను. మళ్లీ యింకెప్పుడూ -"

అంటూ అతడు వంగి కాళ్ళు పట్టుకోబోయేసరికి, మణిరాస రెండడుగులు వెనక్కి జరిగి, మరింత కఠినంగా "వెళ్లు. ఏం చెప్పినా నేను వినతలచుకోలేదు. తక్షణం వెళ్ళు బయటికి" అన్నది.

గత్యంతరంలేక నరేన్ అడుగులో అడుగు వేసుకుంటూ ఆ రోజున బయటికి వెళ్లవలసి వచ్చింది.

కాని ఈ సంఘటనకు శ్యామ చాలా దిగులుపడింది. పైగా ఈ సంఘటన దాగలేదు. దీన్ని గురించి ఆవాడలో ప్రతియింట్లో యెలా చెప్పుకోసాగారో, అలాగే జట్లుజట్లుగావచ్చి జాలి సానుభూతి చూపించిన వాళ్లేం తక్కువలేరు. భర్త! అసలు భర్త అంటే యెలాంటివాడో తన భవిష్యత్తు యేమవుతుందో అన్నదాన్ని గురించి నిశ్చితాభిప్రాయమనేది లేకపోయినా, శ్యామ తనకేదో ముప్పు రాబోతోందని మాత్రం గ్రహించింది. ఆమె మామూలుగా యేడుపు చల్లారగానే ఈ దుఃఖాని కంతకీ మూలం తల్లేనని మాటల్లో చేష్టల్లో, ఆమెనే బాధ్యురాల్ని చేయసాగింది.

రాసమణి అయిదారు నెలలు కాకముందే, లోపల్లోపల ఆందోళవచెందింది. చివరికి లజ్జాభిమానాలును చంపుకుని, అల్లుణ్ణి రమ్మని పిలనటమా మానటమా అని గుంజాటన పడుతున్న సమయంలోనే - హఠాత్తుగా ఒక రోజున శ్రీమాన్ స్వయంగానే వచ్చాడు. ముఖం వాడిపోయి ఉంది. కాళ్లనిండా దుమ్ముతో పెద్ద 'మాన్‌కచూ' (ఒక విధమైన దుంప వస్తువు) బుజాన మోసుకుని యింట్లోకొచ్చి పడ్డాడు. అత్తగారిని చూడగానే ఆ 'మానకచూ'ని ఆమె కాళ్ల ముందుపెట్టి, సాష్టాంగపడి నమస్కరించి తడబడుతూ - "ఇటువైపు వస్తున్నా, యేదో పని తగిలిందిగా! ఎలాగూ అటువైపు వెడుతున్నావ్, ఈ మానకచూ వియ్యపురాలికిచ్చిరా, అని మా అమ్మ అదేశించింది. చెపితే నమ్మరుకాని, ఇది మా తోటలోదే" అన్నాడు.

రాసమణి అతి కష్టం మీద నవ్వు అపుకుని "సరే, సరేలే, నువ్వింక నూరబద్దాలు కల్పించి చెప్పక్కర్లేదులే బాబూ! కాళ్లూ చేతులూ కడుక్కో, భోంచేద్దువుగాని" అన్నది.

నరేన్ హమ్మయ్య బతికిపోయా ననుకున్నాడు. భోజనం చేసి అత్త గారి వంటింటి గుమ్మంలో కుర్చీపీటమీద కూచుని, ఆమెతో కబుర్లు మొదలెట్టాడు. అంతులేకుండా అనర్గళంగా మాటాడుతూ రాసమణికి ఊపిరాడనీయకుండా చేశాడు. ఆమె ఒకసారి గద్దించటానికి కూడా ప్రయత్నించింది; కాని అలాంటి గద్దింపుల్ని పట్టించుకునే రకంకాదు నరేన్.

అయితే రాసమణి కూడా అభిప్రాయాన్ని మార్చుకునే మనిషి కాదు.

మర్నాడు పొద్దున లేవగానే అల్లుడితో "ఇవాళ మంచి రోజు, శ్యామని మీ యింటికి తీసుకెళ్ళు" అన్నది.

నరేన్ అప్పటికీ అర్థంచేసుకోలేదు. "ఇంకా సంవత్సరం పూర్తి కాలేదు. అదీకాక ద్విరాగమనం (పెళ్ళయిన యేడాది లోపల రెండో సారి అత్తరింటికి వెళ్లటం వంగదేశపు ఆచారాల్లో ఒకటి) ఆచారాలవీ ఉన్నాయిగా" అన్నాడు.

"ఉండనియ్" రాసమణి నిరాసక్తతో కఠినంగా చెప్పింది జవాబు. "పిల్ల యిక్కడ ఉండొచ్చు. నువ్వు మాత్రం రావటానికి వీల్లేదు. ఏది మంచిదో నువ్వు ఆలోచించుకో. అయితే అది అక్కడికి రావటానికి తొందర పడుతోంది. నేను బండి బాడుగకూడా యిచ్చేశాను. సంసారానికి కావలసిన సామానులవీ యిచ్చి పంపటానికి తెప్పించి ఉంచాను. భర్త స్వయంగా వెంటపెట్టుకువెళ్ళటం తప్పు లేదంటారు. ఇవాళే తీసుకెళ్ళు."

ఎన్నివిధాల ప్రయత్నించినా, ఆమెని ఆ నిర్ణయంనుంచి కదపటానికి వీలుకాలేదు. శ్యామ యేడుస్తూ వెళ్ళిపోయింది. రాసమణి యేరి కోరి కొనుక్కుని వచ్చినవన్నీ బండిలో పెట్టించి, వారిని సాగనంపి యేడుస్తూ కూచుంది. అంతకు ముందెప్పుడూ, ఆమె ముఖంలో ఒక్క నరం కంపించటం కూడా యెవరూ చూడలేదు.

ఏమయినా ఆమె ప్రతిజ్ఞలన్నీ నిలబెట్టుకోటం సాధ్యం కాలేదు. క్షమాసుందరి స్వయంగా వచ్చి కొడుకు తరఫున క్షమాపణ కోరి వెళ్ళింది. "చూడండి. ఇది హిందూ వివాహం. ఆ సిందూరం చెరిపెయ్యటానికి వీల్లేదు. అలా అని కడుపున పుట్టిన బిడ్డను శాశ్వతంగా త్యజిస్తారా? నా ముఖం చూసి మీరు వాణ్ణి క్షమించండి."

రాసమణి కూడా లోపల్లోపల బాగా మెత్తపడినట్లుంది. ఆమె కూతుర్ని అల్లుణ్ణి మళ్ళీ ఆహ్వానించి తీసుకొచ్చింది. మళ్ళీ రాకపోకలు ప్రారంభమయాయి.

రోజులు గడిచిపోసాగాయి.

కాని రోజులు, నెలలు, సంవత్సరాలు బాలిక అయిన శ్యామ శరీరంలో రూపలావణ్యాల్ని మాత్రమే తీసుకురాగలిగాయి కాని, ఆమె అదృష్టంలో మార్పుని తీసుకుని రాలేకపోయాయి. వయసు రావటంతోపాటు భార్యా భర్తల మధ్య పరస్పరానురాగం పెరిగిన మాట నిజమే. అయితే అంత మాత్రాన, శ్యామకి తిట్లు, దెబ్బలు కొంచెం కూడా తగ్గలేదు. ఆమె యేదో తన స్వంతఆస్తి అని నరేన్ ఉద్దేశం. అంతేకాదు ఇష్టం వచ్చినంత అత్యాచారం చెయ్యటానికీ భగవంతుడు తనకీ సంపత్తిని సమకూర్చి యిచ్చాడు. దేవేన్ సహజంగా యెంత ఉద్రేకి. ముక్కోపి అయినా, ఈ నైచ్యాన్ని సహించలేకపోయాడు. మధ్య మధ్య నరేన్‌ని శాసించ బోయేవాడు కూడా. దాని ఫలితంగా యెన్నోసార్లు భయంకరమైన వివాదం వస్తూండేది. అంతేకాదు చేతులుకూడా కలుస్తూండేవి. అన్న దములిద్దరూ నిస్సంకోచంగా, తల్లితండ్రుల పేర్లు యెత్తి తిట్టుకునేవారు. శ్యామ, రాధారాణి చెవులు మూసుకుని పారిపోవటం తప్ప వారికి మరో ఉపాయం లేకపోయింది. క్షమ గదిలో దూరి టపటపమని తల పగలు కొట్టుకునేది.

ఆ పర్వమంతా పూర్తికాగానే, నరేన్ మళ్ళీ మరోసారి శ్యామ మీద విరుచుకుపడి, "చెప్పవే చెప్పు. అతడికేం పట్టింది. నేను నిన్ను కొట్టాను దానికతడి కెందుకంత కడుపు ఉబ్బు ?'' అని దాంతోపాటు బుగ్గలు మెలి పెట్టటం, దెబ్బలు తన్నులు పడేవి. ఇలాంటి సందర్భాలన్నిటిలో - దెబ్బలకంటె అతడి చేష్టల్లో బయటపడే హీనత్వానికి శ్యామ సిగ్గుతో చచ్చి పోయేది.

ఆ సంగతులన్నీ రాసమణి చెవిని పడేవి. ఆమె యెప్పుడూ యే విషయంలోనూ అధైర్యాన్ని వ్యక్తం చేసేది కాదు. ఇంటి విషయాలు పరాయివాళ్ల ముందు వెళ్లబోసుకునే అలవాటు ఆమెకి లేదు. ఒక్క పూజ ముందు కూర్చున్నప్పుడు మాత్రం మనస్సులోని వేదనంతా ఇష్టదైవం ముందు వెల్లడించుకునేప్పుడు, ఆమె గుండెలు బ్రద్దలయిపోయాయనిపించేది.

కాని యేం చెయ్యగలదు ? ఏమిటి ఉపాయం ? అల్లుణ్ణి ఇంటికి రావద్దని వారిస్తే. కూతుర్ని గురించిన సంగతులేవీ తెలియనే తెలియవు.

ఒక్కొక్కప్పుడు ఆ వార్తలు నరేన్ స్వయంగా మోసుకొచ్చేవాడు. ఆమె కూతురు యెంత చెప్పినమాట వినని మొండిఘటమో ? చిలవలు

పలవలు వివరించి, అలాంటిదాన్ని యెలా లొంగతీసుకో తలచిందీ ఆ ఉపాయాలన్నీ చెప్పేవాడు.

ఒకరోజున మిట్టమధ్యాహ్నం వచ్చి పడ్డాడు. చేతికి తడిగుడ్డ కట్టుకట్టి ఉంది. చెయ్యి వాచికూడా ఉంది. ఇంట్లో అడుగుపెట్టగానే ఎలాంటి నటన లేకుండానే "పెట్టండి. నాలుగు మెతుకులు అన్నం పెట్టండి. ఇవాళ యింక యింటికి వెళ్లను" అన్నాడు.

అప్పుడామె అన్నం వడ్డించుకుని తినబోతోంది. ఆ అన్నం తీసు కొచ్చి పెట్టింది.

"ఉహూ ! నేను చేత్తో తీసుకుని తినలేను. మీరు నోట్లో పెట్టా ల్సిందే. చూశారుగా చెయ్యి పరిస్థితి ?"

"చేతికేమయింది బాబూ ?"

"మీ కూతుర్ని - (నరేన్‌కి శిష్టమైన భాష మాట్లాడటం కూడా అల వాటుంది) అదుపులో పెట్టబోతే జరిగిన పని యిది. కొట్టబోయే సరికివటు క్కున చేతికేదో కొట్టుకుని, చూడండి యెలా వాచిందో ? ఎప్పుడూ కదల కుండా నుంచుని దెబ్బలు తినదు. అంత పొగరుబోతు. తర్వాత కంచంకేసి చూసి, "ఇదేమిటి వట్టి కాయకూరల భోజనంలా ఉంది. అదేదీ లేదా ? ఓ ఉల్లిపాయ తరిగి యివ్వండి, వంకాయ వేపుడులో చాలా బావుంటుంది" అన్నాడు.

కొట్టినవారి చెయ్యే ఇలా అయితే - దెబ్బ తిన్నవారి పరిస్థితి యెలా అయి ఉంటుంది ? అని ఊహించుకునే సరికి రాసమణికి కళ్ళ నిండా నీళ్లు తిరిగాయి. కాని ఈ పశువు ముందు కళ్ల నీళ్లు పెట్టుకోటం కూడా సిగ్గని పించింది. పైకి పొంగే కన్నీళ్లను అతి కష్టంమీద ఆపుకుని, ఒక చెంచా తీసుకొచ్చి, అతడి కంచంలో పడేసి - "ఎడం చేత్తో తీసుకుని తిను బాబూ ! నేనిప్పుడు నీకు తినిపించలేను" అన్నది.

"అయితే పర్వాలేదు కాని మరి ఉల్లిపాయ ? పోనీ నేనే కోసు కుంటాను. మళ్లీ మీ చేతులు వాసనేస్తాయి".

"ఎందుకూ ? ఉమ కోసి యిస్తుందిలే."

ఆమె అస్పష్టంగా "ఉస్ ! అబ్బా !" అనుకుంటూ గదిలోంచి బయటికి వెళ్లింది.

# రెండవ పరిచ్ఛేదం

## 1

నరేన్ వాళ్ల యిల్లు సర్కారువారు కొన్నట్లు కొన్నాళ్ల తర్వాత తెలిసింది. ఖిదిర్‌పూర్‌లో పడవలు నిర్మించే కర్మాగారం యేర్పడబోతోంది. వారి ఒక్క యిల్లే కాదు. ఆప్రాంతంలో చాలా యిళ్లు కొన్నారు.

ఈ సంగతి చాలా ముందుగానే తెలిసింది. అయినా అన్నగాని తమ్ముడుగాని మరో యేర్పాటు యేమీ చెయ్యలేదు. ఇంక యేడెనిమిది రోజుల్లో స్వాధీనం చేసుకుంటారనగా, అప్పుడు స్పృహ వచ్చింది. ఎక్కడికెళ్లి ఉండటమనేది పెద్ద సమస్య. బోలెడన్ని సామానులు - పెట్టెలు, పరుపులు, మంచాలు, బిందెలు, గుండిగలు ఉన్నాయి. సంసారం ఉన్న గురువు లవటంవల్ల - శిష్యులిచ్చినవి వంశపరంపరగా చాలా పేరుకుపోయాయి.

క్షమాసుందరి రాసమణిని కలుసుకోటానికి వచ్చింది.

"మీ యింట్లో కొన్ని సామాన్లు ఉంచనివ్వండి"

రాసమణి మితంగా మాట్లాడే మనిషి - ఆమె మాటపూర్తి చెయ్యక ముందే "అది వీలుపడదు వదినగారూ! అసలే అద్దె కొంప, చోటుతక్కువ. పైగా వియ్యాలవారి సామాను యింట్లో పెట్టుకోలేను. దానివల్ల ముందు ముందు యెన్నోమాటలు పడవలసి రావచ్చు, నన్ను క్షమించండి" అన్నది.

గత్యంతరం లేక క్షమ ఊరుకోవలసి వచ్చింది.

ఆమె తిరిగి వెళ్లేప్పుడు రాసమణి ఒక సలహా యిచ్చింది. "వదినగారూ! ఒక్క మాట చెపుతాను. మనస్సులో యేమీ అనుకోవద్దు. మీ అబ్బాయిల్లో యెవరూ మంచివాళ్ళు కాదు. వాళ్లవల్ల చాలా కష్టాలు పడాల్సి వస్తుంది అన్ని సామాన్లు యేంచేసుకుంటారు? ఎంతపెద్ద సంసారమయినా కానివ్వండి, అన్ని సామాన్లు అక్కర్లేదు. అనవసరంగా యిక్కడికి అక్కడికి మార్చుకోవటం వల్ల చాలా యిబ్బందులు పడాల్సివస్తుంది. చూస్తూండండి. అంతకంటె ఒక పనిచెయ్యండి. కొన్నిటిని మీరే స్వయంగా అమ్మండి. ఆ డబ్బు మీకు నమ్మకమైన వారెవరి దగ్గరయినా దాచుకోండి తర్వాత చాలా అవసరమవు. తుంది."

ఆ మాట క్షమకి నచ్చలేదు - మంచి సలహాలు సాధారణంగా అందరికీ నచ్చనట్లు.

కొన్ని సామానులు - ఒక బోషాణం వస్తువులు, బౌబజారులోని ఒక శిష్యులింట పెట్టి, తక్కిన సామానులన్నీ రెండు పడవల నిండా యెక్కించి, వారు 'గుప్తపాడా' వెళ్లటానికి నిశ్చయమయింది. అక్కడ ఒక పురోహితుడి పెద్దయిల్లొకటి ఖాళీగాపడి ఉంది. ఉండటానికెలాంటి అసౌకర్యమూ లేదు. మగవాళ్లిద్దరూ కలకత్తాలో ఒక గది అద్దెకి తీసుకుని ఉంటారు. సర్కారు వారి దగ్గిర్నుంచి డబ్బు చేతికి రాగానే స్థలం కొనుక్కుని, మరొకచోట యిల్లు కట్టుకోటం మొదలెడతారు. ఆడవాళ్లు యేకంగా ఆ క్రొత్త యింటికే వస్తారు. క్షమ వెళ్ళేప్పుడు కొడుకులిద్దరి చేతులూ పట్టుకుని మరీమరీ చెప్పింది. "చూడండి బాబూ, మమ్మల్ని ఈ అడవికి పంపించి, నిశ్చింతగా కూచో కండి. అదీకాక డబ్బనేది చేతిలో యెక్కువరోజులు నిలవదు. ఖర్చయి పోయిందంటే ఇహ ఇల్లు కట్టుకోవటం కుదరదు. చూడండి, అన్నదమ్ము లిద్దరూ సఖ్యతగా ఉండండి, లేకపోతే ఒట్టే మీ మీద"

నరేన్ వారిని దింపించి రావటానికి వెళ్లాడు. తిరిగి వచ్చేప్పుడు అతడితో ప్రత్యేకంగా "అన్నయ్యని గౌరవించు, మధ్యమధ్య ఊరికే పోట్లా డకు, తెలిసిందా ? పోతే వీలయినంత తొందరలో మమ్మల్ని తీసుకెళ్లు. ఈ దిక్కుమాలిన ఊళ్లో ముగ్గురం ఆడవాళ్లం ఉంటున్నాం" అని చెప్పింది.

"తప్పకుండానమ్మా ! ఆ మాట చెప్పాలా ? చూడమ్మా, మూడు నెలల్లోపల యిల్లు పూర్తి చేసి, మిమ్మల్ని తీసుకెడతాను."

నరేన్ గట్టిగా భరోసా యిచ్చాడు.

ఆ తర్వాత చరిత్రంతా అస్పష్టం.

ఇంటి డబ్బు కొద్దిరోజుల్లోనే వచ్చిందని క్షమకి తెలుసు. అంతవరకు అన్నదమ్ములిద్దరూ నియమంగా వచ్చేవాళ్లు, డబ్బువచ్చిన తర్వాత వాళ్ల కనబడటమే గగనమయింది. డబ్బు వచ్చిన పదిహేనురోజులకి నరేన్ యెంతో దర్జాగా ముస్తాబయి వచ్చాడు. ఖరీదయిన సిల్కులాల్చీ, జేబులో బంగారు గడియారం, మంచి పాంప్ షూ వేసుకుని ఉన్నాడు. క్షమ కొడుకు కేసి చూసి, అనుమానించింది "ఏంరా ? డబ్బు రెండు చేతుల్తో దుబారా చెయ్యటం లేదుకదా ? ఇంత దర్జా దేనికి ? ఇవన్నీ యెక్కడ నుంచి వచ్చాయి" అని అడిగింది.

నరేన్ కోపంతో - "నీదంతా ఊరికే సొదమ్మా ! నేనేం సంపాదించటం లేదనుకుంటున్నావా ?" అన్నాడు.

"ఆఁ నువ్వు సంపాదన కూడా చేస్తావ్ చదువురాని మూర్ఖుడివి !"

"నేనేమనను ? అమాయకురాలైన ఆడదానివికనుక సరిపోయింది. కాని లేకపోతే, ఆమాట యింకెవరయినా అన్నట్లయితేనా ? వాళ్ళతల తీసే సేవాణ్ణి"

అవమానం చేస్తాడేమో అన్నభయంతో క్షమ మెదలకుండా ఊరుకుంది. కాని శ్యామ విడిచిపెట్టలేదు.

రాత్రి అడిగింది. "ఏమండీ ! అత్తగారినంత పెద్దపెద్ద మాటలతో దబాయించారు. కాని ఆ డబ్బంతా యెలా సంపాదించారో చెప్పండి"

"నువ్వు ఆగు, నీకేం తెలియదు"

"అంతా తెలిసినా తెలియకపోయినా, చెవులారా విని జీవితం సార్ధకం చేసుకుంటాను"

కాసేపాగి, 'ఫట్‌కా' ఆడిగెలిచాను అన్నాడు నరేన్.

"ఆ ఆటలో గెలవటమేమిటండీ ?"

"హుఁ"

"దాన్నే జూదం అంటారనుకుంటాను" అని శ్యామ భయంతోనే ప్రశ్నించింది.

"నువ్వు ప్రతిదానికీ ఈకెకియాక, తోకకి తోక లాగుతావ్ దేనికి ? నోర్మూసుకో". ఇంక నోర్మూసుకుని ఊరుకోకపోతే, యేం జరుగుతుందో శ్యామకి తెలుసు. అందుకని నోరుమూసుకుంది.

నరేన్ ఆ మర్నాడే కలకత్తా వెళ్ళిపోయాడు. ఎంత బతిమాలినా ఆగలేదు. "పగలు రాత్రి స్థలంకోసం తెగ వెతుకుతున్నాను. మిమ్మల్ని ఈ స్థితిలో యిక్కడ వదిలేశాను. నాకూ యింగితజ్ఞానమనేది ఉందిగా ! అన్నయ్యకేం - స్థలమూ వెతకడు. మా సంగతీ పట్టించుకోడు. ఏది చెయ్యాలన్నా అన్నీ నేనే" అన్నాడు.

అప్పటికీ క్షమ భయభయంగా "అవున్నా, కలకత్తాలో బోలెడంత స్థలం ఉంది. స్థలంకోసం వెతకటం దేనికి?" అని అడిగింది.

"అదే ఆడబుద్ధి అంటారు. దేనికా? స్థలం ఊరికే కొనేస్తే సరా? ఆ వాడ మంచిదయి ఉండాలి. స్థలం చౌక ధరలో ఉండాలి. వ్యావహారికంగా యెలాంటి చిక్కులూ లేనిదయి ఉండాలి. అవన్నీ చూసికదా కొనాలి: ఏదో ఓ స్థలంకొని, డబ్బువృధాగా ఖర్చు చేశాక అందులోఉన్న లొసుగులన్నీ బయటపడటం. అలాంటి పని చెయ్యటం నావల్ల కాదు".

ఇది జరిగాక ఒక నెలరోజులవరకు అన్నదమ్ముల జాడే తెలియలేదు. క్షమ చాలా ఆందోళన పడింది. ఆమెకిఖ ర్చులకోసం యిచ్చింది కాస్తే ఆ డబ్బు అయిపోయింది. ఇంతకంటె అసలు పెద్ద చిక్కు - బజారుకి వెళ్ళి కావలసినవి తెచ్చిపెట్టేవాళ్ళెవరు? వయసులో ఉన్న యిద్దరు ఆడపిల్లల్ని పెట్టుకుని, తాను ఒంటరిగా ఉంటున్న ఆడది. పెద్దతోట మధ్యలో ఉన్న యిల్లు ఎవర్నయినా పిలిస్తే వెంటనే పలికే ఆస్కారంలేదు. ఒక పని మనిషి బయట పనులన్నీ చూసిపెడుతుంది.

ఆ పనిమనిషిని అవీయివీ. కొనుక్కురావటానికీ పంపటం కుదరదు. ఆ పనికత్తె దయదలచి ఏ కుర్రాణ్ణయినా పిలుచుకునివస్తే, వాడు యేమయినా కొనుక్కొని తెచ్చియిస్తేస రి, లేకపోతే లేదు. మధ్యలో రెండు మూడు రోజులు వంతున నాలుగయిదుసార్లు ఉపవాసాలు చేయవలసి వచ్చింది. తోటలో పెద్దపెద్ద గుమ్మడికాయలు దొరుకుతాయి. గుమ్మడికాయలు వట్టి కూరమాత్రం వండుకుని తిని గడిపారు. పండ్లు కాయలు అయితే చాలా ఉన్నాయి. కూరలకి వాటికీ లోటులేదు. కాని అన్నం లేకుండా యివి వండుకుని తినటంలో అర్ధమేమిటి? చివరికి ఒక నెలగడిచిపోయాక శ్యామ చేత ఉత్తరం రాయించటం జరిగింది. రాధారాణి కూడా తాను రాస్తున్నట్లు దేవేన్‌కి ఒక ఉత్తరం రాయించింది.

కొన్నాళ్లు గడిచాక దేవేన్ దగ్గిర్నుంచి సమాధానం వచ్చింది. అతడా సమాధానం తల్లిపేర రాశాడు. మామూలుగా నమస్కారాలు ఉభయ కుశలోపరి తర్వాత -

'తర్వాత వివరంగా రాస్తాను. అదే శ్రీమాన్ నరేన్ - సర్కారు వారి దగ్గిర్నుంచి డబ్బువచ్చాక, బలవంతంగా తనవాటా డబ్బు తీసుకుని, తన దగ్గిరే ఉంచుకున్నాడు. నేనొకవేళతన డబ్బుకూడా ఖర్చుపెట్టి, తర్వాత తీసుకో లేదంటానేమో అని వాడి భయం. అప్పటినుంచి - అంటే డబ్బు చేతికి వచ్చిన దగ్గిర్నుంచి శ్రీమాన్‌గారి దర్శనం కావటంకూడా దుర్లభమయింది.

ఎక్కడ ఉంటాడో యేం చేస్తూంటాడో మాకెవరికీ తెలియదు. ఎప్పుడైనా యింటికొస్తూంటాడు. వచ్చినా యేదో హడావిడిగా వస్తాడు, హడావిడిగానే వెళ్లిపోతాడు. అడిగితే స్థలంకోసం రాత్రింబగళ్లు తిరుగుతున్నానంటాడు. ఆ స్థలం యెక్కడ ? యేమిటని వివరాలడిగితే - సరీగ్గా సమాధానం చెప్పలేదు. ఈ లోపల నేను కొన్ని యిళ్లు స్థలాలు చూశాను. వాటి ఖరీదు కూడా చౌకగానే ఉన్నట్లనిపించింది, కాని వాటినిప్పటికీ శ్రీమాన్‌గారికి చూపించలేకపోయాను. వాడి యిష్టానికి వ్యతిరేకంగా కొనటం సాధ్యంకాదు. ఎందుకంటే ఇల్లు అమ్మితే వచ్చిన డబ్బులో నా సగంవాటా డబ్బు కొనటానికి చాలదు. ఈ పరిస్థితిలో నాకేం చెయ్యాలో తోచటంలేదు. ఇక్కడ నేను పనిచేస్తున్న వ్యాపారస్తుడి స్థితి దెబ్బతినటంతో నా నౌకరీకాస్తా పోయింది. నౌకరీయే వెతుక్కోనా ? స్థలాలే చూడనా ? శ్రీమాన్‌గారికోసమే వెతుకుతూ తిరగనా ? ఏం చెయ్యటమో నాకు తోచకుండా ఉంది. ఈ పరిస్థితిలో విధేయుణ్ణి యేం చెయ్యమంటావో, నువ్వు ఆజ్ఞాపిస్తే సంతోషంగా చేస్తాను. ఇంతే సంగతులు నమస్కారాలతో'

ఉత్తరంవిని, క్షమ కొయ్యబారిపోయింది. చాలాసేపు మెదలకుండా ఊరుకుని "శ్యామా! వాడికా గడియారం ఉంగరం, సిల్కు బట్టలు యెక్కడినుంచి వచ్చాయో నాకేం చెప్పలేదు. నీతోనయినా చెప్పాడా ?' అని అడిగింది.

శ్యామ తలవంచుకుని, "జూదంలో గెలిచి సంపాదించానని చెప్పారు, కాని అది నాకు నమ్మబుద్ధికాలేదు దత్తయ్యా!" అని చెప్పింది.

క్షమ యేదో గుండెలు విచ్చిపోయినట్టు పెద్ద నిటూర్పు విడిచింది. ఆమె యింక ఒక్క మాట కూడా మాట్లాడలేకపోయింది.

తర్వాత రెండు మూడు రోజులు ఆ ముగ్గురు ప్రాణులకు చెప్పలేనంత దిగులుతో గడిచాయి. దేవేన్‌కి సమాధానం యేం రాయటమో కూడా క్షమకి తోచలేదు. కాని మూడో రోజున హఠాత్తుగా నరేన్ దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చింది.

ఆ ఉత్తరం కూడా తల్లిపేరనే వచ్చింది. ఎందుకనంటే – పెద్దవాళ్లుండగా పెళ్లానికి ఉత్తరం రాయటం ఆరోజుల్లో సిగ్గుగా భావించేవాళ్లు. వంకరటింకర దస్తూరితో, లెక్కలేనన్ని వర్ణక్రమం తప్పులతో నిండి ఉందా ఉత్తరం.

"అన్నయ్యకి యిళ్ల స్థలాల బోట్లు చెప్పి చెప్పి అలసిపోయాను, ఆయనకి నచ్చలేదు. అసలాయనకి మతిస్థిరమేలేదు. ఈ స్థితిలో నన్నేమి చెయ్యమంటావో తెలియచెయ్యి. ఇటు చూస్తే డబ్బు మంచి నీళ్లలా ఖర్చయి పోతోంది. అదీకాక నీకు రాయాలంటే సిగ్గేస్తోంది. అన్నయ్య బుద్ధి, ప్రవర్తన కూడా చెడిపోయా యనిపిస్తుంది. అన్నయ్య రాత్రిళ్లు యిప్పుడు యింటికి రావడం లేదు". వగైరా.... శ్యామ ఉత్తరం చదవటం పూర్తి చెయ్యగానే, రాధారాణి బిగ్గరగా యేడవటం మొదలెట్టింది. క్షమ యెంతో కంగారు పడిపోతూ ఆమెని ఓదార్చసాగింది. శ్యామ మాత్రం గట్టిగా - "ఊరికే మనస్సు పాడుచేసుకుంటావెందుకు అక్కయ్యా ? ఇవన్నీ ఒట్టి అబద్ధాలని తెలియటంలా ?" అన్నది.

అయినా చాలాసేపటిదాకా రాధారాణి కన్నీళ్లు ఆగలేదు. ఆమెకి తన భర్త మీద కూడా అంత నమ్మకంలేదు.

క్షమ రాత్రంతా ఆలోచించి, మర్నాడుతెల్లారకముందే లేచి, శ్యామతో "శ్యామా, నువ్వు నేను రాసినట్లు ఆకోతులిద్దరికి ఉత్తరాలు రాయి. ఉత్తరం చూడగానే యిక్కడికి రమ్మని, నాకు చాలా జబ్బుగా ఉంది, బ్రతుకుతాననే ఆశలేదని రాయి. ఇక్కడికి వచ్చారంటే యెలాగో అలా మళ్లీ వెళ్లకుండా ఆపుచేయవచ్చు. మనకి కలకత్తాలో ఇల్లు అవసరంలేదు. ఇక్కడే కాస్త పొలం కొనుక్కుని, ఓ పాకవేసుకుని ఉండొచ్చు. లేకపోతే చివరి కింక అసలేమీ మిగలదు" అని చెప్పింది.

శ్యామ చివరిదాకా కొంచెం తటపటాయించింది. (బావగారికి మరొకరి పేరుతో ఉత్తరం రాయటం కూడా సిగ్గుపడే సంగతే) అందుకని రహస్యంగా రాసింది. అతికష్టం మీద దాన్ని పక్క యింటి సాలె అబ్బాయిచేత పోస్ట్‌లో వేయించింది. తర్వాత ముగ్గురూ నిర్జనంగా ఉండే లంకంత యింట్లో సంశయాల్ని బిగపట్టుకుని యెదురు చూడసాగారు - మనుషుల కోసం, కనీసం ఉత్తరం కోసం.... కాని ఒకటి తర్వాత ఒకటి దీర్ఘమయిన పగళ్లతో దీర్ఘతరమైన రాత్రిళ్లు పెనవేసుకుపోసాగాయి కాని, మనుషులూరాలేదు. ఉత్తరమూ రాలేదు.

నెల్లాళ్లు చూసి, క్షమ యిరుగుపొరుగు యిళ్లలో ఉండే ఒకర్ని కలకత్తా పంపించింది. అతడు తిరిగి వచ్చి 'ఆ యింట్లో యెవరూ ఉండటంలేదు. యెక్కడుంటున్నారో యెవరూ చెప్పలేకపోయారు అని చెప్పాడు.

## 2

ఇహ తర్వాత ఆడవాళ్లకి ముగ్గురికీ రోజులు యెలా గడవసాగాయో తేలిగ్గానే ఊహించవచ్చు.

క్షమది అసాధారణమైన ఆత్మగౌరవజ్ఞానం. ఇక్కడ చుట్టు పక్కల నివసించే వారిలో బ్రాహ్మణేతరులు యెక్కువ. క్షమ యిక్కడికి వచ్చి నప్పట్నుంచి, వారితో కొంచెం దూరత్వాన్ని కాపాడుకుంటూ వ్యవహరి స్తోంది. వారు కూడా ఆ దూరత్వాన్ని మన్నించేవారు.

ఇప్పుడింక ఆ దూరాన్ని నిలుపుకోటం కుదరలేదు. వారు వరు సగా మూడు రోజులు గుమ్మడికాయలు ఉడక బెట్టుకుని తిని గడిపారు. ఇహ అదికూడా సాధ్యపడక పోవచ్చు. కాని రాధారాణి చంటిబిడ్డని బతికించుకోవట మెలాగ అన్నది సమస్య అయింది వారికి. చివరికి ఇరుగుపొరుగు వారి గుమ్మంలో వెళ్లి నిలబడాల్సి వచ్చింది. బ్రాహ్మణ, కాయస్థుల దగ్గిర్నుంచి తప్ప - ఇతరుల దగ్గిర వారెప్పుడూ చెయ్యి చాచి యేదీ తీసుకోలేదు. అసంగతి క్షమ యెప్పుడూ గర్వంగా చెప్పుకునేది. కాని ఆ గర్వాన్ని నిలబెట్టుకోటం జరగలేదు. బియ్యం కోసం ఇతరుల ఇళ్లకి వెళ్లాల్సి వచ్చింది. మొదట్లో యింట్లో వస్తువులమ్మి, జరుపుకోటానికి ప్రయత్నించారు. కాని బ్రాహ్మల వస్తువులు కొనటానికి యెవరూ యిష్టపడలేదు. ధాన్యం ప్రతి యింట్లో కావల్సినంత ఉంది. రోజుకొకరు మోయన్ను పంపటం చాలాసులభం. క్షమ దగ్గిర వారి పరిస్థితి అంతా విని, చాలామంది మోయిన్ను పంపించారు. పిల్లవాడికి పాలుకూడా ఒకరు చిన్న గిన్నెడు చొప్పున పంపటం మొదలెట్టారు.

దానివల్ల కొన్నాళ్లు పస్తులుండటమయితే తప్పింది కాని పూర్తిగా కాదు. ఎందుకనంటే దానం యిచ్చేదాని కోసం వారు తగవు పెట్టుకోలేరు. మోయిన పంపేవాళ్లు సరిగ్గా లెక్కకట్టి ఆ ప్రకారం పంపించేవాళ్లు కాదు. అందువలన భాండారం ఖాళీ అవుతూ వచ్చినప్పుడు బిడ్డకోసం కాసిఉంచి అత్తాకోడళ్లు ముగ్గురూ పస్తుండేవాళ్లు. తాటిపళ్లు పండేకాలంలో ఆ పళ్లు తిని గడిపేవాళ్లు.

తరుణ వయస్సులో ఉన్న కోడళ్లిద్దరికీ యేదితిన్నా సరిపడేది కాని క్షమ ఆరోగ్యం చెడిపోసాగింది. కడుపులో రకరకాల బాధలు కలగ సాగాయి. క్షమ అడుక్కోటానికి మాత్రం గడపదాటి వీధిన పడలేదు. మరీ దుస్సహమైనప్పుడు ఒకొక్కసారి తలెత్తి కళ్లమూసుకుని, "ఎలాంటి

కొడుకుల్ని కన్నాను భగవంతుడా! అణువణువు వంతున మాతృహత్య చేస్తున్నారు'' అనుకుంటూ బరువుగా నిట్టూర్చేది.

ఆమె కోడళ్లముఖాలకేసి చూడగలిగేదికాదు. సిగ్గుతో తలతీసేసి నట్లనిపించేది. మధ్యమధ్య కళ్లనీళ్లు పెట్టుకుంటూ - "ఇలా అవుతారని తెలిస్తే వాళ్లకసలు పెళ్లిళ్లే చేసేదాన్ని కాదమ్మా : మీ ముఖాలు చూడలేకపోతున్నా, నన్ను క్షమించండి'' అని వాపోయేది.

రెండునెలలు గడిచాక క్షమ ఈ ప్రస్తావన తెచ్చింది. "నా అదృష్టం యెలా రాసిపెట్టి ఉంటే అలా అవుతుంది. మీరు పుట్టిళ్లకి వెళ్లండి. ఎన్నాళ్ళని యిలా గడుపుతారు ?''

ఈ మాటకి కోడళ్ళిద్దరూ యిష్టపడలేదు. రాధారాణి పుట్టింటి వారి పరిస్థితి అంత చెప్పుకోతగ్గదికాదు. అంతేకాక దేవేన్ ఇంతకు పూర్వం వారితో తగవులాడాడు. మొహమొహాలు చూసుకోటం కూడా మానేశారు. ఒక వేళ అక్కడికెళ్లిదంటే - దేవేన్ ఇంకయెప్పటికీ భార్యను తీసుకునిరాడు. ఆ సంగతి రాధారాణికి కచ్చితంగా తెలుసు.

ఇంక శ్యామ సంగతి, ఆమె స్థితీ అలాంటిదే. ఆమెకి తల్లి ఆశ్రయ మిస్తే ఇవ్వొచ్చు, కాని ఆమె ఒకవిధంగా పట్టుపట్టి అత్తారింటికి వచ్చింది. అలాంటిది మళ్లీ యేమొహం పెట్టుకుని తిరిగివెడుతుంది ?

"అది వీల్లేదత్తయ్యా : మిమ్మల్ని ఈ స్థితిలో విడిచి మేమెలా వెళ్లగలం ?''

క్షమ ఆమాటకి కరిగిపోయి, కోడల్ని గుండెలకి హత్తుకుంది. వారికీ స్థితిలో - అవాడలో ఉండేవాళ్లు శుభకార్యాలకు భోజనానికి పిలిచిన రోజు, కాస్త సంతోషాన్ని, ఊరటను కలిగించాయి. ఇంతకుముందు క్షమ ఇక్కడ యెవరి పిలుపునూ అంగీకరించేది కాదు. కాని యిప్పుడు కోడళ్లను అడ్డగించలేదు. పస్తులనేవి వుండనే ఉన్నాయి. పాపం, వాళ్లుఒక్కపూటయినా కడుపునిండా తింటే మంచిదిగా: పెళ్లిళ్లు, అన్న ప్రాశనల్లాంటివయితే కొంచెం యిబ్బందయేది ! ఏదైనా కానుక యివ్వాలన్న ప్రశ్నతలెత్తుతుంది. క్షమ అతి కష్టంమీద అమ్మవారి ముందున్న కుంకుమబరిణె లాంటివి వెతికి అర్ధ రూపాయో పావలాయో బయటికితీసేది. శ్యామ మొదట్లో సంకోచంతో వెనక్కి తగ్గుతూండేది. జీవితంలో ఆమెకి తెలిసినంతలో రూపాయికి తక్కువకూడా కానుకగా యిస్తారని యింతవరకు వినలేదు. అయితే

యిక్కడ అర్ధరూపాయి, పావలాయేకాదు, బేడకూడా చాలామంది కానుకగా యిస్తారు. ఆ వాడలో పేదవాళ్లని, తక్కువ జాతివాళ్లని, దయతలచే భోజనాలకి పిలుస్తూంటారు. కాని వాళ్లు దయని అంగీకరించటానికిష్టపడరు. సామాజిక గౌరవం పొందకుండా, భోజనం చెయ్యటానికి సిద్ధపడరు. అందుకనే బేడను కూడా కానుకగా యివ్వటం పరిపాటయింది.

అయితే పెళ్లిళ్లు అన్న ప్రాశనలు (ఉపనయనాలు కూడా యెప్పు డయినా సకృత్‌గా జరుగుతాయి. ఇక్కడ బ్రాహ్మల యిళ్లు తక్కువ) కంటె, తక్కిన సందర్భాల్లో పిలుపులే. మేలు బోలెడన్ని వ్రతాలు, నోములు ఉండనే ఉంటాయి. వాటన్నిటిలోనూ బ్రాహ్మణ ముత్తైదువులు కావాలి. అలాంటి వాటిలో భోజనం ఒక్కటేకాదు. కుంకుమ, పారాణి, తమలపాకులు, వక్కలు, దక్షిణ అవీకూడా ఉంటాయి. ఒకొక్కప్పుడు రెవికల గుడ్డలు కూడా దొరుకుతూంటాయి. యధావిధి సంపాదనలో ఉండే ఆనందమనేది శ్యామ మొదట్లో ఇలాగే చవిచూసింది.

మొదటి రోజునాటి సంగతి ఆమెకి బాగా జ్ఞాపకం ఉంది. సాలె ఆమె వచ్చి చేతులు రెండూ పట్టుకుని క్షమతో "బాపనమ్మగారూ! చెప్పటానికి ధైర్యం చాలటంలేదు. రేపు మా పెద్దకోడలి 'నిత్యకుంకుమ' నోము ఉద్యాపన. కనీసం పన్నెండుమంది బ్రాహ్మణ ముత్తయిదువులకు భోజనం పెట్టాలి. దయఉంచి మీ కోడళ్లను కనుక పంపిస్తే, ఇంకా చాలా మంది వస్తారు" అని బ్రతిమాలింది.

క్షమ చాలాసేపు మాట్లాడకుండా ఊరుకుంది. ఆమె మనస్సులో గట్టి సంఘర్షణ యేర్పడినట్లుంది. ఆ సాలె ఆవిడ నిన్ననే చిన్న గంపతో బియ్యం పంపించింది. వాటి మూలంగా నాలుగు రోజుల తర్వాత మళ్లీ కడుపులో అన్నం పడింది. దానమంటూ ఓసారి తీసుకున్నాక - ఇంక ఆమె మనస్సుని నొప్పించినందువల్ల లాభమేముంది?

రెండు నిమిషాల తర్వాత "అందుకు తగినట్లు యేర్పాట్లన్నీ జరుగు తున్నాయా?" అని అడిగింది.

సాలె ఆవిడ తలవంచుకుని నాలిక కరచుకుని - "కచ్చితంగా నాకు మాత్రం భయం లేదనుకున్నారా అమ్మగారూ! అమ్మో! బ్రాహ్మణ ముత్తయి దువుని ఆహ్వానించి తీసుకెళ్లటమంటే త్రాచుపాముతో చెలగాటం" అన్నది.

ఆయేర్పాట్లన్నీ యెలా ఉండటం అవసరమో, శ్యామకి యెంత ఆలోచించినా తోచలేదు. రాధారాణినడిగినా సరైన సమాధానం రాలేదు

అత్తగారి నడగాలంటే సిగ్గేస్తుంది. బ్రాహ్మణ ముత్తయిదువుని తీసుకెడితే యేమేం చెయ్యాలో - కనీసం ఆ ముత్తయిదువుకి తెలిసి ఉండటం మంచిది. నాకు తెలియదంటే ఆమె యేమనుకుంటుంది ?

సాలె ఆమె మధ్యాహ్నం రెండుగంటలప్పుడు, స్వయంగావచ్చి, వారిని ఆహ్వానించి తీసుకెళ్లింది. ఏర్పాట్లన్నీ భారీయెత్తున జరిగాయి. పెద్ద మంటపం కట్టించారు. బ్రాహ్మణులు, వైష్ణవులు చాలామంది కూచుని ఉన్నారు. ముత్తయిదువులు పన్నెండుమంది. వారితో పిల్లలెంతమంది ఉన్నారో లెక్కలేదు. సాలె అవిడ పెద్దకోడలు వారినందర్నీ చెయ్యి పట్టుకుని తీసుకెళ్లి, పీటలమీద నుంచోపెట్టి, కాళ్లుకడిగి, ఆ పాదోదకాన్ని ఓగిన్నెలోకి తీసి ఉంచింది. తర్వాత కొత్త అంగవస్త్రం తెచ్చి, పాదాలు తుడిచి, పారాణి పెట్టింది. తర్వాత ఒక్కొక్కరికి ఒకొక్క కుంకుమ బరిణె నిండా కుంకుమ పెట్టి యిచ్చి, అనుమతి. తీసుకుని, పాపిట్లో, ముంజేతి కంకణాల పక్కన కుంకుమ పెట్టింది. బ్రాహ్మణ స్త్రీల తలమీద చెయ్యి పెట్టటం కనుక దానికి అనుమతి తర్వాత ఒకొక్కకోరారంగు చీరధరింపచేసి, చెయ్యిపట్టుకుని తీసుకెళ్లి ఆసనం మీద కూచోపెట్టింది.

అయితే ప్రత్యేకమయిన యేర్పాటు యేమిటో శ్యామకిప్పటికి అర్థం కాలేదు. భోజనం ముందు కూచున్నాక తెలిసింది. విస్తట్లో యెనిమిదేసి పూరీలు, వంకాయ, మరోకూర వేపుడు, గుమ్మిడికాయ పులుసు ఒక చిన్న కప్పుతో ఉప్పు. గుమ్మిడికాయ పులుసు తెల్లగా ఉంది. నోట్లో పెట్టుకొని చూస్తే ఉప్పులేదు. అంటే బ్రాహ్మణేతరుల యిళ్లల్లో బ్రాహ్మలు ఉప్పు, పసుపు వేసిన కూరలు తినరు. విడిగా ఉప్పువేస్తే - ఆ ఉప్పు కూరల్లో తాము కలుపుకుని తింటే దోషం లేదు. శ్యామ పూరీలరుచి యించుమించు మరచిపోయింది. ఇన్నాళ్ల తర్వాత ఆమె చాలా తృప్తిగా తిన్నది. తర్వాత క్షీరాన్నం, మరొక తీపివస్తువు విస్తట్లోకి వచ్చాయి. భోజనంచేసి తిరిగి వచ్చాక, బ్రాహ్మలు చెప్పుకోటం మొదలెట్టారని వారు విన్నారు. ఇలాంటి కూరలు, పళ్ల యేర్పాట్లు చాలాకాలంగా జరగలేదు. కలకత్తా విందులోని 'మతిచూర్' 'దర్ బేష్' 'అమ్మత్' తింటే ఇంకా వీళ్లెంత చెప్పుకుంటారో ! ఇహ పోతే చేపలకూర - పసుపు వేసిన కూరే తినరు, ఇహ చేపల కూరా ? తనకి తెలియకుండానే శ్యామ ఒక నిట్టూర్పు విడిచింది. చేపల కూరనేది ఆమె యించుమించు మరచేపోయింది. దక్షిణ యిచ్చిన రెండణాలు చేతిలో ఉన్నాయి. మర్నాడు యెవరినయినా, ఆ మాట యీమాట చెప్పి ఉబ్బించి, చేపల కోసం యేటి ఒడ్డుకి పంపించాలని శ్యామ నిర్ణయించుకుంది.

ఇది జరిగిన కొద్ది రోజులకే, ఒక కాయస్థుల యింటినుంచి ఆహ్వానం వచ్చింది. అది మరొక ఆశ్చర్యం! ఈసారి ఉప్పు లేని గుమ్మడికాయ పులుసు బాగానే ఉన్నా, నూనెతో చేసిన పూరీలు వేశారు.

ఎవరయినా భోజనానికి పిలిచి, నూనెతో చేసిన పూరీలు వడ్డిస్తారని కలకత్తా యువతి అయిన శ్యామ యింతవరకు ఊహించలేక పోయింది. తినటానికయితే రుచిగానే ఉన్నాయి. పైగా యింట్లో తయారుచేసిన తాజా నూనెతో తయారుచేసిన పూరీలు యెంత ఘుమఘుమ లాడుతున్నాయో, అంత రుచిగా ఉన్నాయి. కాని తింటే యేం జబ్బు చేస్తాయో అని కాస్త భయం వేసింది. కాని యేమీ చెయ్యలేదు. పైగా వాళ్లు తోటికోడళ్లిద్దరికీ పద హారేసి 'సందేష్' లు (ఒక రకమైన బెంగాలీ స్వీట్) పొట్లం కట్టియిచ్చారు. క్షమ సంగతి జ్ఞాపకం పెట్టుకుని, వాళ్లు సంతోషంతో తీసుకొచ్చారు, ఆమెకంతకంటె గత్యంతరం లేదు.

వైశాఖమాసం మొత్తమంతా వారికి భోజనాల పిలుపులతోనే గడిచి పోయింది. వాళ్లు అన్యకులస్థుల యిళ్లకి భోజనానికి వెడతున్నారన్నవార్త ఒక్క సారి ఊరంతా పొక్కిపోవటంతో, చాలా ధైర్యంచేసి అడగటానికివచ్చేవారు. దాని ఫలితంగా, శ్యామ కెన్నోరకాల అనుభవాలు తెలిసి వచ్చాయి. తెలకుల వారింటికి భోజనానికి వెళ్లి చూసింది. ఆ భోజనంలో అసలు వండిన పదార్థాలనేవి లేనేలేవు. ఒకరాచిప్పనిండా పెరుగు పోసి 'సుర్త మాన్' (ఒక రకమైన అరటిపండు) పండును నాలుగయిదు ముక్కలుగాకోసి, ఆరేడు జతల 'సందేష్' సగం ముక్కలు, చేత్తో తాకని పేలాలు పోశా రందులో. అంటే పళ్లతో కలుపుకుని తినమని.

చివరికి పెద్ద గ్లాసెడు పాలు. అయితే ఇక్కడే రాబడి యెక్కువ గిట్టింది, కొత్త తుండుగుడ్డ, ఇత్తడి పళ్లెం నిండా సందేష్ సగం ముక్కలు, పైన రెండణాలు దక్షిణ.

వైశాఖమాసం దాటాక భోజనాల పిలుపులు తగ్గుతూవచ్చినా, జ్యేష్ఠ మాసం మామిడికాయలు, పళ్లతిని నాలుగయిదుసార్లు భోజనాలకు వెళ్లి గడి పారు. కాని శ్రావణమాసంలో మళ్లీ కష్టాలు-పెద్ద తోటలో యింటి చుట్టూ ఉన్న పెద్ద పెద్ద మామిడిచెట్లు పనసచెట్లు ఇంటిని కప్పేసి, చీకటికమ్మటం, బయట తెరపి లేకుండా భోరున వాన, కాలు బయట పెడితే యింతలోతు బురద నీరు. లోపలంతా చెమ్మ ఉరికిన చిత్తడి. అప్పుడు శ్యామకి ఊపిరాడనట్లుండేది. ఒకొక రోజున ఆత్మహత్య చేసుకుందామనిపించేది - కాని కడుపులో వున్న

సంతానం సంగతి తలపుకి రావటంతో సాహసించలేకపోయేది. శరీరం క్రమ క్రమంగా లావెక్కుతున్న కొద్దీ, యేమిటో మరింత నీరసం యెక్కువవు తున్నట్లుండేది. కాళ్లు చేతులు, కీళ్లు లాగుతుండేవి. ఈ సమయంలో నిజానికి కడుపునిండా తినాల్సిన మాట. అలాంటిది సగంరోజులు పైగా తినటమనేది ఉండేదేకాదు. ఆ ఘోరమైన వర్షంలో యెవరిసంగతి యెవరు పట్టించుకుంటారు ? ఎవరు బియ్యం పంపిస్తారు ? తాటి, గుమ్మడి, మేడి కాయలు ఉడకపెట్టుకుని తినితిని విసుగు పుట్టిపోయింది. దానికితోడు యీ కారుచీకటి. దీపం పెట్టుకుందామంటే నూనె లేదు. ఎలాగో ఒకసారి వెలిగించి పెట్టి, ఆర్పేయవలసి వచ్చేది. ఇక్కడికి వచ్చే ముందు దొంగల భయం మూలంగా, చిన్నచిన్న నగ - నట్రా ఉన్నవేవో కలకత్తాలోని ఒక దాత యింట్లో దాచుకుని రావటం జరిగింది. ఉన్నవయినా యేదో నామ మాత్రమే. అయినా వాటిలోంచి ఒక ఉంగరం, చెవిపోగులజత అమ్మ వలసి వచ్చింది. నమ్మకస్తుడైన ఒక రైతు కొడుకు చేతికిచ్చి, అతి కష్టం మీద అమ్మించవలసి వచ్చింది. కాని ఆడబ్బుతో మాత్రం యెన్నాళ్లని గడుస్తాయి ?

అన్నిటికంటె చిత్రం యేమిటంటే - ఈ కష్టాలకన్నిటికీ కారణమైన భర్త మీద శ్యామ కెంత కోపంవచ్చిందో, అంతకంటె యెక్కువ బెంగకూడా కలిగేది. ఇలా ముసురు పట్టిన రాత్రివేళల్లో, ఒకొకసారి అందరూ నిద్ర పోయాక ప్రొద్దు జరిగేదేకాదు. అంత బలిష్ఠుడు, అందగాడయిన భర్త యెక్కడున్నాడో, యేం చేస్తున్నాడో, యెవరికి తెలుసు ? ఓవేళ యేదైనా సుస్తీ చేసిందేమో, బహుశా తాను అనుకుంటున్నదేదీ కాదేమో ! ఒకవేళ సంపాదన కోసం ఉత్తరాలు కూడా రానంత దూరదేశం వెళ్లాడేమో ! వాత్సల్యమూర్తి అయిన తల్లిలా, ఆమెకి మనస్సులో భర్తలోని దోషాలన్నీ చెరిపేయాలనిపించేది. అక్కడ లేని ప్రతివారితో వాదించి వాదించి అలసి పోయేది. తాను యెవరికి నచ్చ చెపుతోందో, యెవరి ముందు నరేన్ తప్పు లన్నీ తుడిచెయ్యాలని ప్రయత్నిస్తోందో ఆమెకే తెలియదు. అయినా ఈ గుంజాటనలో కారణాలు వెతుక్కోటంతో ఆమె మనస్సుకి తీరిక ఉండేది కాదు.

మధ్య మధ్య ఆందోళనతో మనస్సు మరీ భయంభయంగా ఉన్న ప్పుడు, సహించలేని వేదనతో శ్యామ అత్తగారిని గట్టిగా కావలించుకునేది. క్షమ గభాల్న మేల్కొని "ఏమిటి శ్యామా ? భయమేసిందా ? నేనున్నానుగా, భయమెందుకు ? పాపం నిద్రలో యేదో కలవచ్చినట్లుంది" అనేది.

శ్యామ కంగారుగా "లేదు, లేదత్తయ్యా !" అని ప్రక్కకి ఒత్తిగిలి ముడుచుకుని పడుకునేది.

అప్పటికీ ఆమెకి నిద్ర పట్టేదికాదు.

బయట కారుచీకటి బావురుమంటూ ఉండేది. తాటిచెట్లు కొబ్బరి చెట్లు తలలు గాలితాకిడికి రాచుకుని, ధ్వనిస్తూండేవి. క్షణక్షణానికి చెక్కల సందుల్లోంచి మెరుపులు కన్పిస్తూ కళ్లు మిరుమిట్లు గొలిపేవి. ఆ పర ధ్యానంలో మేఘాల ఉరుములకి ఉలిక్కిపడేది. అలా పడుకునే భర్తను గురించి ఆలోచించేది. ఆ సమయంలో తమ కష్టాల సంగతి జ్ఞాపకమొచ్చేదే కాదు. అంతర్యం ఒకే వ్యక్తి మీద కేంద్రీకృతమై కన్నీటిని వర్షించేది. చాలాసేపు కన్నీళ్లు ధారగా కారేవేమో, చివరికి అలసిపోయి శ్యామ తెల్లవారు కట్ల నిద్రపోయేది.

3

భాద్రపదమాసం మొదట్లోనే, దేవేన్ దగ్గిర్నుంచి అనుకోకుండా పది హేనురూపాయలు మనియార్డరు వచ్చింది. అందులో రెండే రెండు పంక్తులు కూపన్‌లో రాసిఉంది. "బొత్తిగా తీరిక లేకపోవటంవల్ల మీసమాచారాలు తెలుసుకోలేకపోయాను. త్వరలోనే వస్తున్నాను"

అందులో నరేన్ మాటేమీ లేదు, లేకపొతే పోనియ్. ఒక కొత్త ఆశ యేదో మనస్సులో అలలా పైకి లేచింది. తమ భర్తలు యిద్దరూ ఒకే స్థాయికి వచ్చారే అన్న దిగులుతో, రాధారాణి ముడుచుకు పోయినట్లుండేది. ఇప్పడిహ 'హమ్మయ్య' అని నిట్టూర్చి తెరపిన పడింది. ఆమె ప్రతి మాట లోనూ, కొత్తగా మళ్లీ పొందిన భర్తృ సౌభాగ్యపు అహంకారం - యేదో మెరుగుపెట్టిన బంగారం నిగనిగలా తళతళ లాడించసాగింది. తోటికోడలి మీద ఆమెకి అంతులేని సానుభూతి ఉంది. ఆ సానుభూతిలో - ఇన్నాళ్ల నుంచి అందరూ అనుకునేది నిజంకాదు. వెయ్యి చెప్పు, లక్షచెప్పు - నా మొగుడు నీ మొగుడికంటె చాలా మంచివాడనే అర్థం వ్యక్తమయేది.

కావొచ్చు. దాన్నిగురించి శ్యామ కేమీ బాధలేదు. ఆమెకూడా బావ గారి రాకకోసం యెంతో ఆత్రంగా - రోజులు కాదు, గడియలు లెక్కించ సాగింది. బావగారు వస్తే చాలు, తనభర్త కబురనేది తెలుస్తుందని ఆమె ఆశ. ఆ ఆశతో ఆమె అవమానాన్నంతనీ తేలిగ్గా సహించగలదు.

కాని అంతకు ముందే మరపురాని సంఘటన ఒకటి జరిగింది.

భాద్రపదం మధ్యలో - శ్యామ ఒకరోజున, అత్తగారిని పిలిచి,

"అత్తయ్యా నాకు కడుపులో యేవో పోట్లువస్తున్నాయి కాస్తలేవండి" అన్నది.

అప్పటికీ క్షమ ఊహించలేకపోయింది. ఆమె గబగబా లేచి దీపం వెలిగించింది.

కాని శ్యామ బయట కాసేపు తిరిగి వచ్చి బాధతో మెలికలు తిరిగి పోతూ, బోర్లగా పడుకుంది. ఎంత భరించలేని బాధ కడుపులో! ఏదో పట్కారుతో కడుపులోని పేగులు గుంజి లాగుతున్నట్లుంది.

"ఏమిటి శ్యామా! యేమయింది? అప్పుడే నీకు నొప్పులొస్తున్నాయా యేం? మంత్రసాని కెవరు కబురంపుతారు? రాధారాణీ! లే అమ్మా ఓసారి, ఏమవుతుందో!"

శ్యామ ముఖం వివర్ణమయింది. గ్రుడ్లు బయటికి వెళ్లకొస్తున్నాయి. బాధతో శరీరం మెలికలు తిరిగిపోతోంది. అయినా జరగబోయేది మనసులో తోచగానే శ్యామకి అంతబాధలో కూడా యేదో ఆనందం కలగసాగింది.

క్షమ గబగబా చీకట్లో, ఆ అడవిలో మతిచలించిన దానిలా పొరుగింటికి పరుగెత్తింది. పొరుగింటి ఆవిడ నిజంగా చాలా మంచిదనాలి. ఆమె తన పెద్దకొడుకుని మంత్రసానికోసం పంపించి, తాను క్షమ వెంట వచ్చింది. కాని అంతలోనే శ్యామ మగబిడ్డని ప్రసవించింది. అలసటతో ఆమె కళ్లు మూసుకుంది.

క్షమ గబగబా పరుగెత్తుకుని వచ్చి బిడ్డని ఒళ్లోకి తీసుకుంది.

అభాగ్యు డెక్కడున్నాడో, యేం చేస్తున్నాడో, యెవరికి తెలుసు? పుత్ర సంతానం ముఖం - ముందు తండ్రి చూడటం ఆచారం. క్షమకి మనస్సులో కలిగిన పరితాపానికి అంతులేదు.

ఆశ్వయుజమాసం మొదట్లో ఒకరోజున దేవేన్ నిజంగానే వచ్చి ప్రత్యక్షమయాడు.

అతణ్ణి చూడగానే క్షమకి కన్నీళ్ళు కట్టుపడలేదు. అంత అందంగా ఉండే తన కొడుకుకేమిటిలా తయారయాడు? నరేనంటే కొంచెం నలుపు, కాని దేవేన్ రంగు పసిమిబంగారం. అలా కాలినల్లబడి పోయినట్లుందేం? కళ్లు గుంటలు పడి లోపలికి పీక్కుపోయాయి. చూపులో కాంతి లేదు. బుగ్గలు జారిపోయాయి. ఏదో ఒక్కసారిగా ముసలివాడయిపోయినట్లున్నాడు. కాళ్లకి చేతులకి యేం దెబ్బలు తగిలాయో, ఇంకా పూర్తిగా మానిపోలేదు.

రాధారాణి మాటిమాటికీ కన్నీళ్లు తుడుచుకో సాగింది.

"ఏం చెయ్యను? తమ్ముడి పరిస్థితి అది. అసలు వాడి జాడే తెలియలేదు. ఇటు నా ఉద్యోగం పోయింది" అన్నాడు దేవేన్.

"అదేమిట్రా? నీదేదో గట్టి ఉద్యోగం అని విన్నాను" అన్నది క్షమ అతడి మాటకి అడ్డువచ్చి.

"నీకు మతి పోయిందమ్మా; ఉద్యోగం గట్టి యేమిటి - పైగా ఈ రోజుల్లో? అది అలా ఉంచు, ఈ పరిస్థితుల్లో ఇల్లు కొనడం జరగలేదు. పోతే చేతిలో డబ్బు కూచుని తినటం మొదలెడితే యెన్నాళ్లని వస్తుంది, చెప్పు? ఏం చేద్దామా అని ఆలోచించాను. ఒక స్నేహితుడు ఒరిస్సా వెళ్లి, ఉపిరి కాయల వ్యాపారం చెయ్యమని సలహా ఇచ్చాడు.

అక్కడికి కొంత దూరం నడిచి, కొంతదూరం పడవలో వెళ్లాలి. కాని మంచి లాభసాటి వ్యాపారంట: ఉపవాసాలు, శ్రమ, నీరసం అన్నీ మరచి, ఆ వ్యాపారం చెయ్యబోతే, బొచ్చె చేతికొచ్చింది. వారిలో దొంగలు దగ్గరున్న దంతా దోచుకుపోయారు, తెలుసా? తర్వాత జబ్బుచేసి మూణ్ణెల్లు ఆస్పత్రిలో పడ్డాను. కొంచెం నయమవగానే అక్కడినుంచి బయటయితే పడ్డాను; కాని యేమొహం పెట్టుకుని మీ దగ్గరకు రాను? అందుకని అక్కడినుంచి మళ్లీ వెళ్లిపోయాను.

"మళ్లీ యెక్కడికి వెళ్లావురా?"

"అది యింకా దూరం పడమట. కాశీకి దగ్గిర. అక్కడికెళ్లి మంచి మిత్రుడి సలహా విని, డాక్టరీ మొదలెట్టాను. అయితే చెప్పొద్దూ, ఇప్పుడొక రకంగా కాస్త కుదటపడ్డా"

"డాక్టరీయా? నువ్వు వైద్యం చేస్తావ్‌రా? దానికి చదువుకోవాలి, పరీక్షలు ప్యాసవాలని విన్నాను."

"అది నీకు తెలియదులే. అదంతా అడవి ప్రదేశం. పరీక్షలు ప్యాసయిన డాక్టరు అక్కడి కెవరొస్తారు? అయిదారురకాల మందులు పెట్టు కుని కూచున్నా నక్కడ. వాటితోనే జరిగిపోతోంది. అక్కడివాళ్లు వాటితోనే సంతృప్తి పడుతూంటారు."

"తర్వాత మనుషుల్ని - గినుషుల్ని చంపకురోయ్, చివరికి చేతులకి బేడీలు పడతాయి."

"ఏదీ! ఆర్నెల్లు గడిపి వచ్చాను. ఇప్పుడు అందరు నా చుట్టూ మూగుతున్నారు."

అప్పటికప్పుడు నోటికి వచ్చినట్టు కథ అల్లి చెప్పాడు. అయితే అతడు చివర చెప్పిన వైద్యం మొదలెట్టిన మాట నిజమే. దానికి ముందు చెప్పినవన్నీ అబద్ధాలే. మూర్ఖుడి చేతిలోకి డబ్బువస్తే యేమవుతుందో, వాళ్లచేతికి వచ్చిన డబ్బూ అంతే అయింది. కొందరు శ్రేయోభిలాషులయిన స్నేహితులు దొరికారు. తర్వాత కొద్దిరోజులు ఆనందంగా గడిపారో లేదో, ఉన్నకాస్తడబ్బు రెక్కలొచ్చినట్లు యెగిరిపోయింది. రకరకాలయిన పాడు జబ్బులన్నీ మిగిలిపోయాయి.

ఆస్పత్రిలో పడిన మాట కూడా నిజమే. లేకపోతే గత్యంతరం లేదు. అక్కడి నుంచి బయటికి వచ్చాక ఏడెనిమిది రూపాయలు అప్పుచేసి, మళ్లీ వెళ్లిపోయాడు. మందు అనేది ఒక్కటే లేదు కొనటానికి డబ్బెక్కడుంది? ఒక బాటిల్ సిరప్, ఒక రంగు సీసా నిండా నీళ్లు మాత్రం ఉన్నాయి. ఇహపోతే కాస్త సోడా ఉప్పు మాత్రం ఉంది. పప్పు చెక్కలు తింటారు వెధవలు. కాస్త సోడా కలిపియిస్తే, దానివల్ల ఉపకారమే కలుగుతుంది. జబ్బు నయమయే యోగం వుంటే దానంతటదే నయమవుతుంది.

కాకపోతే డాక్టరు మాత్రం యేం చేస్తాడు? డాక్టరు చేతిలో మాత్రం రోగులందరూ బ్రతుకుతారాయేం? దాన్నిగురించి దిగులెందుకు? ఇదీ మరో మిత్రుడు చెప్పిన సలహాయే.

ఈ మిత్రుడు మంచి సలహాయే యిచ్చాడు. బస్తీలో అయితే దేవేన్ నాలుగణాలు ఫీజు తీసుకునేవాడు. పల్లెటూరు వెడితే యెనిమిదణాల నుంచి రూపాయిదాకా తీసుకుంటాడు ఫీజు. గంభీరంగా గొట్టం పెట్టి నాడి చూస్తాడు తిరిగివచ్చి మందు పంపిస్తాడు. ఒకసీసా మందు రెండణాలు. జబ్బు నయమయాక క్యాబేజీ, గుమ్మడికాయ, సొరకాయ, గోధుమపిండి కందిపప్పు మొదలయినవి పంపటం ఉండనే ఉంది. దాని మూలంగా దేవేన్ రెండు మూడు నెలల్లో 'బచ్చర్' (గాడిద, గుర్రం కాని ఆ కోవకు చెందిన జంతువు. కంచర గాడిద లాంటిది కావొచ్చు) కొన్నాడు.

మూడు రోజుల తర్వాత దేవేన్ తల్లిదగ్గర తల గోక్కుంటూ "అమ్మా! నేనిహ వెళ్లాలి" అన్నాడు.

"అదేమిట్రా? అప్పుడే!"

"లేకపోతే చేతిలో ఉన్నరోగులు యింకో డాక్టరు దగ్గర కెడతారు. అసలు నేనిప్పుడు రావలసిందా? మీకోసం మరీ ప్రాణం కొట్టుకోటం మూలంగా వచ్చాను"

"అయితే వెళ్లు, కాని మాగతేమిటి ?

దేవేన్ కొంచెం తటపటాయించి "నేనొక యిల్లయితే తీసుకున్నాను. తిండీతిప్పలకి యిబ్బందిగా ఉంది. తిరిగి తిరిగి శ్రమ పడివచ్చి చెయ్యి కాల్చుకుని వండుకోటం - ఇహ నావల్ల కాదు" అన్నాడు.

"ఏం ? అక్కడ వంటవాడు గింటవాడు -"

"నీకేం మతి లేదాయేం ? ఇన్నేళ్లొచ్చి, నేను - నేను యేహిందూస్తానీ వంటవాడిచేతి వంటో తిననా ? అసలు వాళ్ల జాతేమిటో తెలియదు. బహిర్దేశానికి వెళ్లివచ్చి పంచెకూడా విడవరు."

దేవేన్ ఈ మధ్య పతితల కొంపల్లో మాంసం తిండి తినటం కూడా మరిగాడని, క్షమ కల్లో కూడా ఊహించలేదు. ఆ సంగతి తెలుసు కనుకనే దేవేన్ ఆ మాట అనగలిగాడు.

క్షమ కాసేపు మెదలకుండా ఊరుకుని, కొంచెం విచారంతో - "అంటే నువ్వు మమ్మల్ని తీసుకెళ్లాలనుకుంటున్నావా ? కాని వాడి దగ్గిర్నుంచి కబురేమీ తెలియనే లేదు. ఒకవేళ యెప్పుడైనా వస్తే వాడిహ మన సంగతే తెలుసుకోలేడు" అన్నది.

"ఆ దౌర్భాగ్యుడి పేరు నా ముందెప్పుడు యెత్తకండి. ఇదే చెపుతున్నా అంతే. లేకపోతే ఖూనీలు జరిగిపోతాయి. నీదెప్పుడు ఒకటే ధోరణి. నీకేదో వాడిమీద లేనిపోని మమకారం ఉన్నట్టుంది. నీగారాబం మూలంగానే వాడిలా పాడయిపోయాడు. దొంగ, దుర్మార్గుడు, బద్మాష్, లుచ్ఛా - కొంపకి చెడపుట్టాడు" అని దేవేన్ అరిచాడు.

శ్యామ చాటునుండి విని వణకిపోయింది. ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి. బావగారి మాటల్లో ప్రచ్ఛన్నంగా ఉన్న సంశయాన్ని ఆమె ఊహించింది.

క్షమ కూడా కొడుకు కోపం చూసి, ఆ ప్రసక్తి అణచివేస్తూ "వాడిష్టం, వాడేమయినా కానియ్. ఇక్కడ తెలియకపోతే వాడి అత్తగారి నడిగి తెలుసుకుంటాడులే, అంతకంటె యేం చేస్తాం ?" అన్నది.

దేవేన్ ముఖం ముడుచుకుని, ప్రక్కకి తిరిగి "అందరం వెళ్లటం మాట యెవరు చెప్పారు ? నేను కొత్తగా డాక్టరు ప్రాక్టీస్ పెట్టినవాణ్ణి. ఇంతమందిని నెత్తిన పెట్టుకుని వెడితే పోషించటమెలా ? ఉన్నదొక్కటే గది" అన్నాడు.

"అయితే మరి ?" అని అడిగింది తల్లి.

"ఈసారికి నీ పెద్దకోడల్ని మాత్రం తీసుకెడతాను.

దేవేన్ ఉదాసీనభావంతో అటుతిరిగి నిట్టూర్చాడు.

క్షమకి ఆశ్చర్యంతో కొన్ని క్షణాలవరకు నోటమాట రాలేదు. తర్వాత మెల్లిగా - "అయితే మేమేమయిపోవాలి ? నిర్మానుష్యమైన ఈ పాడుపడిన కొంపలో ఆడవాళ్లం యిద్దరం పడి ఉండమా ? నేను ముసలిదాన్నయిపోయాను. ఓవేళ నే నటోయిటో అయితే ? అది చిన్నపిల్ల, దానికి తోడు ఓ పసివాడు. ఎలా సంబాళించుకుంటుంది ? మేం తినగలమో లేదో తెలియదు. వచ్చిన డబ్బంతా తగలేశావ్ !"

"అలా అని అందరం వెళ్లటం మంచిదంటావా ? ఇప్పుడు నువ్వే అన్నావు - ఓవేళ నరోవస్తే, యెవరి జాడ తెలియకపోతే యేమనుకుంటాడో - అదీ అలోచించాలిగా ! వాణ్ణి అలావదిలేసి ఊరుకోటం మాత్రం మంచిదా ? నువ్వు వాడికీ తల్లివేగా !" అన్నాడు దేవేన్.

క్షమకి యింక ఆశ్చర్య పోవలసినదేం లేదు. ఆమె అతడికేసి చూస్తూ ఊరుకుంది. దేవేన్ కొంచెం ఆగి "పోనియ్ నీ చిన్న కోడల్ని కలకత్తాలో వాళ్లమ్మ దగ్గరకు పంపు. నువ్వు మాత్రం యిక్కడ ఉండు. ఎవరినయినా ఒక పనిమనిషిని పెట్టుకో. కావాలంటే నేను నాలుగో అయిదో పంపుతూంటాను. కనీసం నాలుగయిదు నెలలిక్కడే ఉండు. ఒకవేళ అప్పటికీ నరేన్ రాకపోతే, నేను వచ్చి నిన్ను తీసుకెడతాను" అన్నాడు.

ఆ 'నిన్ను' అన్నమాట నొక్కి చెప్పాడు.

క్షమ కాసేపు మెదలకుండా ఊరుకుని అక్కడినుంచి వెళ్లిపోయింది. వెళ్లేముందు శాంతభావంతో "మేము యేదో ఒకటి చేస్తాంలే మీరు వెళ్లటం అవసరం. మంచి రోజు చూసుకుని వెళ్లండి. మమ్మల్ని గురించి నువ్వేం దిగులు పెట్టుకోనక్కర్లేదు" అన్నది.

"ఇదే, నాకు మొదట్నుంచీ తెలుసు. నరేన్ యెన్ని తప్పులు చేసినా మంచివాడే, నేను మాత్రం మంచి చేద్దామనుకున్నా అది నీకు చెడుగానే కన్పిస్తుంది. సరే అలాగే చేస్తాను. రేపే తీసుకెడతాను. వాడికీ అమ్మవే కదా ? నువ్వు నాకొక్కడికే అమ్మవా ? నేను ఒక్కడినే బరువంతా యెందుకు మోయాలి ? నేను డబ్బు దుబారా చేశాను. వాడు మాత్రం చెయ్యలా ?

మంచిపని చేశా. దుబారా చేశానంటే నాతండ్రి సొత్తు నేను దుబారాచేశాను యేం ?"

దేవేన్ బిగ్గరగా అరిచి చాలా సేపటిదాకా గొణుక్కోసాగాడు. రాధా రాణి అత్తగారెక్కడ అనిష్టాన్ని కోరుతుందో అన్న భయంతో, కాళ్లుపట్టుకుని, కళ్లనీళ్లు పెట్టుకుంటూ "నన్ను క్షమించండి అత్తయ్యా, వారిలా మాట్లాడతారని నేకల్లో కూడా అనుకోలేదు. రాననటానికి లేదు, తెలుసుగా వారి సంగతి? సిగ్గుతో నాకు తల పగలకొట్టుకోవా లనిపిస్తొంది" అన్నది.

క్షమ యెంతో అపేక్షతో కోడల్ని గుండెలకు హత్తుకుని, ముద్దుపెట్టుకుని "నువ్వు సిగ్గుపడటం దేనికమ్మా ? నీ తప్పు యేముంది ? వాడి సంగతి యెరగనా నేను ? అమానుషులైన కొడుకుల్ని కన్నాను నేను దాని ఫలితంకూడానే ననుభవించక తప్పదు. మిమ్మల్ని కూడా ఈ నరకం లోకి త్రోశాను. అదే నా కన్నిటికంటె సిగ్గుగా ఉంది. పెళ్లి అయిన తర్వాత భర్త యెక్కడికి తీసుకెడితే నువ్వు అక్కడికి వెళ్లాల్సిందే అన్నది.

రాధ తోటికోడలి చేతులు పట్టుకుని యేడ్చేసింది. ఇన్నాళ్ల సాహచర్యంతో ఆమెకి తోటికోడలి మీద కొంచెం ప్రేమకూడా యేర్పడింది. "చెల్లీ ! ఇది నేను సుఖంగా వెళ్లటం కాదంటే నమ్ము" అన్నది. తర్వాత కొంచెం ఆగి తలవంచుకునే ; "నాకు అనుమానంగా ఉంది చెల్లీ : అయనేదో పాడుజబ్బులన్నీ తెచ్చుకున్నారు. నాకు మాచెడ్డ భయమేస్తోంది" అన్నది.

శ్యామ తెల్లబోతూ - "పాడు జబ్బులంటే యేమిటి అక్కా ? అవి యెందుకొస్తాయి". అని అడిగింది.

"అది నాకు సరీగ్గా తెలియదు చెల్లీ, చెడిపోయిన ఆడవాళ్ల దగ్గిర కెడితే అలాంటి జబ్బు లొస్తాయని, లోకులు చెప్పుకోటం విన్నాను. అలాంటివి నీకు యెప్పటికీ తెలియకుండా ఉండాలి. కాని నాకు మాత్రం మనస్సేమిటో పీకుతోంది."

దేవేన్ మర్నాడే రాధారాణిని తీసుకుని వెళ్లిపోయాడు. వెళ్ళేప్పుడు తల్లికి నమస్కరించి మూడు రూపాయలు కాళ్లదగ్గిర పెట్టాడు. ముఖం గోడ వైపుకి తిప్పుకుని నుంచుని "ఇప్పుడు చేతిలో ఇంతకంటె లేదు. ఇంత దూరం ఒట్టిచేతులతో వెళ్లటం కుదరదు. వెళ్లాక రెండుమూడు రోజు ల్లోపలే యేదయినా పంపిస్తాను" అన్నాడు.

క్షమ రోజంతా వంటింట్లో కట్టేసినట్టు అలాగే కూర్చుండిపోయింది. కాని వెళ్లేటప్పుడు కోడలు, ముఖ్యంగా మనుమడి క్షేమాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని, బయటికి రాకుండా ఉండలేకపోయింది. అలాగే మరొక కోడలి సంగతి జ్ఞాపకంచేసుకుని ఆ డబ్బు విసిరి కొడదామన్న కోరికను అణచుకుంది. "వాడితో చెప్పమ్మా, దారిలో యెక్కడయినా అవసరమవు తుందేమో, అదికూడా తీసుకెళ్లమని చెప్పు. తర్వాత బాగా ఉన్నప్పు డెప్పుడో పంపింవొచ్చులే. మాకు యిన్నాళ్ల యెలా గడిచాయో, యిప్పుడూ అలాగే గడుస్తాయ్."

దేవేన్ ఈలోగా యెద్దు బండెక్కి కూచున్నాడు. అతడింక సమాధానం చెప్పలేదు.

# మూడవ పరిచ్ఛేదం

## 1

ఖాళీగాఉన్న పెద్ద యిల్లు బావురుమంటోంది. అన్ని గదులు తలుపులూ మూసేశారు - ఒక్క గది తప్ప. అయినా శ్యామకి ఒళ్లంతా కంపించేది - అదే మరీ భయం. దేవ్‌న్ వాళ్లు వెళ్లిపోయిన దగ్గిర్నుంచి క్షమ కూడా యెక్కువ మాట్లాడటం లేదు. నిశ్శబ్దంగా కళ్ల నీళ్లు పెట్టుకుంటూ, మధ్య మధ్య పెద్దగా విన్పించేంత ధ్వనితో నిట్టూర్చేది. శ్యామయినా ఆమె దగ్గిర యేం మాట్లాడుతుంది? ఆమెని యెలా ఓదార్చాలో తెలియటంలేదు. ఆమె మాట్లాడకుండా ఊరుకునేది. ప్రచండమైన నిశ్శబ్దానికి ఒక్క పసివాడి యేడుపు మాత్రమే భంగం కలిగించేది. కాని ఆ యేడుపు ఖాళీగా ఉన్న ఇంత పెద్ద యిల్లంతా ధ్వనించి, ఒక విచిత్రమైన భయోత్పాత ధ్వని కల్గిస్తుందని, శ్యామ చప్పున పసివాడి యేడుపు మాన్పించటానికి ప్రయత్నించేది.

కాని క్షమ ఒక్కసారి కాదు, చాలాసార్లు - "కొడుకులే తల్లి మొహం చూడతలచుకోనప్పుడు - పరాయి తల్లి కన్నబిడ్డవి నువ్వెందుకమ్మా కష్టపడటం? నీకెందుకు బాధ్యత? నువ్వు కలకత్తా వెళ్లు. నేనెలాగో అలా రోజులు గడుపుకుంటాను" అన్నది.

శ్యామ యేమయినా సరే అందుకు ఒప్పుకోలేదు. ఆ ప్రస్తావనను యెదురు త్రిప్పి "అయితే మీరు కూడా కలకత్తా రండి. మా అమ్మ మిమ్మల్ని నెత్తిన పెట్టుకుంటుంది" అన్నది.

క్షమ నాలిక కొరుక్కుని, "అది నాకు తెలుసమ్మా! కాని ముసలి వయస్సులో పట్టెడు మెతులకుకోసం కొడుకు అత్తగారింటికెళ్లి ఉండటం చాలా సిగ్గుచేటు. అది నేను చెయ్యలేను" అన్నది.

ఆ వాడలో అందరూ ఛీ ఛీ అన్నారు. వాళ్ల జాలి, సాను భూతి శ్యామకి కూడా బాణంలా గుచ్చుకుంది. కాని తాను మాట్లాడేందుకు, చెప్పేందుకు యేముంది? తన మొగు డెలాంటివాడో, బావగా రెలాంటివారో అదే వారు చెప్పుకుంటున్నారు. అంతే! వాళ్లు బ్రతుకుతెరువు చూపించ వలసిన వాళ్లకి - తాము బ్రతుకుతెరువు కల్గించి దూషిస్తున్నారు. కోపం తెచ్చుకోవాల్సిన సంగతి కాదు. పైపెచ్చు కృతజ్ఞత చూపించాల్సిన సంగతి. శ్యామకూడా అలా ఉండటానికి ప్రయత్నించేది. కాని అప్పటికే ఆమెకి మిగిలిఉన్న ఆత్మగౌరవజ్ఞానం లోపల్లోపలే ఆమెని దహింపచేసింది. శ్యామకి భర్త సంగతి మనస్సులో చిత్తరువులా హత్తుకు పోయింది. ఈ లోపునే అతడి మొహం యేమిటో ఆమె మనస్సులోంచి చెరిగి పోయినట్లయింది. భర్త ముఖాన్ని యెప్పటికీ మనస్సులో ప్రకాశ వంతంగా ఉండేట్లు ధ్యానించుకునే వారి సంగతి శ్యామకి తెలియదు - అయితే ఆమెకిప్పటికీ స్పష్టంగా గుర్తుకి తెచ్చుకునేందుకు యిబ్బందయేది. ఆమెకి కేవలం భర్త సౌందర్యం, అతడి సాహచర్యంతో తాను పొందిన ఆనందానుభూతి మాత్రమే యిప్పటికీ గుర్తున్నాయి.

అప్పుడప్పుడది ప్రచండంగా, పిచ్చి యెత్తించేంత తీవ్రంగా గుర్తు కొచ్చేది. అతణ్ణి తిరిగి పొందటం కోసం, అతణ్ణి గట్టిగా పెనవైచుకోటం కోసం మనస్సెంతో కలవరపడేది. అలాంటప్పుడు దుఃఖంతో, క్షోభతో తల పగలకొట్టుకోవా లనిపించేది. తనకేదయినా శారీరకబాధకి కారణం సంఘటిస్తే, యేదో కాస్త తేలికపడతా ననిపించేది. అలాంటి సమయాల్లో భర్త చేసిన యే తప్పూ ఆమె మనస్సులో నిలిచేది కాదు. ఆయన రానియ్, ఆయన్ని యేమీ అనను అనుకునేది.

ఇలా కొన్నాళ్లు గడిచాక, కలకత్తానుంచి హఠాత్తుగా ఉమ పెళ్లి అని ఉత్తరం వచ్చింది. శ్యామని పంపించటం సాధ్యమవుతుందా? అయితే రాసమణి శ్యామను తీసుకుని రమ్మని మనిషినే పంపించేది.

క్షమ ఉత్తరం చదవటం పూర్తిచేసి కోడలి మొహంకేసి చూసింది.

"ఏం చేస్తావ్ శ్యామా?"

ఉమ ఆమెకి కవల చెల్లెలు. పసితనంలో, బాల్యంలో తనతో కలసి ఆడుకున్నది. ఒకరెమ్మని ఒకేసారి పూచిన రెండుపూలు.

ఉమ! ఉమని చూడకపోతే శ్యామ ఒక్క నిమిషం కూడా ఉండ గలిగేది కాదు. రాత్రిళ్లు యిద్దరూ తల్లికి చెరో ప్రక్క అమె గుండెల మీద చేతులు కలిపి వేసుకుని పడుకునేవాళ్లు. ఉమ యేదో తన అస్తిత్వానికి మరొక రూపం!

ఆ ఉమ పెళ్లి శ్యామకి శరీరంలోని శక్తినంతా కూడ కట్టుకుని కలకత్తాలోని తమ రెండంతస్తుల యింటికి రెక్కల కట్టుకుని వెళ్లి వాలాలని పించింది. ఆ డాబా పిట్టగోడ గూళ్లకి చేరపడి అక్కచెల్లెళ్లిద్దరు యెన్నో మాట్లాడుకున్న చిన్ననాటి స్మృతులు నిలిచిపోయిన యిల్లది.

కాని ఆ ఉమ పెళ్లి కదా అని వెళ్లటం సాధ్యం కాదు.

కోడలు మౌనంగా ఉండటం చూసి, అత్తగారు అంగీకార సూచన అనుకున్నది. "నీ చెల్లెలికి యేం కానుక తీసుకెడతావా అని ఆలోచిస్తున్నా. ఏదో ఒకటి తీసుకెళ్లకపోతే మర్యాదగా ఉండదు. కనీసం 'అయి బూడో భాత్' (పెళ్లికి ముందు వధువు తండ్రి యింట కాని, వరుడి తండ్రి యింట కాని విందు యేర్పాటు)కి చీరె అయినా తీసుకెళ్లాలి"

"నేను వెళ్లనత్తయ్యా!"

"వెళ్లవా? యెందుకనమ్మా?" అని అడగటమయితే అడిగింది కాని - క్షమ కంఠంలో కోడలు మళ్లీ ఆ అభిప్రాయా న్నెక్కడ మార్చు కుంటుందో అన్న ఉద్వేగం వ్యక్తమయింది.

శ్యామ తలవంచుకునే సమాధానం చెప్పింది. "ఏం కట్టుకుని వెళ్లి నిలబడను అత్తయ్యా? నగలేమో అక్కడే ఉండిపోయాయ్. ఇప్పటికీ ఉన్నాయో లేవో మాత్రం తెలియదు. బనారస్‌చీరె కూడా యిక్కడ లేదు. అసలు ఒక మంచి చీరనేది కూడా లేనే లేదు. ఈ స్థితిలో అక్కడి కెడితే చాలామంది చాలా రకాలుగా మాట్లాడతారు. ఎంతమందికని సమాధానం చెప్పను! మీ అబ్బాయి సంగతి అడిగితే యేమని చెప్పను నేను? కానుక సమస్య ఉండనే ఉంది. అదీకాక మిమ్మల్ని ఒక్కరినీ యెవరి దగ్గిర ఉంచి వెళ్లను?"

"అంతగా అయితే చాకలిదాన్ని రెండు రాత్రిళ్లు వచ్చి పడుకోమని చెపుతాను. కాని తక్కిన సంగతులు -" అంతవరకు అని, కాసేపాగి, ఒక్క నిట్టూర్పు విడిచి "నీ దురదృష్టమమ్మా! లేకపోతే తోడపుట్టిన దానిపెళ్లి, ఇది మీ అమ్మ చేసే చివరి శుభకార్యం, నువ్వు వెళ్లలేకపోతున్నావ్. నిన్ను గట్టిగా వెళ్లమని చెప్పలేకపోవడం నా దౌర్భాగ్యం! నిజంగానే యేం కట్టుకని

వెడతావు ? పోనీ యివ్వటం మాట అలా ఉంచు. మీ అమ్మకి మాత్రం యేమని చెపుతావ్ ? ఆమె కూడా నీకేం తక్కువ యివ్వలేదుగా !'' అన్నది.

తర్వాత కొంచెంసేపు ఆగి, ఆమె వీపు ఆపేక్షగా నిమురుతూ - 'కాని ఒక్కమాట చెపుతా భర్త సంగతి యెత్తితే, ఎవరి కొడుకు ఎవరు తండ్రి ఇలా పేర్లు యెత్తి చెప్పకూడదు, దానివల్ల నింద వస్తుంది'' అన్నది.

శ్యామ కొద్దిరోజులు యేదో భూతం ఆవరించిన దానిలా చీకట్లో తిరగసాగింది. ఆమె శరీరం యిక్కడ ఉన్నదన్నమాటేగాని, ఆమె మనస్సు, ఆత్మ అన్నీ ఆ యింట్లోనే ఉన్నాయి. అక్కడ యెప్పుడు యేం జరుగుతోందన్నది ఆమె కెవరూ చెప్పక్కర్లేదు. తీరికగా ఉన్నా, పనిలో మునిగిఉన్నా, యేమిటో అన్నీ ఆమె కళ్ళకి కట్టినట్లు కన్పించేవి. కళ్లు మూసుకోవాల్సిన అవసరం లేదు. దృష్టి ఇంకొక వస్తువు మీదకి కాని, మనిషి మీదకి కాని మరల్చినా, కళ్లముందు మరొకటి కన్పించేది - అక్క వచ్చింది, అక్క, బావగారు, పిల్లవాడు వచ్చారు పెద్దమ్మ - పేరుకెక్కిన తన పెద్ద బిందెతో - గుమ్మంలో కుర్చీ పీట మీద కూచుని ఉంది ఆమె బాలవితంతువు. అగ్నిహోత్రుడిలా గుండెల్లో జ్వాల దాచుకుని. ఆమె యివాళ యీ యిల్లు, రేపు ఆ యిల్లు వంతున తిరుగుతూంటుంది. ఇహలోకంలో ఆమెకున్నదీ భాండం ఒక్కటే. ఎక్కడా ఆశ్రయమనేది లేదు, వేరే సంపతీ లేదు. రెండుమూడు సైనుపంచెలు, ఈ భాండం ఇవే ఆమె సంసారం. ఆమె యెక్కడైనా ఉండనీ ఆ ఇంట్లో యే పనికి సాయపడదు. వాళ్ళ తిండి తింటూంటుంది. వాళ్లనే తిట్టి పోస్తూంటుంది.

తల్లిదండ్రులు ఆమెని కులీనులింటి ముసలి - అవిటివాని కిచ్చి చేశారు. వితంతువయినప్పట్నుంచి - "అంతారాత ! లేకపోతే యెంతమంది ముసలి వాళ్లు బ్రతకటం లేదు ? అందుకు తల్లిదండ్రుల్ని రోజూ ఒకసారి తిట్టందే, ముద్ద నోట్లో పెట్టుకోదు. వాళ్ల పేరెత్తితే ఆమె - ''ఆఁ అంతా భవితవ్యం అంటారు వాళ్లు. తెలిసి తెలిసి వల్లకాటో శవానికిచ్చి చేశాక భవితవ్యం అనటం దేనికి ? వాళ్లే భవితవ్యం.వాఇద్దరూ కలసి నా కపాలాన్ని పర పర కోశారు'' అంటుంది.

అయినా అమ్మ పెద్దమ్మని పిలవకుండా ఉండదు. వంటింటి గుమ్మంలో కుర్చీపీట వేసుకుని తన శాకాహార భోజానాన్ని యెవరూ ముట్టుకో కుండా, తీసుకోకుండా కాపలా కాస్తూ కూచుని ఉంది. చిన మామయ్య కూడా వచ్చాడు, చినమామయ్య కొడుకు అమ్మను ఎప్పుడూ వదిలేసి ఊరుకో లేదు. బాబాయిలూ వాళ్లూ యెవరూ రారు. అందులో సందేహం లేదు.

అయితే పిన్నికొడుకు కలకత్తాలోనే మెస్సులో ఉంటున్నాడు. అతడు అప్పుడప్పుడు అమ్మదగ్గరకొచ్చి, ఒకపూట భోజనంచేసి వెడుతూంటాడు. అతడు తప్పకుండా వస్తాడు. ఇహపోతే వాడలో అటు యిటు అత్తయ్యలు, పిన్నిలు, వదినలూ జట్లుజట్లుగా వచ్చారు. బజారునుంచి కొనుక్కుని వచ్చిన పెళ్లిసామానులు అన్నీ యెక్కడ పెట్టారో శ్యామకి తెలుసు. తాంబూలాలు కట్టే సామగ్రి అంతా భోషాణం కింద పెట్టి ఉంచారు. ఉమకి అక్క తెప్పించిన బెనారస్ పట్టుచీర మడతవిప్పి అందరికీ చూపిస్తోంది. బావగారు కూడా పరిహాసాలాడుతూ, వియ్యాలవారికి మర్యాదలు చేయటంలో మునిగి ఉన్నాడు. ఆపనిలో అతడు సిద్ధహస్తుడు.

ఉమ భర్త చూపులకెలా వుంటాడో తెలియదు. ఉమ శ్యామకి కవల చెల్లెలు, ఆమెలాగానే అందంగా ఉంటుంది. అయితే ఆమె అంత గులాబీ రంగుకాదు. కాస్త పసుపు రంగు. అయితే యేం ? అంతకంటె మరింత అందంగా కనిపించేది. ఉమ - పేరుకీ ఉమే, చూపులకీ ఉమే ! సాక్షాత్తూ దుర్గలా ఉంటుంది. ఆమె వరుడు కూడా తప్పకుండా చూపులకు అందంగా ఉండిఉంటాడు. అమ్మ వరుణ్ణి చూడకుండా చెయ్యదు. అక్కని రెండో పెళ్లివాడికిచ్చి చేసింది, నిజమే, కాని బావగారి మొహం యెలా ఉంటుంది ? అచ్చగా మహాదేవుడే ; తనకి -

తనభర్త సంగతి వద్దు. ఎవరూ లేనప్పుడు తలపుకి వచ్చినా కళ్ల నిండా నీళ్లు నిండుతాయి.

ఉమ భర్తతో సుఖపడాలి : అత డెలాగయినా ఉండనియ్. అందం అవసరం లేదు.

పెళ్లిరోజు దగ్గరపడుతున్నకొద్దీ, శ్యామ మనస్సు ఉరకలెత్తసాగింది. క్షమ కోడలి మొహంచూసి చాటుగా వెళ్లి కన్నీళ్లు తుడుచుకునేది ! సరిగ్గా పెళ్లిరోజు తెల్లారకట్ట, ఆమె యేడుపుధ్వనికి మెలకువ వచ్చి, క్షమ లేచి బయటికి వచ్చేసరికి ఆమె మెల్లాలో కూలపడి, వెక్కి వెక్కి యేడుస్తోంది. ఇవాళ ఆమె యేడుపు ఆగటమనేది లేదు. ధైర్యాన్ని నటించటం సాధ్యం కాదు.

క్షమ ఒక్క ఓదార్పు మాట కూడా మాట్లాడలేకపోయింది. శ్యామ పక్కకి వెళ్లి కూచుని, ఆమె తలని బలవంతంగా ఒళ్లోకి తీసుకుంది.

శ్యామ రాత్రి తెల్లవార్లూ నిద్రపోనే లేదు. అక్కడ వాళ్లు రాత్రి మేల్కొని ఉండి, కూరలు తరిగేవేళకి, ఆమెకి అదృశ్యంగా రాత్రంతా

యేదో అక్కడున్నట్లే ఉంది. నీళ్లు తేవటానికి వెళ్లేసమయం గుర్తుకి రాగానే యింక యేమయినా తనను ఆపుకోలేకపోయింది. నిజంగా ఆమె ఉమ పెళ్లిలో లేదు.

## 2

మర్నాడు కాక ఆ మర్నాడు - శాస్త్రప్రకారం ఆనాడు ఉమకి పూల పాన్పు వెయ్యాలి. ఆ రోజున సంజెపడే ముందు తలవని తలంపుగా నరేన్ వచ్చి ప్రత్యక్షమయాడు.

శ్యామ తన కళ్లను తానే నమ్మ లేకపోయింది. వెల వెల పోతూ ఊరికే అలా చూస్తూ ఉండిపోయింది. నరేన్ పరిహాసమాడాలని ప్రయత్నించి "ఏమిటి భూతాన్ని చూస్తూన్నావా యేం? అమ్మో ఇన్ని వగలు నేర్చు కున్నావా ?" అన్నాడు.

శ్యామ అతడి వాలకంచూసి, మరింత తెల్లబోయింది. ఆమె చివరి సారిగా అతణ్ణి సిల్కులాల్చీ, నేత ధోవతి, బంగారపు గడియారం, గొలుసు వేసుకుని ఉండగా చూసింది. ఇవాళ వాటికి బదులు చిరిగి మాసిపోయిన పంచె, చుక్కలున్న నేతగుడ్డకోటు వేసుకుని ఉన్నాడు. మోకాళ్లదాకా యెత్తికట్టుకున్నపంచె, కాళ్లనిండా దుమ్ము, చెప్పులు లేనికాళ్లు, చేతిలో చిన్నమూట, రేగిపోయిన జుట్టు, యేదో మసిపూసినట్లు నల్లగా ఉన్నవొళ్లు - తన భర్త యెన్నడూ యింత నల్లటివాడు కాడు - మెడ చిక్కిపోయి కొంగ మెడలా ఉంది. అంత ఉబ్బినట్లుండే బుగ్గలు - యెవరో లోపలికి పోయేట్టు నొక్కినట్లు గుంటలు పడి కళ్లు లోపలకు పోయినట్లున్నాయి. అన్నిటికంటె అప్పుడే అతడి జుట్టు అక్కడక్కడ నెరిసినట్లు సందేహం కలిగిం దామెకి. ముంజేతుల మీద, కాళ్ల మడమల మీద యేదో పంచర్ వేసినట్లు గాయాలు. ఒళ్లంతా మట్టిపేరుకుపోయి ఉంది. కొన్నినెలలుగా స్నానం చేయలే దనిపిస్తుంది.

ఆమె అలా తెల్లబోయి చూస్తూనే ఉంది. ఇంతలో - "ఎవరు వచ్చింది శ్యామా?" అంటూ, క్షమ వంటింట్లోంచి బయటికి వచ్చి కొడుకుని చూసి కొయ్యబారిపోయింది. ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది. కాసేపటికి పెదిమలుకూడా ఒకటి రెండుసార్లు కదిలాయి. కాని గొంతులోంచి మాటపెకిలి రాలేదు. నరేన్ నమస్కారం చెయ్యాలనేమో, ఆమె యెదుటికి

వచ్చేసరికి, ఆమె ఒక్క మాటయినా మాట్లాడకుండా వంటింట్లోకి వెళ్ళి, దభీమని తలుపులు మూసుకుంది.

"వాహ్! భలే, తమాషాకేం తక్కువ లేదు. అమ్మ కూడా నేర్చుకుందే". నరేన్ ఆశ్చర్యపోవాలని ప్రయత్నిస్తూ, మళ్లీ వెనక్కి వెళ్లాడు. తర్వాత చేతిలోమూట శ్యామ దగ్గరగా పెట్టి, "ఉమ పెళ్లయిపోయింది. మీరెవ్వరూ వెళ్లలేదేం ?" అన్నాడు.

ఆ ప్రశ్న అడగటం నరేన్‌కి ఒక్కడికే సాధ్యం. శ్యామ ఈ కొద్ది రోజుల్లో భర్తను ఆ మాత్రం అర్థంచేసుకుంది. అందుకని ఆమె యెలాంటి ఆరోపణ చెయ్యలేదు. కాని చాలా ఆశ్చర్యపోయింది. అన్నీ మరచిపోయి, "మీకెలా తెలుసు ?" అని అడిగింది.

"అరె! నేను ఆమాత్రం తెలుసుకోలేనా, నువ్వొక్కడే ఉంటే ? నిన్ను అత్తగారు తప్పకుండా కలకత్తా తీసుకెళ్లి ఉంటారని అనుకున్నా నేను. మీ అమ్మకి గారాబాల కూతురివిగా!"

ఎంత యెత్తి పొడవద్దనుకున్నా, ఒక్కొక్కప్పుడు సహనం అదుపు తప్పుతుంది. "మీ అమ్మ ముసలివారు, ఆవిడను యెక్కడ ఉంచి వెళ్లను ?"

"అమ్మ ఈపాటికి చచ్చిపోయి ఉంటుంది. లేదా అన్నయ్య వచ్చి యెక్కడికో తీసుకెళ్లిపోయి ఉంటా డనుకున్నా. అందుకే నీ సంగతి తెలుసుకుందామని ముందు కలకత్తా వెళ్లాను".

"మీరు.... మీరు యీ అవతారంతో కలకత్తా వెళ్లారా ?" అని వణకిపోయింది శ్యామ. ఆమె యించుమించు ఆర్తనాదం చేసింది. ఈసారి నరేన్ కూడా విస్తుపోక తప్పలేదు. "అరె ? నేనేం పెళ్లియిల్లని తెలిసి వెళ్లానా ? తర్వాత అత్తగారు విడిచిపెట్టలేదు. అప్పుడింకేం చెయ్యను చెప్పు ? ఆమెకిక్కడి సంగతులేమీ తెలియవల్లే ఉంది. అన్నీ నేచెపితే విన్నది. నువ్వు అన్నీ లోపల్లోపల అణచుకునే మనిషివి, భలే మోసకత్తెవి బాబూ" అన్నాడు.

తర్వాత తన చమత్కారానికి - తానే నవ్వుకుంటూ - "నేనేం స్వార్థంతో అన్నీ మెక్కి వచ్చాననుకున్నానా ? నీ కోసం అడిగి పట్టుపట్టి - పూరీలు, లడ్లు, అన్నిరకాలు మూటకట్టుకుని వచ్చాను. చేపలకూర అదీ పాడైపోతుంది కనుక -"

ఇంక శ్యామ మాట్లాడకుండా ఊరుకోలేకపోయింది.

"మీకు కంఠానికి ఉరి పోసుకోటానికి బారెడు తాడు దొరకలేదా? అందుకని ఈ తినుబండారాలన్నీ మోసుకొచ్చారా? ఏం? మెళ్లో జంధ్యం ఉందిగా! లేక అదికూడా అమ్ముకుంతినేశారా? ఛీ. ఛీ. నాకే గొంతుకు ఉరిపోసుకుని చావాలనిపిస్తోంది.

శ్యామ తన గదిలోకి వెళ్లి తలుపులు భడేల్న మూసుకుంది.

"హుఁ. చాలా పెద్ద పెద్ద మాటలు నేర్చుకున్నావే! చూడు, అందరు కలసి నన్నిలా సాధించకండి, చెపుతున్నా. కంఠానికితాడు యివ్వటం యేమిటో చూస్తా. దరిద్రుల గుంపు యెక్కడో?"

ఇదివరకటిలా అలవాటుప్రకారం అడుగులు బాదుకుంటూ పచార్లు చేసినా, నరేన్ కంఠంలో ఆ తీవ్రత వ్యక్తం కాలేదు. పైగా కొంచెంసేపయాక మళ్లీ తలుపు దగ్గిరకెళ్లి అలవాటు లేకపోయినా, క్షమాపణ కోరటానికి ప్రయత్నించాడు. క్షమే బయటికి రావలసివచ్చింది. ఏ అమానుషత్వాన్నయినా శక్తి ఉంటే శాసించవచ్చు. దానికి అభిమాన పడట మంత తెలివితక్కువ మరొకటి లేదు. వృథా అని తెలిసికూడా కాసేపు చివాట్లు పెట్టింది.

కాని నరేన్ నిస్సంకోచభావంతో, తనను సమర్థించుకున్నాడు. "వాహ్? తప్పులన్నీ నావేనా యేం? కలకత్తా నగరమవడం ఒకటి. నేనా చిన్న వాణ్ణికావటం, పైగా చేతినిండా డబ్బు ఉండటం. ఇహ బుద్ధి తిన్నగా ఉండమంటే ఉంటుందా? పోనీ నేను తిన్నగానే ఉంటాను. నలుగురూ యెందుకుండనిస్తారు? చూస్తూ చూస్తూండగానే నాలుగువైపుల నుంచి నా యీడు వాళ్లందరూ వచ్చి చేరారు. అంతే, తాగుడు, అమ్మాయిలు ఆ డబ్బు కాస్తా యెన్నాళ్లొస్తుంది!"

"అఁ!" అంటూ క్షమ యించుమించు అర్తనాదం చేసింది. "ఇంటి. కోసం ఉంచిన డబ్బు నువ్విలా తాగుడికి, ముండలకి తగలేసి తిరిగొచ్చావా? పైగా అది గొంతు చించుకుని బడాయిగా నాముందు చెపుతున్నావా? ఏరా? మీకు సిగ్గుశరాలనేవి లేవూ? వాడొకడు యేదో వ్యాపారం పేరు పెట్టి అంతా ఖర్చుపెట్టి వచ్చాడు.

నరేన్ వికృతమైన భంగిమ పెట్టి, "ఇదిగో, వ్యాపారం చేసి డబ్బు ఖర్చు పెట్టిందెవరు? చెప్పు. అన్నయ్యా?" అని అడిగాడు.

క్షమకి మొదట్లో కొంచెం సంశయం కలిగింది మనస్సులో. "అఁ అలా అనే చెప్పాడు -"

"నరేన్ హహహ అంటూ చాలాసేపు నవ్వి "అమ్మో!" అన్నయ్య బాగా కల్పించి కథలు చెప్పగలడే! నవల రాసుకుంటే నాలుగు డబ్బు అయినా వస్తాయి. నేను యేదారిన వెళ్లానో, వాడూ ఆదారినే వచ్చాడు. ఒక యింటికే యిద్దరం వెళ్లిపడ్డాం. అన్న యెవరితో వెళ్లేవాడో - నాకు తెలియదు. ఇద్దరికీ పాడు జబ్బులన్నీ తగిలాయి. నేను కాస్త కోలుకున్నాను. వాడింకా తీసుకుంటున్నాడు. వ్యాపారమా? ఆఁ వ్యాపారమే."

పూర్తిగా సిగ్గు విడిచి చెప్పి, నరేన్ సగర్వంగా చూస్తూ నిలబడ్డాడు. అన్నయ్య మోసాన్ని బయటపెట్ట లగటంతో అతడీసారి నిజంగానే మురిసిపోయాడు.

క్షమ స్తంభితురాలయి కూర్చుండి పోయింది. నరేన్ అమాను షత్వం ఆమెకి చాలాకాలంనుంచి తెలుసు. కాని దేవేన్! వాడు యిన్ని అబద్దాలు చెప్పాడా!

"అన్నయ్య ఇంక యేమేం కల్పించి చెప్పాడో చెప్పు, వింటాను."

"వాడు కల్పించి చెప్పాడో, నువ్వు కల్పించి చెపుతున్నావో నాకెలా తెలుస్తుంది? తోకతెగిన నక్క యింకో నక్కతోక తెగాలని కోరుకుంటుంది కదా? యెవరికి తెలుసు?"

"అమ్మమ్మమ్మ నీమీద ఒట్టు."

అని నరేన్ తల్లి తలమీద చెయ్యి తాకించబోయాడు. క్షమ భయంతో అక్కడినుంచి తప్పుకుని "ముట్టుకోకు ముట్టుకోకు. మిమ్మల్ని కడుపున కన్న పాపానికే నేను నరకానికి పోవాలి. ఇంకా నన్ను ముట్టు కోనిచ్చి నా పాపాన్ని పెంచుకోలేను. ఎన్ని జన్మల పాపం పెరగడంతోనో నేను మిమ్మల్ని కడుపున కన్నాను" అన్నది.

నరేన్ ఇలా పరిణమిస్తుందని అనుకోలేదు. ఎందుకనంటే - అతడు తన తప్పుల విషయంలో - సజ్జానికాదు. నరేన్ తల్లిని తాకబోతే హఠాత్తుగా ఆమె యెందుకు తప్పుకుని వెళ్లిపోయిందో, అతడు తెలుసుకో లేకపోయాడు. తర్వాత దాన్ని సంబాళించుకోటానికి ఒక్కడూ కాసేపు యెవరూ లేని వరండాలో నిలబడి, తనలో తానే బడాయిలు కొట్టుకోటం మొదలెట్టాడు "అబ్బో! తాకనివ్వకపోతే పోయింది. నాకేం నష్టమా? అన్నయ్య వచ్చి అవీ యివీ కల్పించి చెప్పడంతో సత్పురుషుడయి పోయాడు. నాసంగతి వచ్చేసరికి తప్పొప్పుల విచారణ. సరే, నేనిహరాను.

రాత్రి భోజనమయాక శ్యామ తక్కిన రోజుల్లోలాగానే క్షమ పక్కమీదికి వచ్చి కూచునేసరికి ఆమె కొంచెం విస్మితురాలయింది. అంతేకాదు, ఉద్విగ్నురాలు కూడా అయినట్టుంది "ఇంత పొద్దు పోయాక ఇంకా యిక్కడెందుకు శ్యామా! నీగదిలోకి వెళ్లి పడుకో, పోనీ పిల్లాడు నా దగ్గిర ఉంటాడు. ఓవేళ రాత్రి మరీ యేడిస్తే, పిలిచి నీకప్పగించి వస్తాలే ?" అంది.

శ్యామ అలవాటు ప్రకారం ఆమె కాళ్లు ఒత్తుతూ కాసేపు ఊరుకుని, "నేనిక్కడే ఉంటాను అత్తయ్యా, నాకేం బాగుండలేదు" అన్నది.

క్షమ లేచికూచుంది కోడల్ని ఒళ్లోకి తీసుకుని "నాకు తెలుసమ్మా, నేనూ ఆడదాన్నే, ఆ సంగతులన్నీ విన్నాక భర్త దగ్గిరకెళ్లాలంటే, యెంత అసహ్యం వేస్తుందో నాకర్థమయింది. మన సవతుల్ని తెలిగ్గానే సహిస్తున్నాం. అలాంటప్పుడు యింత అసహ్యం వెయ్యదు. ఇందులో ఉన్న నీచత్వం అందులో లేదు. కాని యేం చెయ్యగలవు? ఇది హిందూ వివాహం. చెరిపేసుకుంటే పోయేదికాదు. విడాకులిచ్చే ఆచారమూ లేదు. కాపురం చెయ్యాలనున్నప్పుడు సహించటం తప్ప యేం చెయ్యగలవు చెప్పు? అదీ కాక వాడి సంగతి తెలుసుగా! అరచి గోలచేసి కొట్టినా ఆశ్చర్యం లేదు. అర్ధరాత్రి కాస్త అరిస్తే చాలు అందరికీ వినిపిస్తుంది. వాడవాడంతా పాకి పోతుంది" అన్నది.

శ్యామ అత్తగారి ఒళ్లోనే ముఖం దాచుకుంది. ఇహలేచి కూచుని కళ్లనీళ్లు పైటతో తుడుచుకుని తలమీద చెంగు ముందుకు సవరించుకుని బయటికి వచ్చేసింది.

"మీరు తలుపు వేసుకుని పడుకోండి అత్తయ్యా"

బయటినుంచి సహజమైన శుష్కస్వరంతో - యేదో మరతిప్పితే పలికినట్లన్నది ఆ మాటలు.

ఇంట్లోంచి ఆమె బయటికి వచ్చిన చోటు - అది వరండా. క్షమ గది పక్కనుంచే మెట్లున్న గది. దాని ప్రక్కనున్న గదిలో ఇవాళ నరేన్‌కి పక్కవేసి ఉంది.

శ్యామ మరతిప్పితే నడిచే బొమ్మ లాగానే రెండడుగులు ముందుకి వెళ్లింది. మెట్లదగ్గిరకి వచ్చేసరికి చటుక్కున యేదో పర్యధానం వదిలి నట్లయింది.

ఉంది. ఇప్పటికీ ఉపాయం ఉంది. పారిపోవల్సిందేనా వివరికింట్లో నుంచి !

ఈమెట్లు ! ఈమెట్లు దిగగానే కింద వరాండాతలుపు తెరుచుకొని బయటికివెడితే యెవరికీ తెలియనే తెలియదు.

ప్రక్కన 'కుండూ' వారి చెరువు. ఇంకా స్త దూరం ముందుకు నడిచి వెడితే గంగ !

శాశ్వతమైన శాంతి ! ఈబాధ యింక భరింపశక్యం కాదు. శ్యామ కదలకుండా నుంచుంది. ఆశ ! బహుశా ఆశే కావొచ్చు ! చావుమీద ఆశ ! అదియెవరు తెలుసుకోగలరు ? ఇదే : ఆమెకి సరిగ్గా పదహారేళ్ల వయసు. నిండు యౌవనం. ఇన్నాళ్లూ ఆమె భర్తను యెంతో ప్రగాఢంగా కాంక్షించింది. కటికవాడు ! ఏమీ తెలియని మొద్దు ! పశువు ! అయినా అతణ్ణి కోరింది. తన తొలియౌవనంలోని తీవ్రమైన కోరికతో యెప్పుడూ భర్తని గురించే ఆలోచించింది. ఇవాళ ఆ భర్తే తిరిగివచ్చాడు - ఇంచుమించు ఒక సంవత్సరం తర్వాత.

అయితే -

అతడు పశువుకంటె మించినవాడు. ఇంట్లో అప్పుడే వికసించిన పద్మంలాంటి అందమైన భార్య - హృదయంలో అనురాగజ్యోతిని వెలిగించుకుని , స్వప్నంలాంటి ప్రణయరాత్రుల్లో, ఆవేశభరితమైన కాంక్షతో కంపించిపోతూ నిరీక్షిస్తూంటే - అక్కడికి వెళ్లకుండా, వధువుకేసి చూడకుండా - అతడు రూపాన్ని అమ్ముకుని జీవించే హీనురాలింటికి వెళ్లి, హేయాతిహేయమైన వ్యాధులతో ఆరోగ్యాన్ని, యౌవనాన్ని, లావణ్యాన్ని శాశ్వతంగా పోగొట్టుకుని వచ్చాడంటే - అతడు పశువుకంటె అధముడు.

పశువు దైహికమయిన అవసరాల్ని మాత్రమే తీర్చుకుంటుంది. అక్కడ పాత్రాపాత్ర విచక్షణ చేయదు ; కాని అలాంటి ప్రయోజనం లేకుండా, కేవలం నీచమైన, మలినమైన బురదగుంట మీది ఆకర్షణతో, వ్యామోహంతో పరుగెత్తే మనిషిని యే స్థాయిలో పరిగణించాలి ?

అలాంటి భర్త ఆలింగనంలో హత్తుకుపోవల్సిందేనా ?

తలచుకుంటేనే ఆమెకి వొళ్లగరిపొడిచింది. కాని - బిడ్డ ! శేఫాలికలా సుకుమారమైన పద్మంలా పవిత్రమయిన ఈ కుసుమం - తన దేహలతకు పూచిందే ! ఇది తనకి ఈశ్వరుడిచ్చిన కానుక. వాణ్ణి వదిలెయ్యవలసిందేనా !

అమ్మ, అక్క, ఉమ, తల్లికంటె అపేక్షగా చూసుకునే అత్తగారు! శ్యామ మెట్ల దగ్గిర్నుంచి ప్రక్కకి వచ్చింది. కుడివైపు కిటికీ దగ్గిరకొచ్చి, చల్లగాఉన్న కిటికీ చువ్వలకు నుదురు ఆనించి నుంచుంది. వాహ్! ఎంత చల్లదనం! ఎంతశాంతి!

బయట రాత్రి యెంతచీకటిగా ఉందో అంత నిస్తబ్ధంగా ఉంది. దూరంగా యెక్కడో యెండుటాకుల మీదుగా పాములాంటిదేదో పాకుతూ పోయింది. ఆ సవ్వడి మొద్దుబారిపోయిన ఆమె చైతన్యాన్ని కదిపింది. ఆ సరీసృపం స్పర్శకూడా అంత దుస్సహమయింది కాదు.

నరేన్ ఈసారి వచ్చేప్పుడు చిలుంగొట్టం, పొగాకు వెంటతెచ్చుకున్నాడు. ఈ కొద్దిరోజుల్లో అతడికి పొగాకు అలవాటయింది. ఇప్పుడతడు తాపీగా పొగతాగుతూ కూచున్నాడు. ఆ చప్పుడు, వాసన ఇక్కడికి స్పష్టంగా తెలుస్తున్నాయి. అంటే యింకా మేల్కొని ఉన్నాడు. నరేన్ ఇహ త్వర లోనే నిద్రపోతాడు. శ్యామ మనసులో దురాశ పెంచుకుంది.

హఠాత్తుగా ఒకసమయంలో నరేన్ గదిలోంచి బయటికి వచ్చాడు. శ్యామ చీకటి వరండాలో కదలకుండా నుంచుని ఉండటం చూసి, అతడేదో కొంచెం భయపడినట్లు - టక్కున ఆగి నిలబడిపోయాడు. తర్వాత ఆమెని గుర్తించి దగ్గరకువచ్చి, తిక్తకంఠంతో "ఇదేమిటి? ఇంతరాత్రివేళ మళ్లీ యిక్కడికి వచ్చినుంచున్నావ్ దేనికి? నేను రాత్రంతా మేల్కొని, నీకోసం యెదురుచూస్తూండాలా?" అన్నాడు.

అదే క్రూరమయిన క్రుద్ధ కంఠస్వరం, తర్వాత ఇహ దెబ్బలు పడతాయని శ్యామకి తెలుసు.

అయినా ఆమెకి యెక్కడినుంచో అపరిమితమైన సాహసం వచ్చింది. ఆమె శాంతంగా మామూలు కంఠస్వరంతో "మీరు వెళ్లి పడుకోండి. నేను కాసేపయాక వస్తాను" అన్నది. నరేన్ చెయ్యిపట్టుకుని లాగటానికి ప్రయత్నించి - "ఈ వేషాలన్నీ కట్టిపెట్టు. మంచి కోరుకునే దానివయితే మంచిదానిలా రా లోపలకు. లేకపోతే - "

"లేకపోతే?" శ్యామ శాంత కఠినస్వరం నరేన్‌ని గతుక్కుమని పించింది. "లేకపోతే రాసిపెట్టిఉంది. అంతేనా? ఏంచేస్తారు? కొడతారా? బాగా తీవ్రంగా కొట్టగలరా? కత్తిపీట తీసుకొచ్చియిస్తే మెడ కోసెయ్య గలరా? చూడండి, నేనొక్కమాట మాట్లాడను. ఏడవనుకూడా యేడవను. ఎవరికీ యేమీ తెలియనివ్వను".

శ్యామ ఈ ముఖకవళిక నరేన్‌కి బొత్తిగా పరిచయం లేనిది. అతడు కొంచెం గాబరా పడ్డాడు.

"ఏమిటీ తమాషా చెయ్యటం ? పడుకుందువుగాని రా'' నత్తులు కొడుతూ అన్నాడు నరేన్ ; కాని ఆ కంఠస్వరంలో ఇదివరకున్న తీవ్రత లేదని స్పష్టంగా తెలిసిపోయింది.

శ్యామ ఈసారి సహజంగా నరేన్ చేతిలోఉన్న తనచేతిని విడిపించుకుంటూ - "మీరు వెళ్లండి, నేను తప్పకుండా వస్తాను. నా యిష్టం వచ్చినప్పుడు వస్తా ; కాని ఓవేళ బలవంతం చేశారంటే మాత్రం - ఇప్పుడే డాబా మీదికి వెళ్లి కిందికి దూకుతాను. ఈ మాటకు ఇంక తిరుగుండదు'' అన్నది.

నరేన్ మామూలుగా భయపడుతూనే "నువ్వు నాతో సంసారం చెయ్యవా యేం ?'' అన్నాడు.

''చేసితీరాల్సిందే, కాని ఇవాళరాత్రికి మాత్రం వదిలెయ్యండి నన్ను, నమస్కారాలు మీకు"

నరేన్ మెల్లిగా వెనక్కి వెనక్కి జరుగుతూ తన గదిలోకి వెళ్లాడు. అక్కడికి వెళ్లగానే అతడికి మళ్లీ పాతఅలవాటు వచ్చేసింది. పైకి పెద్ద బడాయిగా "వేశ్యలింటి కెవరూ వెళ్లరాయేం? ఎంతెంత గొప్పవాళ్లు వెడతారో వెళ్లి చూడు. వెళ్లాను, మంచిపనే చేసాను. మగవాళ్లు వెడుతూనే ఉంటారు. వచ్చిన దగ్గర్నుంచి అత్తా - కోడలు యెంతయిది చేస్తున్నారో చూడండి. సాధ్వికూతురు సాధ్వి. ఇలాంటి సాధ్వీరకాలు చాలా చూశాను. ఈ సతీత్వాన్ని చిత్తుచెయ్యడం నాకెంతోసేపు పట్టదు. చెబుతున్నా. సరే, ఇవాల్టికి ఉండు, ఇంత ప్రొద్దుపోయింది కనుక ఈరాత్రికేం గొడవచేయను. రేపు ప్రొద్దున నీకూ - నాకూ - "

ఆ అరుపులు క్రమంగా తగ్గసాగాయి. తర్వాత కొంతసేపటికి అతడు గురకపెట్టటం విన్పించింది. అంటే నరేన్ నిద్రపోయాడు.

శ్యామ అక్కడే కదలకుండా నుంచుండిపోయింది. అలాగే కిటికీ చువ్వలు పట్టుకుని కూర్చోనుకూడా లేదు. గంటలతరబడి అలాగే గడిచిపోయింది.

ఇవాళ ఉమ పూలపాన్పు! ఆమెది యెలాంటి పూలపాన్పు అవుతుందో యెవరికి తెలుసు ?

"భగవంతుడామెని కాపాడాలి! ఆమెకెన్నడూ యిలాంటి అవమానం జరగకుండా ఉండాలి!"

శ్యామ యింతవరకు యేదో రాతిబొమ్మలా నిలబడిపోయింది. ఉమ సంగతి జ్ఞాపకం వచ్చింది. తల్లి సంగతి గుర్తుకొచ్చింది. తల్లిలాగా ఆమె స్నేహమయి. ఆ చిన్ననాటి తియ్యటి రోజులు, ఆ చిన్నతనం మరీ సుదూరం కాలేదు. ఈసారి యేదో పాషాణాన్ని ఛేదించుకుని నిర్ఝరిణి పైకిపొంగింది. శ్యామ యేడుపుతో కూలిపోయింది.

## 3

రాసమణి నిలకడ స్వభావంగల మనిషి. చాలా గంభీరురాలు. అందు వలన ఆమె యెంత ఆఘాతానికి గురయినా దాన్నిపైకి కన్పడనీయదు. శ్యామ విషయంలో ఆమెకి పెద్ద ఆఘాతమే తగిలింది. అంత అందమయిన కూతురు, బుద్ధిమంతురాలు, అన్నిపనులూ చక్కగా చేతయిన పిల్ల. ఏ యింటికెళ్లినా, ఆ సంసారాన్ని సుఖపెట్టగలది - ఈ మాట ఆమె సగర్వంగా చెప్పుకునేది. అలాంటి పిల్లకి యిలాంటి పెళ్లి అవుతుందని యెవరను కున్నారు ?

రాసమణి జీవితంలో చాలా దెబ్బలు తిన్నది. ఆమెకి సవతులున్న ముసలిభర్తతో పెళ్లయింది.ఏభైయేళ్లవృద్ధుడు నౌకలో వెడుతూ, గంగాస్నానం చేస్తున్న పదమూడేళ్లబాలికను చూసి, చంచలుడయినాడు. పెళ్లిచేసుకుంటా నని 'ఘటకీ'ని పంపించాడు. అతడు జమీందారు. తల్లిదండ్రులు అతడి డబ్బునుచూసి అతడికి పిల్లనిచ్చారు. అయితే భర్తవల్ల ఆమె యేమీ సుఖ పడలేదనటానికి వీల్లేదు. తొలియౌవనంలోనే ముగ్గురాడపిల్లల తల్లిఅయి వితంతువయింది. ఆఖరిసమయంలో ఆమె భర్తదగ్గర ఉండటానికి వీల్లేక పోయింది. మరదులు సవతిబిడ్డలతో లాలూచీఅయి, తెలివిగా పథకం వేసుకుని, ఆమె నక్కడినుంచి తప్పించారు. చనిపోయేముందు స్పృహలోలేని, చదువురాని భర్తచేత వేలిముద్ర వేయించి, అబద్ధపువిల్లుని సృష్టించారు. దానిఫలితంగా ఆమె ఆస్తికంతకీ వంచితురాలయింది. ఆమె కంటకట్టిన అపవాదు మూలంగా, అత్తవారింటికి భూమ్యాకాశాల్నియేకం చేసేంత కళంక చుట్టుకుంది. ఆ స్థితిలో తన నగలన్నీ అమ్ముకుని, అప్పటికి చేతిలోవున్న

డబ్బుతో కూతుళ్లని పోషించుకోవలసి వచ్చింది. దావావేస్తే బహుశా జ్ఞాతుల్ని లొంగదీయగలిగేదేమో ! కాని ఆమె ఆ ప్రయత్నం చెయ్యలేదు. అదీ కాక అప్పటికి ఆ వున్న డబ్బే జీవితానికంతకీ ఆధారం. అదికాస్తా వకీళ్ల చేతుల్లో పోయటానికి ధైర్యం కలగలేదు.

ఇన్నికష్టాలమధ్య కూతురికి పెళ్లివెయ్యటం. ఆమెకీస్థితి కలగటంతో రాసమణి రాతిబొమ్మ యిపోయింది. కూతురు పైకిబయటపడేది కాదు. ఆమె యేమీ చెప్పదు. కాని నరేన్ మూలంగా బయటపడిందే చాలు, తక్కినదంతా ఆమె సులభంగానే ఊహించుకోగలదు. దానిఫలితంగా రాత్రిళ్లు ఆమెకి నిద్రపట్టటం లేదు. రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు ఒక్కతే మేలుకుని కూచుని ఉంటుంది. ఆకాశపాతాళాలవరకు ఆలోచిస్తుంది. ఒక్కొక్కప్పుడు ఆమెకి పిచ్చెత్తుతుందేమో అనిపిస్తుంది. మళ్లీ మధ్యలో ఆలోచిస్తున్నప్పుడు - ఒకొకసారి గుండెలు పగలకొట్టుకోవాలనిపించేది. 'అమ్మో' అని పెద్ద నిట్టూర్పు విడిచేది. ఆ నిట్టూర్పుధ్వనికి ఉమకి మెలుకువ వచ్చేది.

ఇలా ఆలోచిస్తూ కూచుంటే, ఒకొక రోజున తెల్లవారిపోయేది. నాలుగు కొట్టగానే ఇంటికి తాళంవేసి, గంగాస్నానం చెయ్యటానికి వెళ్లేది.

అయితే ఈ లక్షణాల్ని గురించి బయటివాళ్ల కెవరికీ తెలియదు.

ఒక్కలక్షణం మాత్రం - ఉమ పెళ్లివిషయం. అప్పుడామె అయిష్టం బయటపడింది.

పిల్ల రానురాను చెట్టులా యెదిగిపోతోంది. ఉమకు పెళ్లి యింకా యెప్పుడు చేస్తుంది వాళ్లమ్మ ! ఆమెకి అన్నం నీళ్లు యెలా సయిస్తున్నాయి ! పదమూడేళ్లు దాటాయి - ఆడపిల్ల పెళ్లికాకుండా యౌవనంలో అడుగుపెట్టిందంటే, పూర్వపురుషులు నరకంలో పడతారు. ఇలా యెన్నో రకరకాల యెత్తిపొడుపులు, ఆరోపణలు, యుక్తులు, శాస్త్రాల్లో రాసివున్న సంగతులు ఆమె మీద వర్షింప చేసేవాళ్లు. అయినా రాసమణి మాత్రం తొణికేది కాదు.

"నా బిడ్డ నవ్వుతూ, ఆడుతూ పాడుతూ యిష్టం వచ్చినన్నాళ్లు నాదగ్గిర ఉంటుంది. నేను మా త్రం తొందరపడను"

ఆ మాటను ఆమె పెద్దక్క సమర్థించేది. "వెయ్యొద్దు, వెయ్యొద్దు. తొందరపడి పెళ్లిచెయ్యటం వల్ల యేమిటి ఒరిగేది ! మాటమాటకీ అందరూ

భవితవ్యం అంటారుగా ! ఈవిషయంలో మాత్రం భవితవ్యం లేదా ! ఎవర యినా అడిగితే దానికి భవితవ్యం వుంటే .... (ఎప్పుడు రాసిపెట్టి ఉంటే) అప్పుడు అవుతుంది పెళ్లి, నాకేం తెలుసు అని చెప్పు'' ఎడమ చేతికింద బిందెపెట్టుకుని, వంటింటి గుమ్మంలో పీటమీద కూచుని ఉత్తేజితురాలై చెప్పేది మాటలు.

కాని ఉమకి పధ్నాలుగు కూడా దాటేసరికి ఇంక రాసమణి నిబ్బ రంగా ఉండలేక పోయింది. నాలుగువైపులా వాకబు చెయ్యటం మొదలెట్టింది. మరో కొన్ని నెలలు గడిచాక ఈ సంబంధం చేతికి వచ్చింది.

కులీనుల బిడ్డ ! ఎంత అందగాడు ! ఇంత అందం బెంగాలీ కుటుం బాల్లో చాలా అరుదు. మిసమిసలాడే యెరుపు. ఉంగరాలజుట్టు - పాపిడికి అటుయిటూ. గుత్తుల్లా దువ్వి ఉంటుంది. సన్నటి మీసం ! సాక్షాత్తూ కార్తికేయుడి ప్రతిమే. వయస్సుకూడా తక్కువ. ఇరవైరెండు ఇరవైమూడేళ్ల కంటె యెక్కువ ఉండవు. అయితే స్థితిగతులంత చెప్పుకోతగ్గవి కావు. ఇల్లు-వాకిలి, పొలం-పుట్రా యేమీ లేవు. కుర్రవాడు ఓ ప్రెస్‌లో పనిచేస్తూంటాడు. జీతం కూడా పర్వాలేదు. యిప్పుడే ఇరవై వస్తోంది. అదీకాక ఓవర్ టైంచేస్తే దానికి విడిగా వస్తుంది. తల్లి ఒక తమ్ముడు. ఆ తమ్ముడు కూడా యేదో జమీందారుగారి ఆఫీసులో అప్రెంటిస్‌గా చేరాడు. త్వరలోనే జీతం యేర్పాటవుతుంది.

ఘటకీ చెప్పినవన్నీ రాసమణి విని, "ఇల్లూ - వాకిలీ లేవు. యెక్కడివ్వను పిల్లను ?" అన్నది.

"ఆఁ. ఆఁ. ఆవిషయం కూడా పిల్లవాడితల్లి చెప్పిందమ్మగారూ ! వాళ్లు 'మానిక్ తలా' వీధిలో స్థలం లీజ్‌కి తీసుకున్నారు. అక్కడ రెండు గదుల యిల్లు వేయించి ఇవ్వండి. పాయ్‌ఖానాతో కలిపి ఆరువందలతో అయిపోతుంది. ఆమె నగదుగా ఒక్కపైసా కూడా తీసుకోనని చెప్పింది. అది మంచిదేగా అమ్మగారూ ! పిల్ల స్వంతయింటికే కాపురానికి వెడు తుంది".

"ఆరువందల రూపాయలు నగదా ? ఆ పిల్లవాడికి ఆరువందలు నగదు యివ్వనా ? నగలు పెట్టాలి. అదీ యెంత లేదన్నా ఇరవై అయిదు, ముప్ఫయితులాల బంగారం పడుతుంది. ఆరువందలు నగదు, ఇంకా లాంఛ నాలు, ఇంటిఖర్చు. పై ఖర్చు, అన్నీ వున్నాయి. ఎక్కడినుంచి వస్తుంది డబ్బు ? ఈ సంబంధం మనకు కుదిరేది కాదు. నేను పేద వితంతువుని'' అన్నది రాసమణి.

ఘటకీ పట్టుపట్ట సాగింది. "ఇల్లు మీ అమ్మాయికే ఉంటుందమ్మ గారూ ! మీ అమ్మాయి అల్లుడు. ఆ ముసలావిడ యెన్నాళ్లని ఉంటుంది ? అంతగా అయితే పోనీ నగలు కాసిని తగ్గించి పెట్టండి."

"అయితే స్థలం పిల్లపేర పెట్టమను. ఇల్లు నేను కట్టించి యిస్తాను. తమ్ముడు కూడా అక్కడే ఉంటాడు. అదీకాక తల్లి పేర ఉన్న స్థలం. ఒక వేళ అత్తాకోడళ్లకు పడకపోతే ?"

"అలా చెయ్యటానికి వీల్లేదమ్మగారూ ! లీజ్‌కి తీసుకున్నస్థలం. మరొకరి పేరపెట్టే హక్కుండదు. లీజ్ అయిపోయాక మళ్లీ అమ్మాయిపేర పట్టా రాయించుకోవచ్చు. అయితే మళ్లీ దానికి కొత్తగా కాస్త ఖర్చు అవుతుంది."

"అయితే నువ్వు ఈ సంబంధం వదిలెయ్, వేరే సంబంధం చూడు."

ఘటకీ అనుభవంగలది. పెద్దకూతురికి రెండోకూతురికి సంబంధాలు కుదిర్చిన ఘటకీని - శ్యామవిషయం యిలాఅవటంతో. రాసమణి మళ్లీ పిలవలేదు. కొత్తఘటకీ. అయితే యేం ! ఈలోగా అనుపానులన్నీ ఆరాతీసి తెలుసుకుంది. ఆమె కాస్త కన్నుగిలికి "తొందరపడి వదిలెయ్యకండి అమ్మ గారూ ! ఆలోచించి చూడండి. కొత్తసంబంధం చూడనా ? మంచి సంబంధం చూడాలి, అంత అందమైన కూతురికి. కాని దేశం యెలా ఉందో తెలుసుగా ! ఎక్కడికి సంబంధంకోసం వెళ్లినా మీ అత్తగారింటి అప్రతిష్ఠ సిద్ధంగా కూచునిఉంటుంది. మంచిమంచిచోట్ల యెక్కడా ఈప్రస్తావన తేవటానికే యిష్టపడరు. పైగా చెట్టంత యెదిగిన పిల్లను పెళ్లిచెయ్యకుండా యింట్లో పెట్టుకుకూచోటం అదొక అప్రతిష్ఠ. ఇన్నాళ్లు పెళ్లెందుకు కాలేదు ? అని అడుగుతూంటారు" అన్నది.

రాసమణిముఖం అవమానంతో యెఱ్ఱపడిపోయింది. చూపు తీక్ష్ణ మయింది. "అంతగా అయితే నా కూతురిపెళ్లి చెయ్యనే చెయ్యను. వెళ్లు, చేతనయితే ఇంకో సంబంధం చూడు" అన్నది.

కాని ఘటకీకి యిలాఅయితే సాగదు. పైగా అటువాళ్లు కాస్త పెద్ద మొత్తం ఆశపెటారు. ఆమె రాసమణి పెద్దకూతుర్ని పోయిపట్టుకుంది. కమల మంచి యోగ్యుడిచేతిలో పడింది. ప్రపంచంలో యింతమంది అయోగ్యు లయిన వరులున్నారంటే ఆమె నమ్మలేదు. శ్యామపెళ్లిఅంటే అది దైవదుర్ఘటన. అలాంటిదే మాటిమాటికీ జరుగుతుందా ? కమల తల్లిని వచ్చిపట్టుకుంది. "కార్తికేయుడిలాంటి వరుడమ్మా ! చెయ్యిజారిపోనీయకు. నేను వారితో

చెప్పాను. అత్తగారు తప్పుగా అనుకోకపోతే నేను కొంతయేదయినా సర్దుబాటు చేస్తానన్నారాయన"

రాసమణి పేలవంగా నవ్వింది. తప్పుగా అనుకోవటమనే ప్రసక్తే లేదు. చాలారోజులుగా అల్లుడి సహాయం తీసుకోవలసి వస్తోంది, నగదుగా డబ్బుచేతిలో పెడితే ఆమె యెప్పుడూ తీసుకోలేదు. కాని అల్లుడు స్థితిమంతుడు. అతడికి స్వగ్రామంలో పొలాలు, పట్నంశివార్లలో తోటలు. స్థలాలూ ఉన్నాయి. పంటలో బియ్యం బాగా వస్తాయి. తోటలో పంటకూడా యిప్పుడు తరచు పంపిస్తూంటాడు. అన్నీ తోటలో పండినవేనా అన్నసందేహం ఉన్నా, రాసమణి గుచ్చిగుచ్చి అడగదు. కారణం ఆ పరిస్థితి ఇంక ఆమెకి లేకపోవటమే. కిరాణాకొట్లో పద్దు తగ్గింది. బజారుఖర్చుకూడా యెక్కువ అవటంలేదు. ఇది ఆమెవిషయంలో యెంతసహాయమో అంతర్యామికే తెలుసు.

'వృద్ధస్య తరుణీ భార్యా' కనుక ముసలిజమీందారు భర్తనుంచి ఆమెకొంచెం యెక్కువనగదు పొందకలిగింది. అంతమాత్రాన అది కుబేరుడి ఐశ్వర్యమంతదేమీకాదు. కలకత్తాలో యిల్లు అద్దెకి తీసుకుని వుండటం. అయిదారుగురు అద్దెలకుండేవారితో కలసి, ఒక యింట్లోఉండే స్వభావంకాదు ఆమెది. జమీందారీ అలవాట్లలో దీన్నిమాత్రం ఇప్పటికీ వదల్లేకపోయింది. దానికే యెంతో డబ్బు అయిపోతుంది. ఒకమనిషినికూడా పెట్టుకోవలసి వచ్చింది. లేకపోతే యెప్పుడూ కనిపెట్టుకుని ఉండటం, బజారుకెళ్లి అవీయివీ కొనుక్కురావటం యెవరుచేస్తారు? కుండలో నీళ్లు కాసినికాసిని వంచుతూంటే యేదో ఒకరోజుకి అయిపోకమానవు.

రాసమణి కాసేపు మెదలకుండా ఊరుకుని "అందుకుకాదే, అల్లుడి దగ్గిర్నుంచి తీసుకుంటూనే ఉన్నాను. బహుశా యెప్పుడో ఏదోఒకరోజున కాస్త ఆశ్రయంకోసం అల్లుడింటికే వెళ్లి నిలబడాల్సి వస్తుందేమో! కాని కుర్రాడు కూడా అంతయిదేమీకాదు. అచ్చాఫీసులో పని" అన్నది.

"అతడు యింకో స్నేహితుణ్ణి భాగస్వుడిగా చేర్చుకుని, త్వరలోనే స్వంతంగా అచ్చాఫీసు పెడతాడని 'ఘటకీ' చెప్పింది."

"సంబంధాలు కుదిర్చేవాళ్లు యెన్నో చెపుతూంటారు, అవన్నీ నమ్మటానికి వీల్లేదు. ఇప్పుడు కళ్లకి కన్పించేదెంతో అంతే. పిల్లచేత అంట్లు తోమించ వచ్చు, వీధిలో పంపుదగ్గిరకెళ్లి నీళ్లకూడా మోసుకు రావలసి వస్తుందేమో."

"సంసారం బరువు మీదపడితే అన్నీ సరిఅయిపోతాయమ్మా! కాని అంత అందమైన కుర్రాడు - ఉమకి యెంతోనప్పినట్టుంటాడు!"

"మళ్లీ రంగు చూసి భ్రాంతిపడుతున్నావు. ఒకసారితో మీకు తెలిసిరాలా?"

"ప్రతిసారీ అలాగే అవుతుందా? అదీకాక వాళ్లయిల్లు 'డాక్'లో పడటం మూలంగా కాని, లేకపోతే యిలా స్థానభ్రష్టం, మానసష్టం జరిగేదా? కుర్రాడితో మాట్లాడి బాగానచ్చాడని చెప్పారాయన. అతడు మామూలుగా అచ్చాఫీసులో పనిచేసే మొద్దబ్బాయిల్లాంటి వాడుకాడట. అలా అని తెలిస్తే వారు అతడికి ఓ మంచి ఉద్యోగం యిప్పించలేరా?"

రాసమణి ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి "ఎలా బాగుంటుందో చూడమ్మా! నేనింక యేదీ బాగా ఆలోచించనుకూడా లేను. అల్లుడికి కనుక బాగుంద అనిపిస్తే అక్కడే ఖాయంచెయ్యి. అల్లుడయినా ఒక మంచిసంబంధం చూడలేకపోయాడు" అన్నది.

కమల తలవంచుకుని నేలమీది కంతలో వేలుపెట్టి, విదేశీ తివాచీ పైకెత్తుతూ "నీకు తెలుసుగా అమ్మా! ఆయన కిలాంటివేమీ తెలియవు. పైన యెవరూ పెద్దదిక్కు లేకపోవటంవల్ల వాకబుచేసి తెలుసుకోలేక పోయారు. ఎక్కడ సంబంధం చూడటానికి వెళ్లినా, అక్కడ వాళ్లు ముందే వాకబు చేసి తెలుసుకుంటారు. అప్పుడు ఆయన తలవంచుకోవలసి వస్తుంది. పైగా అందరూ అతడుకూడా అక్కడే పెళ్లిచేసుకున్నాడు అంటూంటారు" అన్నది.

కూతురి నోటిమీదుగా కూడా వ్యంగ్యపుమాటలు వినేసరికి, రాసమణి కేమిటో గుండె విచ్చిపోయినట్లయింది. భగవంతుడికి తెలుసు తన అపరాధం యేమిటో!

ఆ దౌర్భాగ్యపు రోజులు ఇప్పటికీ కళ్లముందు కన్పిస్తుంటాయి -ముసలి భర్త చికిత్సకోసం కలకత్తా వెళ్లాడు. వారంరోజులుపోయాక సవతి కొడుకు వచ్చి! "పిన్నీ! నాన్నగారికి అంతిమగడియ లనిపిస్తోంది. నిన్ను, కూతుళ్లని చూడా లనుకుంటున్నారు" అని చెప్పాడు. అప్పుడే రాసమణి కట్టుబట్టలతో బయటికి వచ్చింది. పూర్వంనుంచి ఉన్నదాసీ - 'చిన్నమ్మగారూ! జమీందారి యిళ్లలో వ్యవహారం! నగలపెట్టె, డబ్బు - దస్కం, ఉన్నవేవో విడిచిపెట్టి వెళ్లకండి. తిరిగివచ్చేసరికి దక్కుతాయో లేదో సందేహం' అన్నది. అప్పటికీ రాసమణి తీసుకెళ్లతలచుకోలేదు. ఆ ముసలి దాసీయే బలవంతంగా కొయ్యపెట్టెలో అన్నీపెట్టి నౌకలో యెక్కించింది. కలకత్తా వచ్చాక భర్తమళ్లీ తిరిగి స్వగ్రామం వెళ్లాడని తెలిసింది. అరె

యేం జరిగిందో, మీరు అంతవరకు కూచోండి. నేను తెలుసుకుని వస్తానని సవతికొడుకు అక్కడినుంచి తప్పుకున్నాడు.

ఒక నెలరోజులు యిల్లు అద్దెకి తీసుకోవటం జరిగింది. అప్పుడు కూడా కొన్ని సామానులు అక్కడ యిక్కడ పడేసి ఉన్నాయి. మందు సీసాలు. మాసిపోయిన బట్టలు - అన్నీ అక్కడనుంచి ఖాళీచేసి వెళ్లిపోయిన చిహ్నాలు. వాటిమధ్యనే రాసమణి రోజంతా ఉపవాసంతో కూచుని, వృథాగా యెదురుచూసింది. తర్వాత కూతుళ్లను ప్రక్కయింట్లో ఉన్న ఒకామెదగ్గిర ఉంచి, ఒక్కతే మళ్లీ ఊరికి తిరిగివచ్చింది. ఆమెవెంట ముసలినౌకరు, దాసీ ఉన్నారు. దాసీని పిల్లల దగ్గర వదిలిపెట్టి, నౌకర్ని తీసుకుని వెళ్లింది. ఊరికి వచ్చాక భర్తని గాలిమార్పుకని మళ్లీ తీసుకువెళ్లవలసి వచ్చింది. అతడు లేడు, ఆమెట - (ఆ పాడువార్త వింటే ఇప్పటికీ ఆమెకి గంగలో దూకి, ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది) నౌకరుతో యింట్లోంచి లేచిపోయిందట! నగలు, డబ్బు అన్నీ తీసుకునే వెళ్లింది. తిరుగులేని దృష్టాంతం. ఆ దెబ్బతగలటం మూలంగానే వృద్ధుడు తెలివి తప్పిపోయాడు. ఏవిల్లులో సంతకం పెట్టాలో అతడికి తెలియదు. స్పృహ లేని స్థితిలో వేలిముద్ర వేయించి తీసుకోటం జరిగింది. తానింకా బతుకు తానని వృద్ధుడికి తెలుసు కలకత్తా వెళ్లాక కొంచెం స్వస్థత కూడా కలిగింది. మళ్లీ గాలిమార్పు కోసం పడమటి కెడదా మనుకుని, ముందు స్వగ్రామం వెడదాం పదండి, చిన్నావిడను వెంటపెట్టుకుని వెళ్లాలి. లేకపోతే ఉపచారాలు యింకెవరూ చెయ్యలేరు అన్నాడు, కాని ఎవరిమీద ఆశపెట్టుకుని వచ్చాడో, ఆమెని గురించి అపవాదు చెవిని పడ్డాక - కుప్పకూలిపడిపో కయేమవుతాడు ?

రాసమణిని యింటికి రావటానికి కూడా అనుమతించలేదు. లేచి పోయిందని విన్నాడు, అందుకని భర్త కూతుళ్ల పోషణకు యేమీ యేర్పాటు చేసిపోలేదు. విల్లులో ఆ సంగతివ్రాసి, యెక్కువభాగం కొడుక్కి, మిగి లింది కాస్తకాస్త తమ్ముళ్లకి వ్రాసియిచ్చిపోయాడు. చివరిగడియని తెలిస్తే రాసమణి ఆస్తంతా తనపేర రాయించుకుంటుందని వారికి భయముండేది. దానికింత పన్నాగం. అంతేకాకుండా, తాను భర్త వివాహం చేసుకున్న భార్య కాదట. ఉంపుడుకత్తెట ! అది రుజువుచెయ్యటానికి మరదుల దగ్గిర ప్రమాణా లున్నాయిట ! అలా అత్తవారింటినుంచి వచ్చినది, ఇంక మళ్లీతిరిగి అక్కడకు వెళ్లలేక పోయింది.

రాసమణి మళ్లీ యింకొక నిట్టూర్పు విడిచి "మీకు యేది మంచిదని తోస్తే అలా చెయ్యండమ్మా. అల్లుడి అభిప్రాయం తీసుకో. నేనేమీ ఆలోచించలేను" అన్నది.

కమల వరుణ్ణి చూడలేదు. కేవలం అతడి రూపవర్ణన విని, ఇంక యెటూ చూడలేదు. ఒకవిధంగా ఒత్తిడిమూలంగానే - ఈ సంబంధం నిశ్చయం చేసింది.

4

ఉమ పెళ్లి నిర్విఘ్నంగా జరిగిపోయింది. నవవధువు కొత్త యింట్లోకే వెళ్లిఉండేందుకు వీలుగా - ఇలు ముందుగానే కట్టించి ఇవ్వటం జరిగింది. ఇటికగోడలు, క్రిందగచ్చు.

''ఆరువందలు సరిపోలేదు. ఎంత అయిందో రాసమణికి తెలియదు. చివరికి ఆమె అసంతృప్తి చెందటం మూలంగా, పైనపడిందంతా కమల చాటుగా తన డబ్బులోంచి తీసియిచ్చింది. పెళ్లి మండపంలో వరుణ్ణిచూసి, అందరూ ఉమ అదృష్టాన్ని ఐక్యకంఠంతో మెచ్చుకున్నారు. ఉమ శుభదృష్టి సమయంలో సరిగ్గా చూడలేదు, కాని తర్వాత తనివితీరా చూసింది. శ్యామ పెళ్లికి లేకపోవటం ఆమె మనస్సుని చాలా దెబ్బతీసింది. మొదట్లో ఆమె చాలా కలవరపడింది, కాని వరుణ్ణిచూశాక, ఆ దిగులంతా మరిచి పోయింది. కాని నరేంద్రనాథ్ హఠాత్తుగా ప్రత్యక్షమవటంతో, నాలుగు వైపులనుంచి నిరసన వ్యక్తం కావటంతో, తల్లి ఆమె చేతులుపట్టుకుని ''తెలియదమ్మా ! నీకు మళ్లియెలాంటి పెళ్లిచేశానో'' అని కంపించిపోయింది. అప్పుడు ఉమకి చిన్నక్కమీద మనస్సులో జాలే కలిగింది. మళ్లీ దాంతో పాటు 'నాకెప్పటికీ అలాజరగదు. ఇంత రూపంకలవాడికి గుణం కూడా తప్ప కుండా ఉండే ఉంటుంది' అనిపించింది మనస్సులో. తన భర్తృసౌభాగ్యా నికి ఆమెకి కొంచె గర్వంకూడా కలిగింది.

దాన్ని గురించిన అనుమానం మొదట్లో అత్తవారింటి కెళ్ల గానే కలిగింది. డాబా యిలు, కిందిబాగం. ఇలాంటి ఇంట్లో కాపురముంటా రని ఆమె జీవితంలో యెన్నడూ ఊహించి యెరుగదు. నుయ్యిలేదు. ప్రక్క యింటివారి నూతినుంచి నీళ్లుతెచ్చుకోవాలి. ఇంట్లోజనం కూడా యెక్కువమంది లేరు. దయామయి అయినవాళ్లకి, ఆత్మీయులకి యెక్కువమందికి తెలియచెయ్యలేదు. నగదుగా ఒక్కపైసా కూడా యివ్వలేదు. ఎక్కడి నుంచి ఖర్చుపెట్టను ? కొడుకు పెళ్లికి అప్పుచెయ్యనా యేం ?

దయామయి పేరు యెవరుపెట్టారో తెలియదు కాని ఆమె ఆకారంలో దయ అనేది యెక్కడా లేశమాత్రమయినా ఉమకి కన్పడలేదు. పొడుగ్గా

లావుగా, పొడుగాటిచేతులు మంచివస్త్రాదులా ఉంటుంది, ఆమె గొంతుకూడా మొరటుగానే ఉంటుంది. కోడలింకా పల్లకీలోంచి దిగనే లేదు. ఆమె వెటకారంగా "ఈవిడేనా మహా అందకత్తె అన్నారు: ధూత్! ఏమిటా అందం? ఘటకీ ఎక్కడకెళ్లిందో రానియ్. నాకొడుకు అందం ముందు యెంత ?" అన్నది.

తర్వాత హఠాత్తుగా చెయ్యిపట్టుకుని ఒక్క గుంజుగుంజి. "బుది మంతురాలిలాగా దిగుపిల్లా! గున్నయేనుగులా ఉన్నావు, యెత్తు కోలేను" అన్నది.

ఏదో మర్యాదగా కోడల్ని యింట్లోకి తీసుకెళ్లింది. ముగ్గురో నలుగురో, ముత్తయిదువులు గట్టిగా శంఖాలు కూడా పూరించినట్టులేదు. 'కడిఖేలా' (బెంగాలీ వైవాహిక ఆచారవిశేషం) మొదలయిన ఆచారాను ష్ఠానాలు కూడా నామమాత్రమే. అదృష్టవశాత్తూ 'కుశండిక' (వివాహాదిశుభ కార్యాలో హెూమానికి సంబంధించిన అగ్నిసంస్కార విశేషం) అక్కడి నుంచి తొలగించి తీసుకురావటం జరిగింది. లేకపోతే అదికూడా వుండేది కాదని ఉమ మనస్సులో అనుకుంది. తర్వాత అత్తగారు కోరాచీరె ఒకటి తెచ్చి, కోడలి మీద విసిరిపడేసి "తీసుకో, బనారస్ పట్టుచీరె త్వరగా విడిచెయ్యి. ఇటువైపున యిక్కడ నీళ్లున్నాయి. మొహమూ చేతులు కడు క్కుని రా. చూడు - జాగ్రత్తగా వాడు నీళ్లు. నీపుట్టింట్లోలాగా కావాల్సి నన్నినీ లేవు. నేనెంతో కష్టపడి మోసుకొచ్చిన నీళ్లు యివి. పాతికమంది దాసీలూ, నౌకర్లూ యేం లేరు" అన్నది.

ఉమ కొయ్యబారి పోయింది. ఆమె భర్త శరత్ చెవిఒగ్గి విని, ఒక సారి ఆమె ముఖంకేసి చూసి, పక్కకి వెళ్లి ఉమ పుట్టింటి దగ్గిర్నుంచి వచ్చిన దాసీని పిలిచి, "నువ్వు ఉమను చీరెవిడిపించి వెళ్లరాదూ నీళ్లదగ్గిరకి" అన్నాడు.

దాసీ గొంతుతగ్గించి "నేను వెళ్లేదాన్నే అలుడుగారూ! మీ అమ్మ గారిని చూడగానే నాకు భయమేసింది" అన్నది.

"లేదు, లేదు, అమ్మస్వభావమే అంత! ఆమె మాటలు పట్టించుకోకు"

శరత్ అక్కడి నుంచి వెళ్లిపోయాడు. దాసీ ఉమ దగ్గిరకి వచ్చి చీరె విడిపిస్తూ, రహస్యంగా - "మీ అయన మంచివాడు అమ్మాయిగారూ! అప్పుడే

యెంత అపేక్ష ! నీకు యిబ్బందిగా ఉండటంచూసి, నన్ను పిలిచి చెప్పి పంపించాడు కాని మీ అత్తగారు మాత్రం - "

ఇంతలో దయామయి ప్రవేశించింది.

"నువ్వు చెప్పకుండా చెయ్యకుండా, ఈగదిలో కెందుకు వచ్చావ్? మాకు దాసీల్ని, నౌకర్లను పెట్టుకునేంత స్తోమత లేదు. అదీకాక యీ నవాబుకూతురికి దాసీ లేందే గడవకపోతే కూతురికి అలాంటి యిల్లు కట్టి యిచ్చిందేం మీ అమ్మగారు ! ఇక్కడ నీళ్లు తోడాలి. అంట్లు తోమాలి. అన్ని పనులూ చెయ్యాలి. అంత దాసీల్ని పెట్టుకోటం యిక్కడ సాగదు"

"రెండు రోజులు పోయాక అలాగేనమ్మా ! కొత్తగా పెళ్లయినపిల్లకదా ! అందుకే నేను రావటం - "

"నోర్ముయ్, మొహం మీదే సమాధానం చెపుతావా ? ఎంత పొగరు ? ఇది నా యిల్లు. ఇక్కడ నేను చెప్పినట్లు జరగాల్సిందే !"

దాసీ తెల్లబోయి, దయామయి ముఖంకేసిచూస్తూ, కాసేపు అలాగే ఉండిపోయింది. తర్వాత ఉమ విడిచిన బనారసు పట్టుచీర మడతపెట్టి, దాన్ని ఆమె కాళ్లదగ్గిరకు విసిరేసి, "నీ భర్త యింట్లో నువ్వుండమ్మా ! నేను వెడుతున్నాను. మేము కష్టపడి పనిచేసుకుని బ్రతికేవాళ్లం. ఎక్కడ కష్టపడితే అక్కడే డబ్బు. తిట్లెందుకు తినాలి ? ధూత్ ! ఇదేం మర్యాదస్తుల యిల్లు బాబూ !" అన్నది.

"ఫో, బయటికి. తక్షణం వెళ్లిక్కడినుంచి, ఇంకా మాట్లాడుతున్నావా ?" అంటూ దయామయి మండిపడింది.

"ఎందుకు మాట్లాడనమ్మా ? నేనేం నీ కొడుకుపెళ్లాన్నా ? తప్పు చెయ్యనిదాన్ని. నేను తిట్లెందుకు పడతాను ?"

దాసీ బయటికి వెళ్లిపోయింది. ఉమ స్తంభితురాలయింది. కళ్లనీళ్లు యెప్పుడు కట్టతెగి కారటం మొదలుపెట్టాయో ఆమెకే తెలియదు. "లే, లే ఇంక రాగాలేం పెట్టక్కర్లేదు. గబగబా పనులు పూర్తికానియ్. ఇదెక్కడి కోడలు ! అందం పాడుగాను ! మీ అమ్మ వందలు వేలు యెంత డబ్బిచ్చి పంపిందేం ? దాసీనికూడా తోడిచ్చి పంపించింది ! పోనీ యిచ్చిందేమో యింత అలగాజాతి దాసీనా యివ్వటం ? మంచి - మర్యాద నేర్పక్కర్లా ? ఎన్నడూ మర్యాదస్తుల యిళ్లలో పని చేయనిదయితే యింతే అవుతుంది ! కుటుంబం

యెలాంటిదో దాసీని చూడగానే తెలిసిపోయింది. ఎంత హీనమైన యిల్లో దాసీకూడా అలాంటిదే! ఇదిగో, అదికూడా చెబుతున్నాను పిల్లా! ఆ దాసీ కళ్ళెర్రచేసి వెళ్లింది. ఈ అవమానానికి నీ మీదే బదులు తీర్చుకుంటాను. మీ అమ్మతో చెప్పు. ఈ కొద్ది రోజులూ గడిచిపోనియ్'' అని గద్దించింది దయామయి.

ఆశ - ఓదార్పుమాటే నిజంగా. ఉమ భయంమూలంగా 'ఆ దాసీ యేడాది పొడుగునా ఉండే దాసీ కాదు. ఇంటిదాసీని యెవరూ కూతురితో పంపరు' అన్నమాట కూడా చెప్పలేకపోయింది. చెపితే ఓవేళ మళ్లీ తిట్లు తినాల్సి వస్తుందేమో యెవరికి తెలుసు? కళ్లనీళ్లు కారిన ముఖాన్నే కాసిని నీళ్లతో కడుక్కుని మళ్లీ వచ్చి కూచుంది. ఆలస్యం చెయ్యటానికి ధైర్యం చాలకపోయింది. ఎవరో ఒకావిడ "కోడలికి ఫలహారం పెట్టరాదుటమ్మా!" అన్నది.

"ఇప్పుడేగా పుట్టింటి దగ్గిర్నుంచి వచ్చింది! తినటానికి కడుపు ఖాళీ ఉండొద్దూ? ఊరికే పైవాళ్లకి చూపించటానికి చేసే మర్యాదలు నేను చెయ్యలేను''

ఆ రోజు, ఆ మర్నాటి రోజు ఉమకి కన్నీళ్లు ఆరనేలేదు. అదీ బయటికి కన్పించేలా కన్నీళ్లు పెట్టుకోటానికీలేదు. ఆవిడ చూసిందంటే ఊరుకోదు. దీనికి అంతరాంతరాల్లో ఒకే ఒక్క అభయంలాంటి మాట మనస్సులో జపించుకోసాగింది. అది దాసీ చెప్పిన మాట. 'నీ భర్త మంచివాడే నమ్మాయిగారూ!' ఇది ఒక్కటే ఆమెకి ఊరటకల్గించే మాట. ఈ ఆశాదీపాన్ని నాలుగువైపుల నుంచి కొడుతున్న గాలీ వానా మధ్య మనస్సుకి ఆశాఆకాంక్షల దడికట్టి ఆరిపోనీకుండా నిలుపుకో సాగింది.

'బౌ భాత్!' (వివాహమయిం తర్వాత - నవవధువు వరుని బంధువులకు చేత్తో స్పృశించిన వంటకాలతో విందు చెయ్యటం) యేర్పాటు కూడా సామాన్యమే. మొత్తం యాభైమంది భోజనాలు చేశారు. దయామయి మరో యిద్దరు స్త్రీలు వంటలు చేశారు. మిఠాయిలు చేసేవాళ్లు, హల్వాలు చేసేవాళ్లు యెవరూ రాలేదు. ఏదో బొమ్మల పెళ్లిలాంటి పెళ్లి. ఉమ తన అక్కలిద్దరి పెళ్లిళ్ల సంగతులు విన్నది. ఆవాడలో యింకా యెన్నో పెళ్లిళ్లు చూసింది. కాని యిలాంటి పెళ్లి జరుగుతుందని అమె యెప్పుడూ వినలేదు.

అయితే భర్త మంచివాడైతే - మనస్సులో ఊహించుకున్నలాంటి వాడైతే - ఈ పైపై చిన్నలోపాలు సరికాకపోయినా పర్వాలేదనుకో సాగింది. ఆ విషయంలో భగవంతుడు కార్పణ్యం చూపించడు. భర్త అనురాగపు అమృతస్పర్శతో - తగిలిన దెబ్బల గాయాలన్నీమానిపోతాయి.

అదృష్టదేవత అన్నిటికీ మించిన పరిహాసాన్ని ఆమె కోసం సిద్ధంగా ఉంచినట్లు అప్పటికింకా ఆమెకి తెలియదు.

పూలపాన్పు ఆచారవిధానం పూర్తి అయి, అందరూ వెళ్లిపోగానే ఉమ గుబగుబలాడుతున్న గుండెతో భర్త దగ్గిర్నుంచి తొలిప్రేమ నిదర్శనం తనవైపు కెప్పుడు జరిగివస్తుందో! భర్త బహుశా దగ్గిరకు పిలుస్తాడేమో ! చెయ్యి పట్టుకుని గుండెల మీదికి లాక్కుంటాడో, ఊహ కందనిది యింకేం చేస్తాడో (ఉమ యిప్పటికీ యెవరి నోటి మీదుగా వినలేదు) అని ఆపరమశుభక్షణం కోసం యెదురు చూస్తుండగా - అణచుకున్న కంఠంతో "ఇదిగో ఇలా వచ్చికూచో" అనటం విన్పించింది.

గుండె దడదడ కొట్టుకుని, ఆగిపోనారంభించింది. ఏమిటో రస విహీనమయిన కంఠం. ఇదేమిటి ?

ఉమ చెమటలు పడుతూ కూచుంది. శరత్ మళ్లీ పిలిచాడు. "చెవి యిటు త్రిప్పు. నేను ప్రేమాలాపన చెయ్యటానికి పిలవలేదు. రా, లేచి రా"

ఉమకి రవంత చిమ్నిదీపం వెలుగులో యేమీ కన్పించలేదు. మెదలకుండా అలాగే కూచుంది. దృష్టి అంతా అలుక్కుపోయినట్లుంది ఇల్లంతా నిస్తబ్ధంగాఉంది. ఎవరూ చెవి ఒగ్గి వింటూ ఉండరని ఉమకి తెలుసు. ఈ యింట్లో అలాంటి మనుషులే లేరు.

శరత్ కొంచెం విసుగు వ్యక్తంచేసి, తానే ముందుకి జరిగి వచ్చాడు. ముఖానికి దగ్గిరగా ముఖం పెట్టి "చూడు, ఒక సంగతి నీకు యిప్పటినుంచే స్పష్టం చేయాలనుకున్నాను. నువ్వు నన్ను అపార్థం చేసుకోవద్దు. నా నుంచి నువ్వుయేమీ ఆశించవద్దు. అంటే - భర్త దగ్గిర్నుంచి భార్య ఆశించే ప్రేమను నేను నీకు యివ్వలేను. అమ్మ బలవంతంమీద పెళ్లి చేసు కున్నాను. చేసుకున్నానుకదా అని నీతో కాపురం చెయ్యటం నాకు సాధ్యం కాదు" అన్నాడు.

ఉమ బుర్ర యేమయినా పాడయిందా ? ఆమె యేమయినా తప్పుగా విన్నదా ? తప్పుగా అర్థం చేసుకుందా ? ఉమ గుండెల్లో రక్త ప్రవాహం ఆగిపోయినట్లుంది.

సరీగ్గా తాను యేమనుకున్నదో, యేంవిన్నదో ఉమకేమీ అర్థం కాలేదు. ఆరాత్రి మాటలు చాలారోజులు ఆలోచించటానికి ప్రయత్నించింది.

లక్షయోజనాల దూరంనుంచి యెవరయినా మాట్లాడుతున్నారా ?

"నీకు ఉంపుడుకత్తె అని యెవర్ని అంటారో తెలుసా ? తెలియదా ? అంటే - నేను మరొక స్త్రీని ప్రేమించాను. ఆమెతోనే కాపురం చేస్తున్నాను. ఆమెతో తప్ప నేనింకెవరితోనూ కాపురం చెయ్యలేను. ఇప్పటికి మూడేళ్ల నుంచి ఉన్న అలవాటు మరింక మారదు. కొడుకు ప్రవర్తన చెడిపోతోందని అమ్మ పెళ్లిచెయ్యా లనుకున్నది. చాలా వేధించింది. అందుకని పెళ్లి చేసుకోవాల్సి వచ్చింది. కాని లేకపోతే నాకిష్టం లేదు. ఏం చెయ్యను ? అమ్మ అక్కడికికూడా వచ్చి గొడవచేసింది. అందుకని గులాబీకూడా - 'ఈ గొడవంతా యెందుకు బాబూ ! పెళ్లి చేసుకుని ఆమెనలా పడేసి ఉంచు' అన్నది. అయితే నేనూ ఆలోచించాను. పిల్లనిచ్చే వారు అన్నీ వాకబు చేస్తారు. అమ్మ యెలాంటిదో తెలిస్తే పిల్ల నివ్వరు. మీ అమ్మ యింత యెందుకు తొందరపడిందో తెలియదు. నువ్వు అందమైన దానివి. మీ అమ్మ డబ్బుకూడా బాగానే ఖర్చు పెట్టింది.' నాలాంటి వరుడికెందు కిచ్చింది ?"

ఉమ నోట్లోంచి ఒక ప్రశ్న మాత్రం వెలువడింది. "ఆమెని మీరు పెళ్లెందుకు చేసుకోలేదు ?"

శరత్ చాలా ప్రశాంతంగా చెప్పాడు సమాధానం. "హరిహరీ ! ఆమె వేశ్య, కాని ఆమె కూడా అందకత్తె. కులం తక్కువ పిల్ల అయినా ఆమె ముఖం యెంతో తీర్చిదిద్దినట్లుంటుంది. అదీకాక ఆమె నన్నెంతో ప్రేమించింది. నేనేమీ డబ్బుదస్కం యిచ్చే వాణ్ణికాను. నెలజీతం - జీతాలిచ్చే రోజున అమ్మ అఫ్ఫీసుకు వచ్చి నిలబడి వసూలుచేసి తీసుకు వెడుతూంటుంది. కేవలం ఓవర్‌టైం కింద వచ్చేడబ్బే. అదయినా యెంత డబ్బు ! ఆమే నన్ను పోషిస్తుంది. ఆమె తల్లిదగ్గిర కాస్త డబ్బుంది. అదీకాక అందులో ఇందులో కాస్త మిగులుస్తూంటుంది. దాంతోనే జరిగిపోతోంది ; లేకపోతే ఈ రోజుల్లో రెండు పొట్టలకి యెలా గడుస్తుంది చెప్పు ?"

ఉమ ఈ కాలపుపిల్ల కాదు. ఆమెకారోజున ఈ ప్రశ్న బుర్రకి తట్టలేదు. ఇలాంటి పరిస్థితిలో యే అధికారంలో శరత్ పెళ్లి చేసుకున్నాడు? తన నారీజీవితాన్ని వ్యర్థం చెయ్యటానికతడికేం అధికారం ఉంది? ఆ రోజుల్లో భర్తయేమీ యివ్వకపోతే ఆడవాళ్లు తమ అదృష్టాన్నే నిందించు కునేవాళ్లు. ఉమ కూడా కచ్చితంగా అలాగే చేస్తుంది. కాని ఆక్షణంలో ఆమె మనస్సులో యీ సంగతులు లేనేలేవు. ఆమె అలా మొద్దుబారి పోయింది.

కాని శరత్ మాత్రం తల్లి వేధింపుకి లొంగిపోయి, ఒక ఆడదాని జీవితాన్ని వ్యర్థంచేసి కూచున్నాడు. ఈ సంగతి అతడేమీ సంకోచించకుండా చెప్పగలిగాడు. అది అతడి మనస్సుని కాస్త కూడా బాధించలేదు.

అయితే ఊరటకూడా కలిగించకేం? "అలా అని నేను నిన్నేమీ ఆజ్ఞాపించను. నీ మీద నాకేం ద్వేషం లేదు, కోపం లేదు. నువ్వు సంసారం చూసుకుంటూ ఉండు. నాపనుల్లో నేనుంటాను. అమ్మతో యిదే ఒప్పందం జరిగింది. సంసార నిర్వహణ కోసం కోడల్ని తీసుకొచ్చి యిస్తాను, తర్వాత నన్నింకేమీ అడగటానికి వీల్లేదు. అందమైన పెళ్లాం వస్తే నా అంతట నేనే ఆమె వైపుకి మొగ్గుతాను, అని ఆమె బహుశా అనుకొని ఉంటుంది. కొడుకు యెలాంటి వాడో ఆమె యిప్పటికీ గుర్తించలేదు."

శరత్ చిన్న నవ్వు నవ్వాడు. బహుశా చమత్కారమనిపించటంతో కొంచెం ఆగి "ఈ అయిదారు రోజుల తర్వాత యిహ యింటికి వస్తాననుకుంటున్నావా? ఈ కొద్దిరోజులూ మధ్యలో తలగడా అడ్డం పెట్టుకుని పడుకో. అంతకంటె యేం చెయ్యను? చూడు, అన్నీ స్పష్టంగా చెప్పేశాను తర్వాత ఇక నన్నేమీ తిట్టుకోవద్దు" అన్నాడు.

# నాలుగవ పరిచ్ఛేదం

## 1

మూడురోజు లక్కడ గడిపి, నరేన్ మళ్లీ కలకత్తా వెళ్లాలన్న ఉద్దేశం బయటపెట్టినప్పుడు - అత్తా కోడళ్లిద్దరూ సహజంగా ఒకేప్రశ్న అడిగారు "తర్వాత?"

నరేన్ అమాయకుడిలా నవ్వుతూ, తల గొక్కోవటం మొదలెట్టాడు. సమాధానం చెప్పలేకపోయాడు.

క్షమ కొంచెం కటువుగానే. "నీపెళ్లాన్ని కొడుకునీ నువ్వు తీసుకెళ్లే యేర్పాటు చేసుకో బాబూ, నేను బతికిపోతాను. గంగలో దూకి నిశ్చింతు రాలి నవుతాను" అన్నది.

నరేన్ హిహిహి అని నవ్వి, "ఈ తమాషా బాగానే ఉందే! నిన్న రాత్రి సరీగ్గా యిదేమాట - 'మీ అమ్మకేదయినా యేర్పాటుచెయ్యండి, చచ్చి విముక్తురాల్ని అవుతా' నన్నది. హిహిహి ఇద్దరూ సంప్రతించుకుని అడుగు తున్నట్లున్నారే!" అన్నాడు.

"దీనికి సంప్రతించుకోవాల్సిన అవసరం లేదు బాబూ? నీలాంటి మనిషితో కాపురం చెయ్యాల్సివచ్చినవా రెవరయినా యిదే అడుగుతారు. అదీకాక వాళ్లగతేమిటి చెప్పు?"

"వారే - తప్పంతా నాదేనా యేం? తొందరపడి నన్నువేధించి పెళ్లి చేసి పెదజంజాటం తెచ్చిపెట్టావు. ఇప్పుడన్నీ నేనే సంబాళించుకోవాలి"

"నేను పెళ్లిచేసినప్పుడు సంపత్తి ఉంది. ఉన్నదాంతో యెన్నాళ్లయినా తినటానికి సరిపోయేది. మీ తిక్కచేష లన్నిటికీ నేనా బాధ్యురాల్ని?"

"వాహ్! అలా అని మగవాణ్ణి అన్న తర్వాత సరదాలు సంతోషాలు తీర్చుకోనా?"

ఇలాంటివాడితో మాట్లాడటం అనవసరమని తెలుసుకుని, క్షమ మెదలకుండా ఊరుకుంది. కాసేపు యేమాలోచించుకున్నాడో "చూద్దాం, కొన్నాళ్లపాటు తిరిగివస్తాను" అన్నాడు.

"తర్వాత? మాకికొన్నాళ్ల యెలా గడవటం?"

"రాజు లేకపోతే రాజ్యపాలన ఆగిపోతుందా? ఇన్నాళ్లూ యెలాగడి చింది? హిహీ. అదీకాక నీచేతిలో కూడా అంతోయింతో ఉండే ఉంటుంది. దాపరికం నేర్చినదానివి."

ఇంతమాట అన్నాక కూడా క్షమ అసహ్యతతో సమాధానం చెప్ప లేదు. కొడుకు వెళ్లిపోయాక తులసికోట దగ్గరకు వచ్చి తల పగలకొట్టుకో సాగింది "భగవంతుడా! నన్ను తీసుకెళ్లు, ఇప్పటికీ ప్రాయశ్చిత్తం కాలేదా? ఇంత పాపం యేంచేశాను భగవంతుడా?"

ఆ తర్వాత మళ్లీ ఆ సుదీర్ఘమయిన ప్రతీక్ష. పగలు రాత్రీ కూడా యేదో దీర్ఘం, దీర్ఘతరం అయినట్లనిపించేది. ప్రతిరోజూ యెలా గడవట మన్నది సమస్య అయింది. దానికితోడు శ్యామకి అత్తగారితో ముప్పువచ్చి పడింది. ఈసారి నరేన్ వెళ్లినప్పట్నుంచీ ఆమె తిండితిప్పలు మానేసింది. అంతో యింతో దొరికిన తిండిగింజలు కూడా మనుమడికోసం, కోడలికోసం పొదుపు చేయసాగింది. అసలు సాంతం వద్దు అంటే శ్యామకూడా తినటం మానేస్తుందని, ఒకపూట మాత్రం తిండిముందు కూచునేది, ఊరికే పేరుకి తినటమే. చిన్నపిట్ట తినే ఆహారంకంటె కూడా తక్కువ తినేది.

మొదట మొదట శ్యామ బ్రతిమాలటానికి ప్రయత్నించేది.

"మరీయింతిలా తింటే బతకట మెలా అత్తయ్యా."

"ఇంకా నేను బ్రతకటం మెందుకమ్మా, ఇంకా నన్ను బ్రతకమంటు న్నావా? ఆత్మహత్య మహాపాపమని చేసుకోలేదు. కాని లేకపోతే నాకు చావంటే ఆవగింజంతయినా భయం లేదమ్మా"

"కాని మే మెక్కడ నిలబడం అత్తయ్యా? ఏమిటి మాకింక ఉపాయం?" అనేది శ్యామ.

"ఉపాయం నేనేమీ చెయ్యలేకపోయాను. అదే నాబాధ. ఇప్పుడు నీకు రోజులెంత కష్టంగా గడుస్తున్నాయో అంతకంటె యింక కష్టమే ముంది? ఇప్పటికీ మీ అమ్మ యింకా బ్రతికేఉంది. నీకు పట్టెడన్నం దొరుకుతుందని తెలుసు నాకు."

కోడలికి ఆమాటకి సరయిన సమాధానం చెప్పటానికి దొరికేదికాదు. నరేన్‌కూడా కబురేమీ పంపలేదు. దేవేన్ కూడా అంతే. రాధారాణికి కొంచెం చదవటం వ్రాయటం చేతవును. కాని ఉత్తరం రాయటం అలవాటు లేదు. ఒక్క ఉత్తరం మాత్రం దేవేన్ రాశాడు. అందులో కేవలం నరేన్‌ని గురించి వినకూడని తిట్లుమాత్రం ఉన్నాయి. ఇక్కడ నిరాశ్రయంగా ఉన్న ఆడవాళ్లకిద్దరికీ రోజులెలా గడుస్తున్నాయో తెలుసుకుందామన్న ప్రసక్తిలేనే లేదు.

మరీ దుస్సహమవటంవల్ల అత్తగారు శ్యామచేత పెద్దకోడలి పేర, ఒక ఉత్తరం రాయించింది. పిల్లవాడు తిండి లేకపోవటంమూలంగా చచ్చి పోతాడేమో, దేవేన్ కనీసం అయిదురూపాయలయినా పంపుతాడేమో అని. రెండు రూపాయలు పంపించాడు దేవేన్. ఆ కూపన్‌లో "ఇక్కడికొక ఇంగ్లీషు

తెలిసిన వాడొచ్చి కూచున్నాడు. అతడికి నాకంటె యెక్కువ వైద్యం తెలియకపోయినా, ఇంగ్లీషు ట్రిక్కులు చేసి నా ప్రాక్టీసు మట్టిచెయ్యటానికి కూచున్నాడు. ఇప్పుడు నా సంసారం గడుపుకోటమే భారంగా ఉంది. లేక పోతే శ్రీమాన్‌ని చూడటం నా కర్తవ్యంలో భాగమే...." వగైరా....

అమెతల్లికి ఉత్తరం రాయించొచ్చు. క్షమ ఆ సూచనకూడా యివ్వ లేదు. అవిషయంలో శ్యామది చలించని నిర్ణయం. ఏకారణంవల్ల నయినాసరే ఈ పరిస్థితిలో అమె తల్లిదగ్గిర చెయ్యిచాచదు. అసలు తనపరిస్థితి కూడా ఆమెకి తెలియనీయదు. అత్తగారు కోడలి అంతర్యం గ్రహించి అమాట స్పష్టంగా చెప్పటానికి సాహసించలేదు.

కాని ఆర్నెల్లలోపలే క్షమ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. రక్తక్షీణత లక్షణాలన్నీ కన్పించాయి. చేతులు కాళ్లు నీరుపట్టటం మొదలెట్టాయి. శ్యామ ఈసారి యథార్థమైన ప్రమాదాన్ని గ్రహించింది. ఈపరాయి ఊళ్లో ఈ పరిస్థితిలో ఆమె యేం చెయ్యగలదు? ముఖ్యంగా చిన్నవయస్సు, చూపులకు చక్కనిది. ఇది ఈరోజుల్లో యెంతప్రమాదమో అడుగడుగునా తెలుస్తూనే ఉంది. ఆ వీధిలోని సాలె ఆమె చాలా కనిపెట్టి ఉంటూంటుంది. తెలిక వీధిలోని రెండు మూడు కుటుంబాలు నియమితంగా సహాయం చేస్తున్నాయి. అందువలన ముప్పు ముంచుకురాలేదు. కాని దగ్గిరలోనే చుట్టూ తిరుగుతున్న సూచనలు శ్యామ తెలుసుకుంది.

ఆవాడలో వయసులో ఉన్న కుర్రాళ్లకేం కొదువలేదు. వాళ్లు మధ్యాహ్నం, సందెచీకట్లో - గోడపక్కనుంచి యీలలు వేస్తూ తిరుగు తూంటారు, చెట్లకొమ్మలమీద యెక్కి పై అంతస్తులో కిటికీదగ్గిర కూచున్న ఆమె చూపుని ఆకట్టుకోటానికి ప్రయత్నిస్తూంటారు. అయితే స్థితిమంతులైన కుర్రాళ్లు మంగలదాని ద్వారా నగల ఆశ కూడా పెడుతూంటారు. సాలె ఆమెకి అయిదుగురు జవానుల్లాంటి కొడుకులున్నారు. ఆమె సాధారణంగా బిగ్గరగా అందరికి వినపడేటట్లుగా 'యెవరైనా పైకి కన్నెత్తిచూసినా, సైగలు చేసినా తక్షణం నాకు చెప్పమ్మా! పట్టపగలు వాళ్ల మెడలమీద తలలు తెగ నరికి నాకొడుకులు నీ కాళ్లముందు పడేస్తారు. వాళ్లు అన్నదమ్ములు అయిదు గురు కర్రలు పట్టుకుని నిలబడ్డారంటే, సర్కారువారి సైన్యం కూడా యేం చెయ్యలేదు' అనేది. అంచేత యెవరూ హద్దుమీరటానికి సాహసించలేదు.

శ్యామ నెల్లాళ్లు ఆలోచించి ఆలోచించి, వాళ్లమ్మకే ఒక ఉత్తరం రాసింది. అన్నిసంగతులూ విడమర్చి రాసింది. ఊరికే దాచిపెట్టినందు వల్ల లాభంలేదు.

ఆ ఉత్తరానికి వచ్చిన సమాధానం శ్యామను రాతి బొమ్మనుచేసింది, ఆమె కివాళభర్త ప్రవర్తన యేదీ ఆశ్చర్యం కలిగించలేదన్న నిశ్చయ మేర్పడిపోయింది. కాని తల్లి ఉత్తరం చూశాక ఇంకా ఆ మనిషిని అర్థం చేసుకోటానికి చాలా వ్యవధి ఉందనిపించింది.

తల్లి ఉత్తరం రాసిన తేదీకి సరిచేసుకుని చూసింది. నరేన్ యిక్కణ్ణుంచి వెళ్లిన కొద్ది రోజులకే రాసమణిని వెళ్లి కలుసుకుని, శ్యామకి పిల్ల వాడికి అబద్ధపు రోగాన్ని కల్పించి చెప్పి, ఆర్థిక సహాయాన్ని కోరాడు. నరేన్ స్వభావం గుర్తించినా అతడు చెప్పిన వివరణంతా విని, ఆమె నిబ్బరంగా ఊరుకోలేకపోయింది. అప్పు చేసికూడా కొంత డబ్బు యిచ్చింది. ఆ తర్వాత కూడా మళ్లీ రెండు మూడు సార్లు కాస్త యిచ్చాక ఆమెకి అనుమానం కలిగింది. ఆమె యింక స్పష్టంగా - కూతురు స్వయంగా రాసిన ఉత్తరం వస్తే తప్ప, ఒక్క పైసా కూడా యివ్వనని చెప్పింది. నరేన్ అక్కడినుంచి తిరిగి వదినగారు కమల దగ్గిరకు వెళ్లాడు. ఆమె దగ్గిర కూడా కళ్లనీళ్లు పెట్టుకుని రెండుసార్లు పెద్దమొత్తం వసూలు చేశాడు. దైవికంగా కమల పుట్టింటికి రావటంతో, ఆ మాటమీద ఆ మాటమీద సంగతంతా బయటపడింది. కమల కూడా జాగ్రత్త పడింది. చివరిసారి కమల నిరాకరించాక నరేన్ యింక రాలేదు.

ఇదికాక ఉత్తరంలో మరొక దుర్వార్తకూడా ఉంది. ఉమ భర్త రాత్రిళ్లు యింటికి రాడు. పెళ్లికి ముందునుంచి అతనికి వేశ్యాసంపర్కం ఉంది. ఆ సంగతి అతడు పూలపాన్పునాటి రాత్రే కపటం లేకుండా ఉమ దగ్గిర చెప్పేశాడు. అదీకాక ఆమె అత్తగారు అమానుషంగా పెట్టే బాధలు జనం చెప్పుకోవటంతో రాసమణికి తెలిసింది. కాని అది ఉత్తరంలో రాయలేదు. ఉమ చెప్పలేదు. అయినా ఆ మాట రాసమణి విన్నది. అంచేత నమ్మకుండా ఉండటానికి కారణం లేదు. రాసమణికి చాలా రోజులుగా నిద్రపట్టటం లేదు. ఇప్పుడు ఫిట్స్ వస్తున్నాయి. ఒక్కతే ఉండవలసిరావటం - ఎప్పుడు చచ్చిపోతానో అన్న భయంతో పెద్దమ్మను రప్పించి దగ్గిర పెట్టుకుంది. ఆమె కొద్ది రోజులుండి, పోట్లాడి వెళ్లి పోయింది. ఈ స్థితిలో శ్యామ అత్తగారికి నచ్చచెప్పి యెలాగయినా ఆమెని తన దగ్గిరకు తీసుకురాగలిగితే, ఒకవిధంగా రాసమణికి ఉపకారం చేయటమే అవుతుంది.

ఉత్తరం చదువుతూంటే దృష్టిని కన్నీటి తెర కప్పి, ఆమెకి కళ్ల వెంట బొటబొట కన్నీళ్లు కారాయి. క్షమ అది గమనించి ఆందోళనపడుతూ

"మీ అమ్మ యేం రాసింది శ్యామా! ఏదయినా చెడువార్తా యేం? నాకు చదివి వినిపించు" అన్నది.

శ్యామ కళ్లు తుడుచుకొని చదవటానికి ప్రయత్నించింది. కాని మొదట కాసేపు పెదవులు కదిలాయి. కాని స్వరమేమీ బయటికి రాలేదు. చాలా సేపటికి అతికష్టంమీద ఒకొక్కటే చదివింది. క్షమ మొదటి భాగం విని ఆర్తస్వరంతో ఒకసారి చీత్కారం చేసింది. "భగవంతుడా! ఇంకా యెంతని వినాలి కొడుకు కీర్తి! ఇహనైనా దయ ఉంచి నన్ను తీసుకెళ్లు! కాని చివరి భాగం విని యెందుకనో తెలియదు. కొంచెం శాంతించింది. ఉమ సుఖసౌభాగ్యాల వార్త ఆమెకేమిటో మరింత లజ్జాదాయక మయింది. ఆమె దురదృష్టం వివరణ తనకి తెలియని సాంత్వనకు కారణమయింది.

"మీ అమ్మది చాలా గొప్ప మనస్సు శ్యామా! అందుకనే యిలా రాసింది. భిక్ష యెలా యివ్వాలో ఆమెకి తెలుసు. మీ అమ్మ దేవి!" అన్నదామె.

శ్యామ కొంచెం ఊరటపొంది, "అయితే ఆమెకి మనం వస్తున్నామని రాస్తాను" అన్నది.

క్షమ కొంచెంసేపు మెదలకుండా ఊరుకుని "శ్యామా! జీవితంలో చాలాభాగం గడిచిపోయింది. ఇంకా యెన్నాళ్లు బ్రతుకుతాను! లోప ల్లోపల అంతా ముగిసిపోయిందని తెలుస్తోంది. ఇంకా యెందుకమ్మా? సాధ్య మయితే నన్ను ఈ అవమానంనుంచైనా తప్పించు" అన్నది.

శ్యామ యింక బ్రతిమాలలేక పోయింది. కాని భయంతో ఆమెకి రాత్రిళ్లు నిద్రపట్టటం లేదు.

రోజురోజుకీ క్షమ శయ్యాగతురాలయింది. ఇహ ఆమె తీసుకెళ్లను కూడాలేదు. కాని రెండు రోజులయాక క్షమే ఆ మాట తీసుకొచ్చింది. శ్యామని పిలిచి "శ్యామా ఇంక ఇక్కడ ఉండటం మంచిది కాదు. పడక పెట్టాను. ఇదే చివరిపడక అని నాకు బాగా తెలుసు, ఇక్కడ ఉన్నవాళ్లు మనల్ని కనిపెట్టుకుని ఉంటారని తెలుసు. అయినా సాధ్యమయినంత వరకు - ఇప్పుడు మీ అమ్మ దగ్గిరకు వెళ్లి ఉండటమే మంచిది. నువ్వు ఒక్కపనిచెయ్యి శ్యామా! ఆ పేటలో మా మామగారి శిష్యుడు వకీలు ఉన్నాడు. వాళ్లయింటి దగ్గిరగా ఓ చిన్న యిల్లు చూసిపెట్టమని అతడికి ఒక ఉత్తరం రాయి. సామానులవీ ఉన్నాయి. పాలెతామె కొడుకుల

చేత కొన్ని కొన్ని అమ్మించేస్తే - వాళ్లు నవద్వీపం వెడుతూంటారు. అక్కడయినా అమ్మేయగలరు. ఆ వచ్చిన డబ్బుతో ఒకటి రెండు నెలలు గడిచి పోతాయి. తర్వాత అక్కడ మీ అమ్మ ఉంటుంది. ఆమె నిన్ను చూసుకుంటుంది" అని చెప్పింది.

శ్యామ ఈ యేర్పాటులో వెయ్యిరకాల యిబ్బందులను వివరిస్తూ ఆమెకి ఇంకోసారి నచ్చచెప్పటానికి ప్రయత్నించింది. కాని క్షమ కోడలి రెండుచేతులు పట్టుకుని యేడుస్తూ "అంతకంటే నాకు గంగలో దూకి ప్రాణాలు వదలటం సులభమమ్మా!" అన్నది.

గత్యంతరం లేక కలకత్తాలో ఆ శిష్యుడికి ఉత్తరం రాయటం జరిగింది. వకీలుబాబు ఆ ఉత్తరానికి సమాధానం రాస్తూ - తమదే ఒక యిల్లు ఖాళీగా పడివుంది. పూర్తిగా ప్రత్యేకంగా ఉండే యిల్లు. మీరు అక్కడికి వెళ్లి హాయిగా ఉండొచ్చు. తర్వాత వారికక్కడ అసౌకర్యంగా ఉంటే దగ్గరగా మరొక యిల్లు యేదయిన వారే చూసుకోవచ్చు! అని తెలియచేశాడు. క్షమ ఆ ఉత్తరం అంతా విని, అతడు తన కొడుకుల చదువుసంధ్యలు సంగతి తెలిసి, గురువంశాన్ని వదిలేసినా, నన్ను పూర్తిగా వదిలెయ్యడని నాకు తెలుసు. అతడు తన కొడుక్కి దీక్ష యిప్పించే ముందు నా దగ్గిర అనుమతి తీసుకునే మరొకర్ని గురువులుగా యేర్పరచుకున్నాడు. పదమ్మా; నా భర్త, మామగార్ల శిష్యవంశం. అక్కడ కాస్త అండ ఉంది" అన్నది.

"సాలెఆమెకి చెపితే ఆమె కొడుకులు కమ్మరిని తీసుకుని వచ్చారు. అయినా బ్రాహ్మల పాత్రసామాను కొనటానికి అక్కడ యెవరూ ఒప్పుకోలేదు. అయినా వాటిమీద వచ్చిన డబ్బు - చిల్లర బాకీలు తీర్చగా, చేతిలో ముప్పై నలభై రూపాయలకంటె యెక్కువ మిగల్లేదు. ఆ కాస్త డబ్బు ఆధారంతో ఆడవాళ్లిద్దరూ - చాలా రోజులు ఆశ్రయంగా ఉన్న 'గుప్తపాడా' ని ఒకరోజున వదలి వెళ్లారు.

## 2

కలకత్తారాగానే క్షమ ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. రాసమణి యెంతో చేసింది. ఆమె ఒకవారం చూసి, "పరిస్థితి యేమీ బాగాలేదమ్మా. మీ బావగారికి ఉత్తరం రాయటం అవసరం" అని కూతురితో చెప్పింది.

నరేన్ చిరునామా యెవరికీ తెలియదు. ఈ పరిస్థితిలో దేవేన్‌కి రాయక తప్పేదేముంది ?

శ్యామ తోటికోడలికి పెద్దఉత్తరం రాసింది. అయినా దేవేన్ రావటం నాలుగురోజులు ఆలస్యం అయింది ; కాని చివరికతడు వచ్చిన సమయానికి క్షమకి మాటపడిపోయింది. దేవేన్ తల్లిదగ్గరకెళ్లి కూచుని యేడవటం మొదలెట్టాడు. క్షమ అతికష్టంమీద వణకుతున్న చేత్తో - అతడి కన్నీళ్లతుడిచి, శిరస్సు మీద చెయ్యి ఆనించి దీవించింది.

"నీకేమయినా తినాలని ఉందా ?" దేవేన్ అడిగాడు.

క్షమ కొంచెం నవ్వింది. తర్వాత అతికష్టంమీద 'నరేన్ ?' అని అడిగింది.

"ఇంకా వాడిమాట యెత్తుతున్నావా అమ్మా ? నీకు సిగ్గెయ్యటం లేదూ ? వాడిమాట నాముందు యెత్తకు, స్పష్టంగా చెపుతున్నా". రాసమణి తలమీద చెంగువేసుకుని. ఒకప్రక్కన కూచుంది. ఇప్పుడు తప్పనిసరిగా తలపైకెత్తి "అతడెలాంటివాడైనా కానియ్, అతణ్ణి ఆమెకడుపునమోసింది. పేగులాగటం యెక్కడికి పోతుంది బాబూ ! నువ్వూ తక్కువ తప్పులు చెయ్యలేదు. అయినా ఆమె నిన్ను ఆశీర్వదించింది" అన్నది.

దేవేన్ భగ్గున మండిపడ్డాడు. "ఆ వెధవగాడిద కొడుకు యే గుడిసేటి కొంపలోపడి ఉన్నాడో వెళ్లిచూడండి. వాణ్ణి పిలుచుకు రావటానికి నేనక్కడికి వెళ్లనాయేం ?" అన్నాడు.

రాసమణి ఇంక మాట్లాడలేదు. దేవేన్ కాసేపు వెనకాముందాగి సంజె పడ్డాక బయటికి వెళ్లాడు. సాయంత్రందాటి రాత్రి చాలా పొద్దుపోయాక క్షమకి యెగశ్వాస మొదలయింది. అయినా యెవరూ రాలేదు. దేవేన్ రాలేదు. నరేనూ రాలేదు. ప్రమాదం గ్రహించింది. చివరికి తెల్లవారకట్ల మీరే కాసిన గంగ నీళ్లపొయ్యండి. నామస్మరణ చెయ్యండి. పాషండులైనకొడుకుల చేతిమీదుగా పవిత్రమైన గంగనీళ్లతాగే అవమానం ఆమె మొహానరాసిపెట్టిలేదు" అన్నది - ఆమే స్వయంగా వియ్యపురాలి గుండెరాస్తూ హరినామ స్మరణ చేయసాగింది.

దేవేన్ యేకంగా తెల్లారాక వచ్చాడు. అప్పటికి క్షమ అంతిమశ్వాస వదిలింది. దేవేన్ గతుక్కుమని ఆగి "నేనేం చెయ్యను ? అమ్మమూలంగానే యిలా జరిగింది. ఆవెధవను వెతకటానికి బయలుదేరాను. కాని దొరకలేదు. డబ్బులు సంపాదించటానికి పాతచోటుకి వెళ్లాను. అక్కడికెళ్లి పడ్డాక,

బయటపడగలమా? మధ్యలో అమ్మకి చివరిగడియలో నోట్లో నీళ్ల
పోయలేదు .... ఛా!" అన్నాడు.

## 3

నరేన్ కీ వార్త తెలియకపోవటం కాదు - శ్రాద్ధంఖర్చు ప్రశ్న వస్తుం దని అయిఉంటుంది. అశౌచం పూర్తయే ముందురోజున వచ్చాడు. ఏదో ఇప్పుడే తెలిసినట్టు పరుగెత్తుకుంటూ వచ్చి "అమ్మపోయిందా? అమ్మా!" అంటూ బిగ్గరగా యేడ్చాడు.

దేవేన్ కాసేపుమెదలకుండా ఊరుకున్నాడు, కాని తర్వాత ఒక్కసారి గద్దించాడు. "ఈనాటకం నటన కట్టిపెట్టు, నరో! నోర్మూసుకో, నిన్ను గుర్తించని వాళ్లెవరూ లేరు యిక్కడ! నీకివాళే కబురందిందా?" అని అడిగాడు.

"ఒట్టు అన్నయ్యా: నీమీద ఒట్టేసి చెపుతున్నా" అంటూ నరేన్ రెండడుగులు ముందుకు వచ్చాడు - బహుశా అతడి తలమీద చెయ్యివేసి చెప్పటానికేనేమో!

"ఖబడ్దార్! నన్ను ముట్టుకోకు. పచ్చిఅబద్ధాలకోరువి. నిజంగా తెలియకనేపోతే. ముఖంనిండా గడ్డం. మీసాలు యెందుకు పెంచావ్. చెప్పులులేని కాళ్లతో రావటం దేనికి?" అని అడిగాడు.

నరేన్ బుర్రకి ఇన్నిఆలోచనలు తట్టలేదు. కొంచెం తడబడుతూ, కాసేపు ఆగి, ముక్కుమాటలు, సాగతీస్తూ, "అదే, నేను నెల్లాళ్ళ జబ్బుచేసి చావటానికి సిద్ధమయాను" అన్నాడు.

"ఆఁ. నెల్లాళ్ళ జబ్బుపడ్డ మొహమే. నీఅబద్ధాలు వింటూంటే అసహ్యమేస్తుంది"

"చూడన్నయ్యా, నువ్వేదో పెద్దపత్తిత్తులా నటించకు. ఆరాత్రి నువ్వు యెక్కడ గడిపిందీ నాకు తెలియదనుకున్నావా?"

"చూశారా? చూశారా? ఈ వెధవగాడిద అబద్ధాలన్నీ బయట పడ్డాయి చూశారా?"

ఇద్దరూ యించుమించు జుట్టుపట్టుకోబోవటం చూసి, రాసమణి ముందుకొచ్చింది. ఆమె ఈశ్రాద్ధక్రియల పనులమూలంగా కొన్నాళ్లనుంచీ

రోజంతా యిక్కడే ఉంటోంది. ఖర్చుకూడా ఆమెదే. దేవేన్ ఈకబురు రావటంతో కట్టుకున్న బట్టతో వచ్చానని సాకుచెప్పి, నిశ్చింతగా కూచున్నాడు. రాసమణిపిలిచి, "దేవేన్, ఈకొద్ది రోజులయినా తిన్నగా ఉండి కర్మకాండలు నిర్వర్తించలేరా బాబూ ! లేకపోతే యివన్నీ అఖ్ఖర్లేదు. ఈసామానులన్నీ తీసుకెళ్లి గంగలో పారేసి, హాయిగా ఉండండి" అన్నది.

ఆ కంఠస్వరానికి దేవేన్ ఒక్కడేకాదు. నరేన్‌కూడా స్తబ్ధుడయినాడు.

ఎలాగో శ్రాద్ధక్రియలు పూర్తికాగానే నరేన్ మళ్లీ మాయమయాడు. 'నియమభంగం' రోజునకూడా లేడు. నాలుగురోజులు తర్వాత దేవేన్‌కూడా తలగోక్కుంటూ, "అక్కడ బోలెడునష్టం. ఇంక యిక్కడ యెదురుచూస్తూ ఉండలేను అత్తయ్యగారూ !" అన్నాడు.

"ఇంకా యెదురు చూడటం దేనికిబాబూ ! నువ్వెళ్లు. నేను కడుపులో చోటు యిచ్చినదాన్ని కూతురికి ఖాండంలోకూడా చోటు యివ్వగలను."

రాధారాణి శ్యామను కావిలించుకుని, చాలాసేపు యేడ్చింది. ఆమెముఖంలో యెముకలన్నీ బయటికొచ్చాయి. ఒంటినిండా పుళ్లు, "నేనింకా యెక్కువరోజులు బతకను శ్యామా ! ఇదే చివరిచూపు" అన్నది. "ఛా ! అవేం మాట లక్కయ్యా ?"

"కాదు చెల్లాయ్, మురికివాడలోని గుడిసేటి కొంపలచుట్టూ తిరిగి, పాడుజబ్బులన్నీ తెచ్చుకున్నారు. ఆ రోగాలన్నీనాక్కూడా వ్యాపించాయి. అసలు నాకు బతకాలని కోరికకూడా లేదు. పిల్లవాణ్ణి గురించే భయమంతా, చూశావుగా వాడి స్థితి వాడు ! కూడా యెక్కువరోజులు బతకడు. అయితే నేను వాడికంటె ముందు యెలా పోగలనో అది చెప్పండి మీరు"

శ్యామ ఆ మాటకి వణకిపోయింది.

పాడురోగాల్ని గురించి ఆమెకి స్పష్టంగా యేమీ తెలియదు. కాని నరేన్‌కి కూడా అలాంటివేమయినా ఉన్నాయేమో అని ఆమెకి అనుమానం కలిగింది. ఇంతకు ముందుసారి అతణ్ణి ఆమె స్పష్టంగా అడిగింది. నరేన్ సగర్వంగా "యెందుకు తగలవు ? అలాంటివన్నీ ఆ పేరు మోసినవాడకెడితే చాలు తగుల్తాయి. కాని నేనేం అన్నయ్యలాగానా ? సరైన చికిత్స చేయించుకున్నాను, ఆయుర్వేద చికిత్స" అని చెప్పాడు.

కాని ఆ మాటమీద నమ్మకం తక్కువ. అదలా ఉండగా తన శరీరంలో మరొక సంతానం కలిగే సూచన దగ్గిరపడుతోంది. ఏమవుతుందోనని ఆలోచించుకుంటూంటే, ఆమె కిప్పటినుంచే నిద్రపట్టటం లేదు.

"నువ్వుకూడా లే ప్రయాణమవు" అన్నది తల్లి.

శ్యామ తల అడ్డంగా తిప్పుతూ - "ఆహఁ, నేను రానమ్మా" అన్నది.

"అదేమిటే ? ఇక్కడ నిన్నెవరు చూస్తారు. నేను రోజు రోజూ యెలా రాగలను ?"

"అక్కడికి వస్తే ఆయన నన్నింక యెప్పటికీ తీసుకెళ్లరమ్మా ! హాయిగా నన్ను నీ నెత్తినెక్కించి, నిశ్చింతంగా ఉంటారు. ఆయన కూడా మళ్లీ యెక్కడికో వెళ్లి కూచుంటారు."

"దానికి నా దగ్గిర మందు ఉందిలే. నువ్వు దిగులుపడకు. నిన్ను తీసుకెళ్లాను కదా అని, అతణ్ణి యింటికి రానివ్వ ననుకోకు."

శ్యామకి యేం చెయ్యాలో తోచలేదు. కాని యిక్కడ ఒక్కతే ఉండటం, త్వరలో ప్రసవించే సూచన ! ఇక్కడ ఉండటం అసంభవం. దీర్ఘంగా నిట్టూరుస్తూ కళ్లనీళ్లు తుడుచుకుంటూ లేచింది.

చాలా రోజుల తర్వాత పుట్టింటికి వెళ్లటం. తల్లి దగ్గిర కెళ్లటం ; కాని ఆమెకి రవంతకూడా ఆనందం లేదు. ఇంత నిరానందంగా పుట్టింటి కెళ్లటం అన్నది ఆడది యెన్నడూ ఊహించలేదు.

తల్లి భర్తను యింట్లోకి రానివ్వదు. ఒకవేళ అతడప్పటికీ రాకపోతే ? శాశ్వతంగా పుట్టింట ఉండటమేనా ? అమ్మమాత్రం యెంతకాలం ? బెంగతో కాళ్లు చేతులూ యేమిటో మొద్దుబారి పోయినట్లున్నాయి. ఆమె వెంటనే కదలలేకపోయింది.

## 4

శ్యామ యెక్కువ రోజులు ఒక్కతే ఉండక్కర్లేక పోయింది. నెల లోపలే ఉమకూడా వచ్చిచేరింది. ఒకనాడు సాయంత్రం శ్యామ తల్లికి మహాభారతం చదివి విన్పిస్తూ కూచుంది. వీధిగుమ్మం తలుపు గొళ్లెంయెవరో టక్‌టక్‌మని చప్పుడు చెయ్యటం విన్పించింది.

"ఇలా గొళ్లెం చప్పుడు చేసేదెవరే ?" రాసమణి విస్మితురాలై దాసీ వెంట కిందికి దిగివచ్చింది.

తలుపు తెరచి చూసేసరికి లావుగా ఉన్న ఒక వయసుదాటిన స్త్రీ వంటినిండా నగలు, వెడల్పుఅంచుగల ఖరీదైన చీరె ధరించి ఉంది. ఆమె వెనుక ఉమ తలవంచుకుని యేడుస్తూ, కంపించిపోతూ నుంచుని ఉంది.

"ఏమిటి ? ఇదేమిటి ?" రాసమణి అతికష్టం మీద అడిగింది.

"నువ్వేనామ్మా ఈ అమ్మాయి తల్లివి ?"

"ఆఁ అవును"

"ఏమమ్మా ? కడుపున కన్నదానివి, కాస్త తిండి పెట్టలేవా ? కూతుర్ని అక్కడ యేం చెయ్యాలని ఉంచావ్ ? ఇంతకంటె దాసీ పని చేసుకుంటే కడుపు నిండటమే కాక నెలనెలా కాస్త డబ్బుకూడా గిట్టుతుంది. ఆ తాటకిలాంటి రాక్షసి దగ్గిర ఉంచటం కంటె - ఆమెకి ఓ తాడు బిందె కొని యివ్వాల్సింది."

రాసమణి అప్పటికి కాస్త తేరుకుంది. "మీరెవరో నాకు తెలియదు. ఆ మాట యెందుకంటున్నారో అదీ తెలియదు. కాని కూతుర్ని అత్తారింటి నుంచి తీసుకొచ్చి, పుట్టింట్లో ఉంచుకోవటం మర్యాదైన విషయమా ? అత్తవారింట దాసీవృత్తి చెయ్యటమయినా మంచిదే - ఇదే మేం పొందిన శిక్షణ !"

"అది నాకు మాత్రం తెలియదనుకున్నావటమ్మా ?" అని కొంచెం మెత్తపడి మేమూ హిందువులింటి ఆడపడుచులమే. 'షో బజారు' రాజా వారింటి బిడ్డను నేను. ఉచితానుచితాలన్నీ నాకుతెలుసు. కాని సంభవం అసంభవమనేవి ఉన్నాయికదమ్మా. మా యిల్లు వాళ్లింటి పక్కనే, మా యింటి కిటికీలోంచి చూస్తే మీ వియ్యాలవారింటి మెల్లా కన్పిస్తుంది. అన్నీ చూస్తూనే ఉంటాను. ఇవాల్టికి మూడు రోజులనుంచి ఈ పిల్లకి తిండి పెట్టలేదు. అయితే పనులు మాత్రం అన్నీ పూర్తిగా చేయించింది. వాళ బిందెతో వీధిలోని పంపు దగ్గిర్నుంచి నీళ్లు తీసుకొస్తూ, మెల్లాలో భాల్న పడింది. అత్తగారు పరుగెత్తుకొచ్చి ముందు బిందె చూసింది. ను సహించలేక, "ముందు చిన్నపిల్ల, ఆ పిల్లకేమయిందో చూడమ్మా !" న్నాను. ఆమె యేమన్నదో తెలుసా ? కోడలు పోతే ఇంకో కోడలు స్తుంది. బిందె పోతే రొక్కం డబ్బుయిచ్చి కొనుక్కోవాల్సివస్తుంది. దే పోయింది అన్నది "ఇవాళ రోజంతా ఈ పిల్లకి అన్నం పెట్టలేదు.

అదృష్టం కొద్దీ సాయంత్రం ఆవిడ కొడుకు అప్ఫాఫీసుకో, యెక్కడికో బయటికి వెళ్లింది. నేను ఆసందు చూసి, ఈమెని బయటికి తీసు కొచ్చాను. ఇప్పుడు నీ కూతుర్ని పోషించగలిగితే పోషించు. లేకపోతే ఒక బిందెకొని యిచ్చి నీ చేతుల మీదుగానే గంగలో త్రోసెయ్". ఒక్క గుక్కలో అన్ని సంగతులూ చెప్పి, ఆయాసపడటం మొదలెట్టింది. రాసమణి వంగి ఆమెకి నమస్కరించ బోయింది. ఆమె నాలికకొరుక్కుని "అగు, అగు, ఏమటమ్మా నువ్వు చేస్తున్నది ? బ్రాహ్మలు మీరు, నమస్కరించి పాపంలో ముంచకండి" అన్నది.

"జంధ్యం ఉండగానే బ్రాహ్మడు కాదమ్మా, మీరు బ్రాహ్మలకంటె యెంతో ఉన్నతులు"

"కావొచ్చమ్మా ! కాని అమ్మో ! ఎన్నన్నా మీ బ్రాహ్మణ స్త్రీలు గోధుమత్రాచులు." ఆమె యింక కూచోలేదు. అక్కడినుంచి వెనక్కి తిరిగి, బండి ఆగి ఉంది. ఆ బండిలోనే తిరిగి వెడతాను. అన్న సాకుతో ఉండటానికి ఒప్పుకోలేదు.

ఆ రాత్రి ముగ్గురు ఆడవాళ్లకి యెలా గడిచిందో చెప్పలేం. ఇద్దరూ కూతుళ్లకీ కాసేపుకూడా కంటతడి ఆరలేదు. రాసమణి మాత్రం స్తంభి తురాలయి అలాగే కూర్చుండిపోయింది. తెల్లవారకట్ల ఆమెకి వరుసగా రెండుసార్లు ఫిట్స్ వచ్చిన తర్వాత, మొదటిసారిగా ఆమె కళ్లల్లో నీళ్ల తిరిగాయి.

మర్నాడు ఉదయమే దయామయి వచ్చి ప్రత్యక్ష మయింది. లోపలికి జొరపడి, మెల్లాలోకి వచ్చి నిలబడి. "ఏరీ ? ఎక్కడ అందరూ ? నాకు నుంచోటానికి తీరికలేదు" అని కేకపెట్టింది.

ఉమ ఆ గొంతు వినగానే భయంతో శ్యామని గట్టిగా కావిలించు కుంది. రాసమణి బయటికి వచ్చింది.

"చూడమ్మా కూతురి కెలాంటి శిక్షణ యిచ్చావో, దానికి తగినట్లే చేసింది. నిన్న కులం వదిలేసి, ఇంట్లోంచి బయటికి వచ్చింది" అన్నది దయామయి.

"అత్తగారింట్లో యెక్కువ రోజులు శిక్షణ పొందితే బహుశా ఆ పనే చేసేది వియ్యపురాలా !" రాసమణి కటువైన కంఠతో అన్నది.

నేను యిచ్చిన శిక్షణ యింకా మరిచిపోలేదు కనుకనే ఆ పని చెయ్యలేదు దాన్ని నేనిక్కడికి తీసుకువచ్చాను."

"ఆ అలా చెప్పు. తల్లికీ కూతురుకీ సరిపోయింది. ఇదిగో చూడు, మంచి కోరేదానివయితే, నా కోడల్ని యిప్పుడే బయటికి పంపు, లేకపోతే పోలీసు ఫిర్యాదు యిస్తాను."

"సత్తా ఉంటే ఆ పనే చెయ్యి. నా కూతురింక ఆ యింటిగుమ్మం తొక్కదు" కంఠస్వరం శాంతంగానే ఉంది. చూపుల్లో మాత్రం నిప్పులు కురిశాయి.

"అంతదాకా యెందుకు ? నాకు పోలిస్‌స్టేషన్‌కు పోవలసిన అవసరం లేదు. నాకోడల్ని నేనే తీసుకెడతాను ఎవరడ్డం వస్తారో చూస్తాను" దయామయి రెండడుగులు ముందుకు వచ్చింది.

దయామయి మెల్లాలో ఉంది. రాసమణి వరండా గట్టుమీద ఉంది. హఠాత్తుగా ఆమె శరీరంలో రక్తం కుతకుత లాడిపోయింది. పక్కనున్న పెద్ద కత్తిపీట అందుకుంది.

"నరహత్య మహాపాపమే. అయినా జగజ్జనని దీన్ని అపరాధంగా తీసుకోదని నాకు తెలుసు. నువ్వు చేసిన దానికి యింకా నాయెదుట నుంచుంటే పిచ్చెత్తకుండా ఉండటం అసంభవం. ఇంక ఒక్క నిమిషం యిక్కడ నిలబడ్డావంటే ఈకత్తిపీటతో నిన్ను రెండు ముక్కలుగా నరికేస్తాను. గురువుల మీద ఒట్టు."

ఆ సమయంలో రాసమణిలో ప్రస్ఫుటించిన రుద్రరూపాన్ని చూసి, దయామయికూడా హడలిపోయింది. ఎలాగో ఒకొక్క అడుగే వెనక్కి వెనక్కి జరిగి బయటికెళ్ళిపోయింది. ఇంక ఒక్కమాట మాట్లాడటానికూడా ఆమెకి ధైర్యం చాల్లేదు.

# ఐదవ పరిచ్ఛేదం

## 1

రెండంతస్తుల యింట్లో ఉన్నది మొత్తం ముగ్గురు ప్రాణులు. తల్లీ యిద్దరు కూతుళ్లు. శ్యామకొడుకు పసివాడు, అయితే ఒక దాసీ మాత్రం ఉంది. ఆ వాడలో జులాయిగా తిరిగే కుర్రవాళ్ల భయమున్నా, నౌకర్ని పెట్టుకోటానికి

రాసమణికి ధైర్యం చాల్లేదు. రూపవతులైన ఆడపిల్లలింట్లో ఉండటం ఒకటి. రెండోది నిస్సహాయులైన ముగ్గురు ఆడవాళ్లు. నౌకరు యెలాంటివాడవు తాడో యెవరికి తెలుసు? ఖూనీచేసి ఇంట్లో ఉన్నదంతా దోచుకుపోయిన సంఘటనలెన్నో ఉన్నాయి.

ఏది యేమయినా వారికి రోజు గడవటంలేదు. పని తక్కువ. ఆపని అంతా రాసమణే చేస్తూఉంటుంది. అదీకాక అమెకి రోజూ గంగాస్నానం ఉంది. పూజలూ అవీ ఉన్నాయి. భగవంతుడి ముందు దుఃఖాన్నంతా వెళ్లబోసుకుని యేడ్చినా కొంతసాంత్వన కలుగుతుంది. వయస్సులో ఉన్న కూతుళ్లిద్దరికీ ఇరుగు పొరుగున ఉన్నవాళ్లు కొందరు ఆ సలహా ఇవ్వలేక పోలేదు. అయితే రాసమణిమాత్రం ఆ పనిచేయలేదు. అది నిరర్థకమని ఆమెకి తెలుసు. శరీరం యే వయస్సుకి చేరుకుంటే మనస్సు ఈశ్వరాభి ముఖమవుతుందో, వారికావయస్సు రావటానికింకా చాలా వ్యవధి ఉంది. ఇప్పుడది భగవంతుడితో ఆడుకోవటమే అవుతుంది. దానివల్ల ఇంకా పాపం పెరుగుతుంది. "ఇష్టదైవం పటం యెదుటపెట్టుకుని, మనస్సులో మనిషిని తలచుకుంటే అంతకంటే పాపం యేముంది? అంతకంటే వాళ్లని యేడవనివ్వండి. భగవంతుడు యేడవటానికే వాళ్లని యీలోకంలోకి పంపించాడు. లేకపోతే యిలా యెందుకు జరుగుతుంది?" అనేది ఆమె.

ఉమకి ఈ సమయంలో ఒక విచిత్రమైన అనుభవం కలిగింది. హృదయవిదారకమయినా యెవరి దుఃఖగాథ అయినా ఈర్ష్యావిషయక మవుతుందని అనుభవం కాకపోతే, బహుశా ఆమె విశ్వసించేది కాదు. శ్యామ దుస్సహమైన తన బాధలగాథ - ఒక్కొక్కటే వివరంగా చెపు తున్నప్పుడు - ఉమకి సానుభూతితో కళ్లల్లో నీళ్లు జలజల్లాడినా, అంతరాంత రాల్లో ఏమిటో ఒక అకారణమయిన ఈర్ష్య అనుభవమయేది. శ్యామ యిన్ని కష్టాల మధ్య కూడా కొంత జీవితాన్ని చవి చూసింది. అఘా తాలూ తిన్నది. కాని దాని వల్లనే ఆమె భర్తనుంచి కొంత పొంద కలిగినదని నిరూపితం కాదు. అఘాతాలు పొందటం పొందటమే. శ్యామ భర్త తన భర్తలాగా ఉదాసీనుడు కాడు. అధికారాన్ని ఆయత్తం చేసుకుని, బలవంతంగా పశువులా బలప్రయోగం చేసి అనుభవించాడు. అయినా దానివల్ల ఆసక్తి ఉన్నట్లు తెలిసింది. కాని తన భర్త? అంద గాడు, తియ్యగా మాట్లాడగలవాడు, ఏ స్త్రీ అయినా కోరతగినవాడు. అతడికి తన తొలియౌవన ప్రకాంక్షని. అనురాగాన్ని అర్పించటానికి వెళ్లి తిరిగి వచ్చింది. కఠినమైన అతడి ఉదాసీనతను, నిరాసక్తతను రవంత కూడ చలింప చేయలేకపోయింది. తన భర్త అలా నిర్దయుడు అంత

పశువు అయినా, తన జీవితం సార్ధకమయేదని అనిపించే దొకొక్కప్పుడు. ఆ సుఖాస్వాదనని తానెప్పుడూ పొంది యెరుగదు. ఆ సూచనల్ని మాత్రం పొంద కలిగింది. ఆ సుఖంలో లీనమైపోతే యెన్ని అఘాతాల్నయినా కానియ్ ఆనందంగా సహించేది. బహుశా అదే స్వాభావికమేమో! లేకపోతే శ్యామయినా తన రాక్షసభర్తకోసం క్షణాల్ని లెక్క పెట్టదు.

ఉమ మధ్య మధ్య తన గుండెలు విదీర్ణమై ఒకొక్క దీర్ఘనిశ్వాస వెలువడటం వినేది. శ్యామ అది తన దుఃఖానికి సానుభూతి అనుకునేది. కాని ఉమ సిగ్గుతో మనస్సులో అంగీకరించటానికి బాధ్యురాలయేది కాదు - శ్యామ దేన్ని పొంది దుఃఖాన్ని అనుభవిస్తోందో, దాన్ని పొందకుండానే ఉమకి ఈ దీర్ఘనిశ్వాసలు !

జీవితంలో యిలాగే అవుతుంది. నాకు యేదయితే దైన్యమో, అది నీకు ఐశ్వర్యం. లోకంలో అన్ని అభావాలు ఒక దానిమీద ఒకటి ఆధారపడినవే. మానవుడు యెదురుగా బృహత్తరమైన వేదనచిత్తరువుని చూసి, తన వేదనకి సాంత్వన పొందుతూంటాడు.

ఆ సంగతి వదిలేద్దాం.

శ్యామకి ప్రసవించే రోజులు దగ్గిరకొచ్చాయి. రాసమణి ముప్పుని శంకించింది. పెద్ద అల్లుడు డబ్బు కలవాడు, డబ్బు సాయం చెయ్యటమనేది అతడికి సామాన్యవిషయం. ఇలాంటి విషయాల్లో అర్ధబలం కంటె అంగబలం యెక్కువ అవసరం. ఒక మగదక్షత కావాలి. రాసమణి ఒకొక్కప్పుడు సహించగలిగేది కాదు. ఎదురుగా లేని అల్లుణ్ణి గురించి కటువుగా మాట్లాడేది. "తిండి పెట్టే మొగుడు కాదు, అతడు గొంతు కోసే కసాయివాడు. నువు సిగ్గులేని దానిలా తయారయావ్" వగైరా....

కాని దానివల్ల శ్యామకి కేవలం కన్నీళ్లు మాత్రమే యెక్కువయేవి. ఒకొక్కరోజున ఆమె కోపం వచ్చి, అన్నం తినేది కాదు. భర్త విరహం యెంత యెక్కువయితే, అంతగా ఒక విచిత్రమైన పద్ధతిని - ఆమె మానస పటంమీదినుంచి అతడి తప్పులన్నీ తుడిచేసేది. ఒక్కొక్కప్పుడు యిలా కూడా అనిపించేది. అతడిప్పుడు కనుక వస్తే, అన్ని సమస్యలూ తేలిపోతాయని. కాని ఇలా ఊహించటం కూడా హాస్యకరమని ఆమె మనస్సుకి తెలుసు.

చివరికి రాసమణి విచిత్రంగా ఒక ఆశ్రయాన్ని పొందింది. అది ఒక వాన రోజు రాత్రి. వాళ్లు ముగ్గురూ ఒక గదిలోనే పడుకున్నారు.

ఇహ తక్కిన యిల్లాంతా ఖాళీ. ఈ సమయంలో ముందు వైపు వరాండాలో యెవరిదో అడుగుల చప్పుడు విన్పించింది.

ఆమె భయంతో కేకలు పెట్టాల్సిన పరిస్థితి. కాని రాసమణి అలాంటి స్వభావం కలది కాదు. అయితే ఆ కంటపడిన వ్యక్తిని చూడగానే రాస మణి ముఖంకూడా డీలా పడిపోయింది. ఆపేటలో పేరుగల జమీం దారుగారి యింటికి చెందిన జులాయిగా తిరిగే యువకుడు. అతడే స్వయంగా గూండా, ఒక పొగరుబోతు గూండామూకని పోషించేవాడు. ఇప్పటికే అతడి చెడ్డపేరు యెక్కడ చూసినా మారుమ్రోగుతోంది. అయితే ఇంత వరకు అమ్మాయిల విషయంలో వచ్చిన చెడ్డపేరు నగరంలో పేరు పొందిన వేశ్యావాటికలోని రెండిళ్లతోనే సంబంధించి ఉండేది. అందుమూలంగా కొంత డబ్బున్నమదంమూలంగా కొంత - పోలీసులంతగా పట్టించుకునే వాళ్లు కాదు. ఈ మధ్య ఒక వ్యవహారంలో జైలు తప్పించుకోలేకపోయాడు. సంవత్సరం జైల్లో ఉండి ఈ మధ్యే బయటపడ్డాడు. ఈ లోపుగానే మళ్లీ అతడింత సాహసానికి పూనుకుంటాడని రాసమణి కల్లోకూడా ఊహిం చని విషయం. గ్యాస్‌పోస్ట్ మీదుగా వరాండాలోకి వచ్చాడు. అతడి ఉద్దేశంవిషయంలో ఇహ యెలాంటి సంశయానికి తావులేదు.

రాసమణి రాయిలా అయిపోయింది. రజిత్ అతడిపేరు. అతడూ ఆమెని చూశాడు. అతడు మామూలు కంఠస్వరంతోనే "మంచి కావాలను కుంటే తలుపు తెరిచేసి వెళ్లిపో. పిట్టకీ, పురుగుకీకూడా తెలియదు. లేక ఊరికే గొడవకనుక చేశావో, ఇంక వీధిమొహం చూడలేవు. నా సంగతి తెలుసుగా! ఏది అనుకుంటే అది చేసి తీరుతాను" అన్నాడు.

రాసమణి మొట్టమొదటిసారిగా యిప్పుడే భయపడింది. ఆమె కాళ్లు చేతులు గజగజ వణకటం మొదలెట్టాయి. సమాధానం యేం చెప్పాలో తోచలేదు. సహనహీనుడైన రజిత్‌కి కూడా మనసు ఆగే స్థితిలో లేదు. అతడు తలుపుమీద గట్టిగా ఒక్కతన్ను తన్నాడు. పాతయింటి చివికిపోయిన తలుపు అతడి తన్నుకి ఫెళఫెళ లాడింది.

ఆడవాళ్లు లేచారు. వాళ్లు భయంతో కేకలుపెట్టారు. అందరూ కలసి తలుపును గట్టిగా నొక్కిపట్టుకుని, అరవటం మొదలెట్టారు. రజిత్ నోటినుంచి తిట్లు, కాళ్లతన్నులు హెచ్చిపోతున్నాయి.

ఆ గందరగోళానికి వీధిలో యెవరికీ నిద్ర మెళకువ రాకపోవటం కాదు. చుట్టుపక్కలయిళ్ల కిటికీలుకూడా తెరుచుకున్నాయి. ఈగొడవ కంతకీ కారకుడైన రజిత్‌నిచూసి, అందరూ వెనక్కి తగ్గారు. అందరి కిటికీలూ మళ్లీ నిశ్శబ్దంగా మూసుకున్నాయి - అందరూ యేదో ఆదమరిచి నిద్రపోతున్నట్లు.

చివరికి ఒక ముసల్మాన్ కుటుంబం బయటికి వచ్చారు. పేరు సాదిక్ మియా. రాధాబజారుప్రాంతంలో అతడి కేదో వ్యాపారం ఉంది. అతడికి జమాజెట్టిల్లాంటి యేడుగురుకొడుకులు. వాళ్లే రజిత్‌కి అంతగా భయపడనివాళ్లు. ఏడుగురుకొడుకులూ, నౌకర్లూ చాకర్లూ కేకలుపెడుతూ వచ్చిపడటంతో రజిత్ పైఅంతస్తు వరాండాలోంచి ఒక్కసారి కిందికి దూకాడు. 'సరే, తర్వాత చూస్తాను' అని బెదిరించి సందుకి అటువైపునుంచి నిమిషంలో మాయమయ్యాడు.

అప్పుడిహ చాలామంది బయటికొచ్చారు. మాయమయిన రజిత్ మీద హాత్‌హూత్ అంటూ చాలా రంకెలు వేశారు. కాని బుద్ధిమతి అయిన రాసమణికి వాళ్లఅవస్థ తెలుసుకోటాని కెంతోసేపు పట్టలేదు. ఆమె తలమీది చెరగు ముఖంమీదికి లాక్కుని, తలుపు తీసుకుని బయటికివచ్చి సాదిక్‌తో - "బాబా! మీ దయవల్లనే నా కూతుళ్ల మానప్రాణాలు రక్షింపబడ్డాయి. భగవంతుడు మీకు శుభం చేకూరుస్తాడు. ఇంతకంటె ఇంకేంచెప్పను? మీ రుణాన్ని తీర్చుకోగల సామర్ధ్యం నాకు లేదు" అన్నది.

సాదిక్ కళ్లల్లో నీళ్లతిరిగాయి. "ఖుదాసాక్షిగా చెబుతున్నానమ్మా. నన్ను బాబా అని పిలిచావు. ఇవాళనుంచి నువ్వు నా కూతురివే. నేను, నాబిడ్డల యేడుగురి శరీరాల్లో రక్తం ఉన్నంతవరకు యెవ్వరూ నీకు కీడు చెయ్యలేరు నిశ్చింతగా ఉండు".

సాదిక్ నిజంగానే ఆమెని కూతురిలా చూసుకోసాగాడు. మర్నాడు ప్రొద్దున్నే వృద్ధుడు మేస్త్రీని వెంటపెట్టుకునివచ్చి, తలుపుకి వెనక పెద్ద ఇనుపబద్దీ పెట్టించాడు. వరాండాచుట్టూ ముళ్లతీగె వేయించాడు. అప్పటినుంచి రోజూ సాయంత్రం కూతుళ్లనో, కోడళ్లనో ఒకర్ని వారిసంగతులు తెలుసుకు రావటానికి పంపించేవాడు. వాళ్లు మెల్లిగావచ్చి లోపల గట్టుమీద, ఆమె శుచిత్వం మైలపడకుండా ఉండేలా జాగ్రత్తగా కూచునేవాళ్లు. రాసమణి వారిని మనస్ఫూర్తిగా ఆత్మీయుల్ని చేసుకుంది. వారికి భోజనాలు యేర్పాటు చెయ్యటానికి ఒకసెట్టు యిత్తడి పాత్రలుకూడా చేయించింది. పాత్రల్ని

కాస్త నిప్పుకి తాకించి తోమించి వేరుగా పెట్టించేది. కాని అతిథులు ప్రత్యేక మైనయేర్పాటుగా భావించేవారు. శ్యామ ఉమని వెంటపెట్టుకుని వెళ్ళేది. అప్పుడప్పుడు రాసమణికూడా వెళ్లేది. తిరిగివచ్చాక ఆ గుడ్డలు విడిచేసేవారు. ఆ ఆచారం మంచిదికాదని ఆమె అంగీకరించేది. అయినా "ఏం చెయ్యను చెప్పండి. పుట్టినప్పట్నుంచి అలవాటైన సంస్కారాన్ని వదిలెయ్యటం సులభమా? మనుషులందరూ ఒకటే అని తెలుసు. అయినా -" అనేది.

క్రమంగా రెండు కుటుంబాల అనుబంధం బలపడింది. ఉమ, శ్యామ సాదిక్ మనుమరాళ్లు 'రాభేయా' 'నశీబన్' లతో స్నేహం యేర్పరుచుకున్నారు.

## 2

శ్యామకి ఈసారి ఆడపిల్ల పుట్టింది. తెల్లగా అందంగాఉంది పాప. సాదిక్ సాయంమూలంగా మంత్రసానిని పిలిపించడం, బజారునుంచి కావలసినవి కొనుక్కురావటం - దేనికి యిబ్బంది కలగలేదు. అటువైపు నిశ్చింతగానే ఉన్నా, రాసమణికీ వ్యవహారం యేమీ బాగాలేదు. ఏమిటీ దైవదుర్ఘటన! పెళ్ళిళ్లయిన ఆడపిల్లలిద్దరూ తన కంఠానికి చుట్టుకున్నారు. అందులో ఒకరు పిల్లలతోసహా. వాళ్లస్థితి యేమవుతుంది? వాళ్లకేం యేర్పాటు చెయ్యడం అనేది తోచలేదు. తన యీ అభిశప్తజీవితంలో చివరిసాంత్వనకూడా యేదో దూరమయినట్లుంది.

పాపకు మహాశ్వేత అని పేరు పెటడం జరిగింది. పెత్తల్లి కమల పెట్టిందిపేరు. ఆమె నవలలెక్కువ చదువుతుంది. పిల్లవాడికి పేరుకూడా ఆమే పెట్టింది. ఉత్తరంలో హేమచంద్ర అని రాసిపంపింది. మహాశ్వేత పేరు శ్యామకంతగా నచ్చలేదు. కాని రాసమణికి బాగుంది.

శ్యామకి మనస్సులో యెక్కడో ఒకమూల నరేన్ ప్రసవించే నాటికైనా తప్పకుండా వస్తాడని ఆశ ఉండేది. అతడలాగే వచ్చిపడతాడు.

ఆ ఆశకి కారణం యేమిటో ఆమెకీ తెలియదు. కాని ఆశ ఉన్న మాట మాత్రం నిజం.

కాని రోజులు, వారాలు, నెలలు - క్రమంగా రెండుమూడు నెలలు గడిచిపోయాయి. నరేన్ కబురేమీ తెలియలేదు. శ్యామ ఒంటరిగా కూర్చుని కంట తడిపెట్టుకునేది. ఒకరోజున "ఒకవేళ అక్కడికి వచ్చి వెళ్లారేమో అమ్మా! ఇంకా కొన్నాళ్లుచూసి వస్తే బావుండేది" అన్నది. తల్లి

ఆమాటకి ముఖం గంభీరంగా పెట్టుకుని చెప్పింది సమాధానం. "సరే, మంచిదే - అద్దెకి తీసుకుని యిస్తాను. అక్కడికే వెళ్లిఉండు. అతడు ఈ యిల్లు యెరగడు. కబురు తెలుసుకున్నట్లయితే అక్కడికే వచ్చి తెలుసు కుంటాడు."

ఆతర్వాత మళ్ల ఆప్రసక్తి తీసుకురావటానికి శ్యామకి ధైర్యం వాల్లేదు.

చివరికి భగవంతుడు ఆమె మొర ఆలకించినట్టున్నాడు.

ఒకనాడు మధ్యాహ్నంవేళ కమల పల్లకి చేసుకుని పరుగెత్తుకు వచ్చింది. నరేన్ అక్కడికి ఆమెయింటికి వచ్చాడు. వీళ్లను చూడాలను కుంటున్నాడు. అత్తగారింటికి సరాసరి రావటానికి ధైర్యం లేకపోయింది. అందుకని సిఫారసు చేయించుకోటానికి వదినగారింటికి వెళ్లాడు.

శ్యామ ఉత్సుకదృష్టితో తల్లివైపు చూసింది. రాసమణి ముభావంగా "వీల్లేదు" అని తల అడ్డంగా త్రిప్పింది.

అందరూ తెల్లబోయారు. శ్యామముఖం వివర్ణమైపోయింది. ఆమె నేల వైపుకి చూస్తూ కూచుంది. కమల కాసేపు నోటమాట రాకుండా ఉండి పోయింది. చివరి కతికష్టం మీద 'వీల్లేదా ?' అని అడిగింది.

ఈసారి రాసమణి కటువుగా దృఢకంఠంతో "వీల్లేదు. ఉండ టానికి ఆశ్రయం చూసుకుని, వీళ్లను పోషించేభారం పైన వేసుకుని, యే రోజున తీసుకెళ్లగలడో, ఆరోజున బండితీసుకొచ్చి, వాకిట్లో నుంచోమను. నేను దాన్ని పంపిస్తాను. అల్లుడికింక యీ యింట్లో స్థానంలేదు" అన్నది.

కాసేపు అందరూ స్తబ్ధులయారు. చివరికి కమల మనస్సుకి కొంచెం కష్టంకలిగిన భావంతో 'ఇది అన్యాయ' మమ్మా అన్నది.

రాసమణి శాంతంగా, స్థిరదృష్టితో ఆమెవైపు చూసి, "నన్ను నువ్వు కడుపున కనలేదమ్మా. నేను నిన్ను కడుపున కన్నాను. న్యాయ - అన్యాయవిచక్షణ ఓవేళ యిప్పటివరకు కలగకపోతే, ఇహ అది నీమాట వల్ల కలగదు. ఇద్దరు వితంతువులయిన కూతుళ్లను యింట్లోపెట్టుకుని పోషిస్తున్నానని నాకుతెలుసు" అన్నది.

శ్యామ కోపం వచ్చి అక్కడినుంచి వెళ్లిపోయింది. కమలకి కూడా కళ్లనిండా నీళ్లు తిరిగాయి. కాని రాసమణి ముఖవైఖరిచూసి యింక

మాట్లాడటానికి ధైర్యం చెయ్యలేక పోయింది. శ్యామకి సాంత్వన కలిగించే మాట చెప్పటాని కేమీ తోచక ఆ పల్లకీలోనే తిరిగి వెళ్ళిపోయింది.

నరేన్ అప్పుడు కమలయింట్లో రెండో అంతస్తులోని గదిలో లాగుడు పంకాకింద హాయిగా నిద్రపోతున్నాడు. వందచిరుగులతో ఉన్న పంచె కట్టుకుని ఉన్నాడు. కాళ్లకి చెప్పులు లేవు. ఒళ్లంతా దుమ్ము. కమల అతణ్ణి చూడగానే యెంతో సంతోషంతో, యెలాగో వంటబ్రాహ్మడితో, భోజనం యేర్పాటు చెయ్యమని చెప్పి వెళ్లిపోయింది. స్నానం సంగతి అతడికెవరూ చెప్పలేదు. అతడికీ అవసరమని తోచలేదు. కిందపరచిన పరుపుమీద అప్పుడే మార్చిన దుప్పటి-ఈలోగానే అతడిఒంటి దుమ్ము అంటుకుని పాడయిపోయింది.

ఈ పశువు చుట్టమని చెప్పుకోటానికికూడా సిగ్గేస్తుంది. కాని కమలది సున్నితమైన మనస్సు. పైగా శ్యామసంగతి తలపుకి రావటంతో రాత్రంతా ఆమెకి నిద్రపట్టలేదు. కటువైనమాట నాలిక చివరిదాకా వచ్చినా, అతిప్రయత్నంమీద అణచుకుంది. నిద్రలేచాక మెల్లిగా అతడికి రాసమణి ఆదేశాన్ని చెప్పింది.

"అలాగా ? ఆవిడపట్టుదల యేమీ తక్కువది కాదు. పాపను చూడ లేదనికాని, లేకపోతే పెళ్లాంకోసం నాకేం నిద్రపట్టటం లేదా ? పోనీలెండి వదినగారూ ! ఈపూట పరోటాలు చేయించండి. మంచిభోజనం చేసి చాలా రోజు లయింది"

అని అతడు బిగ్గరగా ఆవలించి, తీరికగా, నిశ్చింతగా అలసట తీర్చుకున్నాడు.

కమల అతికష్టంమీద మనస్సులోని ఉద్దేశాన్ని అణచుకుని, "సరే అలాగే యేర్పాటు చేస్తాను కాని, నువ్వుశుభ్రంగా నూనె రాచుకుని స్నానం చేసిరా బాబూ !" అన్నది.

"స్నానమా ? ఈవేళ కానివేళా ?"

"అయితే అయింది"

"కష్టం. గుడ్డలూ అవీ -"

"పర్వాలేదు, ఆ యేర్పాటు నేను చేస్తాను. నువ్వులేచి కుళాయిఉన్న గదిలోకి వెళ్లు, పక్కంతా యెలా అయిందో చూడు".

"ఉష్! అవును, మట్టి అయిందికదూ! సరే, స్నానం చేస్తాను. ఓ గిన్నెడు నూనె యివ్వమని మీ దాసీతో చెప్పి, అలాగే కాస్తవిలుంపోగాకు -"

కమల ఉతికిన భర్తపంచె ఒకటి తీసి యిచ్చింది. దాంతోపాటు చొక్కాకూడా. నరేన్ చాలారోజుల తర్వాత శుభ్రంగా స్నానంచేసి, యేదో శృంగారం ధ్వనించే పాట కూనిరాగం తీసుకుంటూ బయటికి వచ్చాడు. తర్వాత పంచెకట్టుకుని, చొక్కావేసుకుని మళ్లీ యింకో నిద్ర తీశాడు. అయితే భోజనమయాక యింకరాత్రి ఉండటానికి ఒప్పుకోలేదు. "వదినగారూ, చాలారోజుల తర్వాత మంచి విశ్రాంతి కలిగింది. దీన్ని పూర్తిగా ఉపయోగించుకుంటాను. ఇక్కడ పడుకుంటే యేమయినా సరే నిద్రపట్టదు. ఒకరూపాయి యివ్వండి. అర్ధరూపాయి అయినా సరే. మళ్లీతప్పకుండా తిరిగి యిచ్చేస్తా అదేంను దిగులుపెట్టుకోకండి" అన్నాడు

కమల ఒక్క నిట్టూర్పు విడిచి, రూపాయి యిచ్చింది.

మంచిదే అయింది. ఆ రోజున భర్తయింకా తిరిగిరాలేదు. మామూలు పనులన్నీ పూర్తిచేసుకుని అతడు 'వరానగర్'లోని ఉద్యానభవనం చూసిరావటానికి వెళ్లాడు. ఈచుట్టాన్ని అతడి యెదుటికి తీసుకెళ్లటమంటే సిగ్గుతో తల ఒరిగిపోతుంది.

ఇది జరిగిన పదిహేనురోజులకి - దాసీ యేదో పరధ్యానంగా ఉన్న సమయంలో తలుపులు తెరచి ఉండటంతో, నరేన్ హఠాత్తుగా ఆ యింటి పై అంతస్తులో ప్రత్యక్షమయాడు.

అప్పుడు రాసమణి మధ్యాహ్నం విశ్రాంతి తీసుకుని లేచి, వక్కలు కత్తిరిస్తోంది. అతణ్ణిచూసి కేవలం విస్మితురాలవటమే కాదు, ఆమెకి అంతులేనంత అసహ్యం కూడా కలిగింది. ఆమె ఒక్కమాటకూడా మాట్లాడలేకపోయింది. కిటికీకేసి చూస్తూ ఊరుకుంది.

నరేన్ నాటకం ఫక్కీలో చేతులు తిప్పుతూ మాట్లాడాడు. "ఏర్పాటు చేసే వచ్చాను. నా పెళ్లాన్ని పిల్లల్ని చప్పున బయటికి రప్పించండి" అని రాసమణి సమాధానం కోసం యెదురుచూడకుండానే గొంతెత్తి బిగ్గరగా - "ఏమే! ఎక్కడ? చప్పున తయారవు" అని కేకపెట్టాడు.

రాసమణి కొంచెం గంభీరంగా "దానికి ముందు యేం యేర్పాటు చేశావో చెప్పు ?" అన్నది.

"ఎందుకు ? అది మీకెందుకు చెప్పాలి ? నాసంసారాన్ని నాయిష్టం యెక్కడికయినా తీసుకెళ్ళి పెట్టుకుంటాను."

రాసమణి యేదో కఠినమయిన సమాధానం చెప్పబోయింది. అంతకు ముందుగానే "ఎక్కడికి తీసుకెళ్లేది చెప్పందే నేనొక్క అడుగు కూడా కదలను ; మిమ్మల్ని నమ్మటానికి లేదు. ఓవేళ పాడుకొంపలుండేవాడకి తీసుకెళ్లి పెడితే ?" అన్నది శ్యామ.

ఆమె యిన్నాళ్లూ మనస్ఫూర్తిగా భర్తరాకనే కోరుకుంటోంది. అయినా ఆ క్షణంలో ఆమెకి మళ్లీ భయమే ప్రబలమయింది. అతణ్ణి చూడ గానే మళ్లీ ఉద్ధతమయిన అనుమానం కూడా పైకి పొంగింది.

"ఆగు ఆగు, వీధిభాగోతంలోలా మాటలు సాగతియ్యక్కర్లేదు, పిట్టకొంచెం కూతఘనం అని మాటలు మాత్రం ధాటీగానే మాట్లాడుతున్నావే ! ఎన్ని చెప్పినా మాది గురువంశం. పద్మగ్రామంలో సర్కారుగారింట్లో నిత్య పూజలు చేసేపని ఒప్పుకున్నాను. ఒకగది యిస్తారు. అక్కడ తీసుకెళ్లిపెడతాను. లే లే దబ్బున తయారవు. ఇప్పుడు నడక మొదలెడితే రాత్రికి వెళ్లి చేరుకుంటాం"

"అదేమిటి ? అంతదూరం నడిచివెడతారా?" అని అడిగింది ఉమ. "హుఁ. లేకపోతే నవాబు కూతురికి బండి, పల్లకీ యేర్పాటు చెయ్యాలా యేం ? నాకు అంత స్తోమత లేదు".

రాసమణి అప్పటికి కొంత తమాయించుకుంది. గదిలోంచి బయటికి వచ్చి ఉమని పిలిచి "రాత్రివేళ నేను మనుమణ్ణి మనుమరాల్ని పంపను. అంత బడాయిలు అక్కరేదు. ఇవాల్టికి ఉండమను. రేపుపొద్దున వెళ్లొచ్చు బండి చేసుకునే వెళ్లొచ్చు. బండి బాడుగ నేను యిస్తాను, అని ఆ సిగ్గులేని వాడితో చెప్పు" అన్నది.

క్షణంలో ఆ ఆర్భాటమంతా ఆగిపోయింది. సాంతం నిస్పృహ - నిరాసక్తత వ్యక్తమవుతున్న కంఠంతో "మీకెలా వీలయితే అలాచెయ్యండి కాని నేనేం కావాలని అక్కడికి తీసుకెళ్లటంలేదు. తర్వాత నన్ను తిట్టొద్దు, అన్నాడు.

తర్వాత పిలవకుండానే దర్జాగా వెళ్లికూచుని - "ఉమా! నాకు పొగాకు అలవాటయింది. దాసీని బజారుకి పంపి చవకరకం చిలుంగొట్టం, కాస్త పొగాకు కొనుక్కుని రమ్మను" అని చెప్పాడు.

శ్యామ రాత్రి అన్నిసంగతులు అడిగితెలుసుకుంది. దేముడిమంది రానికి అనుకుని ఉన్నగట్టి యిల్లొకటి వారికి ఉండటానికి యిస్తారు. పగలు నైవేద్యానికి అర్ధశేరు చొప్పున, "అతప్చాల్" (ఒకరకం బియ్యం) రాత్రిభోగానికి ఒక గిన్నెడుపాలు. కొన్ని "వాతాష్"లు (అప్పాలలాంటి తీపివస్తువు) యిస్తారు. వాటిమీద ఆధారపడే నరేన్ పెళ్లాం పిల్లల్ని ఆ దరిద్రపు ఊరికి తీసుకెడుతున్నాడు. ఆ ఊరు యెక్కడో శ్యామకి తెలియనే తెలియదు. అపల్లెటూరు శివపూర్ కంపెనీ తోటనుంచి ఇంకో రెండు క్రోసుల దూరమని మాత్రం విన్నది.

శ్యామ కొంచెంసేపు కొయ్యబారినట్లయి "తర్వాత యెలాజరుగుతుంది ?" అని అడిగింది.

"పౌరోహిత్యం చేస్తాను. చాలామంది దాతలు దొరుకుతారు. తండ్రులు తాతలు అది చేసే అంత సంపాదించిపెట్టి పోయారు. నేను సంసారమే గడుపుకోలేనా ?"

"వారికి కడుపులో విద్య ఉంది. మీకు పూజమంత్రాలే రావుగా !" కోపంగా అన్నది శ్యామ.

"అరె! శంఖం ఊదగలను, గంటవాయించగలను. అది సరిపోతుంది. ఇంకా మంత్రాలెందుకు ! గజిబిజిగా మంత్రాలు చదువుతున్నట్టు గొణగటం అంతే"!

తన చమత్కారానికి తానే హహహ అని నవ్వాడు. పక్కగదిలోనే తల్లి పడుకుని ఉన్నదని జ్ఞాపకంరాగానే శ్యామ అతడి నోటికి చెయ్యిఅడ్డం పెట్టింది.

నవ్వుజోరుని ఆపుకుని 'మొత్తానికి మీ అమ్మ వంటబాగాచేస్తారు భోజనం చాలాబావుంది' అన్నాడు.

తర్వాత కాసేపు మెదలకుండా ఊరుకుని 'ఉమ చాలా అందంగా తయారయింది. తోడలుడు వట్టిమొద్దులా ఉన్నాడే' అన్నాడు.

శ్యామ చీకట్లోనే కంపించి పోయింది - భయంతోనో, అసహ్యతతోనో ఆమెకే తెలియదు.

ప్రొద్దున్నే లేచి, టిఫిన్ చేయటం ముగించి, అత్తగారినుద్దేశించి "అయితే కాసిని గిన్నెలు, చెంబులు, పక్కబట్టలు చూసి యేర్పాటుచేసి యివ్వండి. కొత్తగా కాపరంపెట్టటం, తెలుసుగా! ఎలాగో బండి చేసుకుని వెడుతున్నప్పుడు బండి గుడిసెమీద వేసి కట్టుకుని వెళ్లొచ్చు" అన్నాడు.

సమాధానం చెప్పొద్దని అనుకున్నా - "భోషాణం నిండా అన్ని సామానులుండేవి. అవేమీ లేవూ?" అనేసింది రాసమణి.

"నాకు వచ్చినవి యింకా ఉన్నాయా? ఎప్పుడో అమ్మేశాను. మిగిలి నవి లోకుల యిళ్లలో పెట్టి ఉంచారు. నివాటి మళ్ల యివ్వలా! వెధవలు, కాజేశారు" చాలా నిశ్చింతగానే సమాధానం చెప్పాడు.

రాసమణి కళ్లనీళ్లు తుడుచుకుంటూనే కొత్తగా సామానులన్నీ సమ కూర్చి యిచ్చింది. వెళ్లేప్పుడు బండిబాడుగ కాకుండా, నరేన్ అయిదురూపాయి లడిగి తీసుకున్నాడు. "వెళ్లగానే బజారుకెళ్లి కొనుక్కోవలసినవి ఉంటాయి తెలుసుగా! నేను శూన్యహస్తుణ్ణి. మీరు పైగా మనుమణ్ణి మనుమరాలి పాలు అలవాటుచేసి, నవాబు బిడ్డల్లా తయారుచేశారు".

# ఆరవ పరిచ్ఛేదం

## 1

ఖాళీగా ఉన్న యిల్లు మరింత వెలితిగా కన్పించేది. అనిర్వచనీయ మైన శూన్యత హాహాకారం చేస్తోంది. శ్యామ ఒక్కతే వెళ్లలేదు. ఆమెతో పాటు హేమ కూడా వెళ్లాడు. రెండేళ్ల పసివాడు - నవ్వులతో అల్లరితో ఇల్లంతా మారుమోగించేవాడు. ఇప్పుడది నిశ్శబ్దతతో చచ్చిపోయి నట్లయింది.

రాసమణి మరింత యెక్కువసేపు పూజలో గడుపుతోంది. కాని ఉమకి చెయ్యటాని కేమీ లేదు. ఒకొక్కప్పుడు భయంకరమైన శూన్యత, పనిలేకపోవటం పిచ్చెత్తుతుందేమో అనిపించేది. చదీచప్పుడు లేని యేకాంతంలో అప్పుడు తల బాదుకుంటూండేది.

సాదిక్‌మియా - (ఆ వాడలో అందరూ సాదిక్ ముసల్మాన్ అని పిలుస్తూంటారు) కిందభాగం అద్దెకియ్యి అమ్మాయీ! దానివల్ల ఇంట్లో మరింతమంది జనం ఉంటారు. నీకు అద్దెకూడా కలసి వస్తుందని సలహా యిచ్చాడు.

కాని రాసమణి ఒప్పుకోలేదు. అద్దెలవాళ్లతో కలసి ఉండటంలో ఆమెకి కొంత అనుభవం లేకపోలేదు. ఇరుగుపొరుగు యిళ్లల్లో - రోజూ రోజూ జరిగే పోట్లాటలు వినివిని, ఆమె విసుగెత్తి పోయింది. మెట్లు కడిగించటం యెగ్గొడుతున్నారని, పాయ్‌ఖానా శుభ్రం చేయించే షరతు పాటించటంలేదని, కొందరు పంపునీళ్లు యెక్కువ వాడుకుంటున్నారని - ఇలా తెల్లారి లేచిన దగ్గిర్నుంచి తొంభైతొమ్మిది తగాదాలు. అదీకాక బోలెడంతమంది పిల్లలుంటారు. ఖా - ఖా అసహ్యపు గొడవలు. ఉహూఁ ఆమె యివ్వలేదు.

"అంతకంటె ఎవరయినా ముసలి దర్వాన్ - పగలు దుకాణాల్లోనో ఆఫీసుల్లోనో పనిచేసి, రాత్రిళ్లు యిక్కడికి వచ్చి పడుకునేవాడు. కాస్త చిన్నచిన్న పనులు చేసి పెట్టేవాడు - దొరికితే, అలాంటి వాడి కోసం ప్రయత్నించండి బాబా"

రెండు నెలలు పోయాక సాదిక్ అంతకంటె మంచి ప్రతిపాదన తీసుకొచ్చాడు. "ఒక పెద్దమనిషి చిన్న అచ్చాఫీసు పెట్టాలనుకుంటున్నాడు. కింద వాటా అద్దెకిస్తారా? తొమ్మిది గంటలకు అచ్చాఫీసు తెరుస్తారు. మహా ఉంటే సందెవేళదాకా ఉంటుంది. తర్వాత తలుపులు తాళాలేసి, యింటికెళ్లిపోతాడు. అద్దె ఇరవైరూపాయలుదాకా యిస్తాడు. అది కనుక వస్తే నీకింక యెక్కువ పడదు. ముప్పై రూపాయల్లో ఇరవై దాకా వసూలవుతుంది."

ఈ ప్రతిపాదన రాసమణికి బాగానే ఉన్నదనిపించింది. పిల్లలుంటేనే పిల్లలు చేరుతారు. అల్లరి కేకలు వెయ్యిరకాల జంజాటం. అదెకి ఉండేవాళ్లు కేవలం మగవాళ్లయితే అలాంటి అసౌకర్య ఇబ్బంది, వీళ్ల విషయంలో ఊహించక్కర్లేదు. రోజంతా పని చేసుకుంటారు. సాయంత్రం వెళ్లిపోతారు. ఆ సమయంలో కింది కెళ్లాల్సిన అవసరమేముంది?

అయినా కొంచెం ఆలోచించి, "మరి పంపు, పాయ్‌ఖానా - అవీ కిందే ఉన్నాయి" అన్నది.

"అంతవరకు ఒక 'పార్టిషన్' లాగా చేస్తే సరిపోతుంది. పంపు పాయ్‌ఖానా ఉపయోగించుకోటానికి వీల్లేదని వాళ్లతో చెపుతాను. బయటనే ఉంది సర్కారు వారి పంపు. ఇటువైపు కుళాయితో కలిపి, మెట్లచుట్టూ దడి కట్టిస్తాను. వాళ్లతో సంబంధమే ఉండదు. యేం ?" అన్నాడు సాదిక్.

రాసమణి ఒప్పుకుంది. డబ్బుసంగతికూడా తేలిగ్గా త్రోసి పారె య్యాల్సిందికాదు. బానలో నీళ్లు వంచగా వంచగా అడుక్కి వచ్చేస్తున్నాయి. ఇంక యెన్నాళ్లు గడుస్తాయని ఆలోచించటానికికూడా ఆమెకి భయమేస్తూం టుంది.

సాదిక్‌మియా ఒకమనిషిని పెట్టి, మెల్లాలో మధ్యగా చక్కగా దడి కట్టించేశాడు. దానికి ఒక తలుపుకూడా అమర్చటం జరిగింది. దాన్ని తెరిస్తే యింట్లోంచి సరాసరి వీధిలోకి వెళ్లొచ్చు. లోపలివైపున వాళ్లకి ఒకచిన్నగది కూడాఉంది. అటువైపున ఉన్న రెండు గదులుమాత్రమే అద్దెవాళ్లకి వది లేశారు. లోపలివైపు తలుపుమూసి ఉంటుందని చెప్పటం జరిగింది. బయటి వైపునే వారి వ్యాపారమయినప్పుడు లోపలి యింట్లోకి రావల్సిన అవసరమేముంది ?

నెల ప్రారంభమయినప్పట్నుంచి అద్దె వచ్చింది. రెండు రోజులు ముందు నుంచి బోలెడు సామానులు రావటం మొదలయింది.

టైపు పెట్టుకునే కొయ్యకేసులు, గ్యాలీలుపెట్టుకునే ర్యాక్ - స్టూల్, కుర్చీ, టేబిల్ - ఇద్దరు మేస్త్రీలు వచ్చి, చిన్నట్రెడిల్‌కూడా అమర్చి ఆడించి వెళారు. ఇవికాక ఇంకా రబ్బరు స్టాంప్స్ తయారుచేసే సరంజామా కూడా కొంత వచ్చింది.

ఉమకి యివన్నీ మ్యూజియంలో వస్తువుల్లా చూడతగినవే. ఉమ ఈలోగా చాటునుంచి చూస్తూఉండేందుకు చిన్నయేర్పాటుకూడా చేసుకుంది. మెట్ల మలుపులో కూచుంటే కటకటాల్లోంచి వాళ్లపెద్దగదిగుండా చాలాదూరం దృషి పోనియ్యవచ్చు. ఉమ అక్కడ కూచునిచూస్తూ తెల్లబోతూండేది. ఆమె పెద్దపెద్దకళ్లు విస్మయంతో విస్ఫారిత మవుతూండేవి. కటకటాల మీద తల ఆనించి, కూచోటంవల్ల ఆమె నుదురు మీద ఎర్రగా మచ్చపడింది.

అయినా ఆమె అక్కడినుంచి కదలి రాలేకపోయేది. దృష్టి మరల్చుకోలేక పోయేది.

ఆశ్చర్యం !

ఆమెకి మొత్తమంతా ఆశ్చర్యంగానే ఉంది. కంపోజిటరు స్టూల్ మీద కూచుని వేరు వేరు అరల్లోంచి, టైపుఅక్షరాలు తీసి వరుసగా కూరుస్తాడు. ఏ అక్షరం తీస్తున్నాడో, దానివైపు చూడటంలేదు. చూపంతా కాగితాల్లో రాసిన అక్షరాలమీదే. అందరూ పొట్టిపంచెలు కట్టుకుని, చిరిగినచొక్కాలతో, కాళ్లకి చెప్పుల్లేకుండా ఉన్నారు. స్టూల్‌మీద కూచుని ఉంటే, వాళ్లకి మెడలు నొప్పిపుట్టవు? తొమ్మిదింటికి వచ్చి కూచుంటారు. అయిదింటికి లేచి వెడతారు. కొందరు ఆ తర్వాత. మధ్యాహ్నం ఓసారి లేచి, మరమరాలేవో తింటూంటారు.

మిషన్ తిప్పుతూ అచ్చు ఒత్తటంకూడా తక్కువ ఆశ్చర్యమేమీకాదు. కాలితో యేదోనొక్కగానే చక్రం తిరుగుతుంది. అప్పడాల కర్రల్లాంటిరెండు 'సిలెండర్లు' లోహపు చక్రంమీద నుంచి సిరాను సీసపు అక్షరాలమీద పూస్తాయి. తర్వాత దానికి పిన్నుతో గుచ్చిన కాగితం అచ్చుఅయి, దానంతటదే కిందపడుతుంది. ఎవరు చూస్తారో ఉమకి తెలియనే తెలియదు.

వాళ్ల యజమానికూడా చూడతగినవాడే. పొట్టిగా, నల్లగా బలిష్టంగా ఉంటాడు. చిన్నచిన్నకళ్లు. ఒకరకమైన ధూర్తదృష్టి. ధోవతిమీద పొట్టి కోటులాంటిది వేసుకుని తిరుగుతూంటాడు. చొక్కా ఒకటుంది. అది వంకెకి తగిలించి ఉంటుంది. ప్రెస్‌తాళాలు బొడ్లో దోపుకుని ఉంటాడు.

పొట్టిధోవతి మడమలపైకి పోయిఉంటుంది. అతడు ఒక్కనిమిషం కూడా స్థిరంగాఉండడు. కస్టమర్లు వచ్చినప్పుడు కుర్చీలోకి వచ్చి, పక్కన స్టూల్‌మీద ఉన్న క్యాష్‌బాక్స్‌మీద చెయ్యి వేసుకుని కూచుంటాడు. లేదా వర్కర్లమీద కేక లేస్తూంటాడు. అదీకాకపోతే రబ్బరు స్టాంపులు తయారుచేయటానికి కూచుంటాడు. వర్కర్లు చాలా తక్కువ. ఇద్దరు కంపోజిటర్లు, ఒక మెషిన్‌మెన్. అతడు తీరికగా ఉన్నప్పుడు చిన్నచిన్న సూచనలిస్తూంటాడు. యజమాని స్వయంగానే రబ్బరు స్టాంపులు తయారు

చేస్తాడు. కస్టమర్లదగ్గిర ఊరికే - (ఎవరైనా మార్పుచేయాలని చెపితే) 'ఇప్పుడు మా వర్కరులేడు. దాన్నలా ఉండనీయండి. రేపు అతడు వచ్చాక రెడీ చేయించిపెడతాను' అంటాడు, అంటే తానే ఆపని చేస్తున్నట్టు యెవరికీ తెలియనీయడు.

అతడి భావభంగిమలు చూస్తూంటే ఉమ నవ్వు ఆపుకోలేదు. అతడి వయస్సుని గురించి ఆమెకి కచ్చితమైన అభిప్రాయం లేదు. ముప్ఫయియేళ్లుండొచ్చు నలభైఉన్నా ఆశ్చర్యం యేమీలేదు. ఆమెకి ఊరికే నవ్వురావటమేకాదు, అప్పుడప్పుడు భయం కూడా వేస్తూంటుంది. అతడిలో భయపడాల్సింది యేదో ఒకటుంది. ఎక్కువసేపు అతడికేసి చూస్తూంటే, ఒంట్లోంచి వణకు పుట్టుకొస్తుంది. అతడివైపు చూడవద్దని యెంత దృష్టి మరల్చుకున్నా, అటుతిరిగి యిటుతిరిగి, మళ్లీ అతడి మీదికే పోయి నిలబడుతుంది దృష్టి. చూపుమరల్చుకోలేదు.

గోపనచారిణి దొంగచూపులు ప్రెస్ యజమాని ఫటిక్‌గారి కంటపడ్డా యని వేరే చెప్పక్కరేదు. అతడది పైకి తెలియనీయ లేదు. పైకి ఉదాసీనభావం వ్యక్తంచేసేవాడు; కాని అతడి దొంగచూపులు, యెప్పుడూ సావధానంగా ఉండే దృష్టి - అందకత్తె అయిన కిశోరయువతి వైపే తిరిగి ఉండేవి. అది ఆమెకి తెలియకుండా ఉండలేదు.

ఒకరోజున అపరాహ్ణ సమయంలో ఉమ తన వీలునిబట్టి వచ్చి, తన చోటులో కూచుంది. హఠాత్తుగా ఫటిక్ తలెత్తిచూశాడు. ఆరోజున యెందువల్లనో వర్కర్లకి పెందరాడే వర్క్ అయిపోయింది. ఫటిక్ ఒక్కడే కూచుని లెక్కలేవో చూసుకుంటున్నట్టున్నాడు. వెనక్కితిరిగి కూచున్నప్పటికీ ఉమ చడీచప్పుడు కాకుండా రావటం యెలాగో గ్రహించి, హఠాత్తుగా తలపైకెత్తి చూసి, "అమ్మాయ్, మాట. మీ అమ్మ ఉన్నారా పైన ?" అని అడిగాడు.

ఉమ ఒక్కసారి తెల్లబోయింది. ఈ స్థితిలో యేంచెయ్యడం ? పారిపోవటం మంచిదో కాదో యేమీ తోచలేదు. అపరిచితుడైన పురుషుడితో మాట్లాడటం కచ్చితంగా మంచిది కాదు - అన్నది ఆమెకి బాగా తెలుసు. కాని ఆమె దొంగతనంగా చూడటం పట్టుపడిపోయింది. ఎదురుగా ఉన్న అతడిలా అడిగినప్పుడు సమాధానం చెప్పకపోవటం కూడా మర్యాదకాదు. ఇప్పుడేమిటి చెయ్యటం అన్నది అన్నివైపులనుంచి జాగ్రత్తగా ఆలోచించింది.

ఏంచెయ్యాలనేది సరిగ్గా తోచకపోవటంతో ఉమ యేం మాట్లాడకుండా మొద్దుబారిపోయినట్లు అతడికేసి చూస్తూ ఊరుకుంది. ఇంతలో మళ్లీ ఫటిక్ మాట్లాడాడు. అతడు ఒక్కచూపుతో- సిగ్గుతో తొట్రుపడుతున్న ఉమ ముఖం కేసి చూసి, విషయం గ్రహించాడు. "నేను ఓసారి నమస్కరించటానికి వస్తానని మీ అమ్మగారితో చెప్పు!"

ఇప్పుడు ఉమకి తప్పించుకునిపోయే వీలు దొరికింది. ఆమె పరుగు పరుగున పైకివెళ్లి రొప్పుకుంటూ "అమ్మా, ఆ అఫ్బాఫీసు ఆయన నీతో మాట్లాడాలట! నమస్కరించటానికి వస్తానన్నాడు" అని చెప్పింది.

రాసమణి కూతురి ముఖంకేసి తీక్ష్ణంగాచూసి "అతడు నీకెక్కడ కలిశాడు? నిన్నుపిలిచి చెప్పాడా?" అని అడిగింది.

ఉమ ముఖం యెర్రపడింది. ఆమె తప్పుచేసినదానిలా తలవంచుకుని ఉండిపోయింది.

"మెట్లమీదనుంచి వాళ్లగదికేసి తొంగిచూశా వనుకుంటాను. ఇంకెప్పుడూ అలాచెయ్యకు, తెలిసిందా? లేనిపోని నిందవస్తుంది - ఇహ లోపలికెళ్లు"

తర్వాత ఆమే బయటికివచ్చి, మెట్లదగ్గిర నిలబడి, "ఏమిటడిగావు బాబూ! పైకిరా" అని పిలిచింది.

ఆరోజున నెలచివరిరోజు. ఫటిక్ బొడ్డున సంచిలోంచి అద్దె ఇరవై రూపాయలు పైకితీసి, ఆమె పాదాలదగ్గిర ఉంచి నమస్కరించి, పాదధూళి తీసుకుని నాలికకు రాచుకున్నాడు.

రాసమణి కొంచెం తెల్లబోయింది "ఇంత తొందరేమొచ్చింది బాబూ? నిజానికి యింకా నెల పూర్తికానే లేదు."

"కాక పోనియ్‌లే అమ్మా! ఇవ్వాల్సింది ఇచ్చెయ్యకపోతే నాకు రాత్రి నిద్ర పట్టదు. కాని కేవలం యిందుకోసమే మిమ్మల్ని పిలవలేదు. చాలారోజులనుంచి మీకొక సంగతి చెపుదామనుకుంటున్నాను, ఇవాళ ధైర్యంచేసి -"

మధ్యలోనే ఆగిపోయాడు. రాసమణి ఉత్సుకతతో చూస్తూ ఉండి పోయింది – తక్కినమాట వినాలని ఆశతో.

"అమ్మా నేను మీ బిడ్డలాంటివాణ్ణి" అంటూ వినయంగా మొదలు పెట్టి "మీరు తప్పుగా భావించనంటే చెపుతాను" అన్నాడు ఫటిక్.

"చెప్పు బాబూ ! తప్పేముంది ?"

"అమ్మా ! మీ అమ్మాయి సంగతంతా విన్నాను. అత్తవారింటికెళ్లే దారి మూతపడింది. మీరు మాత్రం యెంతకాలం వుంటారు ? తర్వాత అమ్మాయిసంగతి యేమవుతుంది ?"

దురుసుతనమే, సందేహం లేదు. అయినా అతడు చెప్పేపద్ధతిలో ఒక ఆత్మీయత ఉంది. అందుకని రాసమణి దృష్టి తీక్ష్ణమైనా కంఠస్వరం కఠినం కాలేదు. కొంతవరకు సౌమ్యంగానే - "దాని అదృష్టం యెలా ఉంటే అలా అవుతుంది. అదీకాక యీసంగతులన్నీ బయటివాళ్లతో ఆలోచించ కుండా ఉండటమే మంచిది" అన్నది.

"అందుకనే ముందుగా అభయం తీసుకున్నాను. ఒక ప్రతిపాదన ఉండటంమూలంగానే ఈప్రసక్తి తీసుకొచ్చాను. ఆమెకేదైనా చేతిపని నేర్పించరాదూ ? దాంతో సంపాదించుకుని తినొచ్చు"

"ఏంపని ?" సందేహంలో పడింది రాసమణి.

"రబ్బరుస్టాంపులు చేసేపనే అనుకోండి. కొత్త పని యిది. ఇవి తయారు చెయ్యటం ఇంకా యెక్కువమంది నేర్చుకోలేదు. ఆర్డర్లు చాలా వస్తున్నాయి. ఆమెకనుక యింట్లో కూచుని, తయారుచేసి యిచ్చేట్లయితే - నేను పని, వాటి వెలకూడా యివ్వగలను"

"అది యెలా వీలవుతుంది బాబూ ?" రాసమణి దృఢకంఠంతో అడ్డుచెప్పింది - "ఉత్తమాటలు అనుకుని లాభ మేముంది ?"

"ఎందుకు వీలుండదమ్మా ? మీరు కూచుని ఉంటారు. మీ యెదురుగానే కూచుని, నేను ఆమెకి పనినేర్పుతాను. తర్వాత వాటిని తయారు చేసే సరంజామా అంతా ఆమెగదిలోనే ఉంటుంది. నేను పనిమాత్రం తీసు కొచ్చి యిస్తాను. ఆమె లోపలకూచుని పని చేస్తుంది. మంచి ఆదాయం వస్తుంది. చూడండి మీరు ?"

"ఇవాళంటే నువ్వు ఉన్నావు, తర్వాత పనియెవరు తెచ్చి యిస్తారు? యెవరునేర్పుతారు? ఇది వ్యాపారవిషయం. ఆడపిల్లలు వ్యాపారం చెయ్య గలరా? నువ్వు యివాళ ఉంటావు, రేపు ఉండవు"

రాసమణి స్పష్టంగానే చెప్పింది. అతడు తలవనితలంపుగా చెప్పినదానికి, ఆమెకి కొంచెం కోపం కూడా వచ్చింది.

ఫటిక్ విడిచిపెట్టే రకం కాదు. "నేను లేకపోవచ్చు. సులభంగా వచ్చే ఉపాయం చెప్పివెడతాను. తర్వాత నౌకరు ద్వారా కూడా చేయించవచ్చు. దానివల్ల కూడా కొంత మిగులుతుంది. అదీకాక పని నేర్చుకుని వుంటే తప్పేముంది?"

అయినా సందేహం యెలా తీరుతుంది? "ఇలాంటి పనులు ఆడవాళ్లు నేర్చుకుంటే లోకులేమంటారు?" అన్నది రాసమణి.

"లోకులకెందుకు తెలుస్తుందమ్మా? మీకు - మీ యీ సంతానానికి నాకుతప్ప యితరులకి తెలియాల్సిన అవసరమేముంది?"

"సరే, ఆలోచిస్తాను" ఇష్టం లేకపోయినా రాసమణి అనవలసి వచ్చింది - కొంతవరకు అతణ్ణి వదిలించుకోటం కోసమే.

కాని ఉమ చాటున ఉండి అంతావిన్నది. ఆమె పట్టుపట్టటం మొదలెట్టింది. "నేర్చుకోనియ్‌రాదమ్మా! అభ్యంతరం యేమిటి? నీయెదురుగానేగా నేర్చుకునేది. లోకులకెవరికి తెలుస్తుంది? తర్వాత యేమయినా నాలుగు డబ్బులు వస్తాయి".... వగైరా.

కొన్నాళ్లపాటు యెప్పుడూ ఒకేమాట విని విని, విసుగెత్తిపోయి "వద్దు. ఆలోచించి చూశాను. ఆ జంజాటం అంతా యేమీ అక్కర్లేదు" అన్నది రాసమణి.

## 2

పిపాసతో ఉన్న ఉమ అంతర్యం - ఫటిక్ ప్రస్తావనను తన శక్తికొద్దీ బలంగా పట్టుకుంది. ఇప్పుడు తల్లి నిషేధాజ్ఞమూలంగా ఆ అవలంబనం విరిగిపోయింది. ఇది ఆమె దృష్టికి పూర్తిగా అవివేచనగానే తోచింది. ఏం చేస్తుంది తాను? ఇప్పుడంటే అమ్మ ఉంది. తర్వాత? బిచ్చమెత్తుకుని తినాలి, లేకపోతే అక్కయింట్లో జీతం లేకుండా దాస్యవృత్తి చెయ్యాలి.

ఎందుకని? యెందుకని? స్వతంత్రంగా ఒకవృత్తిని ఆధారం చేసుకునే అధికారంనుంచి యెందుకు వంచితురాలు కావాలి?

ఆమె మనస్సులో ప్రబలమైన ఒక క్షోభ, విద్రోహం దుర్నివార్య మయాయి. కాని రాసమణి ముఖవైఖరి చూసి, ఆ విద్రోహాన్ని వ్యక్తం వెయ్యటం సాధ్యం కాలేదు. తల్లికి భయపడటం ఆమెకి అలవాటై స్వభావంగా పరిణమించింది. ఇప్పుడు దాన్ని మార్చుకోలేదు.

ఉమ రెండురోజులు సరిగ్గా అన్నం తినలేదు. తల్లితో మరీ అవసరమైతేతప్ప యేమీ మాట్లాడలేదు. అయితే దానివల్ల రాసమణిలో మార్పు యేమీ కన్పించలేదు. ఆమె నిశ్చింతగా తన పనులు తాను చేసుకో సాగింది. ఆమె ఈ పరివర్తనను గమనించకపోవటం కాదు. చనువు యివ్వతలచుకోలేదు. దీన్ని గురించి సాగతీస్తే చేదుగా పరిణమిస్తుందని ఆమెకి తెలుసు. ఆమె ఉమకి తెలియకుండా గట్టిగా ఒక కన్నేసి చూడసాగింది.

ఉమకూడా భయంతో కొన్నాళ్లు మెట్ల ప్రక్కకి వెళ్లలేదు. కాని పని, మనుషులతో సంబంధం లేకపోవటం క్రమంగా ఆమె కుతూహలాన్ని అణచలేకపోయింది. ఫటిక్ ఈమధ్య రాత్రిదాకా ఆఫీసులో ఒంటరిగా కూచుని ఉంటున్నాడు. ఏం పని చేస్తుంటాడో పైనుంచి తెలియదు. టేబిల్ ల్యాంప్ వెలుగుతూండటం మాత్రం కన్పిస్తూంటుంది. మధ్య మధ్య టక్‌టక్ మని యేదో చప్పుడవటం విన్పిస్తూంటుంది. అది రాసమణి గమనించింది. ఒకరోజున సాదిక్‌మియాని పిలిచి "బాబా! మీరు సాయంత్రం చీకటిపడకముందే వాళ్లు వెళ్లిపోతారని చెప్పారు. ఇప్పుడు చూస్తే రాత్రిళ్లు తొమ్మిది, పదిగంటలదాకా ఉంటున్నారు. ఆఫీసులో యేంచేస్తుంటారు?" అని అడిగింది.

సాదిక్ విస్మితు డయినాడు. "అయితే నేను కనుక్కుంటాను" అన్నాడు.

సంగతి తెలుసుకుని వచ్చి "అందరూ వెళ్లిపోతారు. ఒక్క ఫటిక్ మాత్రమే ఉంటాడు. అతడికి రబ్బరుస్టాంపుల పని యెక్కువయింది. అందుకని రాత్రివరకు తానే కూచుని చేస్తూంటాడు. అదీకాక ప్రెస్ వర్క్ అంతబాగా జరగటంలేదు. అందుకని తానే కొంచెం కొంచెం కంపోజింగ్ చేస్తూంటాడు. ఇంకో మనిషిని పెట్టుకోతలచుకోలేదు" అని చెప్పాడు.

"ప్రెస్ పరిస్థితి బాగాలేదా ? పని వస్తూనే ఉందిగా ! ఉన్న వర్కర్ల నెవర్నీ వెళ్లకొట్టలేదు. అంతేకాదు, తానుకూడా కొంతపని చేస్తున్నాడు. పరిస్థితి బాగా వుండాల్సిందే !"

అతడు మెదలకుండా ఊరుకున్నాడు. అద్దె కిచ్చాక యిలాంటి చిన్న విషయాలమీద వాదించుకోటానికి వీలుండదు. సాదిక్ మియాకి మాత్రం యేమిటవసరం ? అతడు అద్దెకి ఉండేవాళ్లని తెచ్చిపెట్టాడు, కాని అపకారం యేమీ చెయ్యలేదుగా ! అనవసరంగా అతణ్ణి రెచ్చకొట్టటం మంచిదికాదు.

కాని క్రమంగా ఫటిక్ అక్కడే ఉండటం యెక్కువయింది. ఒకొక రోజున పదికూడా దాటిపోయేది.

రాసమణికి సంజెపడగానే పూజ - అదీ ముగించుకుని కాసేపు పడుకోవటం అలవాటు. రాత్రి తొమ్మిదయాక లేచి కూతురికి భోజనం పెడుతుంది. ఒకొకరోజున తానుకూడా కాస్త తింటూంటుంది. తర్వాత తాపీగా పక్కవేసుకుని పడుకుంటుంది. ఈ సమయంలో ఆమె కింక నిద్రరాదు. రాత్రంతా అటుయిటు దొర్లుతూంటుంది. మధ్య మధ్య పెద్దనిట్టూర్పులు విడుస్తూంటుంది. ఒకొక్కప్పుడు పక్కమీద లేచి కూచుని జపం చేసుకుంటూంటుంది. బహుశా అందు కేనేమో ప్రొద్దుకూక గానే గాఢనిద్ర పడుతూంటుంది. ఉమకి ఇలాంటి అవకాశం మీద ప్రలోభాన్ని అణచుకోవటం కష్టమయింది. ఈమధ్య సాయంత్రమయాక దాసీ రావటంలేదు, పని తగ్గిపోయిందికదా అని. రాసమణి కొత్త యేర్పాటు చేసింది. ఇక్కడ కేవలం అన్నంకోసం పని చేస్తూంటుంది. సాయంత్రం పెందరాడే వెళ్లి పని చెయ్యటానికి మరోయిల్లు కుదుర్చుకుంది. అయిదుగంటలయేసరికి యిక్కడ పని పూర్తిచేసుకుని వెడుతుంది. మళ్లీ రాత్రి తొమ్మిదింటికి, ఒకొకరోజున తొమ్మిదిన్నరకి వస్తూంటుంది. ఉమ తల్లి పాతపుస్తకాలు ఒకొక్కటి యాభై అరవైసార్లు చదివేసింది. అవి యింక బాగుండటంలేదు. అప్పుడప్పుడు తాను స్వంతంగా కవిత్వం రాయటానికి ప్రయత్నిస్తూంటుంది. తక్కినప్పుడల్లా ఖాళీగా ఉన్న యింట్లో ఒకతే తిరుగుతూంటుంది.

అందుచేత -

దుర్లంఘ్యమయిన ప్రకృతి నియమానుసారంగా, ఉమ మెట్లమీది గూటిలోకి వచ్చి కూచోటం జరిగింది.

కిటికీ సందులోంచి చూపు సారించటంతో కన్పించిన దానికి ఉమ విస్మితురాలయింది. ఫటిక్ అలవాటు ప్రకారం స్టూల్‌మీదున్న క్యాష్ బాక్స్‌మీద చెయ్యి ఆనించుకుని మెదలకుండా కూచున్నాడు. ఇంతరాత్రి వరకు పనిలేకుండా కూచోటానికి కారణం యేమీలేదు. కాని పనేమీ చెయ్యటంలేదు. ఏదో యెవరికోసమో యెదురుచూస్తున్నట్లు ఊరికే కూచున్నాడు. అటువైపు తలుపుకూడా మూసిఉంది. గదిలో కూడా మరో ప్రాణి యెవరూలేరు. ఇది ఎవరికోసమో ప్రతీక్ష !

చాలాసేపు ఇరవై, ఇరవైఅయిదు నిమిషాలు యిలా గడిచింది. చివరికి కుతూహలం తీర్చుకోకుండానే ఉమ లేచి వెడదామనుకుంది. ఆసమయంలో యేదో పాముబుస సవ్వడిలా యెవరో 'అమ్మాయ్ మాట' అని పిలిచారు.

ఉమ ఉలిక్కిపడి కంపించింది.

ఎవరు ? ఎవరిదీ పిలుపు ? ఫటిక్ అలాగే అటువైపుతిరిగి కూచుని ఉన్నాడు. ఒక్కసారికూడా యిటు తిరగలేదు. కాని, మరి ఉమ అక్కడ ఉన్నట్టు అతడికెలా తెలిసింది ? అతడి గొంతులాగానే ఉంది.

ఇదేమయినా భూతమేమీ కాదు కదా !

నిమిషంలో ఆమెకి ముచ్చెమటలుపోశాయి. ఎండిపోయిన నాలికతో ఒకసారి పెదిమలు తడుముకోటానికి ప్రయత్నించింది. పాదాలు మొద్దుబారి నట్లయినాయి. కదలటానికి కూడా శక్తిలేదు. ఏదో భయంతో ఆమె నరాలన్నీ పట్టు తప్పాయి.

ఈసారి ఫటిక్ తిరిగి చూసాడు. స్టూల్‌మీది నుంచి లేచాడు.

"భయమెందుకు ? మాట"

ఉమ కింతసేపటికి మళ్లీ కాళ్లలో, చేతుల్లో చలనం యేర్పడినట్లయింది. ఆమె శక్తినంతా కూడకట్టుకుని లేచి, పై అంతస్తులోకి పరుగెత్తింది. చివరికి ఆఖరి అడుగువేశాక దమ్ముతీసుకోటానికి అక్కడ ఆగింది.

తనకేదో ఒక గండం గడిచిం దనుకుంది. కాని ఇదివరకెరుగని ఫటిక్ నిజస్వరూపం కన్పించింది. ఆ కొద్దినిమిషాల్లోనే సరీసృపంలా నిశ్శబ్దంగా - గబగబా అలాగే బుసకొడుతున్నట్టు - ఉమ యెదుటికి వచ్చేశాడు.

"ఎందుకు భయం? నేను నీకోసమే కూచున్నాను. రబ్బరు స్టాంపులు చేసే పని నేర్చుకుంటావా?" అని అడిగాడు.

"అమ్మ వద్దన్నదిగా!" ఉమ నత్తులు కొడుతూ, అతికష్టంమీద జవాబు చెప్పింది. ఆమె గొంతు తడి ఆరిపోయింది. భయంతో ఒళ్లంతా కంపించిపోతోంది.

"వాళ్లు పాతకాలపుమనుషులు. అన్నిటిలోనూ చెడునే ఊహిస్తారు. నిజానికి నువ్వేమీ అన్యాయం చెయ్యబోవటం లేదు. భయమెందుకు? ఆమె రోజూ ఈ సమయంలో నిద్రపోతూంటుంది. ఆ సమయంలో నువ్వు కొంచెం కొంచెం నేర్చుకోవచ్చు. ఇదొక విద్య. విద్య నేర్చుకుని ఉండటంలో తప్పేముంది?"

అయినా ఉమ వెనకా ముందాడింది.

"నీ స్థితి చూస్తూంటే విచారం కలుగుతోందమ్మాయీ! లేకపోతే నా కింత ఆరాటం యెందుకు? రోజూ ఇంత రాత్రిదాకా కూచుని యెదురు చూస్తున్నాను. నాలుగయిదు రోజులు పోగానే నువ్వు మళ్లీ మెట్లమీదకి వచ్చి కూచుంటావని తెలుసు."

"మీరెలా తెలుసుకున్నారు?"

కుతూహలమే యెక్కువయింది.

ఫటిక్ చిన్న నవ్వు నవ్వాడు. చీకట్లోకూడా అతడి పళ్లు కన్పించాయి. మంచిదృఢంగా ఉండే గట్టిపళ్లు. "రా, రా, వచ్చి పద్ధతి అంతా చూసి వెళ్లొచ్చు. ఈకొద్ది నిమిషాల్లో మీ అమ్మకేమీ తెలియదులే"

ఉమ యేదో అయిష్టంగానే కిందికి దిగి వచ్చింది. తాను యేమీ అన్యాయం చెయ్యటం లేదన్నది నిజం. అన్యాయం, పాపాలను గురించి ఆమెకి ఓ అభిప్రాయం లేదు. అయినా కాళ్లు రెండూ వణికాయి. ఒళ్లంతా చెమటలు పట్టాయి.

కాని ఫటిక్ కిది సహజమే అతడు చాలా మామూలుగానే మాట్లాడాడు. ఆమెకి రబ్బరు స్టాంపులు తయారుచేసే సరంజామా అంతా చూపించాడు. ఒక లైను తయారు చేసి కూడా చూపించాడు.

క్రమక్రమంగా ఉమకి భయంకూడా తగ్గింది. అయినా పైకి ఒక చెవి ఒగ్గే ఉంది.

కొంతసేపయాక "ఇంక పైకి వెళ్లు అమ్మాయ్. మీ అమ్మ బహుశా లేచి ఉండొచ్చు. దాసీ వచ్చే వేళకూడా అయింది'' అన్నాడు ఫటిక్. ఉమకూడా పారిపోయి బ తికిపోయింది. వెంటనే వీలయినంత త్వరగా చప్పుడు కాకుండా పైకి వెళ్లింది.

మర్నాడు ఉమ ఇహ మెట్ల వైపుకి వెళ్లలేదు. పైన వరాండాలోంచి ఫటిక్ గదిలో దీపం వెలుగు - ఫటిక్ ఆ రోజునకూడా తనకోసం యెదురు చూస్తున్నట్లు రుజువుచేస్తున్నా వెళ్లలేదు. 'ఇంక వద్దు. అమ్మవద్దు అని వారించి నప్పుడు, ఆ చిక్కుల్లోకిపోయి యిరుక్కోవాల్సిన అవసరంలేదు' అని మనస్సుని శాసించుకుంది.

కాని ఆ మరుసటిరోజున మళ్లీ యేదో ఆమెని ఆకర్షించసాగింది. తల్లి నిద్రపోయాకనే వచ్చి మెట్లమీద కూచుంది. ఫటిక్‌కూడా రెడీగానే ఉన్నాడు. తన గదిలోకి పిలిచి తీసువెళ్లాడు.

"ఇవాళ ఒక ఆర్డర్ ఉంది చూడు, దీన్ని తయారుచేయగలిగితే ఆ లాభాన్ని నీకే యిస్తాను'' అన్నాడు. కిందటిరోజున ఉమ యెందుకు రాలేదు అన్న ప్రశ్న అనవసరం. ఆసూచన కూడా వ్యక్తం కానీయలేదు.

ఆపని కష్టమేమీ కాదు. ఉమ కొద్దిశ్రమతో తయారుచేయగలిగింది. 'ఆర్డరీ' స్టాంపు కూడా తయారు చేసి, కాగితంమీద అద్ది తన కీర్తివైపు సగర్వంగా చూసుకుంది.

ఫటిక్ వహ్వా అని మెచ్చుకొన్నాడు. "నీది మంచి తెలివైన బుర్ర. నేను కూడా యింత త్వరగా నేర్చుకోలేకపోయాను"

మర్నాడు ఫటిక్ మూడణాల కానీ యించుమించు బలవంతంగా ఆమె చేతిలో పెట్టాడు. నీ వస్తువు అమ్మితే యీలాభం వచ్చింది. తీసుకోక పోతే యెలా ?''

ఉమ సిగ్గుతో, సంకోచంతో తల నేలకేసి కొట్టుకున్నట్లయి "నేను - నేను యీడబ్బు తీసుకుని యేం చెయ్యను ? అమ్మ తిడుతుంది'' అన్నది.

"కూడపెట్టుకో. అమ్మతో యిప్పుడు చెప్పాల్సిన అవసరమేముంది ? ఇంకా కొంచెం కూడబెట్టాక ఆమె చేతికియ్యి. ఒక్కసారి గతుక్కు మంటుంది."

ఆ రోజున కూడా ఉమ ఒక స్టాంపు స్వయంగా తయారుచేసింది. టేబిల్ ల్యాంప్ వెలుతురులో వంగి పని చేస్తోంది. ఫటిక్ ప్రక్కనే నుంచుని సలహా లిస్తున్నాడు. అతడి నిట్టూర్పు ఉమ చెంపకు వచ్చి తగుల్తోంది. ఆమె నుదుటిమీది చెమట బిందువులు ఆవెలుగులో తళతళ మెరుస్తున్నాయి. ఫటిక్ అలాగే చూస్తున్నాడు.

ఆ రోజున సరంజామా అంతా సర్ది ఉమ ప్రక్కన పెట్టింది. 'ఇహ నేను వెడతాను' అని లేచి నిలబడింది. ఫటిక్ హఠాత్తుగా ఆమె చెయ్యి నొక్కిపట్టుకున్నాడు. ఉమ భయంతో గతుక్కుమన్నది. ఏదో భయవిహ్వలమైన దృష్టితో చూస్తూ ఉండిపోయింది. ఫటిక్ కళ్లమీద దృష్టి పడటంతో చెయ్యి గట్టిగా పట్టుకోటంతో యింక లాక్కోలేకపోయింది. విహ్వలదృష్టితో అలాగే నుంచుండిపోయింది.

ఫటిక్‌ది పాముచూపులా స్థిరమైన దృష్టి - గారడీ లాగా అమోఘమైన ఆకర్షణ.

ఫటిక్ ఉమని చెయ్యి పట్టుకుని, ఇంకొంచెం దగ్గిరకు లాక్కుని 'మాట, ఇంకాసేపుండి వెళ్లు' అని పాముబుసలాగా ఘసపుసలాడాడు.

## 3

హఠాత్తుగా పైనుంచి 'ఉమా !' అని రాసమణి తీక్ష్ణమైన పిలుపు ఉమ చెవిని పడింది.

పాముపడగ నిమిషంలో ముడుచుకుంది. ఉమకి కూడా చైతన్యం తిరిగి వచ్చినట్లయింది. చెదిరిపోయిన చైతన్యాన్ని, విహ్వలతను శక్తి కొద్దీ కూడ తీసుకుని, ఒక్కపరుగుతో పైకి వెళ్లింది.

రాసమణి ఒక్కక్షణం యేం మాట్లాడకుండా ఆమెకేసి చూసి - "ఏం చేస్తున్నావ్ కింద ?" అని అడిగింది.

ఉమకి ఒళ్లంతా కంపించిపోతోంది. గొంతు పెకిలి మాటకూడా రాలేదు. ఆమె కేవలం నిస్సహాయురాలిలాగా, దీనంగా తల్లి వైపు చూసింది.

"నువ్వు వాళ్ళ అబ్బాఫీసులోకి ఇంత రాత్రివేళ ఒక్కతెవూ వెళ్లావా ?" అణచుకున్న కంఠంతో రాసమణి గద్దించింది.

"అతడు - అతడు పిలిచాడు - పని నేర్పుతానని" నత్తులు కొడుతూ గుటకలు మింగుతూ అన్నది ఉమ.

"పిలిచాడు కదా అని వెళ్లావా ? నువ్వేం పాలుతాగే పసిపిల్లవా ? నేను అవి అన్నీ వీల్లేదని చెప్పానా ! వయసులోఉన్న ఆడపిల్లవి, ఇంత రాత్రివేళ యెద్దంతమగాడితో, యెవరూలేని గదిలో మాట్లాడటం ఇరుగుపొరుగువారి కెవరికైనా తెలిస్తే, రేపు నలుగురిలో నేను ముఖం యెలా చూపించను ?"

తర్వాత కొంచెం దమ్ము తీసుకొని, "రాత బావుండనివాళ్ళ బుద్ధి కూడా అలాగే ఉంటుంది. నువ్వు దేనివల్ల యేం జరుగుతుందో తెలియని పసిపిల్లవు కావు. నాకంటె – మూర్ఖుడైన ఆ ప్రెస్ యజమానే నీకు ఆత్మీయుడన్న మాట ! అవునా ? అందుకనే నేను వారించినాకూడా అతడి దగ్గిర కెళ్లావు! పెళ్లి అయింతర్వాత మొగుడు తీసుకెళ్లని ఆడది, సిగ్గుతో తల నేలకేసి కొట్టుకోవాలి. నువ్వు కనుక లోకానికి ముఖం చూపిస్తున్నావ్. మరో ఆడదయితే కంఠానికి ఉరిపోసుకునేది. సిగ్గు - శరం లేనిదాని వెక్కడో !" అన్నది.

రాసమణి కోపం తగ్గలేదు. పిచ్చిదానిలా అరిచింది. గొంతుస్థాయి పెంచకూడదన్న జ్ఞానం మాత్రం ఉంది. కాని అణచుకున్న కంఠగర్జన లోంచి బాణాల్లా దూసుకువస్తున్న మాటలు గుండెల్ని గుచ్చుకుని గాయపరిచాయి. ఆ గాయాల మీద కారం చల్లినట్లుంది ఆమాటల భాష.

ఉమకూడా యేమయినా అనతలచుకుంటే లేకపోలేదు. తనని అలాంటి ఇంట్లో ఇచ్చి చెయ్యటం - అది తనతప్పు కాదు. తాను కావాలని కోరి యీ పెళ్లి చేసుకోలేదు. పోనీ తన తప్పువల్ల వెళ్లకొట్టబడలేదు. అలాంటప్పుడు - ఆ మాట యెత్తి పొడుస్తూ తిట్టటంతో సమంజసమేముంది ? కాని తల్లి రుద్రరూపం యెదురుగా నిలబడి యే మాటా అనలేకపోయింది. ఊరికే తల వంచుకుని నిలబడిపోయింది. అంతే !

రాసమణి మరి కొంతసేపు కూతుర్ని తిట్టి, తర్వాత ఆత్రంగా మెట్లు దిగి, ఉమ కూచుని చూసే మెట్లమీద నుంచుని 'ఫటిక్' అని కేకేసింది.

ఫటిక్ చాలా ముందుగానే వెళ్లిపోయి ఉండాల్సింది. కాని పైన వ్యవహారం యెంతవరకు వెడుతుందో అన్న కుతూహలాన్ని అణచుకోలేక పోవటంతో, కిటికీ ప్రక్కనే నుంచుని ఉన్నాడు. అంతే కాదు. గదిలో లైటు కూడా ఆర్పెయ్యలేదు. కనుక తన ఉనికిని ఒప్పుకోకుండా ఉండలేక పోయాడు. అటువైపు గుమ్మంలోంచి తిరిగివచ్చి నిరీహుడైన మంచి మనిషిలాగా "పిలిచారా అమ్మా !" అని నిలబడ్డాడు.

ఆమె ముఖంలో దృఢమైన నిర్ణయం తీసుకున్న వైఖరి- అంటే అతడు తనని తిరస్కరించినా తానూ విడిచిపెట్టదు. అన్నిరకాల యుద్ధానికి ఆమె సన్నద్ధమయే ఉంది.

కాని రాసమణి ఆ దారిన వెళ్లలేదు. "నేను నలభైయెనిమిది గంటల వ్యవధి యిస్తున్నాను. ఈ లోపుగా నువ్వు ప్రెస్ తీసుకుని వెళ్లిపోవాలి. అద్దెకి ఉండనివ్వటాని కింక నాకు వీలుపడదు" అని మాత్రం చెప్పింది.

బహుశా ఫటిక్ ఇందుకు సిద్ధంగా లేనట్లుంది. సమాధానం చెప్ప టానికి అతడికి ఒక నిమిషం పట్టింది. ఆ మాట చెప్పినప్పుడు కూడా అతడి కంఠంలో అంత దృఢత్వం వ్యక్తం కాలేదు. "చిత్తం, అద్దె కివ్వ టానికి తీసుకోటానికికూడా ఒక చట్టమనేది ఉంది. ఇరుపక్షాలవారు పదిహేనురోజుల నోటీసు యివ్వాలి."

రాసమణి అతణ్ణి ఆపి "చట్టాలూ కోర్టులూ నాకు తెలియదు. నేనలాచెయ్యను కూడా. నలభై యెనిమిది గంటలు చూస్తాను. తర్వాత నేనే నీ ప్రెస్సుసామాన్లు అన్నీ తీసి వీధిలో పారేస్తాను. నీకు సత్తా ఉంటే అడ్డుపడు. పోలీసు రిపోర్టు యివ్వాలనుకున్నా, కోర్టులో కేసుపెట్టాలను కున్నా అవన్నీ నువ్వే చేసుకో" అన్నది.

ఆమె ఈ మాట చెప్పి, వాదోపవాదాలకు వ్యవధి యివ్వకుండా మెట్లెక్కి పైకి వెళ్లిపోయింది.

ఉమ ఆ రాత్రి యేమీ తినలేదు. నిద్ర కూడా పోలేకపోయింది. తాను యెక్కడ యేం తప్పు చేసిందో యెంత ప్రయత్నించినా తెలుసుకోలేక పోయింది. ఫటిక్ దగ్గిర నేర్చుకోవద్దని వారించడం కూడా అన్యాయం గానే భావించింది. ఇవాళ తన నలా తిట్టటంకూడా అనుచితంగానే తోచింది. అయితే - మనస్సు అవచేతనస్థితితో ఇంతకు ముందు ఫటిక్ ఆచరణను కలిపి చూస్తే, తల్లి నిషేధాజ్ఞ, ఆమె భయం

లోనూ గల యాథార్థ్యాన్ని ఆమె అంగీకరించక తప్పలేదు. అయితే తగిలిన దెబ్బ బాధకూడా తక్కువదేమీ కాదు. మాటనేది యెంత వాడిబాణంలా గుచ్చుకుంటుందో, ఉమ కివాళ మొదటిసారిగా తెలిసివచ్చింది. అత్తగారి తిరస్కారానికి కారణాలు వొట్టి అబద్ధాలని యెంత దుఃఖించినా ఇంత దెబ్బ తగల్లేదు. వాక్బాణం అనే మాటలోని అర్థాన్ని యివాళ తెలుసుకుంది.

ఉమ గుండెల్ని మెలిపెట్టే దుఃఖంలోని తొలి తీవ్రతతో విలవిల్లాడి పోయి, 'అమ్మమాటే వింటాను. కంఠానికి ఉరి పోసుకుంటాను' అని పదే పదే అనుకోసాగింది. తల్లి అకారణంగా తనను ఆఘాతపరచి నందుకు అమ్మమీద ప్రతీకారం తీర్చుకుంటుంది. ఏం? ఎందుకోసం అనాలి యిన్ని మాటలు? తనలాంటి యువతి యేకాకిజీవితం గడుపు తోం దన్నసంగతి ఆమె యెప్పుడైనా ఆలోచించిందా? ఒకవేళ ఆమె ఫటిక్ డబ్బు సంపాదన ప్రస్తావనకి ప్రలోభపడినా, ఆమె యేమీ అన్యాయం చెయ్యలేదు. ఫటిక్ మంచివాడు కాదని కూడా తెలుసు. అయినా ఆమె తన వైపునుంచికూడా ఆలోచిస్తే బాగుండేది. ఉమకూడా పశ్చాత్తాప పడింది.

కాని -

రాసమణి అన్న ఒకమాట ఆమెని అన్నిటికంటె ఆఘాతపరిచింది. నిన్ను అత్తగారింటికి పంపటమే మంచిదని యిప్పుడు తెలుసుకున్నా. దుష్టురాలయిన అత్తగారిచేత దెబ్బలు తింటూ, నువ్వు చాకిరితో హూనం హూనం కావడమే అవసరం. అప్పుడు తిన్నగా ఉండేదానివి.

ఈశ్వరుడు తనకింత శిక్ష విధించటానికి - నిజంగా తానింత చెడ్డదా? అదేనా తన యథార్థమైన స్థానం! ఇంతకంటే చావే మేలు.

అదృష్టపు అన్యాయానికి విరుద్ధంగా మనస్సు, మెదడు కర్కశమై పోయి, అస్తిత్వమే ముక్కలైపోయినట్లుంది. మనస్సులోని వేదనంతా కన్నీళ్లుగా మారి తలగడ తడిసి ముద్దయిపోయింది. అయినా ఉమ చావ తలచుకోలేదు. ఆమె జీవితాన్ని త్యజించతలచుకోలేదు.

హేమ సంగతి తలపుకి వచ్చింది. శ్యామ పసివాణ్ణయినా వదలి వెళ్లినటయితే?

తాను ఎలా బతుకుతుంది? యెలా బతుకుతుంది?

# ఏడవ పరిచ్ఛేదం

## 1

పెద్ద భవంతి. ఒక వైపునంతా ప్రధానగృహానికి వేరుగా కొంత వరకు బయటికి దేవమందిరం. దాని వెనకాల చిన్న యిల్లు. నరేన్ అక్కడికే శ్యామని తీసుకొచ్చి దింపాడు. "మంచి యిల్లు. మొత్తానికి పక్కాగా ఉందికదూ యిల్లు?"

"ఇల్లు పక్కాగానే ఉంది నిజమే. కాని యిదేం యిల్లు?"

దక్షిణం వైపున దేవమందిరం. కనుక తూర్పువైపు అంతా మూసి ఉంటుంది. తూర్పువైపున కిటికీ యేదీ లేదు. పడమటి వైపున మాత్రం ఒక కిటికీ ఉంది. ఉత్తరం వైపున వీధి గుమ్మం. ఒక కిటికీ. పెద్ద లావుగా ఉండే యిటికెలతో కట్టినది. చాలాకాలంగా నిర్లక్ష్యంగా వదిలెయ్యటంవల్ల లోపలంతా చవుడురికి ఉంది, చీకటి గుయ్యారం. కిందంతా చిత్తడిగా ఉన్నా, లోపల యేదో ఆవిర్లు వస్తున్నట్లుంది. కాసేపు నుంచునేసరికి శ్యామకి గుండె ఆగిపోయిన ట్లనిపించింది. ఆమె యెలాగో గుమ్మం దగ్గిరకొచ్చి నుంచుని ఊపిరి పీల్చుకోటానికి ప్రయత్నించింది. "ఇక్కడ నా పిల్ల లెలా ఉంటారండీ?" అన్నమాట ఆమె కంఠంలోంచి ఆర్తనాదంలా వెలువడింది.

"ఆఁ. ఆఁ. యెలా ఉంటారు? నవాబుకూతురి కొడుకుకోసం, కూతురుకోసం రాజప్రాసాదం కావాలి. ఊరికే పెద్ద పెద్ద బడాయిలకు పోకు. ముందుగానే చెపుతున్నా", అన్నాడు నరేన్.

హేమ కూడా యింట్లోకి రాగానే యేదో మొద్దుబారిన ట్లయిపోయి చూస్తూ నుంచున్నాడు. నరేన్ దృష్టి వాడిమీద పడింది. చెంపమీద ఒక్కటి చాచికొట్టి, "ఏమిట్రా చూస్తున్నావ్ వెధవా! ఇక్కడికి తీసుకొచ్చాను. ఇక్కడే ఉండాలి. అబ్బ స్థితిగతులకు తగినట్లే ఉండాలి. ఇక్కడ నీ నవాబుగిరీ సాగదు" అన్నాడు.

రెండేళ్ల పసివాడు. ఆ మాటల్లో ఒక్కటీ అర్థం చేసుకోలేదు. నొప్పితో ఊరికే వెక్కి వెక్కి యేడవటం మొదలెట్టాడు. వాడి చెంప మీద అయిదు వేళ్లూ తేలాయి. శ్యామ గబగబ వెళ్లి, వాణ్ణి యెత్తుకుంది.

"ఆc. సరే. మూటలూ గీటలూ విప్పి చూస్తా. ఇదిగో, వంటిల్లూ అదీ యెటువైపు ఉందో, పొయ్యీ - గియ్యీ ఉన్నాయో లేవో చూడు. లేకపోతే నాలుగు పుల్లలవీ పోగుచేసి, ముట్టించి, ఆ మంటమీద ఈపూట కిన్నిబియ్యం, పప్పూ ఉడికించు. ప్రొద్దుకూకటాని కెంతోసేపు లేదు. దీపం అదీ యెక్కడో యేమిటో - అవి అన్నీ నేనిప్పుడు వెతుకుతూ తిరగలేను."

అంటే - నిర్జనంగా ఉన్న యీ అడవిలో రాత్రి చీకట్లోనే ఉండా లన్న మాట. ఈ మందిరం నాలుగు వైపులా పెద్దతోట. అటువైపు యెక్కడో చెరువుకూడా ఉంది. ఇక్కడ ఒత్తుగా ఉన్న పెద్ద పెద్ద చెట్లు ఒకదానికొకటి రాచుకుంటూంటాయి. ఇక్కడున్న పనస, మామిడి నేరేడుచెట్లు అపరాహ్ణవేళకే సూర్యుణ్ణి కప్పివేస్తూంటాయి. సందె పడితే యింకెలా ఉంటుందో!

శ్యామకి పిల్లల్ని తీసుకుని, ఈ రాక్షసుడి చేతిలోంచి, ఇంకెక్కడి కైనా సరే పారిపోదామా అనిపించింది. కాని యెక్కడికని వెడుతుంది? విధి చేతిలోంచి తప్పించుకు వెళ్లటం సాధ్యం కాదు. ఆమె అలాగే కొయ్యబారిపోయి నుంచుని ఉండటం చూసి, నరేన్ మరొకసారి గట్టిగా గద్దించ బోయాడు. ఇంతలో తోటలో అటు మధ్యనుంచి ఒక లావుపాటి స్త్రీ వచ్చి పడటంతో అతడి క్రుద్ధకంఠస్వరం టక్కన ఆగిపోయింది.

"మా కొత్తబాపనమ్మ యెలా వుందో ఒకసారి చూస్తా. అరె! ఈవిడ మరీ చిన్నపిల్లే. మా పింట్‌కీకంటె కూడా చిన్నది. అయితే అమ్మాయ్! ప్రణామం (పాదాభివందనం) చెయ్యనమ్మా! అశుభం కలుగు తుంది. ఇక్కడినుంచే చేతులెత్తి యిలా - " ఆమె బాగా వంగి చేతులెత్తి దణ్ణం పెట్టింది.

శ్యామ కేదో చీకట్లో ఒడ్డు దొరికినట్లయింది. ఆమె వస్తుతః మొహ మోటస్తురాలు. కాని హఠాత్తుగా యిలా అగాధంలో పడటంలో ఆమె నోరు విప్పింది. ఆమెకూడా దగ్గరకు వచ్చి నమస్కారం చేసి "నేను కూడా మీకు మరో కూతురినేనమ్మా" అన్నది.

"వాహ్! భేష్ భేష్.... ఎంత తియ్యగా మాట్లాడతావ్ నువ్వు? ఎందుకు మాట్లాడలేవు? ఏమయినా పట్నం పిల్లవిగా! ఈ పల్లెటూరి మాటలు తగలడ! నేను కలకత్తాలో పుట్టినదాన్నేనమ్మా! నా పెళ్లయి

ఇరవైఆరేళ్ళయినా, ఇంకా యిక్కడి మాటలు అలవాటు కాలేదు. ఏదో ఫెళ్లమన్నట్టు తగులుతాయి''

ఆమె శ్యామని త్రోసుకుంటూనే లోపలికొచ్చి నిలబడింది. ''అయ్యో ఇంకా మూటలూ అవీ యేవీ విప్పనే లేదా? రా, అమ్మాయ్, నువ్వుకూడా కాస్త ఒకచెయ్యి వెయ్యి, నేను నీ సంసారమంతా సర్దిపెట్టి వెడతాను.''

శ్యామ సాయం చెయ్యాల్సిన అవసరం లేకపోయింది. సర్కార్ గారి భార్యే అన్నీ స్వయంగా సర్దిపెట్టింది. సామానులన్నీ గోడకి ఉన్న అల్మరాలో సర్దుతూ - ''మీ అమ్మ చూస్తే కాపురానికి కావల్సినవన్నీ పంపినట్లే ఉంది. ఆవిడ అన్నీ బాగా తెలిసిన మనిషే. ఒప్పుకోక తప్పదు. అయినా ఒకమాట అడుగుతా నమ్మాయ్ యేమీ అనుకోవద్దు. అనుకుంటేమాత్రం యేంలే? నా తల తీసేస్తావా? మీ అమ్మకింత స్థితీ, స్తోమత వున్నాయి. మీరుకూడా దొరసానుల్లా చదువుకున్నవాళ్లని విన్నాను. కాని ఆమె కిదేం బుద్ధి? అన్నీ తెలిసితెలిసి, నిన్ను ఇలాంటి జంతువు కిచ్చి చేసింది యెందుకని?'' అని అడిగింది.

నరేన్ మూట విప్పి, ఒకమూల చిలుంగొట్టంలో పొగాకు కూరు కుంటున్నాడు. చటుక్కున అతడి చెయ్యి ఆగిపోయింది. ఒకసారి పళ్లు పటపట కొరికాడు. కాని యజమానిభార్య, యేమనటానికి ధైర్యంలేక పోయింది. శ్యామ యేం సమాధానం చెపుతుందో విందామని చెవిమాత్రం ఒగ్గి ఊరుకున్నాడు.

ఆ మాటకి సమాధానం చెప్పటం శ్యామకి సాధ్యంకాలేదు. ఆ మాటని తప్పిస్తూ - ''దీపాలకి కావల్సినవేవీ వెంటతెచ్చుకోలేదు, యెలా అమ్మా?'' అన్నది.

''దానికేముందిలే అమ్మాయ్! ఈపూటకి ప్రమిదలో పత్తి నూనె వేసి పంపుతాను. రేపు బజారునుంచి కిర్సనాయిల్ తెప్పించుకో. ఇహ వంటింట్లోకి పద. పొయ్యి - అదీ వేయించాను. కట్టెపుల్లలవీ సిద్ధంగానే ఉన్నాయి. చీరె ఉతుక్కుని వచ్చి, అన్నం పొయ్యిమీద యెక్కించు. మా యీ తోటలోనే ఉంది చెరువు. స్వచ్ఛమైన నీళ్లు. మేమందరం ఆ నీళ్లే తాగుతాం''

వారి యింటిపక్కనే మంచి పెద్ద పూరియిల్లు. మట్టిగోడలు, కింద గచ్చు చేయని మట్టినేల. వసారాలో ఒకపొయ్యి, లోపలయింట్లో ఇంకోపొయ్యివేసే

ఉన్నాయి. నిజంగానే యింటావిడ అన్ని యేర్పాట్లూ చేయించే ఉంచింది. లోపల ఒక గడమంచెకూడా ఉంది. సామాన్లూ అవీ పెట్టుకోటానికి.

సర్కారుగారిభార్య శ్యామను వెంటపెట్టుకుని చెరువుకి వెళ్లింది. చాలా పెద్దచెరువు. కాని నాలుగు వైపులా పెద్దచెట్లు ఉండటం మూలంగా నీళ్లు చాలా నల్లగా కన్పిస్తాయి. రాళ్లతో కట్టినరేవు ఉంది. కాని ఇటికలతో కట్టిన మెట్లు బాగా పాకుడుపట్టి ఉన్నాయి, జారింది కూడా.

"దిగటానికి భయమేస్తోందా ? ఇదిగో, నాచెయ్యి పట్టుకుని దిగు. ఈత రాదనుకుంటాను. మా పింట్‌కి రానియ్, ఒక్కరోజులో ఈతనేర్పుతుంది"

"ఆమె యెక్కడి కెళ్లింది ?"

"ఆఁ, నా పిల్లలెవరూ లేరిక్కడ. అందరూ మేనమామఇంటి కెళ్లారు. నామరిది పిల్లలతో కలసి, నా అన్నకొడుకు దగ్గిరకు"

"మరి మీరు వెళ్లలేదేం ?"

"సరెలే, మంచిదానివే" ఆమె తెలివితక్కువకి కొంచెం చిరాకు కలిగి నట్లుంది. "నాయిల్లు, సంసారం యెవరు చూస్తారు ? రోజులుచూస్తే యిలా ఉన్నాయి ! మాది యెంత వాసికెక్కిన కుటుంబం ! బోలెడు సామానులున్న యిల్లు. ఇల్లంతా కొల్లగొడతారు. ఇంకేమన్నాఉందా ? మావారు ఉన్నా రనుకో, అయినా రాత్రిళ్ల నిద్రపట్టదు. చిటుక్కుమని కాస్త చప్పుడయిందంటే చాలు, లేచి కూచుంటాను బాధ్యతేం మాటలా ?"

తర్వాత ఆమె ప్రసంగం మార్చి "నీపిల్లలు అంచక్కగా తెల్లగా ఉంటారు. పేర్లేం పెట్టావ్ ?" అని అడిగింది.

శ్యామ ఆమె పెద్దగొంతుకి భయపడింది. ఇప్పుడు ఒక్కసారి నిట్టూర్చి "అబ్బాయి పేరు హేమచంద్ర. అమ్మాయి పేరు మహాశ్వేత" అని చెప్పింది.

"అమ్మో ! ఇవి చాలా గొప్పపేర్లు. పిలవటం యేమని పిలుస్తావ్ ?"

"అబ్బాయిని హేమ అని పిలుస్తాను. అమ్మాయిని మహా అని పిలుస్తాను."

"అవన్నీ ఆడంబరమైన పేర్లు. నాకు - మా పిల్లలకి యెప్పుడూ తేలి కగా పిలిచేపేర్లు కాకపోతే పిలుపులో తృప్తి ఉండదు. అందుకని చూడు.

మగపిల్లలకి గుయే, హేగో, హాబ్‌లా అని పేర్లు పెట్టాను. ఆడపిల్లల పేర్లు ఫూంటీ, బూంచీ. ఆయన వన్నీ హెచ్చులు. నేను పెట్టిన పేరు ఫూంటీ అయితే, ఆయన దాన్ని పింట్‌కీగా మార్చారు. పైగా ఆయనగారికి యెంత అతిగారాబమో తెలుసా ? ఆఫీసునుంచి వచ్చి, ఆ దుస్తులు విడవకుండానే ఆయన కూతుర్ని ముద్దాడుతూ - 'పింట్‌కీ ఇలారా. లేకపోతే నీకు చావు మూడింది చెపుతున్నా' అనేవారు. నేను మొదట్లో తిట్టేదాన్ని. ఒక రోజున తల్లీతండ్రి పిల్లల్ని చావు అంటే ఆయుస్సు పెరుగుతుందని నచ్చచెప్పారు. అప్పటినుంచి నేనేమీ అనటంలా'' అని సర్కార్‌గారి భార్య తాంబూలం అలవాటు మూలంగా గారపట్టిన పళ్లు బయటపెట్టి, తనకి తానే పగలబడి నవ్వింది.

శ్యామకి అప్పటికి బట్టలు ఉతుక్కోటం అయింది. ఇంటికి తిరిగి వెడు తూండగా "అన్నట్టు - నీపేరేమిటమ్మా ? అడగనేలేదు'' అన్నది సర్కార్‌గారి భార్య.

"నాపేరు శ్యామ''

"అదీ మళ్లీ గొప్పపేరే, మామూలు పేరుకాదు''

"అలా అనుకుని పెట్టలా. ఆమె కిష్టమయింది పెట్టింది''

''వాహ్, భేష్, నువ్వు చక్కగా మాట్లాడతావు. ఒప్పుకుని తీరాలి. ఎందుకు మాట్లాడవు ? చదువుకున్న ఆడపిల్లవికదా ! నేనూ దత్తువంశానికి చెందిన ఆడపడుచునే. అప్పుడు ఆడపిల్లలు చదువుకోటమనేది ఉండేదికాదు. ఇప్పుడు భూదేవ్ మాష్టారుగారి వర్గం ఆడపిల్లలు చదువుకు తీరాలి అని బాగా ప్రచారంచేస్తున్నారుట ! కాలం మారుతున్నకొద్దీ యెన్నో వింతలు జరుగు తున్నాయి. నాపేరు 'మంగళ' అమ్మాయీ ! మావి అన్నీ పాతకాలపు పేర్లు. ఆ కాలంలో ఇలాంటి పేరే పెట్టేవారు. చూడు, దత్తువంశానికి చెందిన ఆడపడు చుని, సర్కార్ వంశానికి కోడలి నయాను. వీరిది మాదగ్గిరపనిచేసే నౌకర్ల వంశం. అయితే యేం - ఈరోజుల్లో డబ్బున్నవారిదేగా గొప్ప. వీరి యింట్లో లక్ష్మి కట్టిపడేసినట్లు ఉంటోంది. ఎక్కడైనా డబ్బుకేగా గౌరవం. వీరి తాత ఒకప్పుడు మాపుట్టింట్లో అయిదురూపాయల జీతానికి పనిచేసేవారు. మా దయాదాక్షిణ్యాల వల్లనే డబ్బునేది చూడగలిగారు. అయితే యేం ? -

సిరి సంపదలు కోల్పోయిన తమ వంశగౌరవం గుర్తుకిరావటం వల్లనే అయి ఉంటుంది – సర్కారుగారి భార్య పెద్దనిట్టూర్పు విడిచింది.

## 2

రాసమణి యిస్తే తెచ్చుకున్న బియ్యం, పప్పులు మొదలైన వాటితో కొన్నాళ్లు గడిచాయి. అయినా శ్యామ తనభర్త నిర్లక్ష్యవైఖరిచూసి ఉద్విగ్నురాలయింది. నిత్యనైవేద్యానికని రోజూ అర్ధశేరుబియ్యం, నియమంగా కొలిచియిచ్చే యేర్పాటు. వాటితో యేవిధంగానూ వారికి రెండు పూటలా గడవదు. నరేన్‌కి సహజంగా అన్నం యెక్కువతినే అలవాటు. అయితే యెప్పుడూ కొలతప్రకారం చూడకపోయినా, అతడు ఒకొక్కప్పుడు శేరుకంటే యెక్కువ తింటాడని శ్యామనమ్మకం. ఇక్కడ నిశ్చింతగా ఉండటంవల్ల కలిగే పరిణామం నిశ్చయంగా ఉపోషాలే. శ్యామ బిడ్డల ముఖాలుచూసే, గుండెధైర్యం తెచ్చుకుని, భర్తతో - "ఏమండీ? యేం చేస్తున్నారు? మాఅమ్మ యిచ్చినవన్నీ అయిపోవస్తున్నాయి, తర్వాత?" అని అడిగింది.

"సరెలే. మీ అమ్మయివ్వటం సంగతి అలాపెట్టు. ఆమె యిచ్చిన ముష్టిగింజలమీద ఆధారపడే నేనిక్కడికి సంసారాన్ని తీసుకొచ్చాననుకున్నావా?" అని యెగిరిపడ్డాడు నరేన్.

"అలాఅని తీసుకుని రాలేనుదనుకోండి, కాని యిహనుంచి జరగడమెలా?"

"ఏం? ఇన్నాళ్లనుంచి వస్తున్న నైవేద్యంబియ్యం నిలవచెయ్యలేదా?"

"చేసినవి మాత్రం యెన్నాళ్లని వస్తాయ్? నిల్వచెయ్యటానికి మాత్రం అవి యెన్ని? తడుపుడు బియ్యమని రోజూ రాత్రిళ్లు అవే వండుతున్నా, తింటున్నా తెలియటంలేదా?"

"ఏం? అవి వంటకెందుకు పనికిరావు చెప్పు. ఎండబెడితే పనికి రావా?"

"మీమాటే యెప్పుడూ మీకు. వాటిని యెండపెట్టి ఉంచితే చప్పన అయిపోతాయి. అదీకాక రెండుపూటలా అలాంటిబియ్యం తింటే అజీర్ణం పట్టుకుంటుందండీ."

"హూఁ" అని కాసేపు మూతిబిగించుకుని ఊరుకుని, "నైవేద్యం కింద వచ్చిన బియ్యమన్నీ కడుపునిండా మెక్కికూచున్నావా?" అన్నాడు. ఆ

అభాండానికి శ్యామకి కళ్లనిండా నీళ్లు తిరిగాయి. అయినా ఇలాంటి మనిషి ముందు కళ్లనీళ్లుపెట్టుకోటంకూడా సిగ్గుచేటని, కన్నీళ్లను బలవంతంగా అణచుకుని "ఆఁ నేనేమెక్కానుకదూ! వండిన అన్నంలో మూడువంతులకు పైగా మీరే తింటారు. ఇహ నాపిల్లలకీ నాకు యేం మిగులుతుంది? నేను తినకండా పస్తులయినా ఉండగలను. కాని పాలు తగ్గిపోతాయి. అప్పుడిహ నా పిల్లలకి ఆహారం అనేదేం ఉంటుంది? పాలు కొని తాగించగలరా?" అన్నది.

"ఆఁ పాలు కొని తాగిస్తాను. ఆఁ. ఆదౌర్భాగ్యురాలు నాకు స్వర్గంలో దీపంపెడుతుందా?" తర్వాత కాసేపు చిలుం తాగుతూ మెదలకుండా ఊరుకుని, గొంతుకాస్త తగ్గించి "ఈ వెధవలు మాత్రం తక్కువనుకున్నావా? నేను నరేన్ భట్టాచార్యను. నా దగ్గిర యే సంగతులు దాచిపెట్టారో, తల్లి గర్భంలో ఉన్నవాటి నన్నీ లాగి బయటపెడతాను. ఈసంపత్తి ఉందే ఇదంతా దేవుడిమందిరానికి చెందినది. దేవుడిని అర్ధశేరు బియ్యం యెనిమిది 'వాతాష్'లతో మోసంచేసి వాళ్లు నవాబుగిరీ వెలిగిస్తున్నారు. సంపత్తి యేం కాస్తా కూస్తానా? యేం? యెందుకని? అర్ధశేరు బియ్యం కంటె పెంచలేరా? ఒకరోజున యెప్పుడో అంతా యీకకియీక చొప్పున లాగి, వీళ్లపెత్తనం అంతా బట్టబయలుచేస్తాను" అన్నాడు.

శ్యామ అతడి బుద్ధిలేనితనాన్ని సహించలేకపోయింది. "దానివల్ల మీకు ఒరిగేదేమిటి? దావాలు వ్యాజ్యాలు వేసి కోర్టు కెక్కగలరా? ఓవేళ దావాలు వెయ్యిగలిగితే మాత్రం మీకీ నౌకరీ నిలుస్తుందా? అప్పుడింక నోట్లోకి ముద్ద యెలావస్తుందో ఆలోచించండి" అన్నది.

"ఛస్. నువ్వూరుకో నిర్భాగ్యురాలా! సంతలో అరిచినట్లు అరవకు నాపెళ్లాం పిల్లలు తింటారో తినరో అది నేను చూసుకుంటాను. పెట్టగలిగానా - తింటారు. లేదా మాడతారు. నేనేంచేస్తానో చూస్తూ పడిఉండు, ఒక్కమాట మాట్లాడకు - నేను నువ్వు చెప్పినట్లు చేసేవాణ్ణి కాను."

గత్యంతరంలేక నోర్మూసుకుని ఉండాల్సివచ్చింది. తమ యిల్లు ఉన్నది ఒకమూలనే అయినా - బాబుగారిపిల్లలు యెప్పుడూ వస్తూ పోతూంటారు. వాళ్లముందు పోట్లాటలు, దెబ్బలు యెంతఅవమానం!

అయినా - రాసమణి యిచ్చిపంపిన బియ్యం అయిపోయిన రోజున - మళ్లీ యీమాట యెత్తవలసివచ్చింది. అంతావిని నరేన్ ముఖం

వికృతంగా పెట్టి, చిలుంలో పొగాకు కూరుకుంటూ కూచున్నాడు. ఈపని శ్యామకి పురమాయించేవాడు. అది తనకి బాగుండకపోవటంలో, యిప్పుడు తానే చేసుకుంటున్నాడు. ఏం మాట్లాడకుండా కాసేపు పొగతాగి, దణ్ణెం మీద ఉత్తరీయం, గావంచా తీసుకొని బుజాన వేసుకొని బయటికి వెళ్ళి పోయాడు.

ఇక్కడికి వచ్చాక నరేన్ ఇదే మొదటిసారిగా యింట్లోంచి కదలటం, పస్తులు ఖచ్చితంగా కళ్ళముందు కనపడటంతో, నరేన్‌కి కాస్త చైతన్యం కలిగిందనుకున్నది శ్యామ. కాస్త సంతృప్తిగా నిట్టూర్చింది.

కాని ఉదయం గడిచి మధ్యాహ్నం, మధ్యాహ్నం దాటి అపరాహ్ణం, తర్వాత సాయంత్రంకూడా దాటిపోయింది. కాని నరేన్‌మాత్రం అయిపు లేడు.

రాత్రి దేముడికి భోగానికి వేళయింది. భోగానికి పాలుకాస్తూ అక్కడే కూచుంది శ్యామ. రాత్రి చాలా ప్రొద్దుపోయేదాకా చూసి, పాలు, 'బాతాష్'లు తానే దేవుడికి నైవేద్యం పెట్టటానికి తీసుకొచ్చింది. మంత్రం రాదు. ఆలోపాన్ని కన్నీళ్లతో మనస్సులోనే పూరించింది.

"అపచారంగా భావించకు స్వామీ! నీకు అన్నీ తెలుసు. ఉదార గుణంతో దీనిని స్వీకరించు" అని నివేదించుకుంది.

అప్పుడింక మరో ఉపాయం తోచలేదు. యజమానికి తెలియచెయ్యటానికి ధైర్యం కలగలేదు. రాత్రి అతణ్ణి యెక్కడని పట్టుకోగలదు? చివరికి దేముణ్ణి పస్తుపెట్టవలసి వస్తుంది.

ఆ అపరాధంమూలంగా ఈ ఆశ్రయంకాస్తాకూడా పోతుంది. తప్పనిసరిఅయి దేముడిపట్ల మిథ్యాచరణ చెయ్యవలసివచ్చింది. దానికి ఆమె అంతరాత్మ కంపించిపోయింది.

రాత్రి యింకా బాగా ప్రొద్దుపోయేసరికి (ఎంతప్రొద్దుపోయిందో తెలుసుకునే ఉపాయంలేదు - ఇక్కడ గడియారంలేదు, యెవరి గడియారం ధ్వనీ విన్పించే అవకాశంలేదు. దూరంగా యెక్కడో యెవరిదో మిల్లుమాత్రం ఒకసారి రాత్రి నాలుగింటికి, ఒకసారి ఉదయం యెనిమిదింటికి, మళ్లీ మరోసారి సాయంత్రం నాలుగింటికి మోగుతుంది. అది ఒక్కటే టైం తెలుసుకునే ఆధారం) ఇంక ఆమె ఊరుకోలేకపోయింది. ప్రతిరాత్రీ తోటంతా భయంకరంగా తయారవుతూంటుంది. అంతులేని కారుచీకటిలో మిణుగురు

పురుగులు మిలమిల మెరుస్తూ, కీచురాళ్లు రొద చేస్తున్నప్పుడు రోజూ ఆమె గుండె భయంతో గుబగుబలాడుతూంటుంది. గుప్తిపాడాలో ఉన్నప్పుడు, ఈ మిణుగురుపురుగులు, కీచురాళ్లు అలవాటయినాయి. కాని యిక్కడి కీచురాళ్లు మరీ గట్టిగా రొద చేస్తాయి. అలాగే రాత్రి తెల్లవార్లూ కప్పల బెక బెకలు. ఇదివరకంటే యింట్లో నరేన్ ఉండేవాడు. ఇవాళ తాను ఒక్కతే నిర్జనంగా ఉండే అడవిలోని యింట్లో పసిబిడ్డల్ని యిద్దర్నిపెట్టుకుని ఉండ టానికి ధైర్యం చాల్లేదు. ఆమె బిక్కచచ్చిపోయి, ఇంటికి తాళంవేసి, మంగళను వెళ్లి శరణు కోరింది అబద్ధమే చెప్పింది. "ఆయనరాత్రి నైవేద్యం పెట్టే యెక్కడికో వెళ్లారు. ఇప్పటికింకా రాలేదు ఒక్కతెను యెలా ఉండను ?"

"అలాగా ? ఇంతరాత్రివేళ మళ్లీ యెక్కడికి వెళ్లాడు ? అతగాడికి బుద్ధి యేమయినా ఉందా ? ఇంట్లో అందమైనభార్య. అడవి మధ్యన ఉన్నయిల్లు. అర్థరాత్రివేళ. సరే, ఓవేళ హరితల్లి వచ్చి సాయం పడుకుంటుందేమో అడిగి చూస్తాను. మావి అవేం పక్కలు బాబూ, మాపిల్లలు వచ్చిపడుకో టానికి ఒప్పుకోరు."

చటుక్కున ఆమెకి కలకత్తాలో తమ యింట్లో బూరుగుదూది పరుపులు, తెల్లగా నిగనిగలాడే దుప్పట్లు గుర్తుకొచ్చాయి. రాసమణి పేదదే అయినా జమీందారీ అలవాట్లు యిప్పటికీ కొన్ని వదలుకోలేదు. వాటిలో శయ్యాసౌఖ్యం ఒకటి. ఆమె అత్తవారింట్లో పందిరిమంచం ఉండటం కళ్లారా చూసింది.

ఆమె నిట్టూర్పు బిగపట్టుకుని "వద్దమ్మా, యెవరూ పడుకో అక్కర్లేదు. ఒక చెవివేసిమాత్రం ఉండండి. ఒక్కతెనే ఉన్నాను, ఒకవేళ యేదయినా భయమేసి పిలిస్తే మాత్రం పలకండి" అన్నది.

"ఊఁ" అని మంగళ అప్రసన్నంగా - "హరితల్లి దాసీకదా అని ఆమెని పక్కమీద పడుకోనీయటానికి మనసొప్పటం లేదల్లే ఉంది. ఏమైనా ఆమెకి పరిశుభ్రత ఉంది - అని ఒప్పుకుని తీరాలి. జాలరికులంలో పుట్టింది. అయినా మంచిపుటక. మురికిబట్టకూడా కట్టదు యెప్పుడూ. చూడు - తర్వాత నీయిష్టం. అలా అని నేను మాత్రం నా బిడ్డల్ని నీయింటికి పంపలేను" అన్నది.

శ్యామ అపరాధినిలా తలవంచుకుని, అక్కడినుంచి వెళ్లిపోయింది. ప్రయోజనం యేమీ లేకపోయింది. పైగా మధ్య గొడవంతా అందరికి తెలిసిపోయింది.

ఆరోజున రాత్రి యేమీ తిననుకూడా తినలేదు. పగలూ యేమీ తినలేదు. నరేన్‌కోసం యెదురుచూస్తూనే కూచుంది. ఆ చద్దిఅన్నమే ఓముద్ద హేమచేత తినిపించింది. పిల్లని పాలు తాగించి, తాను 'వాతాష్'లు మాత్రం తిని, చెంబెడు నీళ్లుత్రాగి పడుకుంది.

మర్నాడు పొద్దున కూడా నరేన్ రాలేదు. ఇంచుమించు యెనిమిది గంటలప్పుడు పూంటీరాణి వచ్చింది. "ఏం అక్కగారూ, భట్టాచార్యగారు వచ్చారా?" అని అడిగింది.

పూంటీ లేదా పింట్‌కీ వయస్సులో శ్యామకంటె పెద్దదే, కాని ఆమె విశ్వాసాలు వేరు. అందుకని ఆమె అక్కా అనే పిలుస్తుంది. శ్యామ కూడా అభ్యంతరం చెప్పదు.

ఆమెకి పెళ్లి అయింది. పిల్లలూ ఉన్నారు. కాని యేవో మాటల సందర్భంలో మంగళ చెపితేనే విన్నది. వారి పరిస్థితులు బాగాలేక పోవటంవల్ల యేడాదిలో పదినెలలు పుట్టింట్లోనే ఉంటుంది. మంగళ గారాబుకూతుర్ని పంపించదు.

"అమ్మో! వింటానికే ఆశ్చర్యంగా ఉంటుంది. అంట్లు, చెంబులు తోమటానికైనా వాళ్లింట్లో పనిమనిషి లేదు. కాయస్థజాతి యిళ్లల్లో యిలాంటి దైన్యస్థితి యెప్పుడూ విననేలేదు. అలాంటి యింటికి పిల్ల నెలా పంపించను చెప్పు. ఎంతో గారాబంగా పెరిగిన పెద్దకూతురు, ఆ యింటికెళ్లి అంట్లు తోముతుందా? ఆ మాయదారి ఘటకీయే మోసం చేసింది. అబద్ధాలు చెప్పి పెళ్లి జరిపించింది. నేనేమంటానో అన్న భయంతో మళ్లీ యిటుకేసి తొంగిచూడలేదు. లేకపోతేనా కత్తితో ముక్కు కోసేసేదాన్ని - తర్వాతే మయినాసరే! మహా అయితే నన్ను జైల్లో వేస్తారు. అంతకంటె యేం చేస్తారు? అయితే అదికూడా చెపుతున్నా. దత్తుగారింటి ఆడపడుచుని జైలుకి పంపించ గల మేజస్ట్రేట్, జడ్జి యింతవరకు పుట్టలేదు."

ఆమె ఇవన్నీ తనలో తాను గొణుక్కుంటూ వెళ్లింది. ఈ మాటలన్నీ శ్యామ అంట్లు తోముకుంటూనే విన్నది. తానూ గారాబంగా పెరిగినదే. తనపుట్టింట్లో యిప్పటికీ రాత్రింబగళ్లు పనిచేసే దాసీ ఉన్నది. కాని అసంగతి యిక్కడ యెత్తటం నిరర్థకం.

పూంటీ అడిగిన ప్రశ్నకి శ్యామ తలవంచుకుని భయభయంగా తల త్రిప్పుతూ, నరేన్ రాలేదన్నసంగతి తెలియచేసింది.

"అరె! ఆశ్చర్యంగా ఉందే! అయితే మరి పూజ యెలా?" శ్యామ చిక్కుల్లో పడటం పూంటీ కేదో ఉల్లాసంగా ఉన్నట్లుంది. ఏకారణం వల్ల యిలా జరిగిందో శ్యామకి తెలియదు. కాని పూంటీ మనస్సులో యేదో ద్వేషమున్నట్లు యివాళే తెలుసుకుంది.

"ఏం చెయ్యటమో చెప్పు!" పూంటీ యింకాసేపు ఆగింది. బహుశా శ్యామ దగ్గిర్నుంచి సమాధానం వస్తుందన్న ఆశతో అయిఉండొచ్చు. తర్వాత మూతి విరుచుకుని వెళ్లిపోయింది. "ఈ తాగుబోతు మనిషిని చేరనియ్యద్దు, దేముణ్ణే భ్రష్టు పట్టిస్తాడు - అని అప్పుడే చెప్పాను అమ్మతో".

ఇంకొంచెం సేపయాక మంగళ స్వయంగా వచ్చి "ఏమమ్మా, జరగవలసిందేమిటో చెప్పు, దేముడికి 'చచ్చడి' యెప్పుడో చెయ్యటం అయింది. దాన్ని రోజంతా వ్రేలాడకట్టి ఉంచలేను" అన్నది.

శ్యామ యేం మాటాడకుండా తల వంచుకుని, కాలి బొటనవేలు నేలలో గ్రుచ్చుతూ ఊరుకుంది. ఏం సమాధానం చెపుతుం దామె? చెప్ప టానికేముంది సమాధానం? ఆమె పాదాలకింద భూమి కదలసాగింది.

మంగళ కొన్నిక్షణాలు మెదలకుండా ఊరుకుని, "ఇక్కడ ఇంకో పురోహితబ్రాహ్మ డున్నాడు. అతడు పూజలు చేస్తాడు, గంజాయి దమ్ముగాడని నేనే వెళ్లకొట్టించాను. అతణ్ణి పిలవమంటాను. నరేన్ వచ్చేంత వరకు అతడే చేస్తాడు పూజ. అయితే నైవేద్యం బియ్యం అతడికి పూర్తిగా యివ్వాలి బాబూ! ముందుగానే చెపుతున్నా. లేకపోతే జీతం లేకుండా పని చెయ్యటానికి యెందుకు వస్తాడు? నా దురదృష్టమే యింత! ఇక్కడ ఇంకా కొన్ని బ్రాహ్మలు, కాయస్థుల యిళ్లున్నాయి. 'షష్ఠీ' 'మహాకాల' పూజలు అందరి యిళ్లలోనూ ఉంటాయి. సంవత్సరం పొడుగునా పూజలు, వ్రతాలు ఉండనే ఉంటాయి. ఇంటింటికీ తిరిగి అన్నీ కాకపోయినా సగమైనా పట్టుకోగలిగితే ఇంక దిగులేముంటుంది? ఆ గంజాయి దమ్ముగా డొక్కడే ఆధారం. అతణ్ణి పిలవటాని కెవరూ ఒప్పుకోరని యెన్నోవిధాల చెప్పాను. ఏదీ! నా మాట యేమయినా విన్నాడా?" అన్నది.

నిన్నటినుంచి భోజనం చెయ్యలేదు. ఇవాళ బియ్యంకూడా పోతాయి. శ్యామ ఆందోళనతో ఆమె మొహంకేసి చూసి యేదో చెప్ప బోయింది. కాని చివరికి యేమీ చెప్పలేకపోయింది. అయినా యేం చెపుతుంది. పూజచేసే అతడు బియ్యం యెందుకు వదులుకుంటాడు?

వాళ్లు ఈ యేర్పాటుకి ఒప్పుకున్నారు. అంతే చాలు, ఇప్పుడే వెళ్లకొట్టలేదు. అందుకామెకి మనస్సులో కృతజ్ఞతాభావమే కలిగింది.

ఆ యేర్పాటే ఖాయమయింది. పూర్వంఉన్న బ్రాహ్మడు వచ్చి "నేను నిషా అలవాటు చేసుకోనీయ్, యేమయినా చేసుకోనీయ్ బ్రాహ్మణ్ణే కద్రా! జాతిసర్పం. వెళ్లకొట్టగానే సరా? మళ్లీ వాళ్లే పిలవాల్సి వచ్చింది. ఆఁ ఇప్పుడు తాత్కాలికంగా చెయ్యమంటే కుదరదు. ఓవేళ అతడు చెయ్యకపోతే నా చేతనే చేయించాలి" అని అందరికీ స్పష్టంగా తెలియచేశాడు.

హేమ యేడ్చియేడ్చి నిద్రపోయాడు. ప్రొద్దున్నే వాడికి తినటానికి శ్యామ కాసిని నేరేడుపళ్లు యిచ్చింది. మధ్యాహ్నమప్పుడు అందరూ నిద్ర పోతూంటే, తోటలోంచి మేడికాయలు తెచ్చి ఉడకపెట్టి ఉప్పు కలిపి తినిపించింది. అదే తానుకూడా కాస్త తిన్నది. పస్తుండటాని కామెకేం అభ్యంతరం లేదు. కాని పిల్లమొహం చూసి బలవంతగా కన్నీళ్లని అణచు కుని తినవలసి వచ్చింది.

మర్నాడు యింక ఓర్చుకోలేక మంగళ దగ్గిరకెళ్లి "పిల్లవాడికి మటుకు సరిపోయేలా కాసిన బియ్యం ఇయ్యి అమ్మా! ముసుగు పెట్టుకుని అలాగే పడుకుండిపోయాడు" అన్నది.

"అయ్యో! కొంపలో మరీ యింత దరిద్రంగా ఉందా? నీ ముఖం కళ్లా కూడా పీక్కుపోయాయి. ఇలాంటి మొగుడి మొహాన నిప్పులు పోయాలి. నేను కనుక అయితేనా ఇలాంటి మొగుడి మొహాన కాల్చి కొరివిపెట్టి పోయేదాన్ని. సానికొంపలచుట్టూ తిరిగేవాళ్ల చిత్తాలో చేరాడు. హత్తేరీ బాపనకొంప!"

ఓ చిన్నబుట్టెడు బియ్యం బయటికి తీసి యిచ్చి- "వీటిలో కాసిని కాసిని తీసి గడుపుకో, అతడు మళ్లీ యెన్నాళ్లకి వస్తాడో తెలియదుగా!" అన్నది.

ఎంత గీసిగీసి ఖర్చుపెట్టుకున్నా బుట్టెడు బుట్టెడే. మరి కొన్నాళ్లు పస్తు లున్నాక. ఒకనాడు నరేంద్రనాథ్ ప్రత్యక్షమయాడు. బుజాన ఓ బస్తా, చెప్పుల్లేని కాళ్లు, ఆ పొట్టి వదులుకోటుకూడా లేదు. కట్టుకున్న పంచె యెంతమురికిగా ఉందో, అన్ని చిరుగులతో ఉంది. గావంచామాత్రం ఒంటిమీద కప్పుకున్నాడు. దభాల్న బస్తా కింద పడేసి, ప్రశాంత కంఠంతో, "ఇదిగో, యెక్కడి కెళ్లావ్? కాస్త చిలుంలో పొగాకు కూరి ఇయ్యి" అన్నాడు.

## 3

అసహ్యత గొంతుదాకా నిండి పుక్కిలింత లవుతున్నప్పుడు తిట్టా లన్నా నోటివెంట మాటరాదు. పస్తులతో యెండిపోయిన శ్యామ పెదిమలు మాటిమాటికీ వణకటమయితే వణికాయి; కాని ఆమె ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయింది. కాసేపు వృథాప్రయత్నం చేసి, వంటింట్లోకి పరుగెత్తి బోర్లగా పడిపోయింది. వేదనతో, విచారంతో, దు:ఖంతో ఆమె చైతన్యాన్ని కూడా కోల్పోయినట్లుంది.

మంగళ కూడా బిగ్గరగా అరుస్తూ పరుగెత్తుకొచ్చింది. ఆమె తిట్లన్నీ నోరెత్తకుండా సహించి ఊరుకుని, కొంచెం నవ్వటానికి కూడా ప్రయత్నిం చాడు. "అది యెంత అమాయకురాలు! సరుకులన్నీ ఖాళీ అయిపోయాక చెప్పిందని నాకెలా తెలుస్తుంది? వాళ్లమ్మ యిచ్చిన బియ్యం దాచిపెట్టే అయిపోయాయని చెప్పిందనుకున్నాను నేను. అదీకాక సంపాదనంటే అంత తేలికా? జూదమాడి కాసిని డబ్బులు సంపాదించాను. కాని మళ్లీ జూదం లోనే ఆ డబ్బుల్ని పోగొట్టుకుని రావలసివచ్చింది. చివరికి ఈ పదిహేను రోజులూ ఒక టోకుదుకాణంలో పద్దులు రాసి, టోకరా యిచ్చి, ఈ అర్ధ మణుగు మైదా తీసుకుని, అక్కడినుంచి వచ్చేశాను. ఏదీ? యెక్కడి కెళ్లింది? కాసిని రొట్టెలయినా వత్తొచ్చుగా" అన్నాడు.

"నీకు సిగ్గు లేదయ్యా, నువ్వు సిగ్గుశరం లేనివాడివని తెలుసు. నువ్వు చెప్పే మాటలన్నీ అబద్ధాలే. కాని ఇలా అయితేమాత్రం మాకు కుదరదు. ముందే చెపుతున్నాను. ఇలా చేసేట్లయితే నీదారి నువ్వు చూసుకో. మా యిల్లు ఖాళీచెయ్యి. నేను యింకెవర్నయినా చూసుకుంటాను. చావనూ చావవు, వదలనూ వదలవు అని అడ్డుకట్టవేసినట్లు పడిఉంటే ఈపద్ధతి మాకు కుదరదు"

"అమ్మా! అమ్మా! నీమీద ఒట్టేసి చెపుతున్నాను. మళ్లీ ఇంకోసారి ఇలా జరగనిస్తానా? నేను బుద్ధిమంతుణ్ణి అయిపోతాను చూస్తూ ఉండు"

మంగళ తిట్టుకుంటూ వెళ్లిపోయింది. నరేన్ లేచి వచ్చి, శ్యామని చెయ్యిపట్టుకుని ఒక్క గుంజు గుంజి లేవతీసి కూచోపెట్టి "లే, లే, ఇంకా అంత మంచిగా నటించక్కర్లేదు. బుద్ధిమంతురాలిలాగా కాసిని రొట్టెలు తయారు చెయ్యి" అన్నాడు.

ఆమెకి నొప్పిపుట్టిందో లేదో తెలియదు. కాసేపు ఏడ్చి, మళ్లీ మామూలు స్థితికి వచ్చినట్లుంది. పమిటతో కళ్లతుడుచుకుని "రొట్టెలు యేంవేసుకుని

తింటారు ? మంచి మసాలా సంగతి అలా ఉంచండి. నూనె, ఉప్పుకూడా లేవు యింట్లో" అన్నది. నరేన్ కోపంతో పళ్లు పటపటా కొరుకుతూ "అన్నీ మింగి కూచున్నావన్నమాట" అన్నాడు.

శ్యామ తల్లిదగ్గిర్నుంచి వచ్చేప్పుడు యేమేం తీసుకొచ్చిందో, ఆ తర్వాత ఒక్క చటాకయినా, మసాలా, ఉప్పు, నూనె కొనలేదు. నరేన్‌కి చెప్పినా వృథా అని ఆమె అతడికి గుర్తు చెయ్యలేదు. భర్తముఖం కేసికూడా చూడలేదు. ఇంత మైదా తీసుకొచ్చి పళ్లెంలో కలిపి మర్దిస్తూ కూచుంది. ఆమె యీ ఉపేక్షాభావం ఇవాళ నరేన్‌కంట యెలా పడిందో, తెలియదు. కాసేపు మెదలకుండా ఆమె ధోరణి గమనించి, తానే చిలుంలో పొగాకు కూరుకుంటూ కూచుని, కొంచెం బిగ్గరగానే "అబ్బో! పౌరుషం వచ్చింది పౌరుషం! ఆ పౌరుషం వదిలించిననాడు తెలుస్తుంది" అన్నాడు.

నరేన్ రెండు మూడు రోజులు యింట్లో విశ్రాంతి తీసుకున్నాడు వెనుకటి పురోహితుడితో తనంతట తానే "ఇదిగో భాయీ! ఈ కొద్దిరోజులూ పూజలు నువ్వే జరిపించు. నేను పనికోసం తిరుగుతున్నాను, చూస్తున్నావుగా! ఎక్కడైనా యెనిమిది, పదిరూపాయల ఉద్యోగం దొరికిందంటే వెళ్ళిపోతాను. ఇక్కడ ఉంటాననుకున్నావా? అప్పుడు ఇక్కడిది అంతా పూర్తిగా నీదే అవుతుంది, తెలిసిందా? కనుక గొడవేమీ చెయ్యకు. నేను ఈపని నీకే అప్పగించా లనుకొంటున్నాను" అన్నాడు.

ఈలోపుగా అతడెక్కడో కాస్తనూనె, ఉప్పుకూడా సంపాదించి తెచ్చాడు. నాలుగోరోజున భార్యని పిలిచి, "భాండారంలో అన్నీ అమర్చిపెట్టి వెడుతున్నాను. ఏడుస్తూ కూచోకు, జాగ్రత్త! నేను మళ్లీ కొన్నాళ్లు తిరగాలి. ఏదయినా నౌకరీ, ఉద్యోగం దొరుకుతుందేమో చూస్తాను" అన్నాడు.

అప్పుడే అతడు వెళ్లిపోవా లనుకుంటున్నాడని శ్యామకి తెలియదు. ఆమె కొయ్యబారిపోయి నుంచుంది. అతికష్టంమీద మళ్లీ మాట పెకలిరాగానే "మీరు మళ్లీ వెళ్లిపోతారా? మమ్మల్ని యెవరుచూస్తారు?" అని అడిగింది.

"ఎవరయినా చూడాలా యేం? నువ్వు పసిపిల్లవేమీ కాదు. తలుపు గడియ పెట్టుకుని పడుకో. నేను మళ్లీ నాలుగయిదురోజుల్లోనే వచ్చేస్తాను"

ఆ తర్వాత నరేన్ నెలా పదిహేను రోజులుపోయాక వచ్చాడు. నగలేవీ అంతగా లేవు. ఈసారి వచ్చేముందు తల్లి కొత్తగా చెవులకి కమ్మలు,

ముక్కుపుడక, ఒకజత గాజులు చేయించి ఇచ్చింది. ఉపవాసాలకి తట్టుకో లేక శ్యామ చెవులకమ్మలు రెండూ మంగళదగ్గిర తాకట్టు పెట్టక తప్పలేదు. అప్పటికే కొడుకు, అమె యెలా తయారయారంటే చూస్తే గుర్తుపట్టలేరు. నరేన్ కాసేపు తెల్లబోయి చూస్తూ నుంచుని, యేదో పశ్చాత్తాపకంఠంతో "ఇదేమిటి ? నీమొహం యిలా అయిపోయిందేం శ్యామా ? తినటానికి తిండీ - అదీ లేకపోయిందనుకుంటా. ఇంత స్థితిమంతుల ఆశ్రయంలో ఉంచి వెళ్లాను. బ్రాహ్మణస్త్రీ. మీమోరే శూద్రులు. కాయస్థులు మా తాతగారు కనుక బతికుంటే మీ యింటికి కాళ్లుకడుగుతానన్నా వచ్చే వాణ్ణికాను. మీరు కాసిని బియ్యమయినా యివ్వలేకపోయారా ? కసాయి వాళ్లు ! కసాయివాళ్లు, కనికరం అనేది కాస్తయినా ఉండఖ్ఖర్లా ?" అన్నాడు.

"కాసేపు కోపంతో విసుక్కుని, చేతిలో మూటకింద పెట్టాడు. కుడిచేతిలో మూతికట్టిన మట్టిపిడత ఉంది. అందులో కాస్తనెయ్యి ఉంది. దాన్ని శ్యామచేతి కిచ్చి "మొన్న ఒకదేముడిపని దొరికింది. అబాపతు నెయ్యే ఇది. అర్ధశేరు తక్కువ ఉండదు. స్వచ్ఛమైన ఆవునెయ్యి. ఇందులో బియ్యం, పప్పు, కూరలు, రెండు గుడ్డలుకూడా ఉన్నాయి. ఇవాళ నియమభంగం చేసి చేపతోసహా. వంట బాగా చెయ్యి" అన్నాడు.

ఈసారికూడా శ్యామ యేమీ మాట్లాడలేదు. అమె అసహ్యించు కోటమే కాదు, ఈ పశువుతో మాట్లాడటం నిరర్ధకమని - అమె యిన్నాళ్లకి పూర్తిగా తెలుసుకుంది. ఆమెకి జీవితంమీద రుచి చెదిరిపోయింది.

కేవలం హేమ, మహాశ్వేతల ముఖాలు చూసి, ప్రాణాలు నిలబెట్టు కునే ఉపాయంకోసం రాత్రింబగళ్లు తాపత్రయపడుతోంది. కాని మంగళ శ్యామ స్తబ్దతను వడ్డీతోసహా తీర్చింది.

"మళ్లీ వచ్చావా ? పెళ్లాంబిడ్డల్ని తీసుకుని వచ్చినదారినే తిరిగివెళ్లు. ఇలా అయితే మావల్లకాదు. సూటిగా చెపుతున్నా, మామూలుగా కనుక వెళ్లకపోయావో, పోలీసుల్ని పిలుస్తా చెపుతున్నా"

నరేన్ మొట్టమొదటి తిట్లన్నీ మామూలుగానే విన్నాడు. కాని చివరి మాటకి ఒక్కసారి యెగిరిపడ్డాడు. "పిలవండి పోలీసుల్ని. దేముడి సంపత్తితో మీరు పాలు, చేపలు హాయిగా అరగిస్తున్నారు. కాని దేముణ్ణి మోసంచేసి అర్ధశేరు బియ్యంమాత్రం యిస్తున్నారు. సిగ్గులేదూ మీకు ? నేను తాత్కాలి కంగా పనిచేయటానికి ఒకర్ని పెట్టే వెళ్లానుగా ! పనిదొరికితే అయినట్లే. పోలీ సుల్ని పిలవండి. ఇంకా సూర్యుడు చంద్రుడు ఉదయిస్తూనే ఉన్నారు.

ఎన్ని చెప్పినా మీరు శూద్రులు, మేం బ్రాహ్మలం, బయటికి వెళ్ళవలసివస్తే జంధ్యాలు తెంచుకుని మరీ వెడతాను. పిల్లా - జెల్లాతో కాపురం చేస్తున్నవాళ్లు నెత్తురు కక్కుకుని ఛస్తారు చెపుతున్నా."

మంగళ ఈఅభిశాపానికి భయపడినంత - అతడి ఆరోపణలకి భయపడలేదు. ఆమె ముఖం మాడిపోయింది. గొంతు చాలావరకు తగ్గించి, గొణుక్కుంటూ తమ యింటివైపు వెళ్ళిపోయింది. ఆమె కనుమరుగైపోగానే నరేన్ సంతోషంతో ఒక్కగంతేసి, హి హి హీ అని నవ్వి "చూశావా? జలగ నోట్లో యెలా సున్నంకొట్టానో! నువ్వేమో ఊరికే హడలి చచ్చిపోయావ్. నాయిష్టం. నాయిష్టం వచ్చినపుడు వెడతాను. అలాఅని వాళ్లు వెళ్ళకొడతామంటారా? హూఁ అనమను. ఒక్కచిటికెలో యెగర కొడతాను" అన్నాడు. సాయంత్రందాకా ఒక్కనిద్రతీసి, లేచి కూచుని నరేన్ ముందుగా "చాలారోజులనుంచి తృప్తిగా యేమీ తినలేదు. ఇవాళ నావరకు కాసిని పూరీలు వత్తి ఇయ్యి. పూరీలు, బంగాళాదుంపలకూర, కావాలంటే మీరుకూడా రెండు తినండి," అని ఆదేశించాడు. శ్యామ కొంచెంసేపు తెల్లబోయి, చూస్తూ ఊరుకుని "మైదా యెక్కడనుంచి తీసుకు రాను? మీరు తెచ్చిన మూటలో మైదా లేదు" అన్నది.

"అదేమిటి? అరబస్తా మైదా ఉండాలిగా!"

శ్యామకి ఆశ్చర్యంతో నోటమాట రాలేదు. "ఆమైదా యింకా యెన్నాళ్లదాకా వస్తుంది? మీరు యిల్లువిడిచిపెట్టి యెన్నాళ్లయిందో లెక్క వేసుకున్నారా? అయినా యేమంత నిల్వఉంచి వెళ్లారు? పిల్లల్ని యేంపెట్టి బతికించాలి? చెప్పండి. చెవుల కమ్మలు తాకట్టుపెట్టుకుని సర్కార్‌గారి భార్య నాలుగు రూపాయ లిచ్చింది. అడబ్బుకూడా అయిపోయింది. మూడురోజులనుంచి గుమ్మడి, మేడికాయలు ఉడకపెట్టుకుని తింటున్నాం. వాళ్ల తోటలోంచి దొంగతనంగా తీసికొచ్చాను గుమ్మడికాయ. మాకిక్కడ రోజులెలా గడు_స్తున్నాయో, యెప్పుడయినా ఆలోచించారా? నేను చావగలను, నాకేం విచారం లేదు. పిల్లల్ని ఈప్రపంచలోకి తెచ్చింది మీరు. మీరు వాళ్లసంగతయినా ఆలోచించారా?" అని అంటూంటే ఇన్నాళ్లనుంచి మనస్సులో అణచిపెట్టుకున్న దుఃఖం ఒక్కసారి పొంగిపొర్లి కళ్లనీళ్లగా బయటికొచ్చింది. ఏడుపుతో గొంతు పూడుకుపోయింది.

కాని ఆకన్నీళ్లు నరేన్‌మీద వ్యతిరేకంగా పనిచేశాయి. అతడు మండిపడ్డాడు. "అలాఅని నువ్వు అరబస్తామైదా నూనెతో పూరీలు చేసి వీళ్లను మెక్కించి కూచున్నావా? పిల్లలు పిల్లలు? వీళ్లు నన్నేం ఉద్ధరిస్తారా?"

శ్యామ సహనంకూడా కట్టలు తెంచుకుంది. ఈసారి ఆమెకూడా గొంతు హెచ్చించి "మీరు నాలుగురోజులు యింట్లో ఉండి తర్వాత వెళ్లారు. ముగ్గురు మనుషులు రెండుపూటలా పూరీలు తింటే అర్ధమణుగు మైదాలో యెంత మిగులుతుంది ?" అన్నది.

"ఎంత మిగులుతుందో చూపిస్తాను. ఈ దరిద్రగొట్టు పిల్లల్ని ఒక్కొక్క కత్తివేటుతోనరికి, అంతంచేసి, తర్వాత నిన్ను నరికి ఉరికంబ మెక్కకపోతేనే బ్రాహ్మణబిడ్డనే కాను" అని కాసేపు అటుయిటు చూసి, ఇంట్లో మూలనుంచి కత్తిపీట తీసుకొని మెల్లాలోకి వచ్చి, "ఏరీ ? ఎక్కడికి పోయారు కొడుకు, కూతురు ? ఇవాళ ముందు వాళ్లని సఫాచేసి కాని మరొక పని చెయ్యను ?" అన్నాడు.

మరీ ముప్పు ముంచుకొచ్చినప్పుడు మనిషి యెంతకైనా తెగించటానికి సిద్ధపడతాడు. సాహసం, తెలివికూడా అనుకోకుండా బయట పడతాయి. వంటకోసం తోటలోంచి యేరుకునివచ్చిన చెట్లకొమ్మలు కొన్ని యింట్లో మూల పేర్చి ఉన్నాయి. గబగబా వాటిలోంచి ఒకటి తీసుకుని శ్యామకూడా హఠాత్తుగా బయటికి పరుగెత్తుకొచ్చి, ఊహించలేనంత దృఢ కంఠంతో "కిందకి దింపండి కత్తిపీట, చెపుతున్నా. లేకపోతే మీతల పగల కొడతాను, దింపండి" అన్నది.

శ్యామ కంఠంలో యేముందో నరేన్‌కి తెలియకపోయినా, ఆమె ఈ క్షణంలో యేదైనా చెయ్యగలదు అని యెలాగో తెలుసుకున్నాడు. అతడు కూడా తనలోతాను ఆడదాని ఓర్పుమీద ఆఖరిదెబ్బకొట్టానని గ్రహించాడు. ఎత్తినచెయ్యి మెల్లిమెల్లిగా దింపి, ఆకత్తిని మెల్లాలోకి విసిరిపారేసి "సరే. ఇవాళకాదులే, కాని, మీబావు యెంతోదూరంలో లేదని మాత్రం చెపుతున్నా" అన్నాడు.

# ఎనిమిదవ పరిచ్ఛేదము

## 1

ఉమ వాళ్లయిల్లు బావురుమంటూ, ఆమె కేదో వెక్కిరిస్తున్నట్లుంటుంది. ఒకొక్కసమయంలో చవుడూరిన గోడలు తనకేసి చూసి, హ హ హ అని నవ్వుతున్నాయనిపించేది. ఆమెకి నిజంగానే నవ్వుతున్న ధ్వనులు

విన్పించేవి. ఉమ తెల్లబోయి చూస్తూండేది. ఆమెకీమధ్య తాను పిచ్చి దాన్నయిపోతానేమో అని బెంగకూడా పట్టుకుంది.

ఆమె మధ్యమధ్య మనస్సులో గొణుక్కుంటూకూడా ఉంటుంది. ఆమెకి వాళ్లమ్మ యెన్నోరోజులనుంచి చెపుతోంది. ఆమె పరధ్యానాన్ని వదిలించిందికాని తన మనస్సులోని మాటలు యెప్పుడు పెదవులమీద చిందిందీ ఆమెకి గుర్తుండేదికాదు.

ఆమెకి మధ్యమధ్య భర్త సంగతికూడా గుర్తొచ్చేది. అంత అందగాడు తనభర్త. కార్తికేయుడంత రూపవంతుడు. ఒకొక్కప్పుడు తనభర్త తనని తీసుకెళ్లి సంసారం చెయ్యకపోతే పోనియ్. తాను అత్త వారింటికి వెళ్లకపోతే పోనియ్. తనభర్త కనీసం ఒకటి రెండుసార్లయినా యిక్కడికి వస్తే, తనజన్మ సార్థకమౌతుందని అనిపించేది. ఒకటిరెండు, రాత్రులు అతడి సాంగత్యాన్ని పొందగలిగితే - ఆత్మగౌరవం వద్దు, అభిమానం పెట్టుకోదు, ఆరోపణలతో ఇరకాటంలో పెట్టదు. భర్తని యెలాంటి సంజాయిషీ అడగదు. మోయలేని బరువు బాధ్యతలేమీ మోపదు.....

సంతానం ?

సంతానం కలిగితే తాను ఇతరుల యిళ్లలో వంటలక్కగా పనిచేసి, లేదా దాసీవృత్తిచేసి పోషిస్తుంది. భర్తను యేమీ అనదు. ఒక్కసారి రాకూడదూ ? శరత్ వచ్చి చూడకూడదూ ? "ఎందరు మగవాళ్లు బయట ఆడవాళ్లను పెట్టుకోటంలేదు ? అయినా వాళ్లు చేసుకున్న భార్యలతో సంసా రాలు చెయ్యటంలా ? కాని ఇది యెక్కడి దుర్బుద్ధి బాబూ ! ఈరోజుల్లో యే మగాడికి వారవనితలతో సంపర్కంలేదు ? ఇది అంటే వ్యాపారాలు జరిగే పట్నం, కాని మా పల్లెటూళ్లకివచ్చి చూడండి. ఇంటింటా ఇదే కీర్తి ? కాని భార్యను ఇంటిదగ్గిర, వదిలేసి ఉండటం - ఇంత అందమైన భార్యని ! వచ్చిచూడటం లేదు. తాకటం లేదు. ఇలాంటిది యెక్కడా వినలేదు చూడలేదు" అని దాసీది కూడా అంటూ ఉంటుంది.

తన అదృష్టంలోనే ఇంత విపరీతం !

ఒక్కసారి దగ్గిరకువస్తే తాను భర్తని కాళ్లుపట్టుకుని అయినా ఒప్పించ గలదు. కాని అత డెక్కడ ! అతణ్ణిగురించి కబురుకూడా యేమీ తెలియటంలేదు. అయితే అతడిప్పు డింటికికూడా రావటంలేదు. తల్లికి ఒక్కపైసాకూడా యివ్వటంలేదు. అని వినికిడి. తాను ఆ స్త్రీ యింటికి

వెతుక్కుంటూ వెళ్లటం - లేదా ఆ అబ్బాఫీసుకి వెళ్లటం - ఛీ! తానాపని చెయ్యలేదు !

అదీకాక అది సాధ్యంకూడా కాదు. ఒకటి - తనకి అతడి చిరునామా కూడా తెలియదు. రెండోది - ఈసంగతి అమ్మకి తెలిస్తే తనని నరికి ముక్కలు చేస్తుంది.

మనస్సులో ఈఆలోచనలు వచ్చినప్పుడు అప్పుడప్పుడు తల అడ్డంగా తిప్పుకోటం ఆమెకి తెలియదు. సిగ్గుతో కుంగిపోయి, ఇలాంటి ఆలోచనల్ని యింకెప్పుడూ రానీయనని ఒట్టు వేసుకుంటూంటుంది.

కొన్ని నెలలు పోయాక ఉమకి ఒక పనిదొరికింది - అంటే పొద్దుగడిచే పని. ఆ ప్రాంతంలో ఒక మురికివాడఉంది. దాన్ని యిప్పుడు పడగొట్టి అన్నీ పీకిపారెయ్యటం మొదలెట్టారు. ఎందుకనంటే అక్కడ కొత్తగా థియేటర్ బిల్డింగ్ కడతారని తెలిసింది.

థియేటరా ? అదేమిటి ?

అదేమిటంటే అదే! దాసీది చేతులూ, తలఆడిస్తూ "నాటకాలాడ తారమ్మా నాటకాలు! అందరూ మొహాలకి రంగులేసుకుని వస్తారు. నాట్యాలు పాటలు. మాటలతో అభినయాలు చేస్తారు. తర్వాత మళ్లీ అందరూ ఇళ్లకి వెళ్లిపోతారు" అని చెప్పింది.

ఉమయెప్పుడూ నాటకం చూడలేదు. ఆమె రెండుమూడు నాటకా లయితే చదివింది. ఎలా ఉంటుందనేది ఉజ్జాయింపుగా ఊహించుకోటానికి ప్రయత్నించింది. అందులో ఆమెకి కుతూహలం అణచుకోటానికి మరొక వైపునుంచి కారణమేమీ యేర్పడలేదు. ఆ థియేటర్‌బిల్డింగ్ తమయింటికి దగ్గిరలోనే మెయిన్‌రోడ్డుకి అటువైపు కడుతున్నారు. తమ డాబాపైనుంచి చూస్తే కొంతవరకు స్పష్టంగా కన్పిస్తుంది. ఉమ ఈమధ్య కాస్తతీరిక ఉన్నప్పుడల్లా డాబామీదికివెళ్లి నుంచుంటూ ఉంటుంది. ఆశ్చర్యంగా చూస్తూఉంటుంది, ఏంచూస్తూంటుందో ఆమెకి తెలియదు. మేస్త్రీలు పని చేయిస్తూంటారు. కూలీలు సాయపడుతూంటారు. ఒకబాబు రాత్రిం బగళ్లు అజమాయిషీ చేస్తూంటాడు, మేస్త్రీలను తిడుతూ. ఆతిట్లు యిక్కడికి విన్పించవు. ఆ భావభంగిమలు కన్పిస్తూంటాయి. పెద్దకోలా హలం విన్పిస్తూంటుంది. ఉమకి అదంతా అద్భుతంగానూ, అపూర్వం గానూ ఉంటుంది. అయితే ఒకవిచిత్రం, ఒకచాంచల్యం, అక్కడికివెళ్లి నుంచోటం ఆమెకి ఒకరకం నిషాగా తయారయింది.

రాసమణి కేకలేస్తూంటుంది. అంతబిగ్గరగా కాదు. "ఊఁ బావు, ఒకబిల్డింగ్ కడుతున్నారు. మేస్త్రీలు కూలీలు కష్టంచేస్తూన్నారు. అందులో ఆసక్తియేముందో అర్థంకావటం లేదు. పగలంతా యెండలో చూస్తూ నిలబడితే ఆరోగ్యం పాడవుతుంది. ఒంటిరంగంతా మాడి నల్లబడిపోతుంది" అనిమాత్రం అనేది.

ఎక్కువగా యేమీ అనదు. దీంతో ఉమ యెంతదుఃఖాన్ని మరచి పోవాలనుకుంటోందో, తల్లిమనస్సుకి బాగా తెలుసు.

కాని వీళ్లు థియేటర్ కడుతున్నవాళ్లే. నాటకాలేసేవాళ్లు వీళ్లు కాదు అని ఉమకి తెలుసు. మధ్యమధ్య ఒక బాబుగారు కారులో పర్యవేక్షణ చెయ్యటానికి వస్తూంటారు. బహుశా అతడే ప్రొప్రయిటర్ అయిఉంటాడు. నాటకాల మనుషు లెలా ఉంటారు ? మామూలు మనుషుల్లాగానే ఉంటారా ? తెలియదు. కుతూహలపూరితమైన ఆమెమనస్సు వారిని చిత్రరూపాలుగా ఊహిస్తూంటుంది.

చివరికి థియేటర్ కట్టటం పూర్తి అయింది, ముందు తలవనితలంపుగా నిజంగా నాటకంమనిషే వాళ్లింటికి వచ్చాడు.

ఒకరోజున దాసీది వచ్చి రాసమణితో, "ఒక వయసుమళ్లిన బాబు గారు మిమ్మల్ని కలుసుకోటానికి వచ్చారు" అని చెప్పింది.

రాసమణి విస్మితురాలై తలమీదిచెంగు ముందుకిలాక్కుని క్రిందికి దిగివచ్చింది. వచ్చేముందు కిందికి తొంగిచూడకు అని ఉమను పదేపదే హెచ్చరించింది.

కాని ఉమ కుతూహలం అణచుకోలేనిది. ఆమె మెట్లమీదపైన ఒక చోట ఇంచుమించు బోర్లగా పడుకుని, ఒకకంతలోంచి చూస్తోంది.

ఆమెకి కొంతవరకు బాగానే కన్పిస్తోంది. కాని ఆమెమాత్రం కన్పించదు. ఆ వచ్చిన పెద్దమనిషి లోపలికివచ్చి నిలబడ్డాడు. పెద్ద వయసైనవాడేమీ కాదు. మంచిబలిష్ఠుడైన మధ్యవయస్కుడు. మహా ఉంటే నలభై యేళ్లుంటాయి. కాని తలమీద జుట్టంతా నెరసిపోయింది - చిన్నవయసులోనే. పొడుగ్గా, కొంచెం లావుగా ఉంటాడు. తెల్లటిమల్లు ధోవతి కుచ్చిళ్లుపెట్టి ముందువైపు పైకి దోపుకున్నాడు. తెల్లటి సిల్కుకోటు తొడుక్కున్నాడు. దానికి గుండీలు పెట్టుకునేచోట రెండువైపులా కుట్టుపని చేసిఉంది. కాళ్లకి క్రోమ్‌చెప్పులు. గౌరవనీయుడైన పెద్దమనిషి.

పెద్దమనిషి లోపలకువచ్చి నిలబడి, చేతులుజోడించి, "తమర్ని ఒకటి అర్థించటానికి వచ్చాను" అన్నాడు.

"చెప్పండి" అన్నది రాసమణి.

"బహుశా తమకితెలిసే ఉంటుందనుకుంటాను. ఇక్కడ ఈమలుపులో థియేటర్ నిర్మాణం జరుగుతోంది. అది యింకా పూర్తి కాలేదు. అయితే ఆలస్యమవుతోందని మేము రిహార్సల్స్ ప్రారంభించాం. కాని యిక్కడ యింకా మరుగుదొడ్డి, పంపు యేర్పాటుకాలేదు. ఇంతమంది జనం వస్తారు. కాస్త త్రాగటానికి మంచినీళ్లు అవసరం. మా నౌకరు వచ్చి రోజూ రెండుమూడు బిందెలు మంచినీళ్లు తీసువెళ్లటానికి అనుమతియిస్తే - ఇంతమంది ప్రాణాలు నిలబడతాయి" అన్నాడు.

రాసమణి కొంచెం యిబ్బందిగా ముఖంపెట్టి, కాసేపు మెదలకుండా ఊరుకుని, "మంచినీళ్లడిగితే లేవనకూడదు. కాని ఒక ఆడదాన్ని, వయసొచ్చిన కూతుర్ని పెట్టుకుని సంసారం సాగిస్తున్నదాన్ని. నాటకాల మనుషులింటికివస్తూంటే లోకులేమనుకుంటారో అని భయంగా ఉంది" అన్నది.

"అమ్మా! ఈవీధిలో యింక యెవరింట్లోనూ పంపు లేదు. నేను వాకబుచేసి తెలుసుకున్నాను. ఉంటే మిమ్మల్ని యిబ్బంది పెట్టేవాణ్ణి కాను. అదీకాక నాటకాల మనుషులందరూ చెడ్డవాళ్లు కాదమ్మా. నేను బ్రాహ్మణ వంశానికి చెందినవాణ్ణి గౌరవకుటుంబంలోనివాణ్ణి. చదువు సంస్కారాలున్నవాణ్ణి, 'పాథురేఘాట్' దేవాలయం మాన్యాలున్నవాణ్ణి, నౌకరు వచ్చి నీళ్లు తీసుకెడతాడు. రెండుమూడు బిందెలకన్న యెక్కువ అక్కర్లేదు. హిందూస్తానీ జాతివాడు. అతడూ మంచికులంవాడే" అన్నాడు పెద్దమనిషి.

రాసమణి కాసేపు మెదలకుండా ఊరుకుని, "సరే, అలాగే, దీన్ని గురించి వీధిలో యెవరైనా రకరకాల చెప్పుకోవటంగాని, యేదయినా గొడవజరిగితే, నేనీయేర్పాటుని ఆపుచెయ్యవలసివస్తుంది. ముందుగానే చెపుతున్నా" అన్నది.

పెద్దమనిషి వంగి నమస్కరించి వెళ్లిపోయాడు. తల్లి యిటు తిరగటానికిముందే, ఉమ చడిచప్పుడు కాకుండా తన చోటులోంచి లేచి పారిపోయింది. ఆమెగుండె టకటక కొట్టుకుంది - పట్టుపడిపోయానేమో అన్న భయంతో కాదు బయట ప్రపంచంతో ముఖ్యంగా చాలా ఊహించుకున్నది ఆ థియేటర్ వాళ్లతో రాకపోకలేర్పడతాయన్న ఆశతో....

## 2

రాసమణికి ఒకమంచివీలుంది. ఆ వీధిలో యెవరేమనుకుంటున్నారో యేమనుకోవటంలేదో తెలుసుకునే అవకాశం అంతగాలేదు. ఆమె యెవరింటికీ వెళ్లదు. తన యింటికెవరైనా సకృత్‌గా వస్తారు. సాదిక్‌వాళ్లు వస్తారు. కాని వాళ్లు యెవరి సంగతులూ పట్టించుకోరు. తమ దాసీ రాత్రిం బగళ్లు ఉండేది. వీధిలో ఉన్న పుకార్లన్నీ బుజాన వేసుకుని తిరుగుతుందన్న భయం చాలా తక్కువ.

కనుక నాటకాలవాళ్లు నీళ్లు తీసుకెళ్లే యేర్పాటు నిరాటఘాంగానే ఉంది. అంతేకాదు రాసమణి కిష్టంలేకపోయినా వాళ్లతో సన్నిహితత్వం కూడా కాస్త పెరిగింది. ఒకరోజున హఠాత్తుగా ఒకస్త్రీ వ్యక్తి హడావిడిగా లోపలికి వచ్చి, "అమ్మగారూ, కోప్పడవద్దమ్మా, చాలా యిబ్బందిలో పడ్డాను. మీ యింటి యిటువైపు కొంచెం వాడుకుంటాను" అంటూ పంపు పాయఖానా వైపు చూపించింది.

ఇష్టంలేకపోయినా అడ్డుచెప్పే ఉపాయం లేదు. మొహమాటం అడ్డువస్తుంది. ఆమె అనుమతికోరినా, దానికోసం ఆగలేదు. తాను కట్టుకున్న ఖరీదయిన శాంతిపురంచీరమీద తువాల ఒకటివేసుకొని అటువైపు వెళ్లింది.

తర్వాత తిరిగివచ్చి "హమ్మయ్య బతికాను" అని సంతృప్తిగా నిట్టూర్చి రాసమణి వంటింటి కెదురుగాఉన్న వరాండాలోకి వచ్చి నుంచుంది. "ఒక పాన్ యిస్తారామ్మా ? పాన్‌లు యింటిదగ్గిర మరచిపోయి వచ్చాను" అన్నది.

ఆమె తప్పనిసరిగా 'ఒట్టినేలమీద కూచున్నావేమమ్మా ! ఒక పీట తీసుకొచ్చివెయ్యి' అని దాసీకి చెప్పవలసివచ్చింది.

చటుక్కున ఆ స్త్రీ నాలిక కొరుక్కుని "అమ్మో ! మీ పీటమీద కూచుంటానా నేను ? మేము నరకంలో పురుగులం. ఎన్నో జన్మల పాపం మూలంగా, ఈజన్మలో యిలాంటి యింటో పుట్టాను. మళ్లీ బ్రాహ్మల పీట మీద కూచుని ఇంకా పాపాన్ని పెంచుకోనా ?" అన్నది.

రాసమణి మనస్సు మెత్తపడింది.

"నీపేరేమి టమ్మాయీ ?"

"నా పేరు ఏక్కడీ. చిన్నప్పుడు అమ్మ ఒక పైసాకి అమ్మేసింది. నేను నాటకాల్లో నటిస్తాను. మీ ఆశీర్వాదంవల్ల పెద్దపెద్ద పాత్రలన్నీ నేనే ధరిస్తూంటాను."

చేతులు జోడించి నమస్కరించిం దామె.

చూపులకికూడా బావుంటుంది. నలుపయినా మంచికళగల మొహం అనుకుంది ఉమ మనస్సులో.

"ఈమె మీకూతు రనుకుంటాను. నీపేరేమిటమ్మా చెల్లాయ్? ఉమా? వాహ్! నిజంగా ఉమే! ఎంత అందం!".

ఇలా రెండుమూడు మాటలయాక ఆరోజుకిమాత్రం వెళ్లిపోయింది. ఆతర్వాత ఇహ వాళ్లబృందానికి అడ్డుచెప్పటం జరగలేదు. తర్వాత ఒకరిద్దరు యిలాంటి ప్రాకృతిక అవసరాలు తీర్చుకోటానికి రావటం ఆరంభమయినది. రాసమణి ఆమొదటిరోజు తర్వాత ఉమను - 'జాగ్రత్త. వాళ్ల యెదుటికి రాకు. వాళ్లందరూ వేశ్యలట. వేశ్యలు తప్ప ఈపని చెయ్యటానికెవరు వస్తారు? నేను ముసలిదాన్ని. ఆమె అదోరకం. నువ్వు వాళ్లతో మాట్లాడావంటే లేనిపోని నిందలు వస్తాయి' అని హెచ్చరించింది. వారికి మామూలు ఆడవాళ్లకి తేడా యేముందో ఉమకి యెంత ఆలోచించినా తెలియలేదు. చాలా తియ్యగా మాట్లాడతారు. ఎంత మర్యాదో అంతవినయం. తల్లిని అందరూ 'అమ్మా' అని దూరంగా ఉండే నమస్కరిస్తారు. స్పర్శతగులుతుందని భయంతో పాదాలమీద చెయ్యి ఆనించరు. చాలాయెడంగా నేలమీదే కూచుంటారు. పంపుదగ్గిర కెళ్లి నీళ్లుతాగి వస్తారు. చెంబుకూడా అడగరు. వాళ్లతో కలియటంలో తప్పేమిటో ఆమె కేమీ తెలియలేదు. కాని ఈలోపుగా దాసీదాని మూలంగా ఉజ్జాయింపుగా తెలుసుకుంది. తెలుసుకున్నాక ఆమెకీ అసహ్యం వేసింది. నిజమే. అయితే మనుష్యుల్ని చూశాక ఆమె అహస్యత నలాగే ఉంచుకోలేకపోయింది.

ఏక్కడి ఈమధ్య తరచుగా వస్తోంది. మొదటిరోజున వచ్చిన పెద్ద మనిషిని గురించి ఉమ ఆమెవల్లనే తెలుసుకుంది. అతడిపేరు చంద్రశేఖర ముస్తఫీ. చాలా మంచినటుడు, మంచిశిక్షకుడుకూడానట. అతడు చాలా కఠినుడైన మాష్టరు. రిహార్సల్స్‌లో బెత్తం పుచ్చుకుని కూచుంటాడు. ఎప్పుడైనా కాస్త చిన్నతప్పు వచ్చిందంటే, బెత్తం వీపుమీదపడిందన్నమాటే! అయితే నన్నుమాత్రం యేమీ అనరనుకో. నేను ఆయన గురువుగారి

శిష్యురాలిని. పైగా ఇప్పుడాయన నాకు విలాసభర్త. అయినా నేను ముస్తఫీగారంటే చాలా భయపడుతూంటాను" అన్నది ఏక్‌కడీ.

మళ్లీ ఒకరోజున - "ఆ థియేటర్ తెరవనీయండి. నాటకం చూపించటానికి మిమ్మల్ని నేను తీసుకువెడతాను. ఎన్నాళ్లో లేదు. రెణ్ణెల్లలో తెరుస్తారు" అని చెప్పింది. రాసమణి తల గట్టిగా తిప్పుతూ, "ఛా! అమ్మో! నాటకం చూడటానికి రావటమా?" అన్నది.

"వస్తే యేమవుతుందమ్మా? చాలావరకు దేవుళ్లు దేవతల నాటకాలే వేసేది. 'సీతావనవాసం' ఉందనుకోండి. నేను సీతవేషం వేస్తాను. గురువుగారు రాముడి వేషం వేస్తారు. చూడండి యెలా ఉంటుందో!"

ఆమె ఇలా అనర్గళంగా ఇంకా చాలా వాగి వెళ్లింది. తన వ్యక్తిగత విషయాలుకూడా చాలా చెప్పింది. తాము ఓకొత్తలోకం మనుషులం, ఒక రకమైన ప్రాణులం. ఈ మాటలన్నీ చెప్పేటప్పుడు ఆమె గొంతు తగ్గించినా, ఉమ అన్నీ విన్నది. విని వణికిపోయింది. అయితే ఒక అద్భుతమైన ఆకర్షణ పొందింది. వినకుండా ఉండలేకపోయింది.

ఒకరోజున ఏక్‌కడి వేళకానివేళ వచ్చింది.

అప్పుడు మధ్యాహ్నం ఒకటిన్నర అవుతుంది. రాసమణి పైన విశ్రాంతి తీసుకుంటోంది. పూంటీ తల్లి బ్రతిమాలటంమూలంగా ఉమ ఆమె కూతురిచేత మొదటివాచకం చదివించటానికి ప్రయత్నిస్తోంది. కింద తలుపు యెందుకనో తెరిచేఉంది. దాసీ బహుశా యెదురింటి దాసీతో మాట్లాడటానికి తలుపు తెరిచిఉంచే వెళ్లినట్లుంది. అంచేత ఏక్‌కడి చడీ చప్పుడు కాకుండా యెప్పుడింట్లోకి వచ్చిందీ యెవరూ గమనించలేదు.

ఉమ చకితురాలయినది. అంతకంటె ఏక్‌కడిది యెక్కువ ఆశ్చర్యం! ఆమె చెంపకి చెయ్యిచేర్చుకొని, కాసేపు తెల్లబోయిచూస్తూ ఊరుకుని, "ఓలమ్మో! నీకు చదువు వచ్చుననుకుంటాను. ఇంతపిల్లవి, గడగడా చదివించేస్తున్నావే! అమ్మో! ఏమవుతుంది? యెక్కడికెళ్లను?"

ఉమకి కొంచెం గర్వం కలిగింది. తర్వాత జాలికూడా వేసింది.

"నీ - మీకు రాదనుకుంటాను" ఉమ సంకోచంతో అడిగింది.

"అసలు రాదు, మాలో యెవరికి వచ్చు? ఒకరిద్దరికితప్ప, తక్కిన వాళ్లందరూ చదువురాని మూర్ఖులు. ఆడవాళ్లు యెక్కడ చదువుకున్నారు? ఇహపోతే మాయింటి సంగతా?"

"అయితే మరి మీారు మీాపోర్షనంతా యెలా కంఠస్తం చేస్తారు ?" అని అడిగింది ఉమ.

"నన్ను 'మీారు' 'చిత్తం' అంటావ్ దేనికి ? నువ్వు బ్రాహ్మణపిల్లవి. మానెత్తిన కాలు పెట్టినా మాజన్మ సార్థకమవుతుంది ! ఆఁ చెప్పానుగా, పోర్షన్ విని బట్టీ పడతాం. ఒకరు చదువుతూంటారు. మేం విని విని ముఖస్తం చేసుకుంటాం. నోటికి రాదా ? ఎందుకు రాదు ?"

తర్వాత కాస్త దమ్ముతీసుకుని పాన్ బుగ్గను పెట్టి, "అమ్మగారెక్కడ ?" అని అడిగింది.

"పైన పడుకుంది"

"నిద్ర పోతున్నారా ?"

"లేదు, అమ్మకెప్పుడూ సరిగ్గా నిద్రపట్టదు. ఏదో పుస్తకం చదువుకుంటూంటుంది. లేదా ఊరికినే పడుకుంటుంది. ఇవాళ వేళకానివేళ యేమిటిలా ?"

'నువ్వు' 'మీారు' అనాల్సిన అవసరాన్ని నేర్పుగా తప్పించుకుంది.

"మీా అమ్మకూడా చదువుకున్నా రనుకుంటాను. అందుకని మీారామె దగ్గిర చదువు నేర్చుకున్నారు"

"కాదు. మేం బడికి వెళ్లే చదువుకున్నాం"

ఏక్కడి పైకి వెళ్లి గుమ్మం దగ్గిర నలచదరపుపీటమీాద కూచుంది. "అమ్మా ? అమ్మాగారూ ?"

పుస్తకం చదువుతూ చదువుతూండగా రాసమణికి కాస్త నిద్రమత్తు వచ్చినట్టుంది. ఆమె పిలుపుకి కంగారుగా లేచి కూచుని "రా రా, లోపలకు వచ్చి కూచో. నలచదరంపీటమీాద మధ్యాహ్నంవేళ - అందులో ఆడపిల్ల కూచోకూడదు"

"ఇవాళ సాయంత్రం తోటకెళ్లే కార్యక్రమం ఉందమ్మా ! అందుకని మధ్యాహ్నం రిహార్సల్స్‌కి వచ్చాం. నాపని అయిపోయింది. ఇప్పుడు పాటలు కడుతున్నారు. మళ్లీ కాసేపయాక నాకు పిలుపు వస్తుంది. అందుకని మీా దగ్గిరకి పరుగెత్తుకొచ్చాను. చాలా దాహంకూడా వేస్తోంది"

"ఆఁ వెయ్యదూ ? మధ్యాహ్నంవేళ ఉరుకులూ, పరుగులూ...."

రాసమణి లేచి వెళ్ళి రెండు కొబ్బరిఉండలు, చెంబుతో మంచినీళ్ల తెచ్చింది.

"నీళ్ల నాదోసిట్లో పొయ్యండమ్మా ?"

రాసమణి కొంచెం తెల్లబోయి. "అఖ్కర్లేదు నువ్వు దాంతోనే తాగు. దానివల్ల దోషం యేముంది? నువ్వూమనిషివేగా !" అన్నది.

అయినా మంచినీళ్ల మెల్లిగా చెంబు యెత్తి పోసుకుని తాగి, చెంబు పక్కగా పెట్టింది.

తర్వాత కాసేపు ఆమాట ఈమాట మాట్లాడాక "అమ్మా, ఒక్క మాట అడుగుతాను. కోప్పడరుకదా ? చెప్పండి" అన్నది.

"లేదు, లేదు. కోపం యెందుకు తెచ్చుకుంటాను ! అడుగు"

"అమ్మా ! తప్పుగా భావించొద్దు. అన్ని వైపుల నుంచి ఆలోచించే చెపుతున్నాను. మీ అమ్మాయి బాగా చదువుకుంది."

"బాగా యెక్కడమ్మా ?"

"అమ్మో ! ప్యాసుకూడా అయిందటగా ? అంటే చదవటం వ్రాయటం బాగా తెలుసు".

"ఇంగ్లీషు మాత్రం రాదు. ఈ రోజుల్లో ఆడపిల్లలు కొందరు యింగ్లీషు కూడా నేర్చుకుంటున్నారు."

"ఇంగ్లీషు రాకపోతే పోయింది. నేను అడిగే దేమిటంటే మీ అమ్మాయి చదువు నేర్పుతుందా ? మేము యెనిమిది పదిమందిమి నేర్చుకుంటాం. రూపాయి, రెండురూపాయలు యెవరి స్తోమతనుబట్టి వాళ్లం యిస్తాం. నెల అయేసరికి ఆడుతూ, పాడుతూ, పదిహేను రూపాయ లొస్తాయి. అందరం కలిసే చదువుకుంటాం. దానివల్ల పెద్ద శ్రమకూడా ఉండదు. మహా అయితే రోజుకి ఒక గంట...."

రాసమణి గట్టి నిర్ణయంతో తల ఆడిస్తూ "అహఁహ. అది కుదరదు. దానివల్ల పెద్దనింద వచ్చి పడుతుంది" అన్నది.

"నింద దేనికమ్మా? చదువు చెప్పడంవల్ల నింద దేనికి ? అదీకాక -' కొంచెందగ్గి గొంతు సవరించుకొని "మీరు దయతో అన్నీ చెప్పారు. మేమింక తెలుసుకోవలసింది యేమీ లేదు. అమ్మాయికి జీవితమంతా యింకా ముందే ఉంది. మీరు కన్నుమూస్తే ఆమె యేం చెయ్యాలి ? అన్నది యెప్పుడైనా

ఆలోచించారా ? చేస్తేవంటలక్కపని, లేదా దాసీవృత్తి. అదీకాకపోతే పెద్దక్క యింట్లో జీతంలేని దాసీవృత్తి'' అన్నది.

ఇంత ఆత్మీయత వెల్లడిస్తున్నందుకు, రాసమణి కొంచెం కోపం తెచ్చుకుంది. కనుబొమలు చిట్లించి ''ఏమయితే అది అవుతుందమ్మా ! ఇంత వయసొచ్చిన పిల్లచేత డబ్బుసంపాదన చేయించలేను. అదీకాక మీరు పది పన్నెండుమంది రోజూ సాయంత్రమప్పుడు ఇక్కడికి వస్తే - యేమీ అనుకో వద్దు, వీధిలో వాళ్లందరూ యేమనుకుంటారు ?'' అన్నది.

''పోనీ సాయంత్రం వేళ బండి పంపించి, ఆమెని మాదగ్గిరకే తీసుకెడతాం''

ఈసారి రాసమణి కోపాన్ని అణచుకోలేకపోయింది. ''నాకూతురు మీ థియేటర్‌కి వస్తుందా ? నీకు అతిశయంకూడా యేమీ తక్కువలేదు. ఇలాంటిమాట యింకెప్పుడూ నాదగ్గిర యెత్తకు'' అన్నది.

ఏక్‌కడి విస్మితురాలయి ''నేనలా థియేటర్‌కి రావాలన్నమాట చెప్పనే లేదమ్మా ! మీరు అనవసరంగా కోపగించుకుంటున్నారు. అదీకాక ముందుగానే కోప్పడననే మాటకూడా తీసుకున్నాను'' అన్నది.

రాసమణి శాంతించింది, కాని ఆమాటకు సమాధానం చెప్పలేదు. అవమానభావన, అణచుకున్న కోపం ఆమెని దహించి వేస్తున్నాయి. ఏక్‌కడి ఇంకా కాసేపు మెదలకుండా ఊరుకుని లేచి వెళ్లిపోయింది.

ఆ సంగతి ఉమ చెవినికూడా పడింది. అప్పుడామె మెట్ల మొదట్లోనే ఉంది. ఆ తర్వాత మూడు నాలుగురోజులు గడిచాక, ఆమె సంకోచాలు, అను మానాలు, అన్నిటినీ వదిలేసుకుని బాహాటంగానే తిరుగుబాటు ప్రకటించింది. ''నువ్వు నా కింక యీ మాటలన్నీ చెప్పఖ్ఖర్లేదు. నిజంగా నాకు యేం యేర్పాటు చెయ్యగలవో చెప్పు. నీదగ్గిర ఉన్నడబ్బుతో మహా అయితే అయి దారు సంవత్సరాలు ఇలా కూచుని తినగలం. కాని తర్వాత యెలా తింటాం ? నేను యెక్కడికి పోయి నిలబడను.''

రాసమణి కన్నార్పకుండా ఆమెకేసి చూసి, ''సరే, నిన్ను మీ అత్త వారింట్లో దింపి వస్తాను. తర్వాత నీయిష్టం ఏమయినా చెయ్యి''

''ఏం? నేనక్కడి కెందుకెళ్లాలి ? ఖూనీ అవటానికా ? మీరే అన్నీచూసి విచారించి పెళ్లిచేశారు, దానికి నాదా బాధ్యత ?''

"అది నీ అదృష్టం. మేం ప్రయత్నంలో యేలోపమూ చెయ్యలేదు."

"అవిషయంలో అదృష్టం, మరి ఈవిషయంలో అదృష్టాన్ని అంగీకరించకపోవటం యెందుకని? నేనయినా కష్టపడి తినటానికి ప్రయత్నిస్తున్నాను"

"అలా అని నువ్వు ఆవేశ్యలకు, పతితలకి చదువు చెప్పటానికి వెడతావా ? నీ పది పదిహేను రూపాయలవల్ల నాకు పెద్ద ఒరిగే దేముంది ?"

"పది పదిహేనురూపాయలు, ఇరవైఅయిదురూపాయలు కావటం యెన్నాళ్లు? పని అలవాటవుతుంది. అయినా పది హేనురూపాయలు ఒక పొట్ట గడుపుకోటానికి చాలదా ?"

ఉమ తన సాహసానికి తానే ఆశ్చర్యపోయింది.

"కాని ఆ వయస్సింకా రాలేదమ్మా ! యౌవనం, రూపం పెద్దశత్రువులు. ఇంత పెద్దశత్రువుల్ని వెంటపెట్టుకుని యేపని మాత్రం చేస్తావ్ ? అదీకాక ఈ అయిదారేళ్లలో అల్లుడి బుద్ధి మారదని యెవరు చెప్పగలరు ?"

ఆ ఆశ ఉమ మనస్సులోంచి పూర్తిగా తొలగిపోయింది. ఆమె మెదలకుండా ఊరుకుంది. తన భర్త రూపవంతుడైన యౌవనుడు. మన్మథ కాంతి. ఆ రూపస్మృతి కామవాయుఘాటి, నిరాశాభస్మస్తూపం మధ్య నుంచి - చాలాకాలం తర్వాత ఆశను సంజీవిలా పునరుజ్జీవింపచేసింది. మనస్సులో పేరుకు పోయిన స్తబ్ధత. యేదో దక్షిణవాయువుకి దూరంగా కొట్టుకుపోయి, ఆమె శరీరం ధర్ధర్ మని కంపించసాగింది.

## 3

రెండురోజుల తర్వాత ఒకరోజున హఠాత్తుగా చంద్రశేఖర ముస్తఫీ స్వయంగా వచ్చాడు. రెండుచేతులూ జోడించి - "అమ్మా ! నాదొక అభ్యర్థన" అన్నాడు.

రాసమణి కారణమేమిటో ఊహించలేకపోయినా, యేదో ఉపద్రవం తెచ్చిపెట్టబోతున్నాడని భయంతో కఠినంగా "చెప్పండి" అన్నది.

"నేను బ్రాహ్మణ్ణి. మీ బిడ్డలాంటివాణ్ణి. ఒక మాట చెపుతాను, తప్పుగా భావించకండి. ఏక్‌కడి దగ్గిర అంతా విన్నాను. మీకూతురు నా చెల్లెలులాంటిది. ఈపని కనుకచేస్తే గొప్పబాధ్యతనుంచి విముక్తి కలిగించిన దవుతుంది. నేనే వేరే ఒకయిల్లు యేర్పాటు చేస్తాను. అక్కడికి మగవాళ్లు యెవరూ రారని హామీ యిస్తున్నాను. మాదాసీది వచ్చి ప్రతిరోజూ రాత్రి యేడుగంటల ప్రాంతంలో తీసుకెడుతుంది. బురఖా వేసుకుని వెడుతుంది.

ఎవరూ అంతగా గమనించరు. నేను గుమ్మందగ్గిరే ఉంటాను. ఆమెకేసి యెవరూ తలెత్తి చూడటానికికూడా ధైర్యం చెయ్యలేరు. వాళ్లు తొమ్మిది మంది చదువుకుంటారు. ఒక్కొక్కరు రెండేసిరూపాయి లిస్తారు. అదీకాక మేం థియేటర్‌నుంచి పన్నెండురూపాయ లిస్తాం. లోకులకు తెలిస్తేగదా నింద వేసేది! నేనంతా విన్నాను. దానివల్ల మీకొచ్చే నష్టం యేముంది? మీ కింకా పెళ్లి చెయ్యవలసిన ఆడపిల్ల లెవరూ లేరు. సమాజంతో మీకేమిటి సంబంధం?"

రాసమణి కాసేపు మెదలకుండా ఊరుకుని, "కాని నాకింకొక కూతురు అల్లుడు ఉన్నారు. వాళ్లకి సమాజం అనేది ఉన్నది" అన్నది.

"ఇది కలకత్తా నగరమమ్మా? ఇక్కడ సమాజంశాసన యేముంది? ఇక్కడ యెవరు యింకొకరి సంగతి తెలుసుకుంటారు?"

"లేదు బాబూ! ఇంక ఈవిషయాలేమీ యెత్తకండి. అది నేను చెయ్యలేను"

రాసమణి దుస్సహమైన కోపంతో మండిపడింది. ఈ అక్కసు అంతా తన అదృష్టం మీద. ఇంత జరిగినా యింకా అదృష్టదేవత కోరిక తీరలేదా? తననింకా క్రిందికి దింపటానికి కింత కుట్రా? ప్రలోభం అనే వలను ఇంకా అందంగా నాలుగువైపుల నుంచీ విసరి పట్టుకున్నాడు. రాసమణి వెనక్కి తిరిగి పైకి వెళ్లిపోయింది - బుద్ధిపూర్వకంగానే ముస్తఫీని అవమానం చెయ్యటానికి.

కాని ఆ ఉపద్రవం యిక్కడితో ఆగలేదు.

మళ్లీ ఏక్‌కడీ వచ్చింది. రకరకాల యుక్తులు, యెన్నో ప్రలోభాలు చివరికి కమల ఒకరోజునవచ్చి అంతావిని "పంపించు అమ్మా? మరో అభిప్రాయం చెప్పకు" అన్నది.

"నువ్వూ ఆమాటే అంటున్నావా? అల్లుడికి తెలిస్తే యేమను కుంటాడు?"

"అది నేనే ఆయనకు చెపుతాను, నాకాధైర్యం ఉంది. ఇందులో తప్పేముంది? అకారణంగా సమాజానికి భయపడటం దేనికమ్మా? సమాజం నిన్నేమయినా పెట్టిపోషిస్తుందా? ఇతరులమీద ఆధారపడి బతకటంకంటే యెలాగో అలా కష్టపడి సంపాదించుకుని తినటం బాలా మేలు"

"కాని యింత అందం విచ్చిన పిల్లను యెక్కడికి పంపను చెప్పు"

"అక్కడ ముస్తఫీగారు మంచి ప్రస్తావన తెచ్చారమ్మా! అందంవిందే పిల్ల ఒకవేళ చెడిపోయేట్లయితే మీరు కాపలా కాసి ఆపగలరా? ఎంతని కళ్లల్లో పెట్టుకోగలరు? అదీకాక నాచెల్లెళ్ల అలాంటివాళ్ల కారమ్మా."

ఇంకా రెండు మూడు రోజులు ఆలోచించి, సలహాలు, సంప్రదింపులు అయాక రాసమణి మెత్తపడింది. ఇష్టంలేకపోయినా ఒకవిధంగా అనుమతి యిచ్చింది. కాని తర్వాత పూజలో కూచున్నప్పుడు ఆమె కళ్లు రెండూ కాల్వలయిపోయాయి "భగవాన్! ఏమిటిలా చేశావ్?"

ఉమకి రోజంతా గుండెలు గుబగుబ కొట్టుకున్నాయి. ఏదో తెలియని భయం. ఏదో పేరు తెలియని ఆశ. ఎంత ప్రయత్నించినా స్థిరంగా ఒకచోట కూచోలేకపోయింది. మతిస్థిమితంగా పెట్టుకుని యేమీ ఆలోచించ లేకపోయింది.

సాయంత్రమయే ముందు తల్లిదగ్గిర కెళ్లి 'నేను చెయ్యలేనమ్మా! నువ్వు వారిని వారించు అని చెపుదామనిపించింది.

కాని యేదో ఆశ! పనిలో తీరికలేకుండా ఉండాలనే ఆశ! డబ్బు సంపాదించాలన్న ఆశ! ఇలా యెన్నో ఆశలువచ్చి అడ్డుపడ్డాయి. ఆ ఆశే ఒకసారి థియేటర్‌లోని దాసీ పద్మ వెనకాలే నిరాటంకంగా లాక్కెళ్లింది. తల మీది చెంగు ముఖంవరకు లాక్కుని, దుప్పటి బుజాలనిండా కప్పుకుని చీకట్లో యెలాగో పరుగెత్తుకుంటూ రాస్తా దాటి వెళ్లింది. అయినా వీధిలో యెన్నోవేలజతలకళ్ల కుతూహలదృష్టి తనమీదే పడుతోందని, హేళ నగా నవ్వుతున్నారని అనిపించింది.

థియేటర్‌కి వెళ్లాక ఆమె పరిస్థితి మరీ అధ్వాన్న మయింది. ఆడవాళ్లు ఇద్దరు ముగ్గురు తెలిసినవాళ్లే. కాని తక్కినవాళ్లు యేదో కుతూహలాన్ని దాచుకున్న దృష్టితో, తనవైపు చూస్తున్నారని అనిపించసాగింది. వాళ్ల మనస్సులోని భావం యేదో నిశ్శబ్దంగా "ఇంకెన్నాళ్లలే, తొందరలోనే మా జట్టులో కలసిపోతావు. ఆలస్యం లేదు. ఈ గౌరవం. అతిశయం యెక్కువకాలం నిలబెట్టుకోలేవు. చాలామందిని చూశాం మేము" అని చెపు తున్నట్లనిపించింది.

అదీకాక ముస్తఫీగారి కఠిన శాసనం ఉన్నా, ఒకరిద్దరు పురుషులు అటునుంచి యిటునుంచి ఆమెకేసి తొంగిచూశారు. వాళ్లకేసి తిరిగి చూడ కుండానే ఉమ గ్రహించగలిగింది.

ఉమకి చెమటలు పట్టిపోయాయి. గుండెల్లో యెలాగో ఉంది. ఆమెకి కాళ్లు చేతులూ తిమ్మిరెక్కుతున్నాయి.

ఎలాగో కొన్ని నిమిషాలు గడిచిపోయాక - ఏక్‌కడితో యేడుస్తూ "నాకివాళ ఏమిటో పెద్దభయంగా ఉంది. అక్కా! నన్ను యింటికి పంపించు" అన్నది.

ఏక్‌కడి కళ్లు జాలితో చెమ్మగిలాయి. "నాకు తెలుసు చెల్లాయ్? మొదటి రోజున యిలాగే ఉంటుంది. ఇంతమంది తెలియని ముఖాలు కదా! ఇవాళ చదువు చెప్పుక్కర్లేదులే, పోనీ కాసేపు కూచుని కబుర్లు చెప్పుకుందాం".

"కాదు కాదు. నాకు ఒళ్లంతా పట్టు తప్పిపోతోంది. నన్నిప్పుడే యింటికి పంపించు".

ఇలా అని ఉమ తానే బయటికి వచ్చేసింది. మరొకవైపుగా బయటికి వెళ్లబోయి, స్టేజి మీదకి పరుగెత్తి ఆ వెనుక త్రాళ్లు మోకులు గుట్టల మధ్య దిక్కు తెలియకుండా పోయింది.

"పద్మా! చూడు చూడు. అటు వెళ్లు, త్వరగా వెళ్లు నువ్వు. ఇదిగో చెల్లాయ్! ఇటురా ఇటురా, అంతగా అయితే నేనే నిన్ను తీసుకెళ్లి దింపి వస్తాను." ఏక్‌కడి అరుస్తోంది.

పద్మ యించుమించు పరుగెత్తు కెళ్లి, ఉమని చెయ్యి పట్టుకుని బయటికి తీసుకువచ్చింది.

ఒకామె ఏక్‌కడితో "నువ్వు యిదేం పని అక్కా? ఆ అమ్మాయ్ మరీ బొత్తిగా చిన్నపిల్ల, ఇలాంటి చోట్లకెప్పుడైనా వచ్చిందా?" అన్నది.

ఇంకొక ఆమె చెయ్యి గిల్లి "చాల్లే ఊరుకో, ఇలాంటి చిన్నపిల్లల్ని మేం చాలామందిని చూశాం. ఇలాంటివాళ్లే తర్వాత స్టేజిమీదకి యెక్కి థయ్ థయ్ అని తైతక్కలాడటానిక్కూడా భయపడరు" అన్నది.

ఏక్‌కడి ఆమెని గద్దించింది.

ఉమ థియేటర్ బయటికి వచ్చికూడా మొదట్లో గాభరాపడి పోయింది. తర్వాత పద్మ ఆమెని చెయ్యి పట్టుకుని లాగి, "ఇదిగో ఇటువైపు, ఏమిటలా తెలివితక్కువదానిలా నాలుగువైపులా చూస్తూ నిలబడతావ్?" అనేసరికి, అప్పుడు తిరిగి స్పృహ వచ్చింది. ఉమ తమ సందు

గుర్తు పట్టి పద్మ గుప్పిట్లోనుంచి తన చేతిని లాక్కుని విడిపించుకుని, ఇంచు మించు పరుగెత్తుకుంటూ వెళ్లి పెద్దరాస్తా దాటి, తమ సందులో కెళ్లింది.

సరీగ్గా తమ యింట్లోకి వెళ్లబోతున్న సమయంలో పరిచితమైన కంఠం వెనుక నుంచి "ఇదిగో ఉమా ! ఒక్క మాట విని వెళ్లు" అని పిలవటం విన్పించింది.

ఉమ ఉలిక్కిపడింది. బహుశాగోడను పట్టుకోకపోతే పడిపోయే దేమో ! ఈకంఠస్వరంతో ఆమెకి ఉన్న పరిచయం సామాన్యమే. అయినా హృదయంలోని తంత్రులన్నీ, ఈకంఠస్వరంతో శాశ్వతంగా కట్టివేయబడినట్లు. ఆ స్వరాలన్నీ అప్పుడే జాగృతమయినట్లయింది.

ఇదేమిటి ! ఇత డామె భర్త శరత్ !

ఉమ తలెత్తి చూడకపోయినా అతణ్ణి గుర్తుపట్టింది. శరీరంలోని అణుపరమాణువులతోసహా అతడి ఉపస్థితిని గ్రహించింది.

"నిన్నిప్పుడే థియేటర్‌లోనుంచి బయటికి రావటం చూశాను. ఏమిటిది ? నిజమేనా ?"

ఈ సహజమయిన స్నేహపూరితమైన మాటల వెనక ఉన్న యెత్తి పొడుపు మూలంగా ఉమ కాఠిన్యాన్ని తెచ్చుకుంది. ఇంతవరకు ఆమె గొంతు పూడుకుపోయినట్లు - ఈసారి స్పష్టంగా చెప్పింది జవాబు.

"ఆఁ దానివల్ల యేమయింది ?"

"చివరికి నీకీ దుర్గతా ? ఛీ...."

ఉమ భగ్గుమంది. "మీరేమో నన్ను వదిలేశారు ? నాకెలా గడు స్తుందనేది యెప్పుడయినా ఆలోచించి చూశారా ? వితంతువయిన మా అమ్మ యెక్కడినుంచి తెచ్చి నన్ను శాశ్వతంగా పోషిస్తుంది ? అమ్మ పోయిన తర్వాత నేనెక్కడ నిలబడను ?"

"నీ విషయంలో నేను చాలా తప్పు చేశాను.. నిజమే బహుశా నీకు చెప్పే హక్కుకూడా నాకు లేదేమో ! అయినా నువ్వు నాటకాల్లో దిగావా ? వద్దు వద్దు. నేను ఊహించలేకపోతున్నాను ఉమా ! నువ్వు ఈ పని చెయ్యొద్దు. ఛీ...."

ఈ మాట అని శరత్ యింకమింకు చీకట్లో పారిపోతూ మాయ మయినాడు.

అతడు యిక్కడికని రాలేదు. ఇది హఠాత్తుగా దారిలో కలుసు కోటమే అని ఉమ అనుకోలేదు. అందుకని లోపలకు రమ్మని పిలుపు కూడా యివ్వలేదు. "లోపలకు రండి, ఈ రాత్రి ఉండి వెళ్లండి" అనే ఉమ హృదయంలోని ఆర్త విన్నపమని అతడికి తెలియదా? అనవసర మనే ఉమ చెప్పలేదు. చెప్పే అవకాశం కూడా యివ్వలేదు అంతలోనే అతడు వెళ్లిపోయాడు.

ఆమెకి చెప్పుకోవలసిన సంగతులెన్నో ఉన్నాయి. అతణ్ణి అర్థించా లనుకున్న భిక్షలున్నాయి. ఎంతో ఆరాధిస్తున్న - యెంతగానో కాంక్షి స్తున్న దైవం దగ్గిరకు వచ్చినా, అతడి ఆరోపణ యెంత అబద్ధమో ఆ సంగతి తెలియచెయ్యటంకూడా జరగలేదు.

ఏమిటిలా అయింది? ఆమె కెందు కిలా అయింది?

ఉమ రాతిబొమ్మలా నిశ్చేష్టురాలై ఒక అడుగు గుమ్మంలో పెట్టి ఒక చేత్తో దర్వాజా పట్టుకుని, అక్కడే నిలబడిపోయింది. ఆమెకి అటు యిటు కదలటానిక్కూడా శక్తిలేకుండా పోయింది.

# తొమ్మిదవ పరిచ్ఛేదం

## 1

ఉమ ఆ రోజున రాత్రంతా మేల్కొని యెదుటలేని భర్తతో - "తప్పకుండా వెడతాను. నాకు చెయ్యటాని కిష్టమైన పని నేను చేస్తాను. అహఁ. మీరు వద్దన్నారుకనుకనే చేస్తాను. ఎందుకు? ఎందుకు మీరు నన్ను వారించారు? ఏ అధికారంతో వారించారు? నాకు మీరేం అధికారమిచ్చారు? నన్ను ఒక్క రోజయినా స్వీకరించలేదు. అలాంటప్పుడు మీ మానమర్యాదల్ని నేనెందుకు లెఖ్ఖచెయ్యాలి?" అని పదే పదే వాదించసాగింది.

తన అంతరాంతరాల్లో భర్త నిషేధాజ్ఞారూపంగా యిచ్చిన సలహా మేఘమందరస్వరంతో ధ్వనిస్తోందని ఆమెతెలుసుకోలేదు. ఆ సలహాని తిరస్కరించే శక్తి తనకి లేదు. అందుకనే మాటిమాటికీ తన మనస్సు

లోనే ప్రగల్భాలు కొడుతోందని మాత్రం ఆమె అంతరాత్మకి తెలుసు. ఇది కేవలం బలహీనులకుండే ఆక్రోశం. అది తెలుసుకునేంత ఆత్మవిశ్లేషణ శక్తి ఆమెకి లేదు. పొద్దున్నే లేవగానే ఆమె తనకి తానే దీన్ని అంగీకరించక తప్పలేదు. రాత్రిళ్లు యెన్నో సమయాల్లో మానసికశక్తులు బాహ్య ప్రకృతిలాగానే అస్పష్టతతోనూ, జడత్వంతోనూ ఆవరింపబడి ఉంటాయి. సూర్యోదయంతోపాటు మళ్లీ స్పష్టంగా బయటపడతాయి. ఉమకూడా తన మనస్సులో ఉన్న సత్యాన్ని స్పష్టంగా చూడగలిగింది. తన భర్త ఒక్కరోజు కూడా తనకి భార్య - అనే గౌరవాన్నివ్వలేదు. అతిస్వల్పమైన కారణంతో తన జీవితాన్ని నాశనంచేసిన భర్త దగ్గిర నిర్దయాత్మకమైన ఉపేక్షను, ఆత్మీయుల దగ్గిర్నుంచి అవహేళనను మాత్రమే తాను పొందగలిగింది. అలాంటిభర్త అసంగతమైన సలహానికూడా ఉపేక్షించలేని తన నిస్సహాయస్థితి తలపుకి రాగానే పొద్దున్నే యేడ్చింది. ఆ కన్నీళ్లు క్షోభవల్ల అభిమానంవల్ల కలిగినవి. ఆ అభిమానం అదృష్టంమీద బహుశా తనమీద కూడా.

సాయంత్రం థియేటర్ దాసీ పద్మ పిలవటానికి వచ్చింది.

ఉమ అంతకుముందే తల్లితో "అమ్మా! నువ్వు ముస్తఫీగారికి నా నమస్కారాలు చెప్పు. ఆ పని దానివల్ల కాదు, దాన్ని క్షమించండని చెప్పు" అని దృఢకంఠంతోనే చెప్పింది.

పద్మ యింకా యేదో చెప్పబోయింది. రాసమణి అడ్డు వచ్చి.

"అహః హః. అసలు నేను అంగీకరించటమే పెద్ద పొరపాటయింది. త్వరలోనే తన పొరపాటు తెలుసుకుంది. మంచిదయింది. గురువు రక్షించారు, ఇంక దీన్ని గురించి యేం మాట్లాడటం నా కిష్టంలేదు. ఆయనతో చెప్పు" అన్నది.

ఆమె మొఖవైఖరి చూశాక, పద్మకింక యేం మాట్లాడటానికి ధైర్యం కలగలేదు.

## 2

శ్రావణమాసం మధ్యలో రాసమణి పెద్దక్క తన అద్వితీయమైన బిందెతో, చంకన రెండు మూడు గుడ్డలు కట్టుకున్న తువాలుమూటతో వచ్చి పడింది. వచ్చీరావటంతోనే "చావుకోసమే వచ్చానే రాసూ! నాకు నీ దగ్గిర చచ్చిపోవాలని యెన్నాళ్లనుంచో వుంది మనస్సులో. చచ్చేసమయంలో నేనే

మనిషి ప్రతాపమంతా. జపాలు తపాలూ చెయ్యటం దేనికి? చావు తెలుసుకుంటే చాలు. భగవంతుణ్ణి యెప్పుడు కోరుకుంటూంటా - "పుట్టినప్పటి నుంచి ఇంతవరకు పడ్డ బాధే చాలు. చచ్చేప్పుడుకూడా వేదించకు, రాసు దగ్గిర చనిపోయేట్లు చెయ్ అని."

ఉమ ఆమెకేసి విస్తుపోయి చూసింది. ఆమెది శక్తి సామర్థ్యాలు యేమాత్రం ఉడిగిపోని ముఖం. వయస్సు అరవయ్యో అంతకంటె యెక్కువే ఉన్నాయో! కాని ఒక్కపన్ను ఊడలేదు. జుట్టుకూడా యెక్కువగా నెరవ లేదు. వార్ధక్యచిహ్నాల్లోకల్లా నడుంమాత్రం కాస్త వంగింది. అదీ సామాన్యంగానే. ఎక్కడా రోగలక్షణా లేవీ లేవు. ఈ మనిషి చచ్చి పోతుందా?

"ఏమిటే అలా చూస్తున్నావ్?" నవ్వుతూనే అడిగింది పెద్దమ్మ.

"నీకు జబ్బేమిటి పెద్దమ్మా?" అని అడిగింది ఉమ.

"జబ్బా? ఏమీ లేదు. జబ్బుచేస్తే యెలా జరుగుతుందే! ఇంత దూరం యెలారాగలను? ఇన్నాళ్లూ చిన్నతమ్ముడి కొడుకు దగ్గిరున్నాను. రైలు స్టీమరు యెక్కి రెండు రోజులు కటిక ఉపవాసాలు చేసి వచ్చాను."

"అయితే?" ఉమ తెల్లబోయి చూసింది.

"అయితే యేమిటా? చావుమాటన్నాను దాన్ని గురించా? అది నాకు బాగా తెలుసు. అన్నం నోటికి చేదుగా ఉంటోంది, అంటే ఇంకా యెన్నాళ్లో బ్రతకనన్నమాట! మహా బతికితే ఆర్నెల్లు. జబ్బు యేదో ఒకటి యెందుకు చెయ్యదు? ఏదో ఒకటి చేస్తుంది. వస్తే జ్వరం వస్తుంది లేకపోతే విరేచనాలు, లేకపోతే రెండూ రావచ్చు. తర్వాత బస్, అంతే!"

"ముందు కాళ్లు కడుక్కోటానికి నీళ్లివ్వటం, తర్వాత స్నానానికి నీళ్లు పెట్టటం అదేం లేదు. ఊరికే సోది వేసుకు కూచున్నావా?"

రాసమణి కూతుర్ని గద్దించింది.

ఉమ తెల్లబోయి, గబగబా చెంబుతో నీళ్లు తెచ్చి పీలమండల వరకు కాళ్లు కడిగింది. తలకి రాచుకునేందుకు చిన్నగిన్నెతో నూనె తీసుకొచ్చి నీళ్ల తొట్టె పక్కన పెట్టింది. తర్వాత ఉతికి ఆరేసిన రాసమణి తెల్లటి పంచె ఒకటి చేత్తో పట్టుకుని నుంచుంది. పెద్దమ్మ తనతో తెచ్చుకున్న బట్టలన్నీ రైలు బట్టలు. వాటి నన్నిటినీ తడిపి ఆరెయ్యాలి.

ఆమె స్నానం చేసి వచ్చి, ఆ బట్ట విడిచేస్తుండగా ఉమ మళ్లీ "అమ్మ తప్ప నిన్నెవరూ ఆదరంగా చూడరని తెలిసికూడా అమ్మదగ్గిర ఉండవు యెందుకని? ఈవయస్సులో అక్కడికీ యిక్కడికీ తిరగటం దేనికి?" అని అడిగింది.

"నీవింత తెలివితక్కువ మొద్దువేమే!" ఆమె ముఖంలో చతురయిన నవ్వు తొంగిచూసింది. "నేనెక్కడయినా కొన్నాళ్లు ఉండాలను కుంటే వాళ్లెంతయినా మండిపడుతూ ఉండనియ్, ఉండి తీరుతాను. ఇది నాకు మరణకాలంలో ఆశ్రయం. దీన్నెందుకు విసిగించివేసారు స్తాను? అలా చేస్తే చచ్చే ముందు యెక్కడికి పోయి ఉండను? ఎవరు చూస్తారు? చిట్టచివరి ఆశ్రయాన్ని యెవరయినా నష్టపరుచుకుంటారుటే. ఎక్కువ రోజులుంటే యెంత కోపం పెరుకుపోతుంది? మరణకాలంలో అంతా బదులు తీర్చుకుంటారు. నేనలాంటిదాన్ని కాను!" అని తనలో తాను గొణుక్కుంటూ, తానే నవ్వుకుంది.

ఉమ పెద్దమ్మ రావటంతో బతికిపోయింది. ఏదియేమయితే యేం ఒక పని అంటూ దొరికింది. ఆమెవెంటవెంట తిరుగుతుంది. దఫాల వారీగా ఉపచారాలు చేస్తుంది. సకారణంగా, అకారణంగా తిట్లుతింటూ ఉంటుంది. ఉమకి అదికూడా బాగానే ఉంటుంది. ఊరికే పనిలేకుండా కూచోటం కంటె యేదయినా నయమే. అదీకాక ఆమె తనకితానే పెద్దమ్మ కష్టమేమిటో, ఆమె కడుపులోని మంట యేమిటో తెలుసుకుంది. తాను ఈ కొద్దిరోజులలో పిచ్చెత్తిపోయినట్లయింది, పెద్దమ్మ యింతకాలం సహించింది. గుండెల్లో ఆర్పశక్యంకాని అగ్ని మండుతూంటే. దాని సెగలు పొగలు కాస్త బయటకి రాకుండా యెలా ఉంటాయి?

రాసమణి అది గ్రహించింది. అయినా ఒక్కొక్కప్పుడు దుస్సహ మవుతూంటుంది. వంటింటి గడపలో నాలుగు పలకల పీటమీద కూచుని పెద్దక్క కక్కే విషమంతా నీలకంఠుడు కాకపోతే సహించటం కష్టం. అందుకని ఆ అసహనమంతా, యే అజాగ్రత్తగా ఉన్న సమయంలోనో. యిద్దరికి మధ్య తగవులాటగా పరిణమించేది. రాసమణి సహజంగా తక్కువ మాట్లాడుతుంది. మాట్లాడేది మాత్రం గుండెల్లో సూటిగా గుచ్చు కుంటుంది. పెద్దమ్మ ఒక్కసారే మండిపడుతుంది. అరుపులు, తిట్లు, యేడుపులతో పిచ్చిదానిలా తయారవుతుంది. కాసేపు అరిచాక అవతలిగొంతు యేమీ వినిపించకపోతే, బిందె తీసుకొని చకచకా కిందికి దిగివస్తుంది. అప్పుడప్పుడు ఆమె కోపంతో వెళ్లిపోతున్నట్లుంది అనిపించేది ఉమకి. కాని ఆమె వెళ్లదు. వీధిగుమ్మందాకా వెళ్లి దభీమని చతికిలపడేది. కాసేపు రాగాలు

పెడుతూ యేడ్చి తర్వాత మళ్లీ తిరిగి వచ్చేది. చెల్లెలి నుద్దేశించి "ఇలా వేధిస్తే నేనిప్పుడే వెళ్లిపోతాననుకున్నావేమో. ఎక్కడికి పోతాను? పోతే నాకెలా జరుగుతుంది? చచ్చేమందు చాకిరీ చేయించుకుని మరీ చస్తాను. అప్పుడే యీ యింట్లోంచి పోయేది?" అనేది.

భాద్రపదం చివరలో పెద్దమ్మ నిజంగానే మంచం యెక్కింది. ముందు జ్వరం, తర్వాత అతిసారం రెండూ వచ్చాయి. రాసమణి మూడు రోజులు చూసి, డాక్టర్ని పిలుచుకురమ్మని పంపింది. పెద్దమ్మకి తెలియదు. డాక్టరురాగానే ఆ జ్వరంలోనే లేచి కూచుని, "ఏమే రాసూ! ఏమిటి నీ ఉద్దేశం? నాకు వైద్యం చేయించకుండానే చంపుదా మనుకున్నావా?" అన్నది.

రాసమణి తెల్లబోయింది.

"అదేమిటక్కా! డాక్టర్ని పిలిపించాను"

"గొప్పపని చేశావ్. మైలపడేస్తావా నన్ను? మూడువంతులు బతుకువెళ్లిపోయింది, ఒక వంతు మిగిలిపోయింది. ఇదివరకెప్పుడూ చెయ్యని పని యిప్పుడు చెయ్యనా? ఈ శవాలుకోసేచి డాక్టరుచేతి మందు తిననా? ఆయుర్వేదవైద్యుణ్ణి పిలిపించు" అన్నది.

ఆయుర్వేదవైద్యుడు వచ్చి నాడి చూసి 'జ్వరాతిసారం' అని చెప్పాడు. "అది పాలు తాగే పసిపిల్లవాడికూ్కడా తెలుసు. జ్వరం, అతిసారం ఉన్నప్పుడు అది జ్వరాతిసారమే అవుతుంది" అని పెద్దమ్మ అతణ్ణి గదమాయించింది.

ఆయుర్వేద వైద్యుడు సాంత్వనగా "భయంలేదు, తగ్గిపోతుంది" అన్నాడు.

"నా బొంద తగ్గుతుంది. నువ్వెంత పండితుడివో తెలిసిపోయింది. చావు జబ్బు వచ్చి పట్టుకుందని తెలియటంలా? అందుకోసం కాదు. నాకు యిది నయం కాదు. అయినా నువ్వు మందియ్యి. మందెందుకు వేసుకోను? చస్తానుకదా అని వైద్యం చేయించుకోకుండా చస్తానా?" అన్నది.

పదిరోజు లయేసరికి యెక్కువయింది. కాళ్లు చేతులు ఉబ్బటం మొదలయినాయి.

దసరాల్లో షష్ఠిరోజున చెల్లెల్నిపిలిచి "ఎక్కువరోజులు మంచంలో తీసుకోనే! కాస్త కాస్తే బతికిపోతున్నాను" అని చెప్పింది. రాసమణి అర్థంకాక ఆమె ముఖంకేసి చూస్తు ఊరుకుంది.

"అర్థంకాలేదా? పిలుపు వచ్చింది. అందర్నీ పిలిపించు. గంగా యాత్రకి యేర్పాట్లు చేయించు"

ఉమకి యేమీ అర్థంకాలేదు. మృత్యువుని మానవులు యిలా ముందుగానే తెలుసుకోగలరా? ఇంత నిర్భయంగా, నిస్సంశయంగా దాని యెదుటికి వెళ్లగలరా? ఆమెకి కళ్లనిండానీళ్లు తిరిగాయి - ఈ గయ్యాలమారి నోరు మంచిదికాని, వృద్ధురాలికోసం. దాంతోపాటు భయంతో మనస్సు వణికిపోయింది. తనకీ యిదే పరిణామమా!

కమలకి కబురు చెయ్యగానే పెద్దఅల్లు డొచ్చాడు. ఇంకా చాలామంది జనం గుమికూడారు మంచాన్ని యెత్తేప్పుడుకూడా దాన్ని యెత్తినవారి అజాగ్రతను తిట్టింది పెద్దమ్మ. బిందెని చెల్లెలి కిచ్చిపోయింది. "అన్ని బంధాల్ని వదిలించుకుని పోవాలి. లేకపోతే మళ్లీ తిరిగిరానా? ఉన్న బంధాల్లో యీ బిందెని నువ్వే తీసుకో రాసూ! అంతే! ఇహ నాకు విముక్తి గంగా.... గంగా!.... హరి బోల్....హరిబోల్...."

దారిపొడుగునా యిష్టమంత్రాన్ని జపించుకుంటూ వెళ్లింది. గంగ రేవుకి తీసుకెళ్లి మంచాన్ని నీళ్ల అంచున దించారు. రాసమణి ఆమెనోట్లో కాసిని గంగ నీళ్లు పోసి, కాసిని నీళ్లు ఒళ్లంతా చిలకరించింది. గంగమట్టి తీసి కాస్త నుదుటిమీద, గుండెలమీద పూసింది. పెద్దమ్మ కళ్లమూసుకునే పడి ఉంది. ఆ సమయంలో ఒకసారి "పొట్టమీదకూడా మట్టి పూయవే. చల్లబడుతుంది. మంట మండిపోతోంది" అన్నది.

తర్వాత ఆమెని తీసుకొచ్చి గంగాయాత్రికుల గృహంలో వుంచారు. అప్పుడీ శ్మశానవాటికలోని యీ గృహం శోచనీయమైన స్థితిలో ఉంది. పడిపోయిన యిల్లు. యెటువైపునా తలుపులు లేవు. వాన కురిస్తే నీళ్లు బయటికంటె లోపలే యెక్కువ పడతాయి. నిర్జీవంగా ఉండే శ్మశానంలో పడిపోయిన ఆ యింట్లో యీదురుగాలి పగలే కీళ్లు బిగుసుకు పోయేంత భయంకరంగా ఉంటుంది. అయినా అక్కడ విడిచిపెట్టటం కంటె గత్యంతర మేముంది? ఆమెని మోసుకొచ్చినవాళ్లు స్నానాలు చేసి వెళ్లి పోయారు. రాసమణి ఒక్కతే ఆమెని పెట్టుకొని ఉంది. పెద్ద అల్లుడి నౌకరు మధ్య వచ్చి, ఖబరు తెలుసుకు వెళ్లటం అని అనుకోవటం జరిగింది. అతడు మాత్రం ప్రొద్దున సాయంత్రం వచ్చి వెడుతూంటాడు అన్నది.

ఆ యింట్లోకి తీసుకొచ్చాక పెద్దమ్మ ఒక్కటేమాట అన్నది. "గంగా తీరంలో ఎలాంటి వెధవపని చెయ్యనే రాసూ! నువ్వు నిశ్చింతగా ఉండు.

అయితే ప్రాణం పోవటమే యింక ఆలస్యం!" తర్వాత ఇహ ఆమెకి తెలివి తప్పిపోయింది.

ఆ రోజంతా అలాగే గడిచింది. సాయంత్రం యింక యిద్దరు ముగ్గురు పరిస్థితి తెలుసుకుందామని వచ్చారు. వచ్చినవారిలో ఒకామె 'పాట్' వెయ్యండి, 'పాట్' వెయ్యండి. లేకపోతే మొండిముండ సులభంగా చావదు" అన్నది.

పాట్ వెయ్యటమంటే - కొబ్బరిముక్కలు. నీళ్లలో వేసిన అన్నం. మజ్జిగ కలిపి తినిపించటం. గంగాయాత్రలో యిది ఆచారపద్ధతి. ఎలాగయినా కాని యేరోగిని చంపటం, మళ్లీ తిరిగి తీసుకెళ్లటం ఉండదు.

కాని రాసమణి తల అడ్డంగా త్రిప్పుతూ "మాట పడిపోయింది. పెదిమలు కరుచుకుపోయాయి. ఎవర్ని తినిపించను! కొబ్బరికాయ కొని యివ్వండి. వీలయితే ఒకముక్క నోట్లో పెడతాను" అన్నది.

సాయంత్రమయిం దగ్గిర్నుంచి కుంభవర్షం మొదలయింది. రాత్రంతా తెరపిలేకుండా ఒక్కటే వర్షం. ఆ వానకి రాసమణికూడా తడిసిపోయింది. మృత్యుముఖంలో ఉన్న ఆమే తడిసింది. ఎక్కడా రవంత పొడినేల లేదు. ఉన్న వెలుతురల్లా చిన్నప్రమిద దీపం. అదికూడా బయటి గాలికి మాటిమాటికీ ఆరిపోతోంది. అగ్గిపెట్టె వెలగటం లేదు. అప్పు డెవరయినా శవాన్ని దహనం చెయ్యటానికయినా వస్తే బాగుండును, అని కోరుకుంది రాసమణి. కాని అదురోగ్యంలో యెవరూ శవాన్ని బయటికి తీసుకురావటానికి సాహసించలేదు. ఆ కారుచీకట్లో తెలివితప్పి మృత్యు ముఖంలో ఉన్న ఆమెని పెట్టుకొని, రాసమణి ఒంటరిగా రాత్రంతా అలాగే గడిపింది.

ఉమను ఆపటంకోసమని కమల వచ్చి యింట్లో ఉంది. ఆమెకి ఉమకీ ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఆ చీకట్లో, వర్షంలో తల్లి శ్మశానంలో ఒంటరిగా కూచుని ఉన్నదని తలపుకి వచ్చేసరికి కమల తానే గజగజ వణికి పోసాగింది.

సప్తమి రోజున కూడా వర్షం ఆగలేదు. అలాగే కొంకర్లు పోయే చలిగాలి. మేఘాల ఉరుములు, తెరపిలేకుండా కుండపోతగా వర్షం. ఈ స్థితిలో ఉమ, కమల బండిచేసుకుని శ్మశానం దగ్గిర కెళ్లారు. ముసలిది యింకా బతికే ఉంది. ఎగశ్వాస మొదలైంది. బహుశా త్వరలోనే

ప్రాణంపోవచ్చు. "మీరిక్కడేంచేద్దామని వచ్చారు? వెళ్లండి, వెళ్లి స్నానాలు వెయ్యండి" అని రాసమణి కూతుళ్ల నిద్దర్నీ కేకలేసింది.

పెద్దఅల్లు డొచ్చాడు. కాసేపయాక అతడు తిరిగి వెళ్లక తప్పలేదు. మళ్లీ తాను ఒక్కతే. గంగప్రవాహం పెరిగిపెరిగి ఒడ్డులకి ఒరుసుకుంటోంది. బహుశా ఒడ్డు విరిగిపోవచ్చు, ఏమవుతుందో అన్నభయంతో, అందరి కను బొమలు ముడిపడ్డాయి, కాని గత్యంతరం యేముంది? ఆ మృత్యుపథ గామినిని వెనక్కి తీసువెళ్లటానికి వీల్లేదుగా!

పగలంతా గడిచి, సాయంత్రమయేసరికి వర్షం జోరు కాస్త తగ్గింది. కాని సాంతం ఆగిపోలేదు. పైగా గాలివేగం హెచ్చింది. బంగన్న బయలుగాఉన్న ఆ పడిపోయిన యింట్లో రాసమణి దీపం వెలిగించటానికి కూడా ప్రయత్నించలేదు. కిందటి రాత్రిలాగానే ఒక్కతే చీకట్లో కూచుని ఇష్టమంత్రాన్ని జపించుకోసాగింది. రోజంతా యేమీ తినలేదు. స్నానం చేసి నీళ్లలో నిలబడే కొబ్బరిచిప్పమాత్రం తిన్నది. అక్కని తినిపించటం వీలుకాలేదు. కొబ్బరినీళ్లు త్రాగించటానికి ప్రయత్నించింది. చిన్నదగ్గువచ్చి పెదిమల వెలుపలే జారిపోయాయి.

అష్టమినాటి రాత్రి తెల్లవారుఝామున నాభిశ్వాస కంఠానికి యెగితట్టింది. నవమినాడు వేకువవేళ అంతా ముగిసింది. మూడుపగళ్లు మూడురాత్రులు యెగశ్వాసపడిన రోగితో రాసమణి అలాగే గడిపింది. అప్పుడామెముఖం చూస్తే యెలాంటి విలక్షణత తెలియలేదు. కాని దహనంచేసి, స్నానంచేసి యింటికి వచ్చీరావటంతోనే ఆమె మూర్ఛ పోయింది. ఆమూర్ఛనుంచి తర్వాత రెండుగంటలకి తెలివివచ్చింది.

## 3

పెద్దమ్మ మృత్యువు ఉమను కొత్తఆలోచనల్లోకి తీసుకెళ్లింది. ఆమె స్వభావాన్నికూడా గమనించింది. ఆమె మండిపోతూ మంటలను చిమ్ము తూండేది. ఆమె గుండెలనిండా అగ్ని వ్యాపించి ఉంది. ఆ అగ్ని తన గుండెల్లో మాత్రం మండటంలా? అయితే ఇంధనాలు పచ్చివి. అంచేత మంట పైకి లేవకుండా అణగిఉంది. కాని ఈ వ్యర్థత్వపుగాలితాకిడి యెప్పుడూ తాకుతూనే ఉంటే తన స్థితియెలా పరిణమిస్తుంది. పెద్దమ్మకంటే ఆత్మీయు లున్నారు. నిలబడటానికి చోటూ ఉంది - కాని తాను రెండుమెతుకులు కోసం అడుక్కోవలసి వస్తుంది.

ఇదీ తన స్థితి!

అందరూ తిరస్కరిస్తారు. గేలిచేస్తారు. తప్పించుకు తిరుగుతారు. కాదు, ఆస్థితి రావటానికి ముందుగానే తాను సార్ధకతామార్గాన్ని వెతుక్కుంటుంది.

ఇటీవల ఉమ పగలంతా చాలావరకు ఇంచుమించు సాయంత్రం కూడా - తమ డాబామీద ఒకమూల కొత్త థియేటర్ కెదురుగా ఖాళీజాగా కనిపించేచోట గడుపుతోంది.

శరత్ కనిపించినరోజు - ఆ కనిపించటం ఆకస్మిక సంఘటనకాదు ఖచ్చితంగా అతడీ దారిన వస్తూ పోతూంటాడని ఆమె విశ్వాసం. ఇంకొక రోజున తన కెప్పుడైనా కన్పిస్తే, దాసీని పంపి పిలిపించి రప్పిస్తుంది. ఒక్కసారయినా - కనీసం అయిదునిమిషాలుండటానికైనా రాడా ? పోనీ అతడి భ్రమనైనా పోగొడుతుంది. అతడారోజున తనని పొరపాటుగా అర్థంచేసుకోవటం ఉమహృదయాన్ని ముల్లులా గుచ్చుకుంది. ఆ తిరస్కార స్మృతి రాత్రింబగళ్లు మనస్సుని కలుషితం చేసింది.

కాని చూసి చూసి కళ్లు అలసిపోయేవి. ఎండవేడిమికి ప్రతిరోజూ తల నొప్పి వచ్చేది. అయినా ఆ నిరీక్షణకి అంతంలేదు. ఒకరోజున రాసమణి "వయసొచ్చినపిల్లవి అలా డాబామీద నిలబడి చూస్తూంటే - వీధిలో పడుచుకుర్రాళ్లేం తక్కువఉన్నారా ? చివరికి అప్రతిష్ట వచ్చిపడుతుంది" అని కేకలేసింది.

ఉమ మ్లానంగానవ్వి - "నాకింక ప్రతిష్ఠ, అప్రతిష్ఠ యేమిటమ్మా ? మీకు యిబ్బంది అంటే అసంగతివేరు. అలాంటి అప్రతిష్ఠ వచ్చినరోజున బారెడుచేంతాడు కొనివ్వు. అప్పుడు తెలిసేలా చేస్తాను. మీ బాధలన్న తీర్చేసిపోతాను" అన్నది.

ఆమాట అన్నాక రాసమణి యింకేమీ మాట్లాడలేక పోయింది. ఇందులో తనకి విరుద్ధంగా, ప్రచ్ఛన్నంగా ఆరోపణను తాను యెలా ఒప్పు కోకుండా ఉంటుంది ?

అప్రతిష్ఠ కొంచెం తలెత్తింది. అంతవయసులో ఉన్నపిల్ల రోజంతా డాబామీద నిలబడి బజారుకేసి చూస్తూండటం - అందులో భర్తచేత వదిలి వేయబడినపిల్ల - శోభస్కరం కాదు. అయితే రాసమణికి ఒక మంచివీలు ఉంది. ఆమె ఆవాడలో ఉన్నవారెవరితోనూ కలియదు. ఆ అపఖ్యాతి ఆమె చెవినపడే అవకాశాలు చాలాతక్కువ.

రోజులు, వారాలు, నెలలు గడిచిపోతున్నాయి. నిరీక్షణలోని యేకాగ్రత క్షీణించింది. హృదయంలో అగ్నిమంట రేగింది. ఉమ ఒక రోజున తల్లితో "అమ్మా! నేను థియేటర్‌లో చేరుతాను. నష్టమేముంది?" అన్నది.

రాసమణి తీవ్రకంఠంతో "అంటే దాని అర్ధం?" అని అడిగింది. ఉమ యిదివరకైతే అతీవ్రకంఠానికి భయపడేది. కాని యివాళ భయపడ లేదు. "నేను యేదో ఒకటి చెయ్యాలమ్మా! మనిషి చావుబతుకులమాట యెవరు చెప్పగలరు? హఠాత్తుగా నీకేదయినా అయితే - నేను యెక్కడ నిలబడను?"

రాసమణి కాసేపు ఊరుకుని - "ఇటీవల నువ్వు నీభవిష్యత్తుని గురించి యెక్కువగా ఆలోచిస్తున్నావ్ ఉమా! దాంతో నా చావునిగురించికూడా!" అన్నది.

"ఆలోచించటమే మేలమ్మా, ఇంకెవరయినా ఆలోచించేవాళ్లుంటే నేను ఆలోచించను. మృత్యువనేది నిశ్చయం, దాన్ని సంకోచంతో ఆలోచించ కుండా ఊరుకోవటంతో అర్ధంలేదు."

ఉమ సంకోచం, గుంజాటన యెక్కడికో కొట్టుకుపోయాయి. తన కింత సాహసం యెక్కడినుంచి వచ్చిందో తానే తెలుసుకోలేకపోయింది.

రాసమణి కాసేపు ఊరుకుని - "అలాంటి దేదయినా జరిగితే - కమల నిన్ను వదిలేసి ఊరుకుంటుందా?" అన్నది.

"బహుశా ఊరుకోకపోవచ్చు కాని నేనక్కడ యేవిధంగా ఉండ గలను? నేను యిదివరకే చెప్పాను. ఆమెకి గుదిబండగా తయారయి తిట్లయినా తింటూండాలి. లేకపోతే జీతంలేని దాసీపనయినా చేస్తూండాలి."

"కాని వేశ్యావృత్తికంటె అది వాంఛనీయం కాదా?"

"అలా అంటావేమిటమ్మా? వేశ్యలతో కలసినంతమాత్రాన వేశ్యా వృత్తి చెయ్యటమే అనటం భావ్యం కాదు. అదీకాక గత్యంతరం యేముంది?"

తర్వాత కాసేపు మెదలకుండా ఊరుకుని, యెక్కడలేని సాహసం తెచ్చుకుని, "ఇంకొక్క ఉపాయం ఉంది. ముసల్మానుగా మారి మరో వివా హం చేసుకోవటం. కాని అలా చేసినా నేను సుఖపడతాననే నిశ్చయం లేదు. ఏవిధంగానయినా నువ్వు నాకింక చోటు యివ్వలేవు, నాకు తెలుసు. అయితే ఇంకోమాట కూడా చెపుతున్నా; మీరు నాకు మరో మార్గమనేది చూపించక

పోతే నేను థియేటర్‌లోనే చేరాలి. పెద్దమ్మ మాదిరిగా అగ్నిహోత్రంలా ఉండటం నావల్లకాదు. సుఖం పొందలేక పోవచ్చు, కాని స్వతంత్రంగా బ్రతికే మార్గాన్ని పొందగలను".

రాసమణి ఆమె మాటలు విని కొయ్యబారిపోయింది.

ఉమకి యింత సాహసం వస్తుందని, తన ముఖంమీదే యిలా మాట్లాడుతుందని, రాసమణి యెన్నడూ కలలో కూడా అనుకోలేదు. కాని నిజంగా మాట్లాడినప్పుడు, ఆమెకి తిట్టే శక్తి లేకపోయింది. కూతురు యెంత మంటతో కుమిలిపోయి, యింత మొండిగా మారిందో తెలుసుకో గలగటంతో - ఆమె నిశ్చేష్టురా లయింది.

# 4

మూడు నాలుగు రోజులూ యెవరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. అది ఒక విచిత్రమైన పరిస్థితి. ఒక రెండంతస్తుల యింట్లో ఉన్నది. దాసీతో సహా ముగ్గురు ప్రాణులు. దాసీతో రెండు మూడు మాటలు మాట్లాడేప్పు డింట్లో కాస్త సవ్వడి అవుతుంది. ఆదాసీకూడా రెండుపూటలా కొంతసేపు మరొక యింట్లో పని చెయ్యటానికి వెడుతుంది. అప్పు డసలు యిల్లు ఖాళీగా ఉందా అనిపిస్తుంది. గాలి ఆడనట్లుండే ఈవాతావరణం దుస్సహమవుతున్న సమయంలో - ఓరోజు శ్యామ పిల్లల్ని తీసుకుని వచ్చింది.

మొదట్లో యెవరూ ఆమెని గుర్తుపట్టలేదు.

తర్వాత ఉమ ఒక్కపరుగున వచ్చి, శ్యామని కావలించుకుని, వెక్కివెక్కి యేడ్చింది. రాసమణి రెండు చేతులతో నుదురు కొట్టుకో సాగింది.

వాళ్లేదో కరువు కాటకాలు పట్టిన దేశంలోంచి వచ్చినట్టున్నారు. కరువంతా వారి ముఖాల్లో మూర్తీభవించినట్లుంది

చిక్కి శల్యావశిష్టమైన ముఖం, రేగి జడలు కట్టుకుపోయినట్లున్న జుట్టు, చిరిగి మాసిపోయిన బట్టలు ; తెల్లగా మీగడలా ఉండే రంగు - మాడి పూర్తిగా నల్లపడి పోయిన ఒళ్లు - చూస్తే భయపడాల్సిందే.

హేమ అదేపనిగా ఫెగ రొప్పుతున్నాడు. వారిలోంచి ప్రాణశక్తి నెవరో పిండి లాగేశా రనిపిస్తుంది.

"ఇదేం దుస్థితి మీకు? ఎందుకిలా అయిపోయారు? మాకు ఉత్తరమైన రాయలేకపోయావా?" ఉమ గుక్కతిప్పుకోకుండా అడిగింది.

శ్యామ కళ్లవెంబడి నీళ్లు కారుతున్నాయి. నీరసమైన కంఠంతో "ముందు కూచుంటాను, చెంబెడు మంచి నీళ్లియ్. నాలుగు కోసుల దూరం సొంతం నడిచి రావటం, పైగా చంకలో పిల్ల, ఇంక నావల్ల కాదు" అన్నది.

ఉమ గబగబా షర్బత్ చేసి యిచ్చింది. పిల్లలిద్దర్నీ త్రాగించటానికి పాలు వేడిచేసి తీసుకొచ్చింది.

శ్యామ అప్పటికి కింద గట్టుమీదనే పడుకుని పోయింది. ఆమె "ఆఁ ఆఁ కాసిని నీళ్లు కలిపి ఇయ్యి, లేకపోతే పొట్ట ఉబ్బుతుంది. ఇన్నాళ్లు పస్తులున్న వాళ్లు చిక్కటిపాలు తాగగలరా? ఒకవంతు పాలు మూడు వంతులు నీళ్లు" అన్నది.

రాసమణి చేతులతో కొట్టుకోవటంతో, నుదురంతా వాచిపోయింది. ఆమె యింక మెల్లిగా లేచి మెదలకుండా వంటింట్లోకి వెళ్లిపోయింది. కూతురి కెందుకింత దుస్థితి పట్టింది అని ఆమెకి అడగాలన్న ప్రవృత్తికూడా కలగ లేదు.

శ్యామ తనంతట తానే క్రమ క్రమంగా జరిగిందంతా చెప్పింది. చెప్ప తగిందేమీ లేదు. నరేన్ మధ్య మధ్య మాయమవుతున్నట్టే ఈసారి చాలా రోజులు మాయమయాడు. తాత్కాలికంగా ఉన్న పూజారి పూజ చేసి యిది వరకు ప్రొద్దున నైవేద్యం బియ్యం తీసుకెళ్లేవాడు. ఇప్పుడు సాయంత్రం పాలు కూడా తీసుకుంటున్నాడు.

"మీరు అనవసరంగా యిల్లు రెండుభాగాలు చేశారు. పదహారణాల పనిచేసేది నేను, మీకు భాగం యెందుకిస్తాను?" అన్నాడు సర్కార్ భార్య, ఆవాడలోవాళ్లు మొదట్లో దయాదాక్షిణ్యాలు చూపించేవారు. ఇప్పుడు సహాయం చేయవలసి వస్తుందన్న భయంతో యెవరూ వారిసంగతి పట్టించు కోవటం లేదు. ఉన్న వెండి, బంగారం వస్తువులు కాసిని పోయాయి. బిందెలు, గిన్నెల్లాంటి సామానులుకూడా తాకట్టులో ఉన్నాయి. ఆ తర్వాత కూడా వారంరోజులు పస్తులుండి, ఇహ గత్యంతరంలేక శ్యామ బయట పడింది. ఇంటికి తాళంవేసి వచ్చేసింది. మళ్లీవెళ్లి దఖలుపరచుకోగలదో లేదో సందేహం వగైరా....

సాయంత్రం భోజనాలవీ అయిపోయాయి. ఇంక రాత్రి భోజనాల ప్రమేయం యేమీలేదు. ఉమ డాబామీద చాపవేసి, పిల్లల్ని తీసుకెళ్లి

పడుకుంది. దాసీ బయటపనులన్నీ చేసి, వచ్చేసరికి అన్నం పెట్టటానికి శ్యామ వెళ్లింది. దాసీ అన్నంతింటూ కబుర్లు చెపుతోంది. వాళ్ల కబుర్లు చెప్పుకోవటం, గుసగుసలాడటం రాసమణికి అస్పష్టంగా విన్పిస్తున్నాయి. రాసమణికి యేవిషయంలోనూ ఆసక్తిలేదు. ఆమె రాత్రంతా చీకటి గదిలో యేదో స్వప్నావిష్టురాలిలా కూచుంది. ఈ సమయంలో శ్యామ "ఏవి(టమ్మా! నేవిన్నదంతా ?...." అని తీవ్రంగా అనటం వినిపించింది.

రాసమణి చకితురాలయినది. "ఏమయింది ? యేం విన్నావ్ ?" గొంతు బాగా తగ్గించి, తీక్ష్ణ కంఠస్వరంతో "ఉమ ధియేటర్‌కి వెడుతోంది టగా ! ఉమ నాటకాలు వేస్తుందా ?" అన్నది శ్యామ.

ఆమె కంఠస్వరం ధోరణికి రాసమణి కరుకుగా - "మంచిదేగా! దాని వల్ల యేమవుతుంది ?" అన్నది.

"అలా అయితే ఈ యింట్లో నేనింక ఒక్కక్షణంకూడా ఉండటానికి కుదరదు. ఇప్పుడే వెళ్లిపోతాను. నాభర్త విన్నారంటే యింకా నా ముఖం చూడరు".

రాసమణి లేచి నిలబడి, "నువ్వేదో నన్ను భయపెడుతున్నావ్, కాని నేను నిన్నేం రమ్మనలేదమ్మా. నీభర్త ఆశ్రయంలోకే వెళ్లు" అన్నది.

"ఆయన యెలాంటివారయినా కానియ్. అదే నా ఆశ్రయం. ఇన్నాళ్లూ ఇలాంటి శిక్షణే యిచ్చావ్! నేనిప్పుడే వెళ్లిపోతాను, చూడు".

ఉమ పరుగెత్తికొచ్చి, శ్యామ రెండుచేతులూ పట్టుకుని "నీకేం పిచ్చెక్కిందా యేం? ముందు అన్ని సంగతులూ విను" అన్నది.

"వద్దులే. నేను చాలా విన్నాను. వదులు నువ్వు"

"మరీ అజ్ఞానురాలిలా మాట్లాడకు చిన్నక్కా! నా మాటవిను. నీకాళ్లు పట్టుకుంటా"

శ్యామని డాబామీదికి తీసుకెళ్లి, ఉమ అన్ని సంగతులు విడమరిచి చెప్పింది. శ్యామ అప్పటికి శాంతించింది. "చెల్లాయ్! నువ్వు ఒకవేళ యీపని చేసినా అమ్మ నిన్ను వదలిపెట్టదు. అప్పుడింక నా కిలా అయినప్పుడు వచ్చి నిలబడే ఆశ్రయంకూడా ఉండదు. ఈనాడు ఉన్నది కనుకనే నా పిల్లలు బ్రతికారు. లేకపోతే నిజంగా మాడి చచ్చిపోయేవాళ్లు" అన్నది శ్యామ.

ఉమ మెదలకుండా ఊరుకుంది. ఆమెకి ఒకవిధమైన అభిమానం విద్రోహం గొంతువరకు వచ్చి, నురుగులు కక్కాయి.

కాసేపయాక, "నీ ఆశ్రయాన్ని గురించే దిగులుపడుతున్నావు, కాని నా సంగతేమిటో ఆలోచించి చూశావా ?" అన్నది.

శ్యామ ముఖం ప్రక్కకి త్రిప్పుకుని, "నా మాటలకు నువ్వు కోపం తెచ్చుకోకు ఉమా! కాని, అత్తవారింట్లో యెన్ని బాధలయినా కానియ్, భర్త యెలాంటివాడయినా కానియ్, ఆడవాళ్లకి ఆయిలే ముఖ్యం. నువ్వు కాళ్లుపట్టుకుని బ్రతిమాలయినా అక్కడికే వెళ్లి ఉండటం మంచిది. గౌరవ కుటుంబాల్లో పుట్టిన ఆడవాళ్లు నాటకాలు వేస్తారా? ఛీ, ఛీ, శరీరమే అన్నిటికంటె ముఖ్యమా ? కాదు చెల్లాయ్. అలాఅయితే మాతోసంబంధం పెట్టుకోటం సాధ్యంకాదు. మామగారి వంశానికి మాలిన్యాన్ని పూయలేను" అన్నది.

ఉమ పెద్దమ్మ గుండెల్లోని మంటని కొంతవరకైనా అంచనావేసి తెలుసుకోగలిగిందా ?

ఉమ ముఖంలో యెంత విచిత్రమైన నవ్వు కన్పించిందో శ్యామ చీకట్లో చూడలేకపోయింది. శ్యామ కనుక భర్తను పూర్తిగా పొందకపోతే, ఈ మాట యెలా అనగలిగింది!? శ్వశురవంశంమీద యింత యిష్టం ఉండేదా ?

శ్యామ మళ్లీ, "కాదు కాదు. నువ్వు అర్థంచేసుకోవటంలేదు. పిల్లలు పెద్దవాళ్లవుతారు. వాళ్లకి ఒకపరిచయం ఉండాలిగా! నాసంగతి కూడా ఇంకోసారి ఆలోచించు" అన్నది.

"అవునదీ నిజమే!"

ఉమ పెద్దనిట్టూర్పుని అణచుకుని, "నీకేం భయంలేదు. నీ ఆశ్రయాన్ని నేనేమీ నష్టపరచను. నువ్వు పడుకో. వీళ్లని కిందికితీసుకెళ్లు" అన్నది.

"మరి నువ్వో ?"

"నాకింకా ఆలస్యం ఉంది."

నిస్తబ్ధంగా ఉన్న చీకటి రాత్రివేళ నక్షత్రాలతో నిండిన ఆకాశాని కేసి చూస్తూ, జీవితంలో పాథేయాన్ని వెతుక్కోటానికి ప్రయత్నించసాగింది ఆమె అంతర్యంలోని వేదన. నాలుగు వైపులా ఉన్న నిశ్శబ్దసాగరంలో

అలల్ని లేపిందో లేదో తెలియదు. జాములకు జాములు జరిగిపోతున్నాయి. పైన ఉమ, కింద రాసమణి.

# పదవ పరిచ్ఛేదం

## 1

శ్యామకి పదిహేనురోజులకంటె యెక్కువ ఉండటానికి ధైర్యం చాల్లేదు. పైకిమాత్రం యింటిసాకు ఒకటి చెప్పింది. "ఏం తెలుసమ్మా ? అదిక్కుమాలిన చక్రవర్తి తాళంపగలకొట్టి, జబర్దస్తీగా ఇంట్లో జొరబడి కూచుంటాడేమో అనిభయం".... కాని అసలు భయం వేరు. అది ఉమ గ్రహించింది. నరేన్ ఈలోగావచ్చి వెళ్ళిపోతాడేమో ! మళ్లీ ఇహ యెప్పటికీ తిరిగిరాడేమో ! కోపం వచ్చి శాశ్వతంగా వెళ్లిపోతాడేమో ! ఈ భయమే అన్నిటికంటె యెక్కువ. ఒకరోజున ఉమ ఈసంగతి స్పష్టంగా పైకి చెప్పింది. "ఇంకేమీ బెంగపెట్టుకోకే. ఒకవేళ బావగారు వస్తే, ఇల్లుతాళంవేసి ఉండటం చూడగానే, నువ్వు యిక్కడికి వచ్చావని తెలుసుకుంటారు. సరాసరి యిక్కడికే వస్తారు."

"ఆఁ ! ఆ బెంగతోనే నాకు నిద్రపట్టటం లేదా ? నువ్వొకతెవి ! అది కాదు, ఇంటికోసమే బెంగ. ఆశ్రయం కాస్తా పోతే యెక్కడ ఉంటాము చెప్పు ?"

ఉమ కాసేపు ఊరుకుని, "ఆయన్ని గురించి బెంగకనుక కాకపోతే, అంత ఆలోచిస్తావ్ దేనికి ? అక్కడ పస్తులుండటానికి వెళ్లటం దేనికి ? ఇక్కడే ఉండరాదూ ? ఇద్దరం ఉంటే ఒకవీలు, ఎలాగో అలా గడుపుకుందాం. అంతగా అయితే అక్కాచెల్లెళ్ళం యిద్దరం జంధ్యాలు వడుకుదాం. గాలిపటాలు కడదాం. వాటిమీాద వచ్చేదాంతోనే పిల్లల్నిద్దర్నీ పోషిద్దాం" అన్నది.

"అమ్మో !" శ్యామ వణికిపోయింది. అలాంటిమాట అనకే చెల్లాయ్. భర్తను వదిలేసి, శాశ్వతంగా పుట్టింట్లో దాసీవృత్తి చెయ్యటం - అది నావల్ల కాదు. తండ్రి బ్రతికిఉండగా పిల్లల్ని పితృపరిచయాన్నుంచి వంచితుల్ని చేస్తే, వాళ్లేమంటారు ? అంతకంటె అక్కడ పస్తులు పడిఉండట మయినా మేలే. ఇంక కొన్నాళ్లు పోయాక. పిల్లవాడికి యెనిమిదోయేడురాగానే-యెలాగో అలా వడుగు చేస్తాను, తర్వాత యింక దిగుల్లేదు. ఆ యింట్లోనే

స్థిరంగా ఉండొచ్చు. కావాలంటే వేరే పౌరోహిత్యం చేసుకుంటూనయినా బ్రతకగలడు. పిల్లకి పెళ్లిచెయ్యాలి, అదిగులు మాత్రం ఉంది".

ఉమ మొహం ఇవాళకూడా అవమానంతో య్రెరపడింది. శ్యామకి ఆమె పరిస్థితి తెలియదా ? కావాలని దెబ్బకొడుతుంది !

కాసేపు మెదలకుండా ఊరుకుని, అప్పటికీ శాంతకంఠంతో "కొడుకుని పురోహితబ్రాహ్మణ్ణి చేస్తావా ?" అని అడిగింది.

"మరి యేంచెయ్యను చెప్పు. అందరూ చదువు నేర్చుకోగలరా ? చదువు తక్కువ, శంఖం ఊదటం యెక్కువ అని సామెత ఉందిగా ! అదీకాక శిష్యులను యేర్పాటు చేసుకోటం, పౌరోహిత్యం చెయ్యటం వంశ పారంపర్యంగా వారి కులవృత్తి"

ఉమ యింక మాట్లాడలేదు. వీళ్లముందర దీర్ఘంగా నిట్టూర్చ టానికికూడా ఆమెకి సిగ్గేసింది.

శ్యామ అన్నీ సర్ది మూటలు కట్టుకుంది. తల్లివద్దనుంచి బలవంతంగా బంగారం తీసుకుని, రెండు చిన్నసగలు చేయించింది. "వాటిని యెన్నాళ్లు ఉంచుకోగలవమ్మా. మళ్లీ తాకట్టయినా పెట్టుకోవాలి. అమ్మనైనా అమ్మాలి" అన్నది రాసమణి.

శ్యామ యేమీా చిన్నపుచ్చుకోకుండా "అందుకైనా అవసరం. పుట్టింటి నుంచి వెడుతూ కూడా తాళిబొట్టు, నల్లపూసలతో వెడితే లోకులేమను కుంటారు ?" అన్నది.

బియ్యం, పప్పులు, మసాలదినుసులు సర్ది తీసుకోటంలో యేదీమరచి పోలేదు - చిల్లరసామానులతో సహా. ఒకరోజున అక్క యింటివెళ్లి, ఆమె కొడుకు తొడిగి, చాలకపోవటంతో వదిలేసిన ఉన్నిచొక్కాలు, కోట్లు అన్నీ అడిగి తెచ్చుకుంది. చలికాలం దగ్గరకు వచ్చింది. కమల ఆమె లోలుపతచూసి విస్మితురాలయింది. కొంచెం సిగ్గుపడింది కూడా. "నేను పోనీ కొత్తవి కుట్టించి యిస్తాను. వాటిని...."

"వద్దు వద్దు, అవసరమేముంది ? నువ్వు మహాఅయితే యిద్దరికీ రెండు కుట్టించి యిస్తావ్ ! ఇప్పుడు చాలా వచ్చాయి. ఇవి నీకెందుకూ పనికిరావు. చివరికి యేపనిమనిషి పిల్లలకో యిస్తావ్. అంతకంటె నాకు రెండురూపాయ లివ్వు - వాళ్లతిండికైనా ఉంటుంది"

కమల యేదో మాటవరసకి అన్నదనుకుంది ; కాని శ్యామ వెళ్లేప్పుడు నిజంగానే - "యేవి అక్కా ! రెండురూపాయలు ? ఆలోచించు. కొత్త చొక్కాలకి నీకింతకంటె యెక్కువ ఖర్చుయేది" అన్నది.

కమల రెండుకాదు, అయిదురూపాయలు తీసుకొచ్చి యిచ్చి, వాటితో పాటు తనవి రెండు పాతచీరెలు, ఒక కొత్తచీరె యిచ్చింది.

శ్యామ నిర్లజ్జతకు కమల సిగ్గుతో చచ్చిపోయింది.

తన పువ్వులాంటి చెల్లెలింక లేదు. విచక్షణత సరదాలు గల చెల్లెలికి బదులుగా ఈమె శరీరంలోకి యెవరు వచ్చారు ?

శ్యామ కిలాంటి మృత్యువు సంభవించిం దేమిటి ?

అన్నీ సర్దుకుని, బండిపిలిపించుకుని బయలుదేరి వెళ్లేప్పుడు శ్యామ తల్లికి ఉపదేశించబోయింది. "నీ గురుదేవుల్ని పిలిచి రప్పించు. ఉమకి యేదో ఒక దీక్ష యిప్పించమ్మా, అప్పుడు పూజలు, ఆచారాల్లో మనసుని మరిచిపోగలుగుతుంది. నిజం, అది యే ఆధారంతో ఉంటుంది చెప్పు ?"

రాసమణి గంభీరంగా "నువ్వు నీబండి సాగటంసంగతి చూసుకోమ్మా. నాకు జ్ఞానబోధ చెయ్యటానికి రాకు" అన్నది.

రాసమణి పైకి యేమన్నా, ఆమాట ఆమె మనస్సుని లోపల్లోపల కలవరపరచింది. ఆమాట యెప్పుడూ ఆమెకి తట్టలేదని కాదు, హిందువు లందరి యిళ్లల్లో - ముఖ్యంగా బెంగాలీ హిందువుల యిళ్లల్లో - వంశపారం పర్యంగా ఈమాట వింటూ వస్తున్నారు. 'ఆడదానికి నుదుటిరాత వక్రిస్తే, ఆమెకి యెలాగో అలా ఒక మంత్రాన్ని ఉపదేశించండి. అప్పుడు మంత్రధ్యానంతో అన్నీ మరచిపోతుంది. భగవంతునివైపు మనస్సు మరల్చుకుంటే, సంసారంలోని ప్రలోభాల నన్నిటినీ మరచిపోవచ్చు. ఈ మాటలు వినివిని సంస్కారంగా పరిణమించాయి. ఆ సంస్కారం రాసమణి రక్తంలో మాత్రం యెందుకు లేదు ?

అయినా రాసమణి మనస్సులో సంశయం తలెత్తుతూంటుంది. ఆ సంశయం చాలారోజుల్నుంచి తొలుస్తోంది. బహుశా కొంతవరకు తన మనస్సునిబట్టి యితరుల మనస్సుని అంచనా వేస్తోందేమో ! భగవంతుణ్ణి ధ్యానిస్తూ ఈజన్మలో శారీరిక సుఖాలను, భోగాలను అన్నిటినీ నిజంగా మరచిపోగలరా ? ఏదో పెద్ద ఆఘాతం తగిలి మనస్సుకి విరక్తి కలగనంత వరకు, దాన్ని సంసారం వైపునుంచి మరలించుకోగలరా ?

సంస్కారం, సంశయం, శ్రుతి, అనుభవం - ఈసంఘర్షణల మధ్య రాసమణి అలసిపోయింది. కాని యెక్కడా ఒడ్డు అనేది కన్పించలేదు. దారీ దొరకలేదు.

చివరికి ఒకరోజున – "నువ్వు దీక్ష తీసుకుంటావా అమ్మా ? తీసుకోవాలని ఉందా ? శ్యామ ఆరోజున అన్నది కదా అని ఇప్పించను. బలవంతంగా తీసుకోమని సలహాకూడా యివ్వను. నీమనస్సుకి యెలాతోస్తే అలాచెయ్యి" అన్నది ఉమతో.

ఉమ నివ్వెరపోయి, కొంచెంసేపు ఆలోచించింది. ఆమె జీవిత నౌక నడిసముద్రంలో తేలుతోంది. నావికుడు లేడు, దారి తెలియటం లేదు. కనుచూపుమేరలో ఒడ్డుకూడా కన్పించటం లేదు. తన చుట్టూ చిమ్మచీకట్లు కమ్ముకున్నాయి. ఈ చీకట్లమధ్య యెవరయినా దారి చూపించ గలరా ? ఈశ్వరుడు యెలా ఉంటాడతడు ? అతడే పరమ నావికుడని విన్నది. దిక్కులు తెలియని జీవనయాత్రలో ఒకే ఒక మార్గదర్శకుడు ! చివరికి అతణ్ణే అవలంబనం చేసుకోవాలా ?

బహుశా యిక్కడే ఉందేమో దారి సూచన ! కొత్త ఉషస్సు బంగారు వెలుగు తనవైపు లాక్కోవాలనే - బహుశా భగవంతుడు దుఃఖాన్నిచ్చి సంసారంనుంచి తన మనస్సుని మరలిస్తున్నాడు. కాల్చికాల్చి, తనని మేలిమిబంగారంచేసి తీసుకోవాలనుకుంటున్నాడు. బహుశా సుఖంకూడా ఉందేమో అక్కడ !

అతణ్ణి యెన్నికచేసి, అతడి దగ్గిరకి తీసుకెళ్ళేవాడే గురువు.

'అజ్ఞానతిమిరాంధస్య, జ్ఞానాంజనశలాకయా - చక్షురున్మీలితం యేన, తస్మై శ్రీ గురవే నమః' ఇది తల్లి రోజూ పఠించటం తాను విన్నది.

నష్టమేముంది ?

ఉమ ఇంకొంచెం సేపు ఆగి, "అ యేర్పాటే చెయ్యి అమ్మా ! నేను దీక్ష తీసుకుంటాను" అన్నది.

"బాగా ఆలోచించుకుని చూడు, తొందరపడకు ఇష్టమంత్రం అలాంటిది యిలాంటిది కాదు".

ఉమ ఆలోచించకేం? ఏదో ఒక అవలంబనాన్ని పొందగలుగుతుంది. అందుకని చివరిమాటగానే తల్లికి చెప్పింది.

కాని రాసమణికి మరొక విపత్తు వచ్చిపడింది. ఆకాలంలో తమ కిష్టం వచ్చిన గురువుని యెన్నుకునే సంప్రదాయంలేదు. కులగురువుని త్యజించటానికి వీల్లేదు. 'గురువుని వదిలి గోవిందుని పూజించేవాడు నరకంలో పడతాడు' అని వారి విశ్వాసం. పెళ్లి అయిన స్త్రీకి ఆమె శ్వశుర వంశం గురువే - ఆమె కులగురువు. కాని తనకి సంతానాన్ని యెవరిస్తారు? రాసమణి యెన్నోవిధాల ఆలోచించి కూతురితో "పోనీ నువ్వు నే రాసినట్టు - కాదు కాదు, వద్దు. కమల రాసినట్లు అల్లుడికొక ఉత్తరం రాయి. 'మీ కుల గురువు యెవరు? వారి చిరునామా పంపగలరా? - అని ...."

ఉమ చీకట్లో పాము కనిపిస్తే మనిషియెలా వణకిపోతాడో - అలా వణకిపోయింది. కంపిస్తున్న పెదవులతో "వద్దు వద్దు, అవసరంలేదు. అన్నీ త్యాగం చేసినప్పుడు ఇంక వారి గురువుకూడా అక్కర్లేదు. అయితే వారు శాక్తేయులు, అది మాత్రం తెలుసు. అత్తగారి గదిలో 'దశమహావిద్యా పటం తగిలించి ఉంది. ఆమె రోజూ ఆపటంముందు కూచుని ఆహ్నికం చేస్తూంటుంది" అన్నది.

"కాదమ్మా! నువ్వు ఉత్తరం రాయి, కులగురువుని త్యజించకూడదు, అదీకాక నీకు భర్త అనుమతి కూడా కావాలి".

భర్తకి ఉత్తరం రాయాలి. చాలా రోజుల తర్వాత మొదటిసారిగా - అదీ యితరులు రాసినట్లు!

ఉమ మనస్సు యెదురు తిరిగింది. ఎందుకు తనని పట్టుకుని మాటి మాటికీ చెలగాటమాడటం!

కులగురువు! ఎవరి కులం తనది? ఎవరు తన భర్త? ఒక్కసారి కూడా తనని స్పృశించని అతడు - పాదాలదగ్గిర స్థానం యిచ్చికూడా భార్యగా స్వీకరించని అతడా?

మళ్లీ 'స్వీకరించకేం?' అనిపించింది మనస్సుకి.

ఆనాడతడన్నమాట జ్ఞాపకం వచ్చింది. "వద్దువద్దు ఉమా? దీనిని నేను ఊహించలేను. ఈపని చెయ్యొద్దు. ఛ!"

స్వీకరించకేం? కాని యెలాగా ఉత్తరం రాయటం!

అయినా రాసిందామె. రాయక తప్పనిసరి అయింది. మూడు నాలుగు కాగితాలు రాసి చించేసి, అక్కరాసినట్లు ఉత్తరం రాసింది. కేవలం అవసరమైన ఉత్తరం.

ఇదే మొదటి ఉత్తరం, మొదటిసారిగా భర్త అన్నమాట. కిశోర వయస్సులో కాలుతొక్కిన తర్వాతనుంచే ఆడపిల్లలందరూ ఆ ఉత్తరం రాయాలని కలలు కంటారు.

నాలుగయిదురోజుల్లోనే సమాధానం వచ్చింది. అస్పష్టమైన దస్తూరి. వంకరటింకర పంక్తులు. భర్తదగ్గిర్నుంచికూడా యిదే మొదటిఉత్తరం.

'కల్యాణీయేషు .... నీఉత్తరం అందుకుని నేను మరింత అపరాధిని అని అనుకున్నాను. బహుశా భగవంతుడు నన్నెన్నటికీ క్షమించడు. నేను పడుతున్న బాధనుంచి విముక్తిపొందే ఉపాయంకూడా లేదు. అదలా ఉంచు. మాతో సంపర్కం యేమీ పెట్టుకోనప్పుడు గురువులవిషయంలో కూడా యేమీ పెట్టుకోవద్దు. మీ అమ్మ గురువులదగ్గిరే మంత్రదీక్షతీసుకో. నేను అనుమతి యిస్తున్నాను. దానివల్ల దోషం లేదు. ఒకవేళ పాపం యేదైనా వస్తే, ఆపాపం నాదే అవుతుంది. ఇట్లు - అభాగ్యుడైనభర్త, శరత్.'

'పునశ్చ - (P.S.) ఏఅధికారం లేదు. అయినా ఆనాటిమాట మరచి పోలేక, మూడునాలుగురోజులు థియేటర్‌కి వెళ్లాను. కాని నువ్వు కనిపించక పోవటంతో, నాదే పొరపాటని తెలుసుకున్నాను క్షమించు.'

ఉమ పదేపదే చదువుకుంది. పదేపదే గుండెల కదుముకుంది. కళ్లనీళ్లతో, గుండెలమీది చెమటతో అక్షరాలు అలుక్కుపోయాయి అయినా ఆశ తీరలేదు.

ఆశ యెక్కడ తలెత్తింది! బహుశా తనభర్త యెప్పుడో ఒకరోజున తనదగ్గిరకు తిరిగిరావచ్చు, లేకపోతే యిన్నిసంగతులు యెందుకు గుర్తుపెట్టు కుంటాడు! ఉత్తరంలో పశ్చాత్తాపవైఖరి స్పష్టమవుతోంది. రాత్రంతా ఉత్తరం దెంపన చేర్చుకుని, ఉమ నిద్రపోకుండా గడిపింది.

## 2

మరొక కొత్త సమస్య యెదురయింది. ఎవర్ని గురువుని చేసుకోవా లని రాసమణి పెద్ద ఆలోచనలో పడింది. అంతా విని, కాసేపు ఆగి, "గురువుని త్యజించవలసి వచ్చినప్పుడు నాగురువుల్నే ఆశ్రయించాల్సిన అవసరం లేదు. అసలు గురుదేవులు కాలధర్మం చెందారు. ఆయన తమ్ముడు ఉన్నారని విన్నాను. కాని అతడు మంచివాడు కాదు. అతడు తాగుతాడు, గంజాయిదమ్ము కొడతాడని వినికిడి అతడి. మీద భక్తి కలగదు.

అంతకంటె పెద్ద అల్లుడి సన్యాసిగురువు ఉన్నా రొకరు. ఆయనదగ్గిరే దీక్ష తీసుకో. ఏమంటావు ?" అని అడిగింది.

ఉమ యింకేమంటుంది ? మెదలకుండా ఊరుకుంది.

అయితే అక్క గురువుని చూస్తే గౌరవమే యేర్పడింది. అజాను బాహువయిన ప్రౌఢసన్యాసి. కాషాయవస్త్రాలు ధరిస్తాడు. కాని జడలు లేవు. పిరుదులవరకు వ్యాపించిన పొడవైన జుట్టు. నుదుట తాంత్రికమతాను సారంగా రక్తచందనం బొట్టు. అతిమిష్టభాషి. అందరితోనూ స్నేహపూర్వ కంగా వ్యవహరిస్తారు. చక్కగా పాడగల తియ్యనికంఠం. అప్పుడప్పుడు రామ్‌ప్రసాద్ కీర్తనలు పాడతారు. ఉమ ఆ పాటవిని కళ్లనీళ్లు ఆపుకో లేకపోయింది.

శ్రద్ధగా దీక్ష తీసుకుంది. ప్రతిరోజూ వచ్చి అభ్యాసం చేయిస్తారు. శిక్షణ యిస్తారు.

ఉమ తన యావచ్ఛక్తితో జీవితాన్ని పెనవేసి పట్టుకుంది. రోజు రోజూ కనీసం ఒక వైరాగ్యం కలుగుతుంటుంది. ఈ జగత్తు నుంచి ప్రతి రోజూ కాస్త దూరదూరం అవుతున్న అనుభవాన్ని పొందింది.

గురువులు మొదట్లో రోజురోజూ వచ్చేవారు. తర్వాత రెండు రోజుల కొకసారి చొప్పున నియమంగా వచ్చేవారు. ఉమ ఆయనపట్ల దైవంలా భక్తిభావం చూపేది. బిడ్డలాగా సేవ చేసేది. రాసమణి ఆమె భావ సరళి గమనించి మనశ్శాంతి పొందింది.

ఒకరోజున హఠాత్తుగా గురుదేవులు - "ఉమా ! మీ అమ్మ నిన్ను స్వయంగా నా దగ్గిరకు పంపించింది. నీ జీవితం సార్థకం, నీ అదృష్టం. అందుకనే లోకులు సౌభాగ్యం అని భావించేదాన్నుంచి వంచితురాలి వయినావు" అన్నారు.

అయన అనేమాట లేమిటో అర్థంకాక, ఉమ తెల్లబోయి చూస్తూ ఊరుకుంది.

గురుదేవులు నవ్వారు. "పిచ్చిదానా ! ఇది అర్థంకాలేదా ? నాకు సిద్ధి కోసం ఇలా నీలాంటి అమ్మాయే అవసరం. వెతికివెతికి ఆశ వదిలేసిన సమయంలో మీ అమ్మ తలవనితలంపుగా నిన్ను కలిపింది. ఇది ఆమె దయకాక యేముంది ? నీ మీదకూడా దయ తక్కువనుకోకు. సాధనా కార్యక్రమంలో నిమగ్న మవుతావు. ఇది ఒక జన్మసుకృత మనుకున్నావా ? జన్మజన్మలసుకృతం. భర్త నిన్ను స్వీకరించినట్లయితే సాధ్యమయేది కాదు."

ఉమకి శరీరమంతా గగుర్పాటు కలిగింది. నిజంగా అమ్మకింత దయా తనమీద ? నిజంగా ఇది తన జన్మజన్మాంతరాల సుకృతమేనా ? నాజీవితం మరింత సార్థకం చెయ్యాలనే తనని అపాతసార్థకతనుంచి వంచితురాల్ని చేసి ఉంటారా ?

ఏమిటో ! ఆమాటని ఉమ విశ్వసించలేకపోయింది. అయినా ఆమె మనస్సులో సంతోషం అలలు అలలుగా పొంగుతోంది. సాధనలో తాను సహాయురా లవుతుంది. తపస్సులో గురుదేవులకి సహచారిణి అవుతుంది. తాను తపస్విని, సన్న్యాసిని అవుతుంది.

గురుదేవుల్ని యెంతో ఆసక్తితో "ఆ సాధన యెప్పుడు ప్రారంభిస్తారు? బాబా ? ఆ సాధనలో నేనేం చెయ్యాలి ?" అని అడిగింది.

"చెపుతానమ్మా చెపుతా" అంటూ ఆమె కుడిచెయ్యి తన చేతుల్లోకి తీసుకుని, ఆప్యాయంగా నొక్కా డాయన.

ఉమ తరచు అడుగుతూండేది. ఊహించుకోటానికి ప్రయత్నిం చేది. కాని యేమిటో తెలిసేదికాదు.

గురుదేవులుకూడా స్పష్టంగా సమాధానం చెప్పలేదు. నిశ్శబ్దంగా ఆప్యాయంగా వీపు నిమిరేవాడు. లేకపోతే పెద్దజుట్టున్న ఆమె తలను తన ఒళ్లోకి తీసుకుని తలనిమిరేవాడు.

ఇప్పు డతడి మాటలు యేదో విచిత్రంగా ఉన్నాయి. "గురువు దగ్గిరే శిష్యురాలి కేస్థితిలోనూ సంకోచం ఉండకూడదు" అన్నాడు. ఉమ యేమిటో సిగ్గుపడింది. అతడు పురాణాల్లోని శృంగార కథలన్నీ చెప్పాడు. జీవితపు అనుభవాల్లోంచి యెన్నో ఉదాహరణలు ఉపదేశాల మధ్య జొప్పించేవాడు. అవి యెలాగో ఉన్నాయి.

ఉమకి యిదంతా యేమీ బాగా లేదు. కాని గురుదేవుల యెదుట నుంచి వెళ్లలేకనూ పోయింది "ఆ మాటలన్నీ వద్దు బాబా ! నన్ను యెప్పుడు తపోదీక్షలోకి తీసుకువెడతారో చెప్పండి. నేను యేం చెయ్యాలో తెలిసేలా చెప్పండి - నేను సన్న్యాసినిని కావాలనుకుంటున్నాను" అన్నది.

చివరికి ఒకరోజున - ఆమె యేం చెయ్యాలో చెప్పాడు.

తల్లి దగ్గిరకు పరుగెత్తుకెళ్లి తల దబదబ కొట్టుకోసాగింది.

"ఏమయిందే ? ఏమయింది ?"

"గురుదేవులమీద భక్తి చూపలేకపోతున్నా నమ్మా ? ఎందుకిలా సందేహాలన్నీ కలుగుతున్నాయి. నాస్థితి యేమవుతుంది ?"

"ఏమయిందో చెప్పవే !" అని రాసమణి బలవంతంగా తల యెత్తి పట్టుకుంది.

"ఆయన అదేదో తన సాధనలో సహాయపడటం చాలా పుణ్యకార్య మంటున్నారు. కాదు, కాదు అది నావల్లకాదు. నేను ఆయన్ని సాక్షాత్తూ యిష్టదైవమని భావించానమ్మా".

రాసమణి రాతి బొమ్మయిపోయింది.

"నువ్వుకూచో, నేను వస్తాను" అని ఆమె గురుదేవుల యెదుటికి వచ్చి చేతులు జోడించి - "భగవంతుడే అఘాతపరిచిన వారికి ప్రపంచంలో యెక్కడా చోటులేదు అని యివాళే తెలుసుకున్నాను మీరు దానికి విముక్తి కలిగించండి. మీరింక రానక్కర్లేదు" అని గురుదేవుల ముఖాన్ని నల్లగా మాడ్చి వెళ్లిపోయింది.

ఉమ తల్లి యెదుటికివచ్చి, "ఈ సంశయం యెందుకు కలిగిందమ్మా ? నిజంగా నాకెక్కడా స్థానం లేదా ? అయితే మరి నేనేం చెయ్యను ?" అంటూ తలకొట్టుకుంది.

# పదకొండవ పరిచ్ఛేదం

## 1

ఒక్కటొక్కటిగా సంవత్సరాలు గడిచిపోతున్నాయి.

మహాకాలం తనఖాతా పుస్తకంలో ఒకొకపుటనే త్రిప్పుతోంది. ఆ పుటలలో యెన్నో సుఖదుఃఖాల వివరాలు శాశ్వతంగా ముద్రిత మయిపోతున్నాయి. ఎంత హృదయవిధారమైన చరిత్ర, ఎంత గుండెలు బ్రద్దలు చేసే వేదన.

ఇప్పు డనిపిస్తుంది. దుస్సహమైనది కాలం – అందుకనే అస్పష్ట వేదనాదాయకమైన అనుభూతిగా పరిణమించి, ఏదో స్మృతి సుదూర దిగంతాల్లో మిళితమైపోతుంది.

శ్యామకికూడా సంవత్సరాలు గడుస్తున్నాయి. ఒకొక్కప్పుడు అప లేవీ గడవటంలే దనిపిస్తుంది. ఇంతకాలం తర్వాత సంసారనౌక ఈ సుడిగుండంలో మునిగింది. ఈ తుఫానులో అట్టడుక్కి కూరుకుపోయిం దనిపిస్తుంది. అది మళ్లీ యెలాగో తేలి అటు ఒరిగి, యిటు ఒరిగి ఒక నాటికి సరీగ్గా నిలబడుతుంది. స్తంభించిపోయిన శ్వాస మళ్లీ మామూలుగా బయటికి వస్తుంది.

ఇదే ఇంచుమించు ప్రతి దరిద్రపు సంసారాల చరిత్ర. శ్యామ జీవి తంలో మాత్రం అందుకు వ్యతిరేకత యెలా కలుగుతుంది?

నరేన్ మాయమవుతుండటం శ్యామ కిప్పుడు సహజమైపోయింది. అతడు తిరిగి వచ్చినప్పుడే సహించటం కష్టం. బియ్యం వస్తున్నాయి, నిజమే. భర్త కూడా దగ్గిరకి వస్తున్నాడు, అంతవరకే - కాని అతడి హంగామా, అతడు తెచ్చిపెట్టే గొడవలు సహించటం సాధ్యం కాదు. శ్యామకి ఒక్కొక్కప్పుడు ఇహ నేను పడలేను అనిపిస్తుంది మనస్సులో.

మంగళ వారిని వెళ్లకొట్టటానికి తక్కువ ప్రయత్నమేమీ చెయ్యలేదు. పూర్వం ఉన్న పూజారిచేత ఒకపూట పూజలుచేయిస్తున్నప్పుడు అనవసరంగా వీళ్లు అంటిపెట్టుకుని ఉండట మెందుకు? అదీకాక ఆ పూజారి చాలా గొడవ చేస్తున్నాడు. నరేన్ మధ్యమధ్య వచ్చి, నెల రెణ్ణెల్లు ఉన్నప్పుడు అతడికి వచ్చే మామూలు పోతూంటుంది. మొదట్లో తగాదా పెట్టుకుని నరేన్‌ని నొక్కి పెట్టటానికి ప్రయత్నించాడు. కాని ఒకటి రెండుసార్లు అయింతర్వాత ఆ ప్రయత్నమే మానేశాడు. నరేన్ కత్తులు, కఠార్లు పట్టు కుని వస్తాడు. ఆ సమయంలో అతడి ప్రచండరూపం యెదుట నిలబడటం కష్టం. మెదలకుండా సహించి ఊరుకోవలసిందే. పూజారికి గత్యంతరం లేదు. సహిస్తూనూ ఉంటాడు. మధ్య మధ్య మంగళదగ్గిర ఫిర్యాదూ చేస్తూంటాడు.

కాని మంగళకి యేంచెయ్యాలో తోచటంలేదు. ఇది ఆమె తన చేతులతో తాను త్రవ్వకున్నగొయ్యి. నరేన్‌చేత సక్రమంగా పూజ చేయించ వచ్చునన్న ఆశ ఇప్పుడు లేదు. ముఖ్యంగా ప్రస్తుతం నరేన్‌ని గురించి రోజు రోజూ వింటున్న సంగతులు, అవిశ్వాసాన్ని మరింత బలపరిచాయి. కొత్తపూజారి నిజంగా పిచ్చివాడు. ఒకరోజున బహిర్దేశానికి వెళ్లివచ్చి స్నానం చెయ్యకుండా, పూజచేయటానికి కూచోవటం ప్రత్యక్షంగా చూసి పట్టు కుంది మంగళ. "ఆఁ. ఆఁ" అంటూవచ్చి, "ఏమిటయ్యా పూజారీ! ఏమిటి

నువ్వు చేస్తున్నది! సర్వనాశనం చేస్తున్నావ్. నువ్విప్పుడే వెళ్ళిపో, వెళ్ళిపో చెపుతున్నా" అని గద్దించింది.

మొదట్లో నరేన్‌కూడా కొంచెం కంగారు పడ్డాడు. "ఎందుకండీ ? ఏమయింది మళ్లీ ?"

"ఇంకా యేమయిందని అడుగుతున్నావా ? బహిర్దేశానికి వెళ్లివచ్చిన గుడ్డలతో దేముణ్ణి ముట్టుకున్నావ్. ఏమయిందని అడుగుతున్నావా యింకా ?"

"ఏమన్నావ్ ? బహిర్దేశానికి వెళ్లివచ్చిన గుడ్డలా ? కాదే !"

"ఇంకా అబద్ధంకూడా ఆడుతున్నావా? నువ్వు మైదానంనుంచి చెరువుకి వెళ్ళివచ్చి సరాసరి పూలచెట్లదగ్గిర కెళ్ళి పూలు కోసుకుని, మందిరంలోకి వెళ్లటం నేను కళ్లారా చూశాను. నేనలాగే నుంచుని నుంచుని నీ మూర్ఖత్వాన్ని గమనించాను. నువ్వింత తెగిస్తావని నేను కల్లోకూడా అనుకోలేదు. ఎంత గుండెధైర్యం నీకు ? పోనీలే, అయిందేమో అయిపోయింది. నాదే తెలివి తక్కువ అయింది. నువ్విప్పుడే వెళ్లిపో, నేను ఆపూజారిని పిలిచి, అభిషేకం చేయిస్తాను. ఇవాళ నువ్వు మాయిల్లు ఖాళీచేసి వెళ్లిపో - చెపుతున్నా"

అబదం చెప్పినా తప్పించుకోటానికి వీల్లేదని తెలుసుకుని, నరేన్ నిజ స్వరూపం ధరించాడు. "ఆగు. దేముడి పూజ యెలా చెయ్యాలో యెలా చెయ్యకూడదో బ్రాహ్మడికి తెలుసు, దేముడికి తెలుసు. ఇది మా పని. 'ఎవరిపని వారు నిర్వర్తించాలి. ఇతరులు జోక్యం కలిగించుకుంటే నెత్తిన దుడ్డుకర్ర పడుతుం'దని శాస్త్రం."

అయినా మంగళ వెనక్కి తగ్గలేదు. "అలా అని నువ్వు యేగుడ్డలతో పడితే ఆగుడ్డలతో దేముణ్ణి ముట్టుకుంటావా ? అశుద్ధమైన చేతులతో పూజ చేస్తావా ?"

నరేన్ భర్రున మండిపడ్డాడు. "తప్పకుండా చేస్తా. ఇంత శాస్త్రం తెలిసినదానికి బ్రాహ్మడు కాలు తాకించనా పవిత్రమే, బ్రాహ్మడు గాలి తగిలితేనే పవిత్రుడవుతాడని తెలియదూ ? తెలియకపోతే యే సంస్కృతపండితుణ్ణయినా అడుగు, లేదా నీకు మంత్రదీక్ష యిచ్చిన గురువునే పోయి అడుగు."

అని అతడు దేవుణ్ణి స్నానం చేయించటం మొదలెట్టాడు.

"ఇదేమీ తక్కువ అత్యాచారం కాదు. బ్రాహ్మడిని కదా అని నీ ఇష్టం వచ్చినట్లు చేస్తావా?"

"ఆఁ. ఆఁ. చేస్తాను. బ్రాహ్మడి పాదధూళిని భగవంతుడు గుండెల మీద అద్దించుకుంటాడు. నువ్వు మూర్ఖురాలివి, నీకేం తెలుసు దీనిఅర్థం? మేము గురువంశీయులం, మాకన్నీ తెలుసు"

నరేన్ ఈ మధ్య 'కాల్నా' వెళ్లి హరికథ విని వచ్చాడు. ఆ ఘట్టం ఇప్పటికీ జ్ఞాపకం ఉంది. వెధవది భృగువు పేరు ఒక్కటి మాత్రం జ్ఞాపకం రానందుకు విచారపడ్డాడు. లేకపోతే యింకా రక్తి కట్టేది.

అయినా మంగళ ఇంకొకసారి చివరి ప్రయత్నం చేసింది.

"నిన్ను నేను పూజారిగా పెట్టుకోను. నా యిష్టం, నీదారి నువ్వు చూసుకో. సూటిగా చెపుతున్నాను"

నరేన్ గభాల్న ఎగిరిపడ్డాడు. ఒక్క అంగతో బయటికి వచ్చాడు. "నేను వెడతాను, ఈజంధ్యం తెంచి, నారాయణుడి ముందుపెట్టి, తలపగల కొట్టుకుని బ్రహ్మరంధ్రంనుంచి రక్తం కార్చి వెళ్లిపోతాను, చెపుతున్నా. పిల్లా - జెల్లాతో సంసారం చేస్తున్నదానివి అది నీకు మంచిదేనా?"

తర్వాత యింక ఒక్కమాట అనటానికికూడా మంగళకు ధైర్యం చాల్లేదు. ఆమె ఒక్కొక్క అడుగే వెనక్కి వెనక్కి జరుగుతూ 'షష్ఠీ, షష్ఠీ' అని గొణుక్కుంటూ వెళ్లిపోయింది. (పిల్లలకు అమంగళం జరగకుండా షష్ఠీ దేవిని తలచుకోవటం) సర్వనాశనం తెచ్చిపెట్టే ఇతడెక్కడి ప్రమాదకరమైన మనిషి బాబూ! ఇవాళ అయిదేసి కానులవంతున పిల్లల తలచుట్టూ దిగతుడిచి మీదుకడతాను. అమ్మవారి దగ్గరకు వెళ్లినరోజున పూజ చేయిస్తాను. హరిహరీ!.... కాపాడు భగవంతుడా.

నరేన్ ఒక్కడూ అక్కడే నిలబడి నవ్వుకోటం మొదలెట్టాడు.

శ్యామ అంతావిని "తర్వాత? మీకేం? మీరు ఛట్‌మని వెళ్లిపోతారు. నేను ఒంటరిగా ఉన్నప్పు డొకవేళ నన్ను వెళ్లకొడితే?" అన్నది.

"ఉష్! వెళ్లకొట్టటమే. నాభార్యవై ఉండి నువ్వా యిలా మాట్లాడటం? వెయ్యి చెప్పినా మనం బ్రాహ్మలం. గోధుమవన్నెత్రాచు జాతి మనది. అంతతేలికగా ఒత్తిడిపెట్టటానికి ధైర్యం చెయ్యలేరు. అలాకనుకపెడితే, నేను

మూడురోజులు ఉపవాసం పడిఉండి. మూడురాత్రులు గడిచింతర్వాత వెడతానని చెప్పు."

శ్యామ అప్పుడా మాటకి అంతగా విలువ యివ్వలేదు; కాని ఒకరోజున ఆమాట చాలా అవసరమయింది. మంగళ ఒకరోజున కొడుకులు, కూతుళ్ళ తనబలగాన్నంతా వెంటపెట్టుకుని, రణచండిలా వచ్చి నిలబడింది. "ఇదిగో నమ్మా బ్రాహ్మణావిడా! నువ్వు యింట్లోంచి వెడతావా లేదా చెప్పు. వెళ్ళక పోతే బలవంతంగా బయటికి గెంటుతాను. మంచికోరుకునేదాని వయితే, సామాన్లవీ యేవికావాలో తీసుకుని పుట్టింటికి వెళ్లు, బండిబాడుగ నేను యిస్తాను" అన్నది.

ముప్పు ముంచుకు వచ్చినప్పుడు మనిషి యేంచేస్తాడో - ముందుగా ఊహించటం కష్టం. శ్యామ నరేన్ నోటిమీదుగా ఆమాటలు విన్నప్పుడు - అవేమాటలు తననోటిమీదుగా అనవలసివస్తుందని యెన్నడూ ఊహించలేదు. మరీ నిస్సహాయస్థితిలో పడటంతో ఆమాటలు జ్ఞాపకం రాసాగాయి. పాదాల కింద నేల కుంగిపోతూండటంతో "నాభర్త యింట్లో లేరుకదా అని, నన్ను బలవంతంగా యింట్లోంచి వెళ్లకొట్టటానికి అందరూ కట్టకట్టుకువచ్చా రామ్మా? మంచిదే. నన్ను మెడమీద చెయ్యేసి బయటికి గెంటఖ్ఖర్లేదు. నాఅంతట నేనే పిల్లల్నితీసుకుని వీధిలోకిపోయి కూచుంటాను. కాని ఊరికే వెళ్లనమ్మా! వీధిలో మీఅధికారం యేంలేదు. మీయింటి కెదురుగా మూడు రాత్రులు పడిఉండి, వెళ్లవలసివస్తే వెడతాను. సామానులు అవసరమే ముంది? వాటిని మీరే ఉంచుకోండి. అరేయ్ అబ్బాయ్!.... " అంటూ కొడుకుని కేకేసింది.

మంగళ తెల్లబోయి, బుగ్గను చెయ్యి పెట్టుకుని కాసేపు అలాగే నిలబడి పోయింది.

"చూడండి. చూడండి! దేవుడెలాంటివాడో దేవి అలాంటిదే. విశ్వాసఘాతకులగుంపు. ఇంతకాలం యింట్లో పెట్టుకుని పోషించాను. దాని కిదీ ప్రతీకారం. మమ్మల్నే సర్వనాశనం చెయ్యాలని ప్రయత్నం. మంచిది. సరే, నువ్వే ఉండమ్మా - మాయింటి నంటిపెట్టుకుని ఉండు. నీకేది ధర్మమని తోస్తే అలా చెయ్యి."

మంగళ రుసరుసలాడుతూ తనబలగంతో వెళ్లిపోయింది.

శ్యామకూడా ఆరోజున తనలో తాను నవ్వుకుంది. తనభర్త పిచ్చి వాడే కానియ్. దుర్మార్గుడే కానియ్. తెలివిఉన్నవాడని ఒప్పుకోవాలి.

## 2

మంగళ ఆరోజునుంచి మళ్లీ వాళ్లను సూటిగా వెళ్లకొట్టటానికి ప్రయత్నించలేదు. కాని యెన్నివిధాల బయటికి పంపించవచ్చో - ఆ ప్రయత్నాల్లో ఒక్కటీ విడిచిపెట్టలేదు. హేమ, మహాశ్వేతలమీద అత్యాచారాలకు అంతులేదు. అవన్నీ సహించటం శ్యామకి దుస్సహమయింది. ఎక్కడా మరోమార్గం లేదు కనుక మెదలకుండా ఊరుకోవలసి వచ్చింది.

ఇలా రోజులు గడవవు. నరేన్ ఉన్నప్పుడు వచ్చే నైవేద్యం బియ్యం ఆగిపోయాయి. కొద్దిగా సరుకులేవయితే ఉన్నాయో వాటితో సరీగ్గా కొన్నాళ్లయినా గడవవు, తర్వాత యిహ మళ్లీ పస్తులే. సహించటం మరీ కష్టమయినప్పుడు - పిల్లల్ని యింట్లోపెట్టి తాళంవేసి, శ్యామ కలకత్తా నడిచి వెళ్లేది. ఒకపూట తల్లిదగ్గిరుండి తిని, కాసిని బియ్యం, పప్పులు, కాస్త డబ్బుతీసుకుని, మళ్లీ నడిచి తిరిగివచ్చేది. పిల్లల్ని తీసుకెళ్లటానికి ధైర్యం చాలేది కాదు. మళ్లీ తిరిగివచ్చాక యింట్లోకి రానివ్వకపోతే!

నరేన్ఉంటే - బుద్ధి కుదురుగా ఉన్నప్పుడు ఒకటిరెండుసార్లు అతడే పంపించాడు. "నువ్వు నిశ్చింతగా వెళ్లు శ్యామా, నేను ఈనేలను కరుచుకుని పడిఉంటాను. నువ్వు తిరిగివచ్చేవరకు నేను కదలను" అనేవాడు. ఈపరిస్థితిలోకూడా యేడెనిమిదిరోజులకంటె యెక్కువఉండటానికి ధైర్యం కలిగేదికాదు. రాసమణి ఆమెకి కరువుఅవతారం అని పేరేపెట్టింది. వచ్చేప్పుడు పీక్కుపోయినమొహం, తలనిండాపేలు, ఒంటినిండామట్టి, చిరిగిపోయినగుడ్డలతోవచ్చేది. ఇక్కడికివచ్చి తలరుద్దుకుని, నూనె రాసుకుని, సబ్బురుద్దుకుని చక్కగా తయారయేది. కొత్తచీరె వచ్చేది. పిల్లల ఒంటిమీదకికూడా చొక్కాలొచ్చేవి. వెళ్లేప్పుడు అయిదురూపాయల తల్లి చెంగునకట్టి పంపుతూండేది.

రాసమణి అంతకుమించి యివ్వదు. ఒకటేమిటంటే ఆమెకీ సంసారం గడవటం కష్టం. తాను యింకా యెన్నాళ్లు బతుకుతుందో యెవరు చెప్పగలరు? ఉమ స్థితి చూస్తే అలా! ముఖ్యంగా ఉమను గురించిన దిగులే ఆమెని మతిస్థిమితం లేకుండా చేసింది. అలాంటి పరిస్థితిలో ఆమెకి యెంత డబ్బు యివ్వడం సాధ్య మవుతుంది? అదీకాక నరేన్ అంటే ఆమెకి రవంతకూడా నమ్మకం లేదు. ఎక్కువ డబ్బు యిస్తే అది కూతురి అవసరాలకు ఉపయోగపడుతుందా, లేదా అన్నది సందేహం.

శ్యామ మనసుకి కొంచెం కష్టమే కలిగేది. చాలాకాలం నిత్య దారిద్ర్యం, ఉపవాసాలతో యుద్ధం చేయటంతో, ఆమె మనస్సు చాలా

మారిపోయింది. తల్లి యెక్కువ డబ్బు యివ్వక పోవడమనేది - ఆమెకి అన్యాయమే అనిపించేది. తల్లికి డబ్బు యెక్కడినుంచి వస్తుందన్నది - ఒక్కసారికూడా ఆలోచించదు. వాళ్లేమో హాయిగా తింటూ సుఖపడుతున్నారు. నా దగ్గిరకు వచ్చేసరికి లేదు లేదు అంటారని అనిపించేది మనస్సుకి. తన మానసికపరివర్తన తానూ గ్రహించింది. దాని ప్రభావం మాత్రం యెగిరిపోలేదు.

కాని తల్లి అనుమానం యెంతవరకు నిజమో, అది ఒకరోజున రుజు వయింది. ఈలోపల శ్యామ మళ్లీ గర్భవతి అయింది. ప్రసవించే రోజులు లెక్కకట్టి, రాసమణి తన దగ్గిరకు రమ్మని రాసింది. శ్యామకి ధైర్యం చాలేదు. నెలో రెండు నెల్లో అక్కడ ఉండాల్సి వస్తుంది. బహుశా అంతకంటె యెక్కువ రోజులుకూడా కావచ్చు. అలాంటప్పుడు, యిక్కడ యీయిల్లు శాశ్వతంగా వెయ్యి జారిపోతుంది. తల్లి దగ్గిర ఆశ్రయం దొరికితే దొరకవచ్చు. అక్కడ నరేన్‌కి స్థానం ఉండదు అనేది నిశ్చయం. అందుకని ఆమె యెంతో ఆలోచించి "వీలయితే కొంచెం డబ్బు పంపించమ్మా, నాకు రావటానికి మాత్రం వీలుపడదు" అని ఉత్తరం రాసింది.

ఎన్ని అన్నా కూతురు కదా! రాసమణి అతికష్టంమీద యాభై రూపాయలు సంతనా చేసి పంపించింది. డబ్బు వచ్చిన రోజున నరేన్ యింట్లోనే ఉన్నాడు. అతడు అత్యాశగా డబ్బు కేసి చూస్తూ ఉండిపోయాడు. శ్యామ భయంతో అప్పుడేమీ మాట్లాడలేదు. ఇటీవల శ్యామకూడా కొంచెం రాటు తేలింది. ఆమెని భయపెట్టి యేం చెయ్యటానికీ లేదు.

సాయంత్రం శ్యామ అన్నం పొయ్యిమీద పెట్టి కూచుంది. నరేన్ దగ్గిరకు వచ్చి నుంచున్నాడు.

"సంగతేమిటో చెప్పండి. ఇంత అపేక్ష ఒలక పొయ్యటం దేనికి ?" అంటూ నరేన్ కేసి తీక్ష్ణదృష్టితో చూసింది శ్యామ.

"ఏం లేదు, ఊరికేనే. చాలా రోజులుగా నేను నిన్ను సరీగ్గా చూడనే లేదు. నిజం చెపుతున్నాను శ్యామా ! ఇంతకష్టం. విచారం నీఅందాన్ని మాత్రం తగ్గించలేదు. ఇప్పటికీ మళ్లీ ఇంకోసారి పెళ్లి చేసుకుని తీసుకు రావచ్చు"

ఈ పొగడ్త వెనుక యేదో ఉండి ఉంటుందని తెలిసికూడా శ్యామ పులకితురా లయింది. పొయ్యివేడికి చెమట పట్టిన ఆమె నుదుటి మీది యెరుపురంగు మరింత యెరుపెక్కింది.

"అయినా యెందుకుండదులే. మా అత్తగారిరూపం మాత్రం తక్కువదా ? చీకట్లోనే మెరిసి పోతూంటుంది. ఎంత గొప్పయింటి ఆడపడుచు ? రాణివాసంలో ఉండవలసిదానిని మరీ నా చేతిలోకి వచ్చి పడ్డావ్."

శ్యామ కోరచూపుతో అతడి మనస్సులోని ఉద్దేశాన్ని గ్రహించటానికి ప్రయత్నించింది కాని యెక్కువసేపు యెదురు చూడాల్సిన అవసరం లేకపోయింది. నరేన్ హఠాత్తుగా గొంతు తగ్గించి "చూడు శ్యామా! నీ కాళ్లు పట్టుకుంటాను మూడు రూపాయలివ్వవూ?" అన్నాడు.

"మూడు రూపాయలా ? యెందుకు ? రూపాయలు నాకెక్కడనుంచి వస్తాయి ?"

"చాలా రోజులుగా నిషాజోలికి పోలేదు. నీ మీద ఒట్టు. ఇవాళ ఒళ్లంతా యేదో చితకకొట్టినట్లుంది. అలా వెళ్లి ఇలా వచ్చేస్తాను ఇవాళ కాస్త సీమసరుకు తాగా లనిపిస్తోంది".

"బాగుంది. మీకేం సిగ్గులేదూ ? నా పురిటిఖర్చుకోస మని మా అమ్మ పంపించింది. నెల్లాళ్లలోగానే పురు డొస్తుంది. మంత్రసానికి, మందులకి, తిండికి యెంతో ఖర్చు ఉంటుంది. అప్పుడు మీజాడే ఉండదు. ఆసమయంలో పస్తుండట మెలా ? మీ రివ్వవలసింది, అమ్మ పంపించింది. వితంతువు. ఆమెకిచ్చేవా రెవరూ లేరు. అందుకైనా మీరు సిగ్గుతో చావటం మేలు ! అలాంటిది అందుకు విరుద్ధంగా-ఛీ, ఛీ. మీకు సిగ్గు అసహ్యం ఉంటాయని ఊహించటం లేదు. కాని మనుష్యత్వం అనేదికూడా లేదా ?"

"ఇదిగో, నీరెండుకాళ్లూ పట్టుకుంటాను. ఈసారికి ఇయ్యి. తర్వాత ఇహ బుద్ధిమంతుడిలా యింట్లో ఉంటానని చెపుతున్నానుగా ! రెండు నెలలు యెక్కడికి కదలను. ఈ గాయత్రీసాక్షిగా చెపుతున్నాను. నీకు పిల్లలకి వండిపెడుతూండాలిగా !"

శ్యామ మనస్సు మెత్తపడింది. ఆమె మెల్లిగా రహస్యభాండారంలోంచి మూడు రూపాయలు తీసి యిచ్చింది.

## 3

ఆ రాత్రే శ్యామకి నొప్పు లొచ్చాయి, అప్పుడింక గత్యంతరం లేదు. ఆ వాడలో 'దులే' పెళ్లాం మంత్రసాని పనిచేస్తుంది. ఆమెనే పిలవటానికి పంపించాలి. ఆరేళ్లపిల్లవాడు హేమని అర్ధరాత్రి ఆ అడవిలో మంత్రసానిని

తర్వాత గొంతు యింకా తగ్గించి, "చేసుకో నీ కూతురి పెళ్లి. నాకేం? నేను నీ మంచికోసమే చెపుతున్నాను. ఎవరో మోసంచేసి పిల్లను తీసుకెడతారు. చెపుతున్నానుగా, నీకేం తెలుసు బూడిద! ఆడవాళ్లు పదిమూరల గుడ్డ సరిగ్గా కుచ్చిళ్ళు పెట్టలేరు. తెలివనేది పీమతలకాయంతయినా ఉండదు. ఊరికే గంతులెయ్యటం తెలుసు'' అన్నాడు.

అక్షయబాబు ఈసారి కొంచెం మందలిస్తున్న ధోరణిలో- "ఆడదానికి తెలివనేది లేకపోతే నువ్వు బతికిఉండేవాడివా? నీ సంసారం నిలబడేదా? ఆమె నిశ్చయించిన సంబంధం నువ్వు జీవితంలో సంపాదించ లేవు. ఇంక ఊరికే గొడవ చెయ్యకు, మెదలకుండా పోయి పడుకో. ఇదిగో చూడు, పిల్లకి అరణం యిచ్చేసామగ్రి దొంగిలించి తీసుకువెళ్లి అమ్ముకుని రాకు. అలాచేశావంటే - అప్పుడు అమ్మాయి వెళ్లనీ, వెళ్లకపోనీ - నేనే పోలీసు స్టేషన్‌కి వెడతాను'' అన్నాడు.

నరేన్ నిజంగానే బుజంమీది పంచెతీసి, చిలక్కొయ్యకి తగిలించి, సణుక్కుంటూ పక్కమీదికెళ్లి పడుకున్నాడు.

మర్నాడు మధ్యాహ్నం అన్నం పొయ్యిమీద పెట్టి, వంటింటి వసారాలో కూచుని శ్యామ డబ్బు సంగతే ఆలోచిస్తోంది.

పింట్‌కీ రెండో కూతురు రొప్పుకుంటూ పరుగెత్తుకువచ్చి ''పిన్నిగారూ! పిన్నిగారూ! బాపన బాబయ్యగారి దగ్గిర చాలారూపాయ లున్నాయి చాలా రూపాయలు" అని చెప్పింది.

''నీకెలా తెలుసు?" శ్యామ కళ్లల్లో ఆశ - ఆసక్తి తళుక్కుమన్నాయి. అదే ఇప్పుడు చెరువులో స్నానానికి దిగారుగా! లేచి తడిసిన బట్టతోపాటు, నడుముకి కట్టుకున్న సన్నటి పొడుగుసంచి విప్పి రూపాయలుతీసి, చెరువు ఒడ్డున గడ్డిమీద పెట్టి సంచి యెండలో ఆరేసి, అక్కడే కాపలా కూచున్నారు.''

అయినా శ్యామకి నమ్మకం కలగలేదు. ఆమె కొంచెం అనుమానంతో అది నంచీ అని ''నీకెలా తెలుసు? సంచి అని దేన్ని అంటారో నీకు తెలుసా?" అని అడిగింది.

''ఆఁ'' అని సాగతీసుకుని, ''సంచి తెలియదా? తాతయ్య యెక్కడికి రూపాయలు తీసుకెళ్లాలన్నా సంచిలోనే పెట్టుకుని తీసుకెడతారు" ఉన్నది కాశీతార.

శ్యామ బుగ్గలు పుణికి ''ఎంత మంచి వార్త చెప్పావమ్మా?" అన్నది.

"నాకు మిఠాయి ఉండలు పెడతావా?" ఉత్సాహంతో ఆబగా అడిగింది కాశీ.

"తప్పకుండా. నువ్వు తిన్నన్ని!"

శ్యామ అప్పుడేమీ మాట్లాడలేదు. సాయంత్రం పెళ్ళికింకా సమకూర్చుకోవలసిన వాటినిగురించి మాట్లాడటానికి - మంగళ వచ్చి అరుగు మీద బాసింపీట వేసుకుని కూచుంది. శ్యామ సరాసరి నరేన్ దగ్గరకు వచ్చి "ఏమండీ, ఇరవైరూపాయలివ్వండి. ఇంక నాకు దొరికేటట్టు లేదు. మైదా, నెయ్యీ అవీ యింకా తీసుకురాలేదు. అయితే చేపలు మాత్రం అమ్మ రేపు చెరువులో పట్టించి యిస్తానని చెప్పింది" అన్నది.

"డబ్బా? డబ్బు నాకెక్కడినుంచి వస్తుంది? నాదగ్గిర ఒక్క పైసా లేదు. ఇంకా యేమేం కావాలి? పూరీలు నూనెతో చేస్తే బావుంటాయి. లేకపోతే అన్నం వండిస్తావా? బ్రాహ్మల యింట్లో అదేం తప్పులేదు. పూజారి బ్రాహ్మడి కూతురు పెళ్లి - దానికి పూరీలా?"

"ఇది మీ గుప్తిపాడా కాదు. ఇక్కడ నూనె పూరీలు వడ్డించటం ఆనవాయితీ లేదు. అన్నం మానేయటం లేదు. మధ్యాహ్నం 'బౌభాత్' పెడితే సరిపోతుంది. పెళ్లిలో ఒక్క అన్నమే అయితే నింద వేస్తారు. ఇంకా పెళ్లివిందే కాదు, 'పూలపాన్పు' ఉంది. దానికి పదిరూపాయలయినా పంపాలి"

"అయితే బావు, నాకేం తెలుసు? నవాబుగిరీ వెలిగించాలనుకుంటే యెలా! ముందు నీ స్తోమత యెంతో తెలుసుకోవాలి"

"నా స్తోమత తెలుసుకునే చేస్తున్నానండి! ఈచేస్తున్నదంతా నేనే తెచ్చి చేస్తున్నాను. మా అమ్మ చేస్తోంది. మీరు జన్మదాతనని అరుస్తున్నారుగా! మీరేం చెయ్యగలరో అదిచెప్పండి. మీ కూతురు కాదూ?"

"నా కూతురయితే యేం? నేను పెళ్లిచెయ్యటం లేదు. నాకు స్తోమత ఉన్నప్పుడు చేస్తాను. నువ్వు నన్నడిగి పెళ్లి నిశ్చయం చేయించావా?"

"సరే, అలా చెయ్యలేదు. మీ మీద ఆధారపడి ఉండటం లేదు. యెలాగూ రానేవచ్చారు. మీదగ్గిర డబ్బుంది కనుక అడుగుతున్నాను. సంసారం మీది, సంసారం ఖర్చుకని అయినా కొంత ఇవ్వండి"

"నా దగ్గిర డబ్బా ?" నరేన్ యేదో ఆకాశంలోంచి పడ్డట్టు చూశాడు. ఒక్కసారి ఉత్తేజితుడై లేచి "నాకెక్కడినుంచి వస్తుంది డబ్బు? కాళీమాత మీద ఒట్టు. నా చేతిలో ఒక్కపైసాకూడా లేదు, చెపుతున్నా" అన్నాడు. బయట నుంచి మంగళ స్వగతోక్తిలాగ "నీకు డబ్బు అడగటానికి యింకెవరూ దొరకలేదా శ్యామా? అతడి దగ్గిర డబ్బు కూడానా?" అన్నది.

శ్యామ మొహం అంతలో కఠినంగా మారింది. ఆమె ఒక అడుగు ముందుకు వచ్చి "చూడండి, బుద్ధిపూర్వకంగా ఉత్తుత్తి ఒట్లు వెయ్యకండి. చెపుతున్నా, డబ్బు నాకు కావాలి. మంచిని కోరుకునేవా రయితే యివ్వండి. లేకపోతే మీకూ నాకూ చెల్లు" అన్నది.

"ఉత్తుత్తి ఒట్లా ?" నరేన్ మరింత ఆకాశంలోంచి పడ్డట్టయి, "అబద్ధం చెపుతున్నా ననుకున్నావా ? నీ యీకొడుకు మీద ఒట్టు - చెపుతున్నా. నాచేతిలో ఒక్కపైసాకూడా లేదు. నడినెత్తిన చెయ్యిపెట్టుకుని చెపుతున్నాను"

"మళ్లీ యింకా ?"

అంటూ శ్యామ అతడి నడుమునున్న గుడ్డలో జాగ్రత్తగా దాచిపెట్టుకున్నదాన్ని ఒక్కగుంజు గుంజి, సంచిని బయటికి లాగింది. అయితే సంచిమూతి గట్టిగా కట్టినట్టు లేదల్లే ఉంది. సంచి లాగగానే రూపాయలు గలగలమని కిందపడ్డాయి.

నిజంగా అతడిదగ్గిర యింతడబ్బు ఉంటుందని యెవ్వరూ అనుకోలేదు. కొద్దిక్షణాలు ఆవెండిరూపాయల ధ్వనికి స్తంభితులై నిలబడిపోయారు. నిజాని కది కొద్దిక్షణాలే. తర్వాత దిక్కులు తెలియని కోపంతో శ్యామ మతిపోయి, తనచేతుల్లోని శక్తినంతా ఉపయోగించి, నరేన్ చెంప మీద చాచి ఒక్కటి కొట్టింది. ఎన్నాళ్లనుంచో గుండెల్లో పేరుకుపోయినక్షోభ, భర్త అమానుషప్రవర్తన, మనస్సులో గూడుకట్టుకున్నతిక్తత ఆమెకి తెలియకుండానే కొట్టటానికి ప్రేరేపించాయి. ఈ సంఘటనకు ముందు కూడా. అది ఆమెకి ఊహాతీతమే ; తర్వాతకూడా చాలా సేపు నమ్మశక్యంకానంత విహ్వలురాలై అలాగే ఉండిపోయింది. జ్యేష్ఠుడు. యేకైకపుత్రుడైన హేమమీద అబద్ధపు ఒట్టువెయ్యటంతో, ఇంతకాలంనుంచి ప్రోగుచేసుకున్న మనఃక్షోభ- ముందుగిడ్డంగిలో ఒక్కసారి నిప్పురవ్వ పడింది. ఇది ప్రపంచంలో స్త్రీలెవ్వరూ సహించలేనిదని అనిపిస్తుంది.

ఏమయినా కానియ్. దెబ్బ కొట్టినా, దాన్నినమ్మటానికి రెండుమూడు నిమిషాలు ఆలస్యంపట్టింది. తర్వాతనే శ్యామ నేలమీద పడిన రూపాయల్ని

యేరుకోటం మొదలెట్టింది. మొత్తం దొరికినవి ముప్ఫైఒక్కరూపాయలు. ఇంకా చాలాసేపు బల్లకింద, పెట్టెలప్రక్కన వెతకసాగింది. కాని యింక దొరకలేదు.

ఒక్కసారిగా ముప్ఫైయిఒక్కరూపాయలు దొరకటం ఆమెకి నమ్మ లేని విషయం.

నరేన్ జరిగినదానికి స్తంభితుడయినాడు. నిజంగా శ్యామ తనమీద చెయ్యిచేసుకుంటుందని యెన్నడూ ఊహించలేకపోయాడు. అతడికేమిటో ఒక భయమేసింది. లేకపోతే కొన్నిరూపాయలయినా గబగబా లాక్కునేవాడు. కాని అతడా ప్రయత్నంకూడా చెయ్యలేదు. అలాగే తెల్లబోయి నుంచుని నుంచుని చూశాడు. శ్యామ మోకాళ్లమీద వంగి, రూపాయలన్నీ యేరుకుంది. తర్వాత ఇంట్లోంచి మంగళయెదుటికివచ్చి యేడుస్తూ-"చూశారా? చూశారా? యెంతపని చేసిందో, నాచెంపమీద అయిదువేళ్లూ తేలాయి. చెంప వాచి పోయింది" అన్నాడు నరేన్.

మంగళ ఝుఙ్ మని. "నువ్వుచేసింది. యెంతపాడుపని! ఇంక చెప్పకు. నీకూతురిపెళ్లి. ఇరవైరూపాయలు అడిగింది. సహజంగా యిచ్చేస్తే పోయేదిగా! అదేం లేదు. పైగా కొడుకుమీద అబద్ధపుఒట్టు వెయ్యబోయావే, కంఠానికి ఉరేసుకోటానికి బారెడుతాడు దొరకలేదూ? తాడు దొరక్కపోతేయేం. మెళ్లోజంధ్యం ఉందిగా! నేను బిందె యిస్తాను. కంఠానికి కట్టుకుని పోయి చెరువులో దూకు. రాగాలు పెడుతూ యేడవటానికి సిగ్గులేదూ? కొట్టిందేమో మంచిపని చేసింది. నేనయితే ఇలాంటి మొగుడి విస్తట్లో బూడిద పోసేదాన్ని".

డబ్బుపోయిందన్న దిగులుతో నరేన్ ఆరాత్రి భోజనం చెయ్యలేదు. మర్నాడు యేదో ప్రతీకారం తీర్చుకోవాలన్న ఉద్దేశంతో యింట్లోంచి మాయ మయ్యాడు. శ్యామ సాధ్యమైనంతవరకు కళ్లన్నీ అతడిమీద ఉంచి చూస్తూం డటంవల్ల, ఏమీ తీసుకెళ్లలేకపోయాడు. ఒక కోరాపంచెమాత్రం యెలాగో ధోవతివాటున దాచుకుని యెలా తీసుకెళ్లిపోయాడో, యెవరూ గమనించ లేకపోయారు.

వెతికితే యెక్కడా కన్పించకపోవటంతో, అప్పు డనుమానం కలిగింది. "పోనీలే బాబూ! ముప్పయి ఒక్కరూపాయలకు బదులు పదమూడణాలు ఖరీదు చేసే సీమగుడ్డ! పాపం, అతడి దగ్గిర యేమీలేదు" అని ఊరట చెందింది.

## 2

మహాశ్వేత కంతా బొమ్మలాటలా ఉంది. దారిద్ర్యం, పేదరికం మధ్య పెరిగినపిల్లబుద్ధికి - నిజమైనపెళ్లిసన్నాహాలు యేదో జానపదగాథల్లో రాజ్యంలాగా నమ్మశక్యంకానిదయి, ఆమె మనస్సుకేదో కలఅనే భ్రాంతి కలిగించింది. పింటేకీవాళ్లు ఆపిల్లని ఉడికించటానికి వర్ణించినంత చెడ్డ చోటు కాదు అత్తవారిల్లు. వరుడెలా ఉంటాడో యెవరికీ తెలియదు. నిజంగా అతడు రాజకుమారుడై ఉంటాడా? అత డెలా ఉంటాడు! మంగళ ముసలి ఆడపడుచు - ఒకామె ఒకొకరోజున సర్కారుగారింట్లో పిల్లల్ని చుట్టూపెట్టుకుని కథలుచెప్పటానికి కూచుంటుంది. మహాశ్వేతకూడా చాలా రోజులనుంచి ఆ పిల్లలతో కలసి కూచుంటోంది. జానపదకథల్లో రాజ కుమారుడు కేవలం రాక్షసుల్ని చంపి, రాజకుమార్తెను ఉద్ధరిస్తాడు. దాన్ని ఊహించుకోటానికి ప్రయత్నించసాగింది మనస్సులో. "అవును బామ్మా! ఆ రాజకుమారుడెలా ఉంటాడు?" అని అడగను కూడా అడిగింది. ముస లావిడ కళ్లు పెద్దవిచేసి, "అయ్యో! అది తెలియదా? అదే, తెల్లగా మా అమ్మ రంగు, పద్మాల్లా పెద్ద కళ్లు, నిటారయిన ముక్కు, కార్తికేయుడిలా మెలి పెట్టిన మీసాలు - ఈ విగ్రహంలో కార్తికేయుడిలా - అంటూ ఇంకెంతో చెప్పి పూర్తిచేసేది. దుర్గ ఆమె అత్తగారి పేరు. రోజూ పొద్దున్నే లేవగానే "మాతా! దుర్గతినాశినీ, తల్లీ!" అని స్మరించుకుంటుంది.

మహాశ్వేత తన వరుణ్ణి కార్తికేయుడిలా ఊహించుకోటానికి ప్రయత్నించింది. బాగుండలేదు. అదేమిటి, బొమ్మరింట్లో బొమ్మలాగా కాస్త ఉంగరాలజుట్టు! ఉహూఁ రాజకుమారుడిలాగే ఉండేట్లయితే - రాజ కుమారుడులాంటి వరు డక్కర్లేదు. అయితే తన వరుడు అచ్చంగా రాజ కుమారుడిలా యెందుకుండాలి అన్నప్రశ్న మనస్సులో ఒక్కసారికూడా కలగ లేదు. ఆ మొదటి రోజున సర్కారుగారి నాయనమ్మ తన తల్లితో 'రాజ కుమారుడులా ఉంటాడు కుర్రాడు' అని చెప్పింది.

ఆ మాటే మనస్సుని పట్టుకుని ఉండి ఉంటుంది.

చివరికి పెళ్లిరోజు వచ్చింది.

వరుడు రాగానే, అతడి ఉత్తరీయం తీసి, పీటమీద పరచి అందరూ అతణ్ణి కూచోపెట్టారు. పింటేకీ కన్నుగీటి, "జాగ్రత్త! ఒక్క అడుగు యిక్కణ్ణుంచి అటు యిటు జరగకూడదు, ఇక్కణ్ణుంచి లేవకూడదు. ఏడడుగులు నడవటానికి పీటతోసహా లేవాలి" అన్నది.

మహాశ్వేత యెక్కువసేపు కూర్చోలేకపోయింది. పెళ్లివారి విడిది యింట్లోకి వరుడు వచ్చి కూచున్నాడు. ఆడవాళ్లు చాటునుండి చూడటానికి గుంపుగా వెళ్లారు. మహాశ్వేత దగ్గిర యెవరూ లేరు. ఆమె ఉన్న గదిలో ఒకరిద్దరు పసిపిల్లలు మాత్రం నిద్రపోతున్నారు.

మహాశ్వేత కుతూహలాన్ని ఆపుకోలేక ఒకసారి అటు యిటు చూసి, వరుడి ఉత్తరీయాన్ని గుండెలమీద పెట్టుకుని వీలైనంత నిశ్శబ్దంగా పరుగెత్తింది. అందరూ చూస్తున్నవైపునుంచి వెళ్లటానికి వీల్లేదు. బయటివైపునుంచి వెళ్లటానికీ లేదు. అక్కడందరూ మగాళ్లే. ఆమె ఆలోచించి ఆలోచించి పరుగెత్తుతూ - అటు పింట్‌కీవాళ్ల యింటివైపు పావురాళ్లగూడులా చిన్నకిటికీ ఒకటుంది. అక్కడినుంచి చూడొచ్చు. అక్కడ గుంపు నిజంగానే తక్కువ. అక్కడి కెళ్లి, అక్కడున్న వాళ్లని తప్పుకోమని తొంగిచూసింది. అంతా కాకపోయినా ఒకపక్క కనిపిస్తోంది బొద్దుగా పొడుగ్గాఉన్న యువకుడు. నిజమే, రంగుకూడా తెలుపే, కాని అమ్మో ! అదేమిటి ? ముఖంనిండా నల్లటి గడ్డం ?

మహాశ్వేత కొంచెం అసంతృప్తురా లయింది. తెల్లబోయిందికూడా. ఊహవచ్చినప్పట్నుంచీ అవాడలో మూడునాలుగు పెళ్లిళ్లు చూసింది. వారిలో యే వరుడూ యిలా గడ్డం పెంచుకుని పెళ్లి చేసుకోవటానికి రాలేదు. విగ్రహంలో కార్తికేయుడిలా లేడు. అందుకు సంతోషమే, అలా అని యింత అసభ్యంగా ఉంటారా ? అక్షయబాబు ఆఫీసులోఉన్న భోజ్‌పురీ దర్వానుకూ్కడా కొంతవర కిలాంటి గడ్డమే ఉంది. కాని అతడి గడ్డం రెండు పాయలుగా తీసి, చెవులకి లాగి కట్టి ఉంటుంది. ఇలా దుబ్బులాంటి గడ్డం కాదు.

తెల్లబోయి చూస్తోంది. అలాగే చూస్తోంది. వెకననుంచి యెవరో వచ్చి మహాశ్వేత చెవి మెలిపెట్టారు. తిరిగి చూస్తే పింట్‌కీ.

"ఆబగా యిలా తొంగి చూడకూడదని వారించానా ? ఎంత అవ లక్షణమయిన పనిచేశావ్ ? పీటమీదినుంచి లేవకుండా శుభదృష్టికి ముందు వరుణ్ణి చూడటమా ? వేలెడంత పిల్లవి, లోపల్లోపల యెంత గడితేరావ్ ? ఇంక రెండుగంటలు ఆగలేకపోయావా ? వరుణ్ణి చాటునుంచి దాక్కుని చూడటమా ?"

ఆమె అణచుకున్న కంఠంతో గాండ్రిస్తోంది. శ్యామ పరుగెత్తుకుంటూ వచ్చి, ఒక్కదెబ్బ వేసింది. మంగళ "ఆఁ ఆఁ ఏమిటి మవ్వు చేస్తోంది. యేమిటది ? ఈ రోజుల్లో యింకా -" అంటూ యేదో అనబోయింది.

చూశారా? శుభదృష్టికి ముందే వరుణ్ణి చూసింది. ఏదైనా అరిష్టం జరిగితే? అన్నీ అవలక్షణపుపనులే" అన్నది శ్యామ.

"ఇదిగో, శుభదృష్టి జరగలేదు. వరుడు అటువైపు తిరిగి కూచున్నాడు. ఆమె మనస్సు పాడుచెయ్యకండి" అన్నారెవరో.

అవమానంతో మహాశ్వేతకి కళ్లవెంబడి నీళ్లొచ్చాయి. అందుకని నిజంగా శుభదృష్టిసమయం వచ్చినప్పుడు మహాశ్వేత కళ్లు గట్టిగా మూసుకుని కూచుంది. ఎంత బ్రతిమాలినా, బెదిరించినా యేమయినా కళ్లు తెరవలేదు. చివరికి అక్షయబాబు వచ్చి బుజ్జగిస్తూ, ముఖం యెత్తి పట్టుకుని, 'కళ్లు తెరు అమ్మా ఒక్కసారి.... ....భేష్. ఇలాగే చూడు సరిగ్గా" అన్నాడు. అప్పుడెలాగో రెప్పపాటుసేపు కళ్లుతెరిచి మూసుకుంది దాంతో అప్పుడు కొంచెం పచ్చగాఉండే రెండుకళ్లలో స్థిరదృష్టి ఆమె కంట పడింది ఆమె కేమిటో భయం వేయసాగింది.

3

అమ్మో! ఏమిటీ అత్తవారింటివాలకం! పల్లకీ దిగి తలవంచుకుని నుంచునేఉన్నా, ఒక్కచూపుతో ఆ యింటివాలక మంతా మహాశ్వేత కని పెట్టేసింది. చుట్టూ గాలి, వెలుతురు లేకుండా చీకటిగుయ్యారంలా ఉండే పెద్ద తోట, మెల్లాలో పెద్ద పనసచెట్టు. అదే పగటి వెలుతురునుకూడా యేదో చీకటిగా చేసేసింది. దాని మధ్య జీర్ణమయిపోయి, చితచితలాడుతూ నేలబారుగా ఉన్న పాతయిల్లు. ఇది ఒక యిల్లట! ప్రక్కనకూడా మరొక యిల్లుంది. దాని పైకప్పు కొంత భాగం పడిపోయింది. అక్కడ కొంత భాగం పైకప్పు గడ్డితో తాటాకులతో కప్పిఉంది. తాము 'పద్మా' గ్రామంలో యెంత దరిద్రంలో ఉన్నా మంచి గట్టియింట్లో ఉండేవాళ్లు. నేలకి కొంచెం యెత్తుగా పొడిగా ఉన్నయిల్లు. తాను జీవితమంతా యిక్కడే ఉండాలా?

అత్తగారు దురుసు మనిషేమీ కాదు. పొట్టిగా ఉంటుంది. శాంతంగా మాట్లాడుతుంది. పల్లకీలోంచి యెత్తుకునే దింపింది. ఆదరంగా లోపలికి తీసుకొచ్చి కూచోపెట్టి, "పాతయిల్లని అసహ్యించుకోకమ్మ! ఇది మా మామగారిల్లు. నీ అదృష్టంకొద్దీ యిక్కడే ఒకరోజున రాజభవనంలాంటి యిల్లు యేర్పడుతుంది" అన్నది.

'కుశండికా' (వివాహాల్లో హెూమంతో జరిపించే ఒకకార్యకలాపం) తంతు అంతా మూడుగంటలకు పూర్తిఅయింది. మహాశ్వేత దాహంతో,

ఆకలితో అప్పటికి కిందపరచిన జంబుఖానామీద పడిపోయింది. అయినా ఈలోపుగా ఒకటి మాత్రం ఆమె గమనించింది. కుశండిక పూర్తి అవబోయే ముందు ఇటుఅటు తూలి పడబోయింది. ఆమెతల యెన్నిసార్లు తిరిగితే అన్నిసార్లూ వరుడు ముందుగానే గమనించి, యెవరూ చూడకుండా పట్టుకుని పడిపోకుండా ఆపాడు. అతడికి చాలా జాగ్రత్త ఉంది.

రెండు జిలేబీలు, రెండు కొబ్బరిఉండలు ఫలహారం వచ్చింది. అది చూసి యెవరో గబగబా చెరకుబెల్లం షర్బత్ చేసి తీసుకొచ్చి యిచ్చారు. మహాశ్వేత కదే యిప్పుడు అమృతం. పెళ్లికూతురు యేమీ తినకూడదు. దానికి బదులు యేమయినా యివ్వాల్సింది – అప్పుడు మరిచిపోయారు.

ఫలహారం చేసి, కొంచెం అలసట తీర్చుకుని కూర్చున్న మహాశ్వేత కిప్పుడు తనచుట్టూ గుమిగూడినవాళ్లని చూసే అవకాశం దొరికింది. ఇక్కడ మనుష్యులందరూకూడా యేదో అదోరకంగా ఉన్నారు. ఊహ తెలిసినప్పట్నుంచి మహాశ్వేత జీవితం రెండు యిళ్లలోనే పరిమితమయింది. ఒకటి కలకత్తాలో అమ్మమ్మగారిల్లు. రెండోది పద్మగ్రామంలో సర్కారు గారిల్లు. అమ్మమ్మగారింట్లో యిద్దరు ముగ్గురు మనుష్యులే. వారి సభ్యత శిక్షణా పరిమాణాన్ని తెలుసుకోగల వయస్సులేదు. నిజమే, కాని అంతా మహాశ్వేత మనస్సులో ముద్రపడింది. సర్కారుగారింట్లోకూడా – వారి ప్రవర్తనలో, వేషభావల్లో కలకత్తా స్పర్శఉంది. కాని యిక్కడ మనుష లేమిటో వారందరికంటె పూర్తిగా వేరు. వీరి బట్టలు యెంత మాసి దరిద్రం ఓడుతుంటాయో, మాట్లాడేసరళికూడా అలాగే ఉంటుంది. మగవాళ్లు మోకాళ్లపైకి పంచెలు కడతారు. కాళ్లకి చెప్పులు తొడుక్కోరు. బుజాన ఒక కండువా, లేదా యెప్పటిదో చిరుగులుపడ్డ పాతకోటు. మహాశ్వేతకి ఇద్దరు మరుదులు, ఇద్దరు ఆడపడుచులు ఉన్నారు. పెద్దాడపడుచుకి పెళ్లి అయింది. పన్నెండు పదమూడేళ్లుంటాయి. ముక్కుకి పెద్దబులాకి ఒకటి పెట్టుకుని, పెద్దఆరిందాలా తిరుగుతూంటుంది. ఆమె వేసుకునే బట్టలే కాస్త తెల్లగా ఉంటాయి. మరుదు లిద్దరిలో ఒకరికి పదకొండేళ్లు, ఒకరికి అయిదేళ్లు. ఎవరి ఒంటిమీద చొక్కాల్లేవు. ఈ పెళ్లియింట్లోకూడా వాళ్లు చిన్నచిన్న మాసిపోయిన పంచెలు కట్టుకున్నారు. చెప్పుల్లేని కాళ్లతో తిరుగుతున్నారు. ఇహ మాటలు చూస్తే కోటలు దాటేటట్లుంటాయి. మహాశ్వేత కేమిటో మనస్సు వికలమయింది.

వరుడుకూడా యేమిటో అదోకరకం పట్టుబట్టలు కట్టుకుని ఉన్నంత వరకు ఒకరకం, అంతే. ఇప్పుడింక గోనెసంచిలాంటి కోరాపంచె కట్టుకుని

పెద్దకొయ్యతుళ్లను పేళ్లు వెయ్యటంలో నిమగ్ను డయినాడు. రేపు పెద్ద యేదో హెూమకర్మ ఉంది. అందుకే ఈ కట్టెలు. అయితే అదృష్టం - ఒంటిమీద చొక్కాలేకుండా లేడు, పొట్టిలాల్చీలాంటిది వేసుకున్నాడు.

కాని ఏమయినా అనండి, అతడిరంగు మాత్రం భలేరంగు బాబూ! తనకంటె చాలా తెలుపు అని మహాశ్వేత మనస్సులో ఒప్పుకుంది. శ్రమ పడటం మూలంగా నుదుటిమీద చెమట కనిపిస్తోంది. ముఖం యెర్రపడి పోయింది. అయితే మహాశ్వేత కది యెరుపెక్కటంకాదు, ప్రొద్దున్నే ముఖానికెవరో పారాణి పూసినట్లనిపించింది. అంత గడ్డం లేకుండా ఉంటే బావుండేది.

శ్యామ పూలపాన్పు సరంజామా బాగానే పంపింది. అందరూ తెగ పొగడారు. పదిరూపాయలకంటె ఖర్చు యెక్కువ అవలేదు, నిజమే. కాని తన శరీరశ్రమతో చాలా సమకూర్చింది. రెండు పళ్లాలు 'చంద్రపులి' (తీపివస్తువు) ఒక పళ్లెంనిండా పాలతో తయారుచేసిన 'ఖాంచ్', ఇంకొక పళ్లెం 'కచూరీ' 'సింగాడా' 'సందేష్' (తీపివస్తువులు) అన్నీ స్వయంగా తయారుచేసింది. ఇహపోతే లాంఛనాలు - అల్లుడికి ధోవతి, ఉత్తరీయం, కూతురికి యెర్రఅంచుచీర, గంపెడుపూలు, దండలు, గంధం - యేవీ మరిచి పోలేదు. ఒక చిన్నపాత్రతో నెయ్యి. మైదా, కాసిని కూరలు, పంచదార, పటికబెల్లంతోసహా అన్నీ అమర్చి పంపించింది. ఈగ్రామంలో పూలపాన్పు కెవ్వరూ యింత సామగ్రీ పంపలేదని అందరూ అనుకున్నారు.

'బౌభాత్' ఆచారవిధానం మధ్యాహ్నానికే పూర్తిఅయింది. అన్నం, పప్పు, పులుసు, చేపలకూర, పెరుగు, చివరికి జిలేబీ. మహాశ్వేతకి కళ్లల్లో నీళ్లతిరిగాయి. ఇంతఘనంగా తన పెళ్లిజరిగింది. ఇదీ బౌభాత్ విందు. అలాగే ఆహ్వానితులు ఆశీర్వదించటానికి వచ్చి చాలావరకు పావలా, రెండణాలు యిచ్చి వెళ్లారు. మరీ ఆత్మీయులైనవాళ్లు, కలకత్తా నుంచి వచ్చినవారు మాత్రం కొందరు రూపాయిచొప్పున యిచ్చి వెళ్లారు. రాజాగారింటి సర్కార్ ఓ కుర్రవాణ్ణి వెంటపెట్టుకుని వచ్చి ఆహ్వానాన్ని మన్నించి వెళ్లారు. అతడు మాత్రం అందరికంటె యెక్కువ అయిదు రూపాయ లిచ్చాడు.

అయితే అంతా లెఖ్కవేసి చూస్తే తక్కువేమీ రాలేదు. మహాశ్వేత యెదుటే అత్తగారు అన్నీ లెఖ్కపెట్టి పెట్టెలో పెట్టింది. ఇంచుమించు ఇరవై యేడు రూపాయలు.

బౌభాత్ తతంగం పెందరాళే అయిపోవటంతో, పూలపాన్పు యేర్పాటుకూడా పెందరాళే చెయ్యటం జరిగింది. ఆడవాళ్లందరూ అలసిపోయి ఉన్నారు. ఇళ్లకి వెళ్లిపోయారు. మహాశ్వేతకూడా బతికిపోయింది. కొయ్యబొమ్మలా ముస్తాబయి రోజంతా కూచోటం, వేళతప్పి భోజనం చెయ్యటంతో ఆమెకి కళ్లు లాగుతున్నాయి. ఇప్పుడిహ కాసేపు నిద్రపోతే బతికిపోతుంది.

కాని ఆడవాళ్లు ఆ తతంగం అంతా పూర్తిచేసి, వారిని పడుకోనిచ్చి బయటికి వెళ్లింతర్వాత - నిజంగా యెంతప్రయత్నించినా నిద్ర రాలేదు.

ఒకే ఒక బాగాఉన్న గదిలో వారి పూలపాన్పుకి యేర్పాట్లు జరిగాయి. పనసచెక్కతో తయారుచేసిన పాతకాలపు బల్లమీద పక్క. కొన్ని చిరిగిపోయిన బొంతలమీద తెల్లటి దుప్పటి పరచిఉంది. ఒకమూల మినుకు మినుకు మంటున్న ఆముదం ప్రమిద దీపం వెలుగుతోంది. గాలికి ఆ దీపశిఖ అటుఇటు కదులుతోంది. దాంతోపాటు తూర్పువైపు గోడమీద, విరిగిపోయిన పెట్టెమూతనీడకూడా కదులుతోంది.

గోడల్ని చాలాచోట్ల సున్నం లేదు. ఏదో ఒకవిధమైన వాసన. అయినా మహాశ్వేత ఒకవైపు తిరిగి, గదిలో ఉన్న వాటినన్నిటినీ పరీక్షగా చూడసాగింది. నిద్రతో కళ్లరెప్పలు బరువెక్కాయి. కళ్లురెండూ లాగుతున్నాయి. అయినా యేమిటో నిద్ర రావటం లేదు. ప్రక్కన పడుకున్న అతణ్ణి గురించి కుతూహలమే అన్నిటికంటె యెక్కువగాఉంది. భయమేస్తోంది. పడుకుని ఉండే తనకాళ్లు కొంచెం కంపిస్తున్నాయని గ్రహించింది. అరచేతులకు చెమట పట్టింది. అయినా భయానికి కుతూహలానికి అంతులేదు.

బయట గుసగుసల సవ్వడి. ఎవరైనా దాక్కుని తొంగిచూస్తున్నారేమో? చూడనియ్, తొంగిచూడటంవల్ల లాభమేమిటో మహాశ్వేతకి అర్థం కాలేదు. ఆమెకి ఊరికే నవ్వొస్తోంది. ఈవ్యక్తి సరిగ్గా వెనకాల పడుకోకపోతే నవ్వేసేది!

కొంచెం విసుగు వ్యక్తం చెయ్యగానే, అతడు ఆమె చెవిదగ్గిరగా ముఖంపెట్టి, యెంతో సున్నితంగా, అపేక్షగా "నిద్రరావటంలేదా? కాసిని మంచినీళ్లు తాగుతావా?" అని అడిగాడు.

"ఆఁ" అన్నట్లు తలతిప్పింది. నిజంగానే ఆమెకి దాహం వేసింది. అతడు సరిగ్గా కనిపెట్టేశాడు.

అతడు సాధ్యమైనంతవరకు చప్పుడుకాకుండానే లేచి వెళ్లి, ఇత్తడి ఆల్పాకరాతో నీళ్లు తెచ్చి యిచ్చాడు. మహాశ్వేత లేచి కూచుని మంచినీళ్లు తాగి, మళ్లీ పడుకుంది.

తర్వాత కొంచెంసేపు యిద్దరూ యేం మాట్లాడలేదు. బయట గుసగుసల సవ్వడి కాస్త తగ్గింది. ఆమెని కొంచెం తనవైపుకి లాక్కుని, "నిద్ర రాకపోతే యేదైనా కథ చెప్పరాదూ ?" అన్నాడు.

వరుడితో మెల్లిగా మాట్లాడాలని యెవరూ చెప్పకపోయినా, యెలాగో తెలుసుకుంది. ఆమె గుసగుసలాడుతున్నట్టే "యేంకథ చెప్పను ?" అని అడిగింది.

"నీయిష్టం"

కొంచెంసేపయాక "మీరు గడ్డం చేయించుకోరు. యెందుకని ? సర్కారుతాతగా రింట్లోనూ మావాడలోనూ అందరూ గడ్డాలు చేయించు కుంటారు. ముసలివాళ్లయాక గడ్డాలు పెంచుకుంటారు" అన్నది.

"ఖర్చు తగ్గుతుందిగా !" అన్నాడతడు.

"గడ్డంచేయించుకుంటే ఖర్చవుతుందా ?"

"మంగలి కాణి చొప్పున తీసుకుంటాడు. నెలకి రెండణాలు"

"పెద్దఖర్చే !" పెదిమ విరిచి అన్నది మహాశ్వేత.

అతడు కొంచెం గంభీరంగా "నాకు వచ్చే జీతం పంథొమ్మిది రూపాయలు. అయిదుగురు మనుషులు భోంచెయ్యాలి. చెల్లెలి పెళ్లి చేశాను. నువ్వు వచ్చాక ఆరుగురమయాం. ఈ ఆదాయం సరిపోతుందా ? ఇల్లూ అదీ కట్టుకోవాలిగా ! అయినా గడ్డం పెంచుకుంటే తప్పేముంది !" అన్నాడు.

"ఆఁ ! తప్పేముంది !" ఆరిందాలా అన్నది మహాశ్వేత.

కొంచెంసేపయాక ఆమె మళ్లీ హఠాత్తుగా "దొంగ యెలా ఉంటాడు ?" అని అడిగింది.

"అది తెలియదు. మనిషిలాగానే ఉంటా డనుకుంటాను అయినా హఠాత్తుగా దొంగ సంగతి యెందుకొచ్చింది ?"

మహాశ్వేత కొంచెం తెల్లబోయి, "అమ్మ యెవరితోనయినా - 'బయట గుడ్డలున్నాయి, చూస్తూ ఉండు దొంగలెత్తుకుని పోకుండా' అంటుంది. ఇక్కడ దొంగలున్నారా ?" అని అడిగింది.

"లేరు. అయినా దొంగ లెత్తుకుపోవటానికి మనదగ్గిరేముంది ?" తర్వాత యే ప్రసక్తి తీసుకురావాలో మహాశ్వేతకి తెలియలేదు. అతడే దయినా మాట్లాడితే బావుండును. ఆమె మెదలకుండా పడుకుంది. బాధ్యతంతా తనదేనా యేం ? కథ చెప్పరాదూ ? బలేవారే !

ఎంతో ఆలోచించి ఆలోచించి మహాశ్వేత ఓప్రశ్న వేసింది.

"మీ ఊళ్లో పూతిక చెట్టుందా ?"

అతడు కొంచెంనవ్వి, "ఉంది నీకు బహుశా చాలా యిష్టం అనుకుంటాను" అన్నాడు.

కాని యింతలో బయట పెద్ద నవ్వులు విన్పించాయి. రహస్యంగా తొంగిచూడాలని వచ్చినవాళ్లు యింకా ఉన్నారల్లే ఉంది. ఎవరూ పడుకోటానికి వెళ్లలేదు. మహాశ్వేత మళ్లీ 'నేను మరీ తెలివితక్కువగా మాట్లాడాను, యెవరూ వినలేదు కదా !' అని ఆమె సృష్టిలో యెక్కడా లేనంత కంగారుపడి, అటు తిరిగి తల దిండులో దూర్చి పడుకుంది. వరుడు అడిగిన దానికి సమాధానం చెప్పలేదు.

ప్రమిదలో దీపం గాలికి కదలుతోంది. దాంతోపాటు తూర్పువైపు గోడమీద ఉన్న పెట్టెమూత నీడకూడా కదలుతోంది. ఓరకంటితో అటు వైపు చూస్తూనే మహాశ్వేత యెప్పుడో నిద్రపోయింది.

# పదునాల్గవ పరిచ్ఛేదం

## 1

మహాశ్వేత యెనిమిది రోజులు అత్తవారింట్లో ఉండి, వచ్చి ఒక యేడాది పుట్టింట్లో ఉండేట్లు అనుకున్నారు. ఇది ఆచారం. ఈసంవత్సరంలో అల్లు డిక్కడికి రావొచ్చు. కాని కోడలు అత్తవారింటికి వెళ్లకూడదు. ఈప్రాంతంలో ఇదే అనువాయితీ. అదీకాక మహాశ్వేత మరీ చిన్నపిల్ల, సంవత్సరంకంటె యెక్కువ ఉన్నా తప్పు లేదు. కాని మహాశ్వేత అత్తగారు క్షీరోదా యే సంస్కృత పండితుడివద్దనో ఆచారవిధానం తెలుసుకుంది. పెళ్లిఅయిన యెనిమిదిరోజులమధ్య వధూవరులు కలసి వధువు పుట్టింటికి వస్తే, వెంటనే తిరిగి వెళ్లొచ్చు. దీన్ని 'ధూలో పాయే దిన్' అంటారు. అలా చేస్తే అప్పుడిహ సంవత్సరమంతా పుట్టింట్లో ఉండాల్సిన అవసరంలేదు. క్షీరోదాకి కోడల్ని మధ్య తీసుకెళ్లాలనికోరిక.

ఒకటి రెండు నెలలు పుట్టింటో తప్పకుండా ఉంటుంది. కాని ఆమెకి కూడా చెప్పిన పనులు చేసేందుకు చేతిలో ఒకరుండటం అవసరం. సంవత్సరమంతా కోడల్ని పుట్టింటి దగిర ఉంచలేదు.

శ్యామ ముఖం వాడిపోయింది. తన కూతురు యింకా పసిపిల్ల. అల్లుడు జమాజెట్టీలాంటి యువకుడు. ఇప్పటినుంచే అత్తారింట్లో ఉండటం యేమిటి? అత్తారింటి వాలకం అది! శ్యామ హేమని గుచ్చి గుచ్చి అడిగి, అత్తవారింటి తీరు పూర్తిగా తెలుసుకున్నాక, యేడేళ్లపిల్ల అత్తారింట్లో ఉండటమనేది తలచుకుంటేనే మనస్సెలాగో అయిపోయింది. కాని పెళ్లయిం తర్వాత ఆడపిల్ల పరాయిపిల్లే, ఆమె మీద అధికారం ఉండదు. శ్యామ మంగళ శరణు చొచ్చింది.

"ఎలాగమ్మా? వాళ్లిప్పట్నుంచే పిల్లనక్కడ అట్టేపెట్టా లంటున్నారు"

మంగళ కాసేపు ఊరుకుని "ఇప్పుడిలాగే జరుగుతోందని విన్నాను. కొందరు 'ధూలో పాయే దిన్' అని తీసుకెడుతున్నారట! దానికి యేం చెయ్య గలం చెప్పు. గట్టిగా కాదనటానికి వీల్లేదు. తర్వాత మళ్లీ యిక్కడికి తీసుకొచ్చినప్పుడు, రెండు నెల్లు, మూడు నెల్లు యిక్కడే ఉంచుకోవచ్చు. అక్కడి కెళ్లాక రెండు నెల్లు ఉన్నాక, మళ్లీ తీసుకొస్తూ ఉండొచ్చు" అన్నది.

"కాని యిప్పట్నుంచీ అత్తారింట్లో ఉంటే పిల్ల చిక్కిపోతుంది. పైగా అల్లుడేమో జమాజెట్టీ. పిల్లభయంతో హడిలి చిక్కచచ్చిపోతుంది".

"ఇలాంటి పిల్లలే చాలామంది అత్తారిళ్లల్లో కాపురాలు చేస్తున్నారు. దానికేం దిగులు పడఖ్ఖర్లేదు. ఇక అల్లుడి సంగతి చెప్పాలంటే - పిల్ల ఒక్క సంవత్సరం నీ దగ్గిరుంటే కాస్త పెద్దదవుతుంది. తర్వాతయినా అక్కడికి పంపాల్సిందేగా! అప్పుడేం చేస్తావు?"

శ్యామ గత్యంతరం లేక ఊరుకోవలసివచ్చింది.

కాని అల్లుడు అభయప్రద్ మంచి మర్యాదస్తుడు. శ్యామ పెళ్లిలో అంత తెలుసుకోలేదు, కాని పెళ్లయిం తర్వాత 'ధూలోపాయేదిన్'కి వచ్చినప్పుడు ఆ రెండు రోజులు బాగా గమనించి సంతృప్తి చెందింది.

నిజానికి అల్లుడించుమించు తన వయస్సువాడే, కనుక చనువుగా మాట్లాడాలంటే ఆమెకి సిగ్గేస్తుంది, ఎలాగో తలమీది చెంగు బాగా ముందుకు లాక్కుని, అతడి యెదుటికి వస్తుంది. భోజనం ముందు కూచున్నప్పుడు రెండు మాటలు మాట్లాడుతుంది. అదీ సూటిగా కాకుండా గొంతు బాగా తగ్గించి. కాని అభయ్ హేమతోను, మంగళతోను మాట్లాడు

తున్నప్పుడు ఆమె చెవులు రిక్కించుకుని వినేది. అతడి మాటతీరు బావుంటుంది. తియ్యగా మాట్లాడటమే కాదు, చాలా బుద్ధిమంతుడు, తెలివైనవాడిలాగానే మాట్లాడతాడు. ఈ వయస్సులో యింత తెలివి ప్రపంచజ్ఞానం యెలా వచ్చాయో ఆలోచించుకుని కొంచెం తెల్లబోయింది. అయితే కారణాన్ని కొంతవరకు ఆమె ఊహించగలదు. మరీ పిన్న వయస్సులో సంసారభారం అతడికి నెత్తిన పడింది. సంసారంలోనూ, పాఠశాలలోనూ కఠినమైన గురువులదగ్గిర వాస్తవాన్ని ఆకళింపు చేసుకోవలసి వచ్చింది. అంచేత అతడు వయస్సుకి మించిన అనుభవాన్ని సంపాదించుకో గలిగాడు. కిశోరవయస్సులో ఉన్నవాడు వయోధికులయిన వారి బరువులు మోస్తూ, యెప్పుడు వయస్కుడు - కాకలుతీరినవాడయాడో, పాపం అతడికే తెలియదు. శ్యామకి యీ అకాలపక్వయువకుడిమీద జాలేసింది. అతడి కిది అహ్లాదంగా ఆనందంగా గడపవలసిన వయస్సు. ఇప్పుడే అతడు వృద్ధుడిగా పరిణత చెందాల్సిందా?

అభయప్రద్ ప్రవర్తనకూడా చాలా విచిత్రంగా ఉంటుంది. భోజనం ఫలహారం అతడి కెంత సరిపోయేట్లుగానయినా పెట్టనియ్ - సగం తిని, సగం విస్తట్లో వదిలిపెడతాడు. ఒక రసగుల్లా ఫలహారంలో పెడితే దాన్ని సగం చేసి తింటాడు. అన్నం మొదలకుని, చేపవరకు యేదయినా సగం తిని లేస్తాడు. శ్యామ మొదట్లో అంత తెలుసుకోలేకపోయింది. తర్వాత అతడిది బుద్ధిపూర్వకంగానే మహాశ్వేతకోసం వదిలిపెడుతున్నాడని గ్రహించింది. అత్తగారి స్థితిగతులు పూర్తిగా అతడికి తెలియకపోయినా, అభయప్రద్ ఒక్క చూపుతోనే అంచనా వేసుకుని, ఇంతమంది కందరికీ సమానంగా యేర్పాటు చెయ్యటం సాధ్యం కాదని తెలుసుకున్నాడు. తనకి అమర్చిపెడుతున్నవన్నీ, కేవలం తన ఒక్కడికోసమే సమకూర్చినవి. తన భోజనమయితే, తర్వాత మహాశ్వేత తప్పకుండా తన విస్తరి ముందుకి వచ్చి కూచుంటుంది, కనుక బాలికావధువుమీద మమకారంతో అన్ని పదార్థాలను భాగించి పెడుతూంటాడు.

అభయప్రద్ ఈ అలవాటు చాలాకాలం నిలుపుకున్నాడు. ఎన్ని చెప్పినా, ఎంతబ్రతిమాలినా అతణ్ణి యెవరూ మార్చలేక పోయారు. చివరికి శ్యామ వదిలేసింది. సాధ్యమయితే అతడి విస్తట్లో యెక్కువగానే వడ్డించేది. అందులో సగం వదిలేసినా తక్కిన సగం ఒక మనిషికి సరిపోతుంది.

మహాశ్వేత మొదట్లో పులకితురాలయేది. శ్యామమాత్రం అంతా ఆమెని తిననిచ్చేదికాదు. హేమకికూడా భాగించి యిచ్చేది మంచి మంచి తినుబండారాలు. దానికి మహాశ్వేతకి పెద్ద అభ్యంతరం ఉండేది కాదు ఒక్కడే అన్నకదా! అతడి కిచ్చినా తనకి మిగిలేది ఊహకంద నంతటిది.

మొదట 'ధూలోపాయేదిన్' కి వచ్చినరోజున మహాశ్వేత కడుపు నిండా తిని లేచి, "ఏమయినా అనండి బాబూ ! ఆయన చెడ్డవారేమీకాదు" అనేసింది.

శ్యామకి నిజంగా మొదట్లో అర్థం కాలేదు "ఎవరే ? యెవరి సంగతి గురించి చెపుతున్నావు ?" అని అడిగింది.

'ఇకెవరి సంగతి ? అల్లుడి సంగతి ?'

మహాశ్వేత ముఖం యెర్రపడలేదు. కాని శ్యామ చెక్కిళ్లు సిందూరం పులిమిన ట్లయినాయి.

ఇది కేవలం సిగ్గుతో కాదు, ఆనందంతోకూడా. దారుణమైన తన అనుభవం గుర్తుకి వచ్చి భయంతో శరీరమంతా గగుర్పొడిచింది. ఇవాళ అభయప్రద్‌ని బాగా అర్థంచేసుకుని, కూతురి మాటలు వినటంతో - ఆనందంతో ఆమె కళ్లు చెమరించాయి.

ఆమె నిశ్చింతురాలయింది. మనిషి చేతిలో పడింది, జంతువు చేతిలో పడలేదు. ఇప్పుడు కూతురు యెన్ని కష్టాలయినా పడనియ్. ఆమెకేమీ మనఃక్షోభ ఉండదు.

మొదటిరోజున వాళ్లు వెళ్లేప్పుడు, హేమ వారిని సాగనంపటానికి వెళ్లాడు. మల్లిక్‌గారి తోటదాటి, చట్‌ఖండీగారి యింటిదాకా వెళ్లి, పెద్దరోడ్డు యెక్కించి తిరిగి వచ్చేప్పటికి హేమ చేతిలో వెండి రూపాయి తళతళ్లాడింది.

"ఇదేమిట్రా ? ఎక్కడి నుంచి వచ్చింది ?" అని శ్యామ చకితురాలై అడిగింది.

హేమ ఉజ్జ్వలముఖంతో రూపాయి శ్యామ చేతికిచ్చి, "బావగారిచ్చారమ్మా ! నేను యేమయినాసరే తీసుకోటానికి ఒప్పుకోలేదు. అతడూ విడిచిపెట్టలేదు. 'సందేష్' కొనుక్కుని తినమన్నాడు. అతడి ఉదారగుణం అల్లుళ్లకి తెలుస్తుందా ? నాచెవిలో - ఇచ్చింది వద్దనకూడదు. మళ్లీ రెండోసారి వచ్చినప్పుడు ఖర్చులేదూ ?" అన్నాడు. నాకు వింటే సిగ్గేసింది" అన్నాడు.

సిగ్గుపడవలసిన సంగతే. అదిమాత్రం నిజం శ్యామదిగులుకి అంతులేదు. ఆనాటిసంగతి గుర్తుకొచ్చింది. పెళ్లిఅవటంతో శ్యామకి చేతులు కడుక్కున్నట్లయింది. ఎక్కణ్ణుంచైనా, యేదయినా వస్తుందన్న ఆశకూడా లేదు. నరేన్ జారుకున్నాడు. ఎంతత్వరగా వచ్చినా రెండునెలలు.

ఉన్న ఆధారంఒక్కటే, కొబ్బరి ఆకులు. అదీ ఈహడావిడిలో కొన్నాళ్లుగా ఆ పని ముట్టుకోలేదు. ఎంత కష్టపడినా నాలుగణాలు అయిదణాలే వస్తుంది. తర్వాత ?

ఈ తర్వాత అన్న ప్రశ్నతో, గుండెల్లో రక్తం గడ్డకట్టుకుపోతున్న తరుణంలో, యేదో దేవుడిచ్చిన వరంలా రూపాయి చేతిలోకి వచ్చింది.

అల్లుడు దీర్ఘాయుష్మంతు డగుగాక ! మహాశ్వేత సుఖపడుగాకమాతా ! మంగళచండీ ! ఇన్నాళ్లకి కాస్త తలెత్తి చూశావా తల్లీ !

మంగళచండికి నమస్కారం చేయబోయేసరికి, మంగళమాటకూడా గుర్తొచ్చింది. అదృష్టం, అప్పుడు వయస్సు మాటవిని వెనకాముందాడలేదు. మంగళరుణాన్ని తాను తీర్చుకోలేదు.

## 2

అత్తగారింటి దారిద్ర్యం పెళ్లిఅయిన యెనిమిది రోజులవరకు మహాశ్వేతకి సరీగ్గా కంటపడలేదు. బెంగాలీ మధ్యతరగతి కుటుంబాల్లో అప్పుచేసికాని, యాచనచేసికాని - పెళ్లిమొదలయిన సామాజికకార్యకలాపాల్లో ఒక కృత్రిమమైన ఆడంబరం సృష్టించటం జరుగుతూంటుంది. దాన్నిబట్టి గృహస్థు నిజమైనస్థితిగతులు తెలుసుకోటం కష్టం. పైగా స్థితిమంతులైన వారి యిళ్లల్లో అక్కడక్కడ పిసినారితనం కన్పిస్తుంటుంది. పైగా సంపన్నులం కదా అని అది చూపించటానికి సాహసిస్తారేమో అనిపిస్తుంది. పేదయిళ్లల్లో యెంత అభావమో, అక్కడంత సమృద్ధి. అదిరుజువు చెయ్యటానికి కార్యకర్తలు సతమత మవుతూంటారు. అభయప్రద్ యింట్లోకూడా దీనికి విభిన్నంగా జరగలేదు. కట్నంగా వచ్చిన యాభైఒక్కరూపాయలుకాక, అతడెంతో కష్టపడి కూడబెట్టిన అరవైరూపాయలు తెచ్చి యిచ్చాడు. అదీకాక ఇంకా కొంత అప్పు చెయ్యాల్సి వచ్చింది. సంసారం గడపాలి. తెచ్చిన అప్పు తీర్చాలి. అన్నీ యీ పంధొమ్మిదిరూపాయల జీతంలోనుంచే, కనుక వధువుయెదుట యెలాంటి కృత్రిమమైన పరువూ ప్రదర్శించటానికి లేదు. మహాశ్వేత రెండునెల లయింతర్వాత - మళ్లీ అత్తవారింటి కొచ్చినప్పుడు బయటి కృత్రిమమైన ఆచ్ఛాదనే కాదు, చర్మం, మాంసంకూడా జారిపోయి, దారిద్ర్యం కంకాళరూపం బయటికి వెల్లడయింది.

అభయప్రద్ ఆఫీసు యెక్కడో హౌరావంతెనదగ్గిర. కార్ఖానాలోపని. యెనిమిది గంటలకి హాజరవాలి. కనుక అతడు అయిదుగంటలకే

భోజనం చేసి బయటపడాలి. పక్కా రెండున్నర క్రోసుల దూరం నడిచి, పెద్దరోడ్డుమీదికి యేడుంబావుకి చేరుకోవచ్చు. తక్కిన క్రోసున్నర దూరానికి తరచు ఒకసౌకర్యం దొరుకుతూంటుంది. ఆఫీసు దొరల బగ్గీలు చాలా ఆ రోడ్డునే వెడుతూంటాయి. కొంద రెవరయినా దయతలచి ఆపి, కోచ్‌మాన్ పక్కన యెక్కించుకుని వెడుతూంటారు. లేకపోతే అదికూడా నడిచే వెళ్లాలి. తిరిగివచ్చేప్పుడుకూడా యిదే యేర్పాటు ఉంటుంది.

ఏమయినా కానియ్, క్రిందటిరాత్రి పప్పు, కూరతోపాటు వేడిఅన్నంతో భోజనం ముగించాలి. అభయప్రద్ అలాంటిది లేనిరోజున, పప్పు అన్నంతో భోజనం చేసి లేవాల్సిందే. ఇంతకంటె యెక్కువగా క్షీరోదా చెయ్యలేదు. ఆమె రోజూ తెల్లవారకట్ల నాలుగింటికి లేస్తుంది. కాని కాల కృత్యాలు తీర్చుకుని, స్నానంచేసి, అన్నం పొయ్యిమీద పెట్టేసరికే యెక్కడినుంచో అయిదుగంటలు కొట్టటం విన్పిస్తుంది. కాని ఆరోజున క్రిందటిరాత్రి పప్పు కూర యేకారణంచేతనయినా లేకపోతే కొంచెం ఆశాభంగంతో - ''అరె! రాత్రి మిగిలినవాటిని యింత నిర్లక్ష్యంచేస్తే యేం వేసుకుని భోంచేస్తావ్? ఇంట్లోకూడా యేమీ లేవు. అందుకే ఇంట్లో కాసిని బంగాళాదుంపలు తెచ్చి పడెయ్యమంటాను. ఇలాంటప్పుడు నాలుగు బంగాళా దుంపలుంటే యెంత సౌకర్యంగా ఉంటుంది" అంటుంది.

అభయప్రద్ ఈమాటలన్నిటికీ యెప్పుడూ సమాధానం చెప్పడని వేరే చెప్పఖ్ఖర్లేదు. భోజనంగురించి యెప్పుడూ యెవరితోనూ చర్చించడు. అంతదాకా యెందుకు? పప్పులో ఉప్పు వెయ్యకపోయినా అడగడు. అడిగి వేయించుకోడు. ఒకవేళ పొరపాటున రెట్టింపుఉప్పు వేసినా యెలాంటి ఫిర్యాదు చెయ్యడు. రాత్రికూడా అతడు అందరికంటె ముందు తింటాడు. కాని అతడికి భోజనం పెట్టటానికి క్షీరోదాకి ధైర్యం చాలదు.

తల్లి "ఏమిట్రా? నువ్వు అప్పుడే చెపితే మళ్లీ ఉప్పువేసి కలిపేదాన్నిగా!" అనేది. కాని దానివల్ల అభయప్రద్ ముఖంలో ప్రశాంతత కాని, మౌనంకాని సడలేవి కావు. "అవసరం యేముందమ్మా? నువ్వు యెలావండితే అలాగే తింటాను అప్పుడు చూడు" అనేవాడు.

"అంటే నీ నోటికి రుచి తెలియదా యేంరా? యెలా తింటావ్?"

"తింటున్నానంటే అసౌకర్యం యేమీ లేదని తెలుసుకోవాలి". అంత కంటె యెప్పుడూ యెక్కువ మాట్లాడడు.

అభయ్‌ప్రద్‌వరకు ఆకులతో మంటచేసి, చిన్న గిన్నెతో వండుతుంది. తర్వాత క్షీరోదా బయటికి వెళ్లి ఎవరి దొడ్లో వెనక మేడికాయలున్నాయా?

ఎక్కడ రెండుకొమ్మలు విరిగిపడ్డాయా ? ఎవరింట్లో కాసిని ఉసిరికాయలు దొరుకుతాయా ? ఎక్కడ కాస్త అరటిదూట దొరుకుతుందా అని తిరగటం మొదలెడుతుంది. ఏవి దొరికితే వాటిని సంగ్రహించుకుని, మళ్లీ యెనిమిది గంటల ప్రాంతంలో తిరిగి వస్తుంది. తర్వాత పప్పుగిన్నె పొయ్యిమీద పెడుతుంది. మహాశ్వేత వచ్చినప్పట్నుంచి చూస్తోంది. రోజూ 'అడర్‌డాలే' (ఒక విధమైన చౌకబారు పప్పు). ఒకరోజున అత్తగారిని అడగనుకూడా అడిగింది. "అత్తగారూ ! రోజూ అడర్‌డాలే వండుతా రెందుకని ?" దానికి అత్తగారు "అదేమిటి ? నీకు తెలియదామ్మా ! అది మంచి బలవర్ధకం. దొరలు కూడా తింటారు" అని సమాధానం చెప్పింది. తర్వాత అసలు సంగతి అది కాదని మహాశ్వేత విన్నది. తన యీడుదే ఆడపడుచు బూడీ. ఒకరోజున చనువుగా మాట్లాడుకుంటున్న సమయంలో, "బలమా - పాడా ? అసలు సంగతేమిటంటే చౌక. అన్నయ్య యెక్కడినుంచో తెస్తాడు ఈ అడర్‌డాల్ శేరు అణా. ఈ నాసిరకం పప్పు బలంకూడానా ? కుండూ గారింటికి అడర్‌డాల్ వస్తుంది. ఇంత పెద్దపెద్దబద్ద. వాళ్లింట్లో ఆ పప్పు నౌకర్లకి దర్వాన్‌కి పెడతారు" అని చెప్పింది బూడీ. ఈ పప్పు చ(చ్చడి ఎప్పుడయినా పచ్చిచింతకాయలుకాని, ఉసిరికాయలుకాని దొరికితే, మహావేస్తే పులుసు కాని పప్పుకాని చేస్తుంది. ఆ పులుసులో కాస్తబెల్లం పడనీయదు. జబ్బు చేస్తుందట !

కాని మహాశ్వేతకి పప్పు (చ(చ్చడి ఒకవిధమైన కూర)తో తినటానికి అభ్యంతరం యేమీలేదు. అవయినా బాగా పెడితే. ప్రతిరోజూ పుల్లబచ్చలి గుమ్మడికాయే - ఇవి రెండూ వారి మెల్లాలోనే బాగా పెరిగాయి.

'డుమూర్‌ఖోడ్' 'కాంచ్‌కలా' (ఒక రకమైన కూరలు) దొరికిన రోజున 'చచ్చడీ' చేసేది. అది మగవాళ్లకి. చిన్న ఆడబిడ్డకి మాత్రమే వేసేది. అత్తగారికి కోడళ్లకి మాత్రం రోజూ చేసే మామూలువే. మహాశ్వేతకి ఆ ప్రత్యేకంగా చేసింది దొరికినరోజున పండగే. కాని అది యెప్పుడైనా ఒకసారి. నీళ్లలాగా పల్చటి పప్పు. ఆ ఆకుకూర తినాలంటే మహాశ్వేతకి ఒకొకరోజున కళ్లవెంబడి నీళ్లొచ్చేవి. అత్తగారూ అదే తినేది, కాని అంత మాత్రాన ఆమెకి సాంత్వన కలిగేది కాదు.

"అత్తగారూ ! మనం బజారునుంచి సరుకులు తెచ్చుకోము యెందుకని ?" అని అడిగింది ఒకరోజున.

క్షీరోదా గతుక్కుమంది. ఆమె ముఖం యెర్రపడింది. "ఎందుకు తెచ్చుకోమమ్మా ! అయితే యేదో గడిచిపోతోంది. నలుగురూ మనమంటే

అభిమానిస్తారు. అవీయివీ పంపుతూంటారు - అందుకని. అదీకాక మా అభయప్రద్ అంత పట్టించుకోడు.

మహాశ్వేతకి అన్నిటికంటె భర్తను కలుసుకోలేకపోవటం మనస్సుకి కష్టంగా ఉంది. ఈసారి అత్తవారింటికి వచ్చినప్పట్నుంచీ పడకలయేర్పాటులో మార్పు వచ్చింది. పెద్దగదిలో తాను ఆడపడుచు లిద్దరు, చిన్నమరది, అత్తగారు పడుకుంటారు. పడిపోయిన యింట్లో తక్కిన అన్న లిద్దరూ పడుకుంటారు. ఇందు కామె ఖిన్నురాలయింది. అత్తవారింట్లో అందరికంటె మంచివాడు తన భర్త ఒక్కడే. మహాశ్వేత మనస్సులోని మాట అతడితో ఒక్కడితోనే నిస్సంకోచంగా చెప్పొచ్చు అన్న యెలాగో తనకి తానే తెలుసుకుంది. కాని యెలా? నేను భర్తదగ్గిరే పడుకుంటానని నోరు విప్పి చెప్పటానికి లేదు. పైగా అత్తగారు "ఇప్పుడు నువ్వు చాలా చిన్నపిల్లవి. నువ్వు కొన్నాళ్ళపాటు నా దగ్గిరే పడుకుంటూ ఉండు లేకపోతే భయపడొచ్చు" అని చెప్పనుకూడా చెప్పింది.

ఆ మాట వింటే మహాశ్వేతకి నవ్వొచ్చింది. మొదట యెనిమిది రోజులు తాను భయపడలేదు. ఇప్పుడు పాతయిల్లని భయపడుతుందా?

ఈలోగా ఒకరోజున కాస్త వీలు చిక్కింది. ఆరోజున ఆదివారమయి ఉంటుంది. అభయప్రద్‌ని యెవరూ లేనిచోటుకి పిలిచి "ఒకరోజున 'పటోల్' (ఒకరకమైన పండు) తీసుకురారాదూ? నాకు తినాలనిఉంది. కాని చాలా తీసుకురండి. లేకపోతే నాదాకా అత్తగారిదాకా రావు" అని చెప్పింది.

"అలాగే తెస్తాను, కాని నువ్వు అమ్మతో బజారుకెళ్ళి అవీయివీ కొనుక్కురావటం మాటచెప్పకు. మనది లేని సంసారం మనకి బజారెళ్ళి కొనుక్కొని వచ్చి తినటం వీలవుతుందా? జాగ్రత్తగా సంసారం గడుపు కుంటే చాలు. ఆమె అనవసరంగా చిన్న పుచ్చుకుంటుంది."

ఆ మాట అనేసరికి మహాశ్వేత తెల్లబోయింది "ఇంకెప్పుడూ చెప్పను" అని తుర్రున పారిపోయింది.

మర్నాడు సాయంత్రం అభయప్రద్ యిన్ని పటోలాలు తువాలున మూటకట్టుకుని యింటి కొచ్చాడు. తల్లిముందు వాటిని కుమ్మరించి, "పొలాలకేసి యివాళ కొంచెం పని తగిలింది. ఒక్క అణాకి యిన్ని పట్టోలాలు వచ్చాయి, తీసుకొచ్చాను" అన్నాడు.

కాని ఆ పటోలాలని చూస్తే నవ్వాలో యేడవాలో తెలియలేదు మహాశ్వేతకి. పచ్చగా పండిపోయిన పటోలాలు.... కొన్ని తడిసిపోయినవి కూడా ఉన్నాయి. కొన్ని సగానికి విరిగి ముక్కలయినవి.

ఆ పటోలాల్లో యేరి తీసినవి ఒక్కరాత్రికూడా నిలువవుండవు. వాటిని కాల్చటం జరిగింది. ఆ కాల్చిన పటోలాలే ఆ రాత్రికి ఆహారం. అత్తగారు రాత్రి అన్నం తినదు. అటుకులు తింటుంది. ఆమెకూడా పటోలాలు కాల్చి అటుకులతో కలిపి తిన్నది ఎంతో సంతోషంతో. ''పటోలాలు యెంత తియ్యగా ఉన్నాయో చూశావా మహా! వీటిని కాల్చి తినటం నాకు చాలా యిష్టం'' అన్నది.

మహాశ్వేతకి మొదట్లో ఇవేమీ బాగాలేదు. ఆమె అమ్మమ్మ గారింట్లో తిన్నది. ఎంత బాగుండేవి! ఇవేమిటిపాడు! తనలో తాను మాటిమాటికీ 'ఇదే ఆఖరుసారి! ఇలాంటి అయోమయం మనిషికి ఇంకెన్నడూ యేదైనా చెపితేనా? మంచిశాస్తి అయింది' అనుకోసాగింది.

మహాశ్వేత ఒకరోజున అన్నంతింటూ తింటూ ''అత్తగారూ! పప్పు మీరింత పల్చగా చేస్తారెందుకని? మా అమ్మమ్మ యేపప్పుచేసినా గట్టిగా ఉండేట్లు చేస్తుంది. అది బావుంటుంది'' అన్నది.

దానికి క్షీరోదా నవ్వింది. మహాశ్వేత సిగ్గుపడిపోయింది. చూడండి యేంచేసిందో! ఆమె మళ్లీ ఒకదానికి ఒకటి చెప్పింది. భర్త ఆమెని చాటుకి పిలిచి, గంభీరంగా సైగలతో శాసించాడు.

''అమ్మో! అడర్‌డాల్ గట్టిగా చెయ్యటమా? యెవరైనా వింటే నవ్వు తారు. ఆ అన్నమాటేదో నాముందు అన్నావు. కాని ఇహ యెవరి ముందూ ఇలా మాట్లాడకు'' అన్నది క్షీరోదా.

పటర్‌డాల్ గట్టిగా ఉంటే, అందులో సిగ్గుపడాల్సిందేముందో మహాశ్వేతకి బోధపడలేదు. తినటాని కదే బాగుంటుంది. అయినా మనస్సులో తిండిసంగతి యింకెప్పుడు యెత్తను అని ప్రతిజ్ఞ చేసుకుంది. పుట్టింట్లో రెండుపూటలా భోజనం దొరకటమే స్వప్నాతీతంగా ఉండేదని చెప్పొచ్చు. ఇక్కడ రెండు పూటలా కడుపునిండా తినగలుగుతోంది.

వయస్సు తక్కువయినా అభావం, దారిద్ర్యం మహాశ్వేతను రాటు తేల్చాయి. అప్పుడప్పుడు తాను అన్నీ తెలిసిన వ్యక్తిననే భావించుకుంటుంది.

కాని ఒక విషయానికి మాత్రం ఆమెకి యేడుపు వచ్చేది. ఆమె మరుదులు, ఆడపడుచులు రోజూ ముందుగా తినేవాళ్లు. ఎవరి కంచాల్లో యేం మిగిలితే, దాన్నితీసి అత్తగారు ఒక గిన్నెలో పెట్టి ఉంచేది. వాటిని తనకి తినటానికి పెట్టేది. వాళ్ల పప్పు కూరకలిపిన అన్నం కెక్కిరించినట్లు తినే వాళ్లు. ముఖ్యంగా చిన్నమరిది దుర్గాపద్ యెప్పుడూ జలుబు కారుతూండే వాడు. అతడు తిండితినేతీరు జ్ఞాపకం వస్తేనే మహాశ్వేతకి డోకు వస్తుంది. అతడు. ఇంతపెట్టించుకుని, కొంతతిని తక్కింది వదిలేసి లేచి వెడతాడు. అతడికంటె కొంచెం జ్ఞానంఉన్న అతడు శుభ్రంగా తిని వెడతాడు. కేవలం పప్పుకలిపిన అన్నం-యేడు విస్తళ్లలోంచి తీసిపెట్టిన చద్దిఅన్నం! ఒకొకరోజున మహాశ్వేత చాటుగా తలకొట్టుకొనేది. అన్నం వదిలేసి, యేడుస్తూ కూచునేది. ఒకొకరోజున మెటికలు విరిచి, 'మీ మొహాలు మండ, మీ గుడ్లుమాడ, చావండి. ఇంతమందికి కలరా వస్తుంది, మీకు రాదా ?' అని తిడుతుంది.

సర్కారుగారి చెరువుకి స్నానానికి వచ్చి, పోద్దారు భార్య సరిగ్గా అదే భాషలో తన మరదుల్ని తిట్టేది. మహాశ్వేతకి ఆ తిట్లే జ్ఞాపకం ఉన్నాయి.

ఒకొకరోజున పనివేళప్పుడు దుర్గాపద్ యేడ్చి మారాం చేసేవాడు. అప్పుడు అత్తగారు - "అమ్మా మహా! వాణ్ణి కాస్త సముదాయించు. వద్దు వద్దులే, యెత్తుకో అఖ్కర్లా. అలా చెయ్యిపట్టుకుని తీసుకెళ్లి ఆడించు" అనేది.

అది మహాశ్వేతకి మంచివీలు. ఒకొకరోజున తొడపాశం పెట్టేది. దాంతో కెవ్వుమని బిగ్గరగా యేడ్చేవాడు. అప్పుడు పళ్లుబిగించి తనలో తాను - 'రాక్షసిపిల్లాడు, చావుచావు' అని తిట్టి, పైకి అత్తగారిని బిగ్గరగా పిలిచి. "మీరు రండి, ఎంత ఆడించినా ఊరుకోటం లేదు" అనేది.

## 3

అత్తగారింట్లో రాధాదామోదర విగ్రహా లున్నాయి. మహాశ్వేతకి పెళ్లిసమయంలో అది బాగా తెలియదు. ఆమెని ఒకపూజగదిలోకి తీసుకెళ్లి నమస్కారం చేయించారు. అంతచీకటిగా ఉన్న చిన్నగదిలో మరీ నేల బారుగాఉన్న అరుగుమీదఉన్న రెండు విగ్రహాలు, రాతివిగ్రహం కృష్ణుడిది. అష్టధాతులోహంతో చేసిన విగ్రహం రాధది. ఎదురుగా సింహాసనం మీద సాలిగ్రామం, ఇంకో చిన్న శివుడి విగ్రహం. చిత్తడిగా ఉండే గదిలో లెక్కలేనన్ని బొద్దింకలు తిరుగుతూంటాయి. గదంతా యేదో ఒక విధమైన వాసన. ఆ విగ్రహాల్ని చూస్తే మహాశ్వేతకి భక్తి కలగలేదు ఇదివరకు అమ్మమ్మతో గంగాస్నానానికి వెళ్లినప్పుడు 'ఆనందమయి'

ఆశ్రమంలో దేముణ్ణి చూసింది. లాల్‌బజార్‌లో మదన్‌మోహన్‌ని చూసింది. ఒకసారి దక్షిణేశ్వరంకూడా వెళ్లింది. వాళ్లందరూ యెలాంటి దేముళ్లు! యెన్ని నగలు! యెన్ని అలంకారాలు! పూలు, గంధం వాసనలు! అందాకా యెందుకు! తమ సర్కార్‌గారింట్లో దేముడికూడా యెలాంటి మందిరం! ఎంత యెత్తుగా ఉంటుంది! ఇదేమిటి పాడు!

ఏమయినా ఈ దేముడు వారి దేముడేనని అప్పుడు తెలుసుకో లేకపోయింది. ఎనిమిది మాసాల తర్వాత ఆ నెలనుండి పూజవంతు తమకి వస్తుంది అని విన్నపుడు తెలుసుకుంది.

"అంటే యేమిటత్తయ్యా?" అని అడిగింది మహాశ్వేత.

క్షీరోదా విడమర్చి చెప్పింది. మా మామగారు పెదమామగారు చినమామగార్లతో కలిసి ముగ్గు రన్నదమ్ములు. దేముణ్ణి ప్రతిష్ఠ చేసింది మా మామగారు. ఈ వంశంలోవా రందరూ పూజలు చేయాలని నిబంధన. ఇప్పుడది మూడు యిళ్లకి సంక్రమించింది. కనుక యేడాది కొకరు చొప్పున వంతు లేసుకుని పూజలు చెయ్యాలి. కిందటి సంవత్సరం మా బావగారిది. ఇప్పుడిహ మనవంతు వచ్చింది. ఒక సంవత్సరం మనం పూజలు చేశాక, మా మరదిగారున్నా రొకరు, అతడిమీద పడుతుంది బాధ్యత.

"ఇదేమిటి? అందరూ కలిసే పూజలు చెయ్యొచ్చుగా!"

"అలా జరగదు, అలా అయితే యెవరూ చెయ్యరు. అందరూ తప్పించుకుంటారు. యెగ్గొట్టటానికి ప్రయత్నిస్తారు."

"అదేం మాట?" మహాశ్వేతకి సరిగ్గా అర్థం కాలేదు. దేముడికి పూజ చెయ్యటం అనేది అదృష్టం. పిన్ని యెన్నోసార్లు చెప్పింది. దాన్ని యెగ్గొడతారా యెవరైనా?

అయినా ఆ మాట వినేసరికి మహాశేతకి ఆనందమే కలిగింది. ఆమెది చిన్నపిల్లల మనస్తత్వం. పూజల్లో బొమ్మలతో ఆడుకోటంలాంటి ఉత్సాహం ఉంది. "అయితే దేముడెప్పుడొస్తా డత్తయ్యా" ఎంతో ఆసక్తితో అడిగింది.

"వస్తే, ఈ గదిలోనే పెట్టాలి. మనం యిక్కడే పూజోపచారాలు చెయ్యాలి. వాళ్ల వైపు తలుపు మూసేసి, మనవైపు తలుపు తెరవాలి అంతే! ఈ గదికి మూడు వైపుల తలుపులు."

ఆమె రోజులు లెక్కపెడుతోంది. దేముడి పూజ తమవంతు వస్తే తాను గది అంతా కడిగి శుభ్రం చేస్తుంది. బొద్దింకలనన్నిటినీ పట్టుకుని

చంపుతుంది. రెండుపూటలా పొగవేసి, ఈ వాసనంతా పోగొడుతుంది. ఇంకా యెన్నో.

ఒకరోజున అభయపద్ ఆఫీసుకి వెళ్లే సమయం గమనించి, పెరటి గుమ్మంలోంచి వెళ్లి, తోటలో పెద్దమామిడి చెట్టుచాటున నుంచుంది - అతడి కోసం. అభయపద్‌కి యిదంతా తెలియదు. అతడు గబగబా బయటికి వెడు తూంటే మహాశ్వేత "ఏమండీ! మాట" అని పిలిచింది.

అభయ్ తెల్లబోయాడు. దగ్గిరకొచ్చి ముసిముసి నవ్వొకటి నవ్వి "ఏమిటి సంగతి? చెప్పుచెప్పు. టైమయిపోతోంది. పురమాయింపు యేదయినా ఉందా? ఈసారి యేం కావాలి?" అని అడిగాడు.

మహాశ్వేత ఈసారి తెగించి "వచ్చే నెలనుంచి దేముడిపూజ మన వంతు వస్తుంది. దేముడికి కాస్త యెత్తుగా ఉండే సింహాసనం కొనుక్కు రండి. తెలిసిందా? దేముణ్ణి అంత కిందుగా పెట్టటం నాకు బాగుండ లేదు" అన్నది.

అభయపద్ గంభీరంగా "ఆఁ పురమాయింపు చాలా పెద్దదే, నెలకి ఒక్కరూపాయికూడా మిగలటం లేదు. రెండు నెలలనుంచి ఓవర్‌టైము కూడా బంద్ అయిపోయింది. ఎక్కడినుంచి తీసుకొచ్చి కొనను? ఇప్పటి కింకా పెళ్లికయిన అప్పు తీరలేదు, తెలుసా?" అన్నాడు.

మహాశ్వేత ముఖం వాడిపోయింది. వెధవబావు! ఎందుకు తాను భర్తను పురమాయించాలి? ప్రతిసారీ యిలాంటి మాట యేదో ఒకటి వినాల్సి వస్తోంది. ఇలాగే అవమానం! ఛీ. ఛీ. ఇంకెప్పుడూ యేమీ చెప్పను. అని మళ్లీ ప్రతిజ్ఞ చేసుకుంది.

కాని ఆ ఆదివారంనాడే - తోటలో మూల పేర్చిపెట్టిఉన్నపెట్టె లోని కొయ్యముక్కలన్నీ తెచ్చి, అభయపద్ ముందువేసుకుని కూచున్నాడు. పనిముట్లన్నీ అతడి దగ్గిర ఉన్నట్టున్నాయి. మహాశ్వేతకి అలా అనిపిం చింది. ఎక్కడికో వెళ్లి అడిగి తీసుకువచ్చాడని అనిపించలేదు. ఏమ యితే యేం. సాయంత్ర మయేసరికి కొంచెం ఎత్తైన సింహాసనం తయా రయింది. మహాశ్వేత మనస్సులో? "వాహ్! పనితనం తీసెయ్యతగిందేమీ కాదు" అనుకుంది.

మొదట్లో, ఆమెకి చాలా సంతోషం కలిగింది. తనకేదో మనస్సులో చిన్న సరదా కోరిక కలిగింది. దాన్ని తీర్చటానికతడు రోజంతా శ్రమ పడాల్సి వచ్చింది! కాని తర్వాత మళ్లీ భయంతో గుండె గుబగుబ లాడింది.

అతడది ఒకవేళ తల్లితో చెపితే? నీ కోడలు పురమాయించింది. అందు కోసం చేశానంటే! అమ్మో! అదెంత సిగ్గుచేటు! అత్తగారేమనుకుంటారు? రోజూ కోడలు తన కొడుకుతో చాటుగా మాట్లాడుతూంటుంది. అందులో పురమాయించటంకూడా మొదలెట్టింది. అమ్మో కాళీ! ఆ మాట చెప్పకుండా ఉండాలి.

కాని ఆయన చాలా మంచివారు. క్షీరోదా అతణ్ణి "ఏమిట్రా? ప్రొద్దునుంచీ చేస్తున్నావ్?" అని అడిగేసరికి అతడు మామూలుగా, "పూర్ణిమనుంచి దేముడి పూజ మనవంతు వస్తోందిగా! అందుకని కాస్త యెత్తుగా సింహాసనం తయారుచేద్దామనుకున్నాను. చూస్తా యెలా ఉంటుందో! యెంతవరకవుతుందో!" అన్నాడు.

సాయంత్రం పని పూర్తవగానే తల్లిని పిలిచి, "ఎలా ఉందో చూడు" అన్నాడు.

తల్లి పరీక్షగా చూసి చూసి "బాగానే తయారయింది. కాని దేముడి సింహాసనం పాతచెక్కలతో తయారుచెయ్యటంవల్ల దోషమేమీ లేదుకదా!" అన్నది.

"ఆఁ నువ్వొకదానివి, పైన అంతా చెక్కు తీసేసి చేశాను, వస్తువు కొత్తగా చేసిందే! కొయ్యలో దోషం యేముంది?"

దేముడిపూజకి నిజంగా తమవైపు తలుపు తెరచినప్పుడు దేముడి పూజ యేదయినా అయితే కావచ్చు, బొమ్మలతో ఆడుకోవటం మాత్రం కాదని మహాశ్వేత గ్రహించింది. ఎన్నోరకాల పనులు, బోలెడంత జంజాటం. పూజకి కావల్సిన యేర్పాట్లేమీ లేవు, కాని అనుష్ఠానం మాత్రం ఉంది. అన్నం కుండతో వండటం పనికిరాదు. రోజూ తోమిన యిత్తడి గిన్నెతోనే వండాలి. అన్నంలోకి యేమయినా చెయ్యనియ్, బ్రాహ్మల యింట్లో దేముడుకి అన్నం విధిగా నైవేద్యం పెట్టాల్సిందే. భోగం పెడితే మాత్రం యేమవుతుంది. ఉదయం రెండు 'వాతాష్'లు తప్ప యేమీ ఉండవు. ఇరుగుపొరుగువాళ్లు యేమయినా పళ్లు తెచ్చి యిస్తే, లేదా యే "మాసపూజ లయినా చేయించటానికి వస్తే, దేముడి నైవేద్యాన్ని చూస్తారు. పర్వదినాల్లో ఆవాడలోనివాళ్ల దగ్గిర్నుంచి చాలా పూజలు వస్తాయి. ఇలా ఇతరదేశాల్లోకూడా జరుగుతూంటాయి. లాభంతోపాటు శ్రమకూడా తక్కువకాదు. భోగంకూడా అన్నం, పచ్చడి. ఎప్పుడూ పాయసమనేదే ఉండదు. రాత్రి భోగంకింద కాసిని, పాలు పెడతారు. అవి

అత్తగారు తాగేస్తుంది. ఒకరోజున మహాశ్వేత "దేముడి నైవేద్యానికి పాయసంకూడా పెడతారని విన్నాను అత్తయ్యా" అంది. దానికి అత్తగారు "ఆ ఆచారం మనకి లేదు. మనది ఆత్మవత్ సేవ. మనం యేదయితే తింటామో, అదే నైవేద్యం పెడతాం" అని సమాధానం చెప్పింది. మహాశ్వేతకి రాత్రి నైవేద్యం మాట గుర్తొచ్చింది. వారు రోజూ రాత్రి పాలుత్రాగరు, అన్నమే తింటారు. మరి రాత్రికూడా అన్నం యెందుకు భోగం చెయ్యరు అని అడుగుదామనిపించింది. కాని చివరికి అడగటానికి ధైర్యం చాల్లేదు.

దేముడు రావటంతోపాటు మరొక బెడదకూడా వచ్చింది - ఆవు. అభయపద్ యెక్కడినుంచో ఒక ఆవుపెయ్యని తీసుకొచ్చాడు. ఇది పెద్దదయి సంవత్సరంన్నరలోనే యీని పాలు యిస్తుందట! పాలు యిస్తుందో లేదో మహాశ్వేతకి తెలియదు, కాని ఆమెకి చాకిరి మాత్రం ఎక్కువయింది. దాంతో తెల్లబోయింది. చొప్ప సరకటం, గడ్డివెయ్యడం, కుడితిపెట్టడం, కొట్టం బాగుచెయ్యటం - అన్నీ ఆమే చెయ్యాలి. అత్తగారు పూజపనుల్లో మునిగి ఉంటుంది. ఆమెకి ఊపిరి పీల్చుకునేంత తీరిక ఉండదు. మహాశ్వేత స్వయంగా కళ్లారా చూసింది. ఆమెని తప్పు పట్టటానికి లేదు. మహాశ్వేతకి ఆడబిడ్డలమీద కోపం వచ్చేది. తన వయస్సువాళ్లే ఆడబిడ్డలు. అత్తగారు అలా చెపుతూంటుంది (మహాశ్వేత ఉద్దేశంలో తనకంటె పెద్దవాళ్లు). వాళ్లు పూచికపుల్ల విరవరు, అయినా అత్తగారు వాళ్లనేమీ అనదు. రోజంతా బొమ్మలతో ఆడుతూ తిరుగుతూంటారు. పోతే వదినమీద పితూరీలు చెయ్యగలిగారంటే చాలు. ఇంకేమీ అక్కర్లేదు. కాస్త ఏదయినా అన్నదంటే "చూశావా అమ్మా? వదిన -" అంటూ రాగాలు మొదలెడతారు. వాళ్లని చూస్తే మహాశ్వేతకి ఒళ్లు మండిపోతూంటుంది. అత్తగారితో చెప్పబోతే "చూడమ్మా, వాళ్ల ఆగడాలు కాస్త సహించక తప్పేదేముంది? ఆడపడుచులు కదా! అయినా వాళ్లకింకా ఊహ-జ్ఞానం యెక్కడొచ్చాయ్? రోషం తెచ్చుకోకు, పరాయి యింటికెళ్లాక వాళ్లే లొంగుతారు" అనేది.

మార్గశిరమాసం ఇంకొక పని వచ్చిపడింది. ఎక్కడో వారికి భూమి ఉందట. ఉమ్మడిపొలం ప్రతియేడూ ఈ రోజుల్లో వారి భాగం తాలూకు ధాన్యం వస్తుంది. క్రిందటియేడు తక్కువే వచ్చింది. ఉమ్మడి వ్యవసాయంలో పండిస్తే వచ్చేవి మూడునెలలకి సరిపోయే ధాన్యం. ఈయేడు అభయ్‌పద్ తక్కిన భాగస్తుల ధాన్యం చవగ్గా కొన్నాడు. అదీ కాక ధాన్యంకూడా ఎక్కువ వచ్చింది. అంచేత ధాన్యాన్ని యింటికి చేర్చాలి. మధ్యమధ్య ఆ ధాన్యాన్ని యెండపెట్టి బాగుచేయించిన తర్వాత

పెదనాన్నగారి మిల్లుకి తీసుకెళ్లాలి. ఆ తర్వాత వెరగటం విట్టూ తవుడు తీసెయ్యటం అంతులేని శ్రమ.

మహాశ్వేతకి యింత శ్రమపడటం అలవాటు లేదు. మధ్యమధ్య కళ్లవెంబడి నీళ్లొచ్చేవి. భోజనం దగ్గిర్నుంచి లేవగానే పశువుల కొట్టం పని పూర్తిచేసి, ధాన్యం దొంకబోయాలి. తర్వాత మళ్లీవచ్చి అత్తగారితో పాటు అంట్లూ - అవీ తోమటానికి కూచోవాలి. అప్పుడిహ కన్నీళ్లు ఆపుకోవాలన్నా ఆగక, బొటబొట చెక్కిళ్లమీదకి కారుతాయి. అత్తగారు కూచున్నవైపు అటు మొహం త్రిప్పుకుని కూచుంటుంది. ఎలాంటి ప్రతీకారం తీర్చుకోటానికి లేదు. ఊరికే సంజాయిషీలు చెప్పుకోవటం. బలవంతాన దుఃఖం ఆపుకునేది.

అంచాకా యెందుకు ? తల్లికూడా యెప్పుడూ చెప్పదు. అయితే మధ్యమధ్య పదిహేనురోజులు, ఇరవైరోజులు పుట్టింటికెళ్లి ఉన్నప్పుడు జైలునుంచి విడుదలయినా నటుకుంటుంది. తల్లి సంకోచంతో కూతుర్ని తీసుకొచ్చేది. కూతుర్ని తీసుకొస్తే అల్లుణ్ణికూడా తీసుకురావాలి. దానికి కొంత ఖర్చు ఉంటుంది. అందుకని కూతురికికూడా అన్నీ బాగా చేసి పెట్టలేకపోతుంది. ఏది యేమయినా అత్తారింట్లో రెండుపూటలా కడుపు నిండా తినగలుగుతోంది. మహాశ్వేత అంత తెలుసుకోలేదు. తల్లి మెడకి చేతులు పెనవేసి "నన్ను కొంచెం త్వరగా తీసుకొస్తూఉండమ్మా. నీ దగ్గిర భోజనం లేకుండా ఉన్నా మనశ్శాంతి" అంటుంది. శ్యామ మొదట్లో ఇదంతా కేవలం తనమీద అపేక్ష అనుకునేది. తర్వాత మాటల్లో గుచ్చి గుచ్చి అడిగి అమాయకురాలైన కూతురు దగ్గిర్నుంచి అన్నిసంగతులు తెలుసుకుంది. మనస్సుకి చాలా కష్టం వేసింది. పేదయింట్లో పుట్టినప్పుడు కష్టపడక తప్పదు. అల్లుడు మంచివాడు. అదే మేలు అనుకొని ఊరడిల్లేది.

ఒక సంవత్సరం గడిచాక మహాశ్వేత అదృష్టం తిరిగింది. పడకల యేర్పాట్లు మారాయి. ఎక్కడినుంచో అదనంగా కాస్త డబ్బు రావడంతో, అభయపద్ చిన్నయింటిని కాస్త సౌకర్యంగా ఉండేట్లు చేసుకున్నాడు. అప్పటినుంచి మహాశ్వేతకి భర్తగదిలో పడుకునేందుకు అనుమతి లభించింది.

ఆమె బతికిపోయింది. మనసారా అతడితో రెండుమాటలు చెప్పుకోవచ్చు. అభయపద్ సమాధానం చెప్పనీ, చెప్పకపోనీ (చాలావాటికి సమాధానాలు చెప్పడు) అర్ధరాత్రి నక్కల అరుపులకి మెలకువ వచ్చి,

హఠాత్తుగా భయంవేస్తే, అతణ్ణి కావిలించుకుని గుండెల్లో తల దాచుకోవచ్చు. ఇదేం తక్కువ లాభమా ?

అతడు చాలా మంచివాడని రోజులు గడిచినకొద్దీ మహాశ్వేత మరింతగా తెలుసుకోగలిగింది. దూరంగా యెక్కడో శవయాత్ర 'హరిబోల్' ధ్వనులు వినిపిస్తే, అతడే భార్యని గుండెలకి హత్తుకుని, వీపు నిమురుతూ "భయంవెయ్యలేదు కదా" అని అడిగేవాడు.

# పదిహేనవ పరిచ్ఛేదం

## 1

కూతురి పెళ్లిఅయి సంవత్సర మయింది. ఈ సంవత్సరమూ శ్యామకి ఒకయుగం. పన్నెండేళ్లలో మనిషి ఇంత కష్టం, ఇంత కఠినసాధన చెయ్యనక్కర్లేదేమో అనిపిస్తుంది. ఇంత దిగులు, ఇంత బెంగపడనక్కర్లేదు. ఒక్కొక్కరోజు అసలిహ గడవదేమో అనిపిస్తుంది. కాస్త సంపాదనికి యేదో దారి యేర్పడింది. అది నిజమే. హేమ స్కూల్లో చదువుతూనే వున్నాడు. ఎంత 'ఫ్రీ' అన్నా కొంత ఖర్చు ఉండక మానదు. ఎప్పుడు పడితే అప్పుడు పౌరోహిత్యానికి వెళ్లలేడు. దానికిపైన కూతుర్ని అల్లుణ్ణి తీసుకురావటం. అల్లుడికేవయినా కానుకలు పంపటం....

అదొక పెద్ద సాధన !

ఒకరోజున - అప్పటికి పెళ్లిఅయి కొన్ని నెలలయింది. హేమకి జ్వరం వచ్చిందని యెవరో చెప్పగా విని ఒక శనివారంనాడు అల్లుడొచ్చాడు. ఇంట్లో యేమీలేదు. హేమకి జ్వరం. మంగళ యింట్లో వాళ్లందరూ ఆమె పుట్టింట్లో యేదో శుభకార్యం అవటంతో అక్కడికి వెళ్లారు. చేతిలో పైసా కూడా లేదు. ఎప్పుడూ ఉండదు. ఉన్నా యెవర్ని పంపించి తెప్పించటం ? శ్యామ యిలాంటి సిగ్గుపడాల్సిన పరిస్థితిలో యెప్పుడూ పడలేదు జీవితంలో. ఐంద్రిల తోటలోనుంచి యెలాగో గుండెలకదిమి పట్టుకుని కొబ్బరికాయ ఒకటి తీసుకురాగలిగింది. కాని ఆపిల్లను బజారు కెలా పంపటం ? పోపుల పెట్టె, గూళ్లూ వెదికితే పదిపైసలు దొరికాయి. కాని వెళ్లేదెవరు ? వెడితే తానే వెళ్లాలి. అల్లుడి ముందునుంచి బజారు కెళ్లటమా ? ఛ ... అల్లు డొకవేళ చూస్తే !

శ్యామ భూమ్యాకాశాల వరకు ఆలోచించింది. ఒంట్లో బావుండటం లేదు. ఇటీవల ఆమెకి మరో బిడ్డ పుట్టింది. ఇంకా మూడు నెలలయినా కాలేదు. ప్రసవించినప్పట్నుంచీ ఆమె యెన్నో జబ్బులతో పిప్పి పిప్పి అయిపోయింది. దయ్యంలాగా కష్టపడి పనిచేసే శక్తి తగ్గిపోయింది. ఏమిటో అన్నప్పుడల్లా అన్నిమాటలు మాట్లాడలేదు, జ్ఞాపకమూ రావు.

పదిపైసలు చేత్తో పట్టుకుని, శ్యామ యేదో మతిలేనిదానిలా వంటింటి వసారాలో కూచుంది. అల్లుడు గదిలో హేమ జబ్బుని గురించి అడుగుతున్నాడు. ఐంద్రిల యేమిటో తనలో తాను వాగుకుంటోంది. ఎక్కడో యేమామిడిచెట్టు కొమ్మమీదనో కూచుని వసంతకోకిల కుహూ కుహూఁ అని కూస్తూంటే ఐంద్రిల చెవి ఒగ్గి వింటోంది.

చాలాసేపయిన తర్వాత ఒక వేడిగాలి విసురుకి గతుక్కు మన్నది. చటుక్కున కంగారుగా లేచి నిలబడింది. చటుక్కున దారికూడా కన్పించింది కళ్లముందు. పప్పు ఉంది యింట్లో. అంతకుముందు మోయినగా వచ్చిన కాస్త ఆవునెయ్యి మైదాకూడా ఉంది. హేమ సంపాదించిందే - ఎక్కడో వ్రతం చేయించి అతడే తీసుకువచ్చాడు.

పప్పు రెండుమూడురకాలు నానపెట్టింది. పొయ్యి వెలిగించి శనగపప్పు పొయ్యిమీద పెట్టింది. ఎక్కడో మూల ఉన్న బార్లీడబ్బాలో కాస్త బరకపిండి ఉంది. కాస్త హల్వాచేసి పెట్టొచ్చు అల్లుడికి ఫలహారం లాగా. హఠాత్తుగా శరీరానికి మనస్సుకీ ఒక ఉత్సాహం కలిగింది. లేని కొరత కప్పి పుచ్చుకోవచ్చని ఆమె సంకల్పం. మూడుగంటల తర్వాత అల్లుడికి భోజనం అమర్చి పెట్టినప్పుడు తనకి తానే తెల్లబోయింది. పప్పు, పరోటా, 'ధోంవార్ కాల్‌నా' 'రష్‌బడీ' (బెంగాలీ వంటకాలు). పాయసం. పాయసాన్ని గురించే కొంచెం ఇబ్బంది అయింది. ఎందుకనంటే పంచదార 'వాతాష్‌మిశ్రీ' - 'ఇంట్లో ఉన్నవన్నీ వెతికి ఇంతకుముందు హల్వా 'రష్' కి ఖర్చు చెయ్యటం జరిగింది. మిఠాయి తెప్పించటం వీలుకాలేదు. ఆలోపం రష్‌తో తీరినా, యెలాగో అనిపించింది. అది నూనెతో చేసిన 'రష్‌బడా'. తల్లి నేతితో రష్‌బడా చేసేది. కాని ఆ నెయ్యి యెక్కడుంది? పూరీలు చెయ్యటం వీలుపడలేదు. పరోటాలు చెయ్యటం జరిగింది. అయితే రాత్రినైవేద్యం పాలు ఉన్నాయి. చాలా ఆలోచించిన మీదట చీకట్లో ఒడ్డు కన్పించింది. కొద్దిరోజుల క్రిందట కుండూగారింటినుంచి పందేరంగా వచ్చిన 'సందేష్' లింకా కొన్ని ఉన్నాయి జాడీలో. పంచదార చల్లిన సందేష్‌లు. ఇన్నాళ్లవటంతో కొంచెం వాసనేస్తున్నాయి. ఈసందేష్‌లు అల్లుడికి పెట్టటం బాగుండదని వాటి సంగతి జ్ఞాపకం పెట్టుకోలేదు.

ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. పంచదార చల్లినవికదా ! .... ఊరికే పారెయ్యటం దేనికి ? వాసనా ? వర్షాకాలంలో ఇంట్లో నిల్వచేసిన పంచదారకూడా కొంచెం మద్యం వాసన వేస్తుంది. అదీకాక యింట్లో యేలక్కాయ ఒకటే దయినా దొరికితే ? అది పొడిచేసి వేస్తే వాసన పోతుంది.

అభయ్ బాగా తృప్తిగానే భోంచేశాడు. ఎప్పుడూ యేమీ అనేవాడు కాదు. ఇవాళ కొంచెం ఉత్సాహంతో "చాలా రోజులుగా యింత తృప్తిగా యెప్పుడూ భోంచెయ్యలేదు. వంట అమృతంలా ఉంది" అన్నాడు. అభయ్ యింకా 'అత్తగారూ!' అని నిస్సంకోచంగా పిలవలేకపోతున్నాడు. సమ వయస్కులవటంతో అలా పిలవడానికి బహుశా సిగ్గుపడుతూండవచ్చు.

ఆనాడు తన నేర్పరితనానికి శ్యామ కొంచెం గర్వించిందనే అనాలి. ఆ సంగతి చాలారోజులదాకా జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఆనందంతో, గర్వంతో ఆమె హృదయం పొంగిపోయేది. మంగళ పుట్టింటినుంచి తిరిగి వచ్చి, అంతా విన్న తర్వాత బుగ్గన వేలేసుకుని మాట్లాడలేకపోయింది. చాలాసేపయాక నీది చాలా తెలివైనబుర్ర శ్యామా, నేనయితేనా యేడు రాత్రు లాలోచించినా ఇంత మాటలు నోట్లోంచి రావు నాకు. పైగా మంచివిందు చేయగలిగావు. అంతకంటె యేం కావాలి ?" అన్నది.

కాని కేవలం గర్వపడటమేకాదు, కొంచెం సిగ్గుపడాల్సిన సంగతి కూడా లేకపోలేదు. ఎంతతృప్తిగా నయినా భోజనం చెయ్యనీ - తెలివి గలవాడైన అల్లుడికి అసలు సంగతి కంటపడకుండా దాగలేదు. ఐంద్రిల చేతిలో ఒక రూపాయి పెట్టి వెళ్లాడు. మర్నాడు సాయంత్రం ఆ వీధిలోని కుర్రాడిని బజారుకి పంపి చాలా తెప్పించింది.

శ్యామకి చాలా సిగ్గేసింది. అల్లుడినుంచి ఈ సహాయం (సహాయం కాక యేమిటి ?) తీసుకున్నందుకు తలకొట్టేసిన ట్లనిపించింది. అయితే ఆనందంతో కళ్లూ చెమ్మగిలాయి. ఇంత వివేచన కలవాడి చేతిలో పడిన పిల్ల సుఖపడుతుంది. తనలాగా యెప్పటికీ కష్టపడదు.

అభయ్ వస్తే తన పిల్లల ముఖాలు సంతోషంతో విప్పారాయి. శ్యామ అదికూడా గమనించింది. అతడు రాగానే రూపాయో అర్థో యిచ్చి వెడతాడని కాదు. అతడికోసం మంచిభోజనం తయారయితే, అందులోంచి తమకి కూడా భాగం వస్తుంది. కేవలం వాళ్లే యేమిటి ? హేమ అస్వస్థతగా ఉన్నప్పుడు ఆ రోజున అల్లుడి విస్తట్లో మిగిలినవి అన్నీ ఐంద్రిల తినటం సాధ్యం కాదు, అలా అని తానూ తినలేదా ? అల్లుడి విస్తట్లో యెంగిలి

తినటానికి ముందు చాలా వెనకా ముందాడింది. కాని చివరికి లోభాన్ని అణచుకోలేకపోయింది. ఇంట్లో యేమీ లేదు. వంట్లో నీరసం. అంతకు ముందే ప్రసవించిన బాలింతరాలు కావటంవల్ల భరించలేని ఆకలిలో లోభాన్ని అణచుకోవటం చాలా కష్టం. తిన్నది, తిని సంతోషించింది కూడా. ఆ సంగతి జ్ఞాపకం వస్తే ఇన్నాళ్లయాక ఇప్పుడుకూడా సిగ్గు పడుతూంటుంది. అనాడు అంతకంటె మరో ఉపాయం లేదు.

## 2

శ్యామ చాలారోజులనుంచి కలకత్తా వెళ్లాలని ఆలోచిస్తోంది. కాని ఇదివరకులాగా వెళ్లటం తనకి తేలిక కాకపోవటంతో వెళ్లలేకపోయింది. అయితే తనకి వెళ్లటం అవసరం. ఈసారి ప్రసవించి నప్పట్నుంచీ యేమిటో తన శరీరం మామూలుస్థితికి రాలేదు. కొన్నాళ్లు ఊరికే తిని కూచోగలిగిన ట్లయితే బహుశా బలం వచ్చే దనిపిస్తుంది. కాని యిటు చూస్తే హేమకి స్కూల్. అతడు నిబంధనలకి ఒప్పుకున్న పూజలు రెండు పూటలా జరుగుతున్నాయి. అయినా హేమని విడచిపెట్టి యెలా వెడుతుంది ? అతడి కెవరు వండిపెడతారు ? అతణ్ణి యెవరు చూస్తారు ? ఇవన్నీ ఆలోచించి ఆమె వెళ్లలేకపోయింది. అలసిపోయిన శరీరాన్ని కొరడాతో అదిలించి నడిపిస్తోంది.

ఈ పరిస్థితిలో ఉత్తరం వచ్చింది. ఉమ రాసింది. "అమ్మ ఆరోగ్యం బాగా పాడైపోయింది. డాక్టరు వచ్చి చూసి, గాలిమార్పుకి తీసి వెళ్లటం అవసరమన్నారు. అమ్మనికూడా ఒప్పించటం మయింది. అమ్మ వెళ్లటానికి ముందు ఒకసారి తన ముగ్గురు కూతుళ్లను కలిపి చూడాలను కుంటోంది. మళ్లీ తిరిగి వస్తుందో రాదో దానికి నిర్ధారణ యేముంది ? మూడు నాలుగు రోజు లుండటానికి రాగలవా ?"

శ్యామ ఉత్తరం చదువుకుని చాలా వ్యాకులపడింది. పడటం సహజం కూడా. ఆమె కేవలం తల్లే కాదు. ఇప్పటికీ తనకొక కొండంత అండ, ఆశ్రయం. ఎంత చరమదుస్థితిలో వచ్చి పడ్డా తల్లి దగ్గరకెళ్లి నిలబడ గలదు. అది ఆమెకి తెలుసు. తల్లి దగ్గర యేం ఉన్నదీ యెంత వరకు ఉన్నదీ ఆమెకి తెలియదు. అయితే తల్లి యేదోవిధంగా జరుపుతుంది. ఇది మనస్సుకి కనిపించే విశ్వాసం కలిగించింది. అది మనస్సుకి తెలిసో తెలియకుండానో ఉన్నది కనుకే శ్యామ ఇలా జీవితంతో పోరాటం సాగించగలుగుతోంది. చివరికి నిరాపదమైన అవలంబనం ఒకటుందన్న విశ్వాసం వెనుక యెక్కడో ఉంది. అజ్ఞానం, ఆ అనుభూతే ఆమెకి

శక్తి నిచ్చింది. ఈ చివరి అవలంబనంకూడా విరిగి పడిపోతుందా? ఇంత త్వరగా ఇంత అసమయంలో? ఇప్పటికీ హేమ యింకా ప్రయోజకుడు కాలేదు.

స్వార్థ మనిపించినా ఇదే స్వాభావికం. ఏ దుర్వార్తయినా విన్నప్పుడు మనిషిలో ప్రతిస్పందన కలిగేది వారి స్వార్థం మీదనే. అందుకు శ్యామని తప్పు పట్టకూడదు.

వెంటనే వెళ్లటం అవసరం.

కేవలం తల్లిని చివరి చూపుచూడటమే కాదు. ఆమెకి యెక్కడ యేం ఉందో, తనకి హేమకి యెంతవరకు వస్తుందో తెలుసుకోవటం అవసరం.

కాని వెళ్లటం సాధ్యమా?

శ్యామ ఉత్తరం చేత్తో పట్టుకుని ఉద్విగ్నముఖంతో కూర్చుంది. కళ్లనిండా నీళ్లున్నాయి. ఈ సమయంలో గుప్పెడు కిళ్లీలు బుగ్గని పెట్టుకుని నమిలే ప్రయత్నంతో మంగళ యిటే రావటం కన్పించింది.

"ఏమిటి? ఏమయిందమ్మా శ్యామా! ఇంత యేడుస్తూ కూచున్నావెందుకు? అమ్మో చేతిలో ఉత్తరం యేదో ఉందే! ఏదయినా దుర్వార్తాయేం? మీ అమ్మ కులాసాగా ఉంది కదా!" ఏడుపుతో పూడుకు పోయిన గొంతులోంచి పెకలించుకుని మాటలు బయటికి రాలేదు.

శ్యామ సమాధానం చెపుతూనే యేడ్చేసింది.

మంగళ అంతా విని, "ఇప్పుడే వెళ్లు, యిప్పుడే. హేమ ఉంటాడులే అమ్మా, మేం చూస్తాంలే. అంతగా అయితే రాత్రికి నేనొచ్చి పడుకుంటాను. భయమేముంది?" అన్నది.

"కాని మరి వాడి భోజనం?"

"అదా!" అని మంగళ కాస్సేపాగింది. తర్వాత మళ్లీ అంత మొహం చేసుకుని "ఇవాల్టి కేదోవిధంగా చేస్తాడులే భోజనం. నేను కాని పింట్‌కీ కాని బియ్యం కడిగి పొయ్యిమీద పెడితే, అత డెలాగో అలా దింపుకో లేడూ?" అన్నది.

హేమ పక్కనే కూచుని ఉన్నాడు. "దింపుకోగలను, చూపిస్తే దింపుకుంటా" అన్నా డతడు.

మంగళ ఉత్సాహితురాలై - "మీవి మంచి బియ్యం. గంజి వార్చి వండుకోవటం అలవాటు లేదు మీకు, నీళ్లు సరిగ్గా పోసి పెడితే గంజి వార్చనే అక్కర్లేదు. మా దగ్గిర అంటుదోషం లేని ఊరగాయలాంటి దేదో తెచ్చి యిస్తాను. రాత్రికి రెండు రొట్టెలు చేసి యిస్తాను. నువ్వు ధైర్యంగా వెళ్లమ్మా ! నీ కొడుకుని నేను చూస్తాను. ఆయన వంటావిడని పెట్టాలని ప్రయత్నిస్తున్నారు. నాకూ ఒంట్లో బాగుండటం లేదు. పింటూకీ వంట బాగా చెయ్యలేదు. వంటావిడను పెడితే యిబ్బందేముంది ? మా దగ్గిరే ఫోంచేస్తాడు - వంటచేసే వాళ్లు కావల్సినంతమంది దొరుకుతారు. అయితే ఒక సంగతి తెలుసా ? వయస్సులో ఉన్న ఆమెని మాత్రం పెట్టుకోను. వాళ్ల దోష మేమిటంటే, యజమానిని మింగెయ్యాలని చూస్తారు. ధూర్తులైన ఆడ మగాళ్లూ పనికిరారు. మా యింట్లో అందరూ యీడొచ్చిన పిల్లలు. అదీ వచ్చిన యిబ్బంది. ఇదివరకు ఒక వంటబ్రాహ్మడుండే వాడు. అతణ్ణి నేనే బయటికి పంపించాను. చెప్పాలంటే నాకు వెయ్యి బెడదలు. ఎవడూ యేదీ యెత్తుకుపోకుండా కూడా నేనే చూసుకుంటూ ఉండాలిగా !" అన్నది.

రాసమణికి కొన్నాళ్లనుంచి ఆరోగ్యం బాగుండటం లేదు. కమల, ఉమ రాసిన ఉత్తరాలవల్ల ఆమె అస్వస్థతగా ఉంటోందని తెలిసింది. కాని యింత జబ్బుగా ఉందని శ్యామ ఊహించలేదు. రాజరాజేశ్వరిలా ఉండే ఆమె శుష్కించి ముడుచుకు పోయినట్లయింది. ఉజ్జ్వలమైన యెర్రటి శరీరచ్ఛాయ నలుపురంగుకి మారిపోయింది. కొన్ని పళ్లు ఊడిపోయాయి. రోజూ జ్వరం వస్తోంది. బహుశా మలేరియా కావొచ్చు. కొన్నాళ్లవరకు డాక్టర్ని పిలవనీయలేదు. ఆ వీథిలో ఉన్న ముసలి ఆయుర్వేదవైద్యుడు చికిత్స చేస్తున్నాడు. దానివల్ల యేమీ గుణం లేక పోయింది. అప్పుడు కమల బలవంతంగా డాక్టర్ని తీసుకొచ్చింది. అతడు పరీక్ష చేసి మందు యిచ్చి, జ్వరం రావడం అరికట్టాడు. కాని పూర్తిగా తగ్గలేదు. సాయంకాలానికి రోజూ ఒళ్లు కొంచెం వేడెక్కుతుంది. డాక్టరు బాబు "గాలి మార్పుకి తీసుకెళ్లాలి. లేకపోతే పురాణజ్వరం తగ్గదు అని చెప్పాడు. గాలిమార్పుకి వెళ్లాలన్నప్పుడు పడమటి ప్రాంతానికి వెళ్లటం అవసరం. దేవఘర్ వెడితే బాగుంటుంది. అయితే అంతదూరం వెళ్లటం యిష్టం లేకపోతే - వర్ధమాన్ కాని, నల్‌హాటీ కాని వెళ్లొచ్చు. నీరు, గాలి మంచివి. నల్‌హాటీ పైగా తీర్థస్థానంకూడా. లలాటేశ్వరి ఉంది. యాభై రెండు పీఠాల్లో ఒకటి" అన్నాడు.

రాసమణి చాలా ఆలోచించింది. ఉమని ఒక్కతెని విడిచిపెట్టి వెళ్లటం కుదరదు. వెంటతీసుకు వెళ్లాలి. ఈ యింట్లో యెవరుంటారు? కమల ఒప్పుకోవచ్చు. కాని తాను మాత్రం ఒక్కతే యెవరిమీద ఆధారపడి వెడుతుంది? శరీరం యింత దుర్బలంగా ఉంది. అదీకాక యెప్పుడూ యెక్కడికీ ఒంటరిగా వెళ్లలేదు. కలకత్తా దాటి బయటికి వెళ్లటం ఆమె కెప్పుడూ అలవాటు లేదు. తోడు యెవరొస్తారు?

కాని ఈ యేర్పాటుకూడా కమలే చేసింది. వారి వృద్ధపురోహితుడు రాఘవ ఘోషాల్ చాలా తీర్థాలు సేవించి వచ్చినవాడు. ఇతర ప్రదేశాలకి వెళ్లటం అతడికి అలవాటుంది. అతడు తోడు రావటానికి అంగీకరించొచ్చు. రానుపోను ఖర్చులు భోజనానికి యిచ్చేట్లయితే అతడు వస్తాడు. అతడితో యిబ్బంది లేదు. అతడి కొడుకు పెద్దవాడయాడు. పౌరోహిత్యం అతడు నిలుపుకో గలడు. మధ్యలో అతడి ఆరోగ్యంకూడా బాగుపడుతుంది.

ఈసారి రాసమణి యింక కాదనలేకపోయింది. ఆమె పట్టుదల గల మనిషి. ఆమెకి పౌరుషంగా బ్రతకటం యిష్టం. ఏదో కాళ్లూ చేతులు పడిపోయి కదల్లేకుండా అయి కేవలం కూతుళ్ల ఉపచారాలమీద ఆధారపడటం ఆమెకి మృత్యువుతో సమానం. ఆమె ఇంతకాలంగా యెన్నడూ, యే కారణంవల్ల నయినా సరే గంగాస్నానం మానలేదు. అది చాలా కష్టం. ప్లేగు వచ్చిన సంవత్సరం కలకత్తా శ్మశానంగా మారినప్పుడుకూడా ఆమె రోజూ తెల్లవారకట్ల లేచి గంగాస్నానానికి వెళ్లేది. రోడ్డుకి రెండు వైపులా ఉన్న ఖాళీ అయిన యిళ్లు, ఏదో మింగటానికి సిద్ధంగా ఉన్నట్లుండేవి. అయినా రాసమణి భయపడ లేదు. ఆమె పారిపోనూలేదు.

మామూలు మృత్యువన్నా, హఠాత్తుగా వచ్చే మృత్యువన్నా ఆమెకి భయంలేదు. నగరాన్ని అందరూ వదలి పారిపోయారు. పాకీవాళ్లు బళ్లు కడిగి, వాళ్లూ కుటుంబాలతోసహా బళ్లు యెక్కి పారిపోయారు. బళ్లు దొరక్కపోవటంవల్ల బళ్లవాళ్లు పదిహేను, ఇరవై రూపాయలు తీసుకునేవాళ్లు. ఇక్కడినుంచీ చందన్‌నగర్‌కి పారిపోతూంటే, వాళ్లను చూసి నవ్వుతూండేవాళ్లు. ప్రాణాల్ని శాశ్వతంగా నిలుపుకోగలరా? అంతేకాదు. పోలీసులు డేరాలు వేసుకుని గంగాస్నానానికి వెళ్లటం ఆపినప్పుడుకూడా రాసమణి యేమీ విచలితురాలు కాలేదు. తాను వెళ్లేవేళనుమాత్రం ముందుకి జరుపుకుంది. తెల్లవారగట్ల నాలుగింటికి వెళ్లేది, మూడింటికే వెళ్లటం మొదలు పెట్టింది. అంత తెల్లవారుఝామున పోలీసులు ఉండరని ఆమెకి తెలుసు

అహఁ రాసమణి భయపడేవ్యక్తి కాదు. మృతులసంఖ్య యెక్కువయేసరికి రెండుగంటలకు మించి చితిని కాలనిచ్చేవారు కాదు. ఈ రెండుగంటల్లో కాలినంతకాలగా తక్కినశవాల్ని గంగలోకి త్రోసేసేవారు. అందుకే గంగాస్నానాన్ని నిషేధించింది. ఇలాగే సగం కాలినశవం ఒకటి స్నానాలరేవుకి తేలుతూ వచ్చి మెట్లకింద యిరుక్కుపోయింది. రాసమణి స్నానానికి నీళ్లలో దిగుతూ ఆ శవంమీద కాలు వేసింది. కాని కెవ్వుమని అరవలేదు. అక్కడినుంచి పరుగెత్తి పారిపోనూలేదు. ఏమాత్రం కంగారుపడ లేదు. పైగా వంగి అదేమిటో పరీక్షగా చూసి, శవమని గ్రహించి, 'నమశ్శివాయ' అంటూ కాసినినీళ్లు ఆ శవంమీద చల్లింది. తర్వాత దాని చుట్టూ ప్రదక్షిణం చేసి, గంగలోకి దిగింది. వెంటతెచ్చుకున్న పట్టుచీరె మైల పడిందనికూడా అనుకోలేదు.

ఇంటికి వచ్చి ఆసంగతి చెప్పగానే ఉమ భయంతో కెవ్వుమని అరిచింది. రాసమణి నవ్వింది. ఆమెని ఊరడిస్తూ - "భయమెందుకు? అగ్నిదగ్ధమై గంగలోపడిన శవం దయ్యమైవచ్చి నన్ను తరుముతుందా? శివుడెంతో ఈ శవమూ అంతే" అన్నది.

"కాని జబ్బేమయినా చేస్తుందని భయం లేదా? ఆ అంటువ్యాధి సోకితే? రెండురోజులు గంగాస్నానం మానితే యేమవుతుంది?"

"అఁ ఏమీలేనిదానికి నేను గంగాస్నానం మాననా? నాకు జబ్బు యెందుకు చేస్తుందే! ఆ చచ్చిపోతున్న వాళ్లందరూ యెవరోతెలుసా? పశువులు వాళ్లు యేటా చస్తూనే ఉంటారు. అంటువ్యాధి బయలుదేరుతుంది. గుంపులు గుంపులుగా చస్తూంటారు. నేనెందుకు చస్తానే?"

ఆ గంగాస్నానం చెయ్యటం ఇవాళ్టినుంచీ ఆగిపోయింది. ఇదే అన్నిటికంటె మించిన బాధ.

జీవితంలోని వ్యథ, వేదన, పేరుకుపోయిన దుఃఖం అన్నిటినీ జాహ్నవీమాత - సర్వదుఃఖహరమైన తనశీతలజలంతో మరపిస్తుంది. కన్నీళ్లు రోజురోజూ ఆ తల్లి చన్నీళ్లతో కలిసిపోయి, గుండెల్లోని తాపాన్ని చల్ల బరుస్తాయి. గంగామాత గుండెలమీదనుంచి వీచే గాలి ఆమె వేడినిట్టూర్పుల్ని శాంతపరుస్తుంది. కష్టాలలో, దౌర్భాగ్యంలో మళ్లీ సహనశక్తిని, పోరాడే శక్తిని వెతికిపట్టుకుంది. గంగ కేవలం ఆమెకి అలవాటయిన మత్తుకాదు, ఆశ్రయం. తన దుఃఖాల నన్నింటినీ రోజురోజు ఆమె కిక్కడ నివేదించు కుంటుంది. లేకపోతే, బహుశా ఆమె పిచ్చిదయిపోయేదేమో! ఈ కెరటాలతో ధ్వనించే ప్రవాహంలో యెంతశాంతి, యెంత అభయం దాగి

ఉన్నాయో, ఆమె జీవితానుభవంతో గ్రహించింది. ఎంత దయ గంగమ్మ తల్లికి! అది రాసమణి తప్ప యింకెవ్వరూ యెరుగరు.

ఆగంగాస్నానం తనకి బతికి ఉండగానే బంద్ అయిపోయింది. బహుశా అందుకనే ఆమె పరాయిప్రదేశానికి వెళ్లటానికి అంగీకరించి ఉంటుంది.

వెళ్లవలసివస్తే వర్ధమాన్, నల్‌హాటీ, వెళ్లటండేనికి? దేవఘర్‌కి మాత్రం యెందుకు? కాశీయే వెడుతుంది. కొంచెం స్వస్థత చిక్కితే బాబా శిరస్సున చెంబెడు గంగనీళ్లు పోయగలుగుతుంది. ఎప్పుడైనా పూజకూడా చేయించవచ్చు. అదొక లాభం. జీవితంలో యెన్నడూ యేతీర్థానికీ వెళ్లటం జరగలేదు. చనిపోయేముందు ఒకసారి కాశీవెడితే సాంత్వనకూడా పొంద గలుగుతుంది.

తాను కాశీయే వెడుతుంది. రాఘవఘోషాల్‌తో చెప్పి ముందు పండాకి ఉత్తరం రాయించింది.

## 3

శ్యామ తల్లియెదుటికి వచ్చి నిలబడేసరికి ఆమెకళ్లు యెలా కాల్వలు కట్టాయో, అలాగే రాసమణికికూడా కన్నీళ్లు కట్టుపడలేదు. వెయ్యిరేకులు విచ్చిన పద్మంలాఉండే తనకూతురుముఖం యెలా అయిపోయింది. ఏదో కంకాళంయిది! ఇదివరకుకూడా తిండిలేక చిక్కిశల్యంలా అయిపోయి యెన్నోసార్లు వచ్చింది. కాని యింత దుర్బలత్వం ఆమెలో యెప్పుడూ చూడలేదు.

జబ్బుతో చిక్కి వణకుతున్నచేత్తో - ఆమెతల, శరీరం నిమురుతూ "నువ్వు నాతో వస్తావే! నీఆరోగ్యంకూడా బాగుపడుతుంది?" అన్నది.

"నేను కాశీరానా?"

"రారాదూ? అప్పుడిహ ఉమను తీసుకెళ్లను. వాళ్లిద్దరూ యిక్కడ ఉంటారు. ఉమ ఆడపిల్లలకి చదువుచెప్పటంకూడా సాగు తుంటుంది."

"ఏం చదువు చెపుతుంది?"

ఉమ దగ్గిరకు వచ్చి కూచుంది. తలవంచుకునే కూచుంది. ఈసారి తలెత్తి శ్యామ కళ్లల్లోకి చూస్తూ "నీకు తెలియదనుకుంటాను. నీకు చెప్పనుకూడా చెప్పలేదు. నేను ఈపేటలోనే ఆడపిల్లలకి చదువు

చెపుతున్నాను. ఇప్పుడు చాలామంది ఆడపిల్లలు చదువుకోవా లను కుంటున్నారు. కాని చెప్పేవాళ్లు దొరకటంలేదు. చిన్న, పెద్ద చాలామందికి నేను చదువు చెపుతున్నాను. కొన్నికొన్ని యిళ్లల్లో కోడళ్లు, గృహిణులు కూడా చదువుకుంటున్నారు'' అని చెప్పింది.

''నువ్వు యింటింటికీ వెళ్లి చదువుచెప్పి వస్తున్నావా ?''

''ఏం చెయ్యను చెప్పు ? వాళ్లమాత్రం మనింటి కెందుకు వస్తారు ? ఎవరైనా కొందరు కొందరు రావొచ్చు. కాని అందరూ రావటాని కిష్టపడరు.''

శ్యామ యేమిటో నమ్మలేకపోయింది. ''నువ్వు, యీయింటి ఆడ పిల్లవి ఇంటింటికీ తిరిగి చదువు చెపుతున్నావా ?''

ఉమముఖం అగ్నివర్ణానికి మారింది. ఆమె కొంచెం కటువుగానే ''నీయింట్లో అద్దం లేదనుకుంటాను చిన్నక్కా ! ఈయింటి ఆడపిల్ల కొబ్బరి కాయలు కొబ్బరిచీపుళ్లు బజారుకి తీసుకెళ్లి అమ్ముకుని వస్తోంది, కన్పడటంలేదూ ?''

అది నిజమే. శ్యామ యీసారి తలవంచుకుంది.

రాసమణి శరీరంలో మార్పు రావటం కాదు. మనస్సులోకూడా మార్పు వచ్చింది. లేకపోతే ఆమె సంజాయిషీ చెప్పుకునే మనిషి కాదు. ఇవాళ కొంతవరకు అదే ధోరణిలో ''ఏంచెయ్యను చెప్పు. అది అడిగినప్పుడు కాదనలేకపోయాను. నిజంగానే మరి యెలా తింటాం ? ఇంకేమీ లేదు. నేను రెండురోజులు యెక్కువ బతికితే నన్నెవరు పోషిస్తారు ? అదొకబెంగ. కమలకువచ్చే పదహారురూపాయలే దాని కాధారం. పెద్దఅల్లుడు బతికిఉంటే అతడే చూసుకొనేవాడు. అయినా యేదో దానిపొట్ట గడుస్తోంది'' అన్నది.

శ్యామకి డబ్బుమీద బుద్ధి తలెత్తింది. ''ఎంత వస్తోంది ?'' అని అడిగింది.

''ఒకొకపిల్లకి రెండురూపాయలు. ఒకొకరు రూపాయి యిస్తారు. ముగ్గురుపిల్లలు ఒకచోటే చెప్పించుకుంటారు. ఒకొకనెలలో పదిహేడు రూపాయలదాకా వస్తాయి.''

''ఎప్పుడు వెడతావు ?''

''ఇదే తినగానే బయలుదేరుతాను - పదకొండుగంటల ప్రాంతంలో. మళ్లీ సాయంత్రం ఆరింటికి వస్తాను. అందరూ ఈపేటలోనే'' రాసమణి తనప్రశ్నని పొడిగిస్తూ ''ఏమంటావే ? వస్తావా ?'' అని అడిగింది.

"ఈ పసిపిల్లల్ని తీసుకునా ?"

"పోనీ ఇంద్రిల నా దగ్గిర ఉంటుంది, చంటిదాన్ని తీసుకెళ్లు"

"కాని మరి హేమ ? ఒక్కణ్ణే వదిలిపెట్టి వచ్చాను. ఏం చేస్తున్నాడో చిన్న సన్యాసి. తానే అన్నం వండుకుని తినాల్సివస్తోంది. ఏం చేతులు కాల్చుకుంటున్నాడో !"

ఈసారి అందరూ మెదలకుండా ఊరుకున్నారు.

శ్యామ మనస్సు ఆశతో ఊగిసలాడుతూనే ఉంది. కాశీ బెంగాలీ స్త్రీలందరికీ ఒక స్వప్నం. ఇప్పటిలాగా అప్పుడంత తిరగటానికి వీలుండేది కాదు. కాశీకి, శ్రీక్షేత్రానికి జీవితంలో ఒకసారి వెళ్లకలిగాడంటే, మానవుడు ఎంతో సుకృతం చేసుకుంటేనే !

శ్యామ రోజంతా ఆలోచించి హేమకి ఉత్తరం రాసింది. జంట కార్డు, రెండురోజుల తర్వాత సమాధానం వచ్చింది. ఊహించని ఒక మంచి వార్త. మంగళ ముసలి వంటావిడిని పెట్టుకుంది. హేమ అక్కడే వాళ్ల దగ్గిరే భోంచేస్తున్నాడు. శ్యామ తల్లికి సేవ చేస్తూ ఆమెకి నయమయేవరకు యెన్నాళ్లయినా ఉండొచ్చు. అని మంగళ అనుమతి యిచ్చింది. పింట్‌కీ కొడుకు హేమ యీడు వాడే. అతడు హేమతోనే పడుకుంటున్నాడు. వారు యెప్పటికప్పుడు కబురు తెలుసుకుంటూనేఉన్నారు, యేం భయం లేదు.

శ్యామ బతికిపోయింది. కమల యిక్కడకు వచ్చి ఉమ దగ్గిర ఉండటం ఖాయమయింది. ఇంద్రిలను వాళ్లే కనిపెట్టుకుని ఉంటారు. శ్యామ తల్లితో కాశీ వెడుతుంది.

పంచాంగంలో తిథి వార నక్షత్రాలు చూసి, ఒక రోజున ప్రయాణమయారు. వెంట ఘోషాల్, అతడి కొడుకు సత్యహరి. అతడికి పదహేళ్లుంటాయి. రాఘవఘోషాల్‌కూడా ముసలివాడైపోయాడు. ఈ పరిస్థితిలో రాసమణిని తాను ఒక్కడూ కనిపెట్టుకుని ఉండగలడా లేడా అని చివరికి అనుమానం కలిగింది. అందుకని ఈ యేర్పాటు. సత్యహరి యేం చేసినా చెయ్యకపోయినా యెక్కడికైనా వెళ్లాలంటే పరుగులెత్తుకుంటూ వెళ్లగలడు. ఎంతో ఆలోచించినమీదట అతడి ఖర్చుకూడా భరించటం మంచిదనిపించింది. రానూపోను రైలుచార్జీ యెనిమిది రూపాయలు ; పోతే కాశీలో ఒక నెల భోజనానికి యెంత అవుతుంది ? మహా అయితే నాలుగు రూపాయలు.

శ్యామకి - హేమ అక్కడ నిత్యపూజలు చెయ్యకుండా ఉంటే, ఈ డబ్బుతో వాణ్ణి తీసుకెళ్ళొచ్చు అనిపించింది.

రాసమణి ఈలోగా తనదగ్గిర యేమీ లేదని మూడు నాలుగుసార్లు చెప్పింది. ఏదో ఒక నగ అమ్మి ఈ వందరూపాయలు సంతనా చేసుకోవడ మయింది. ఇంకా యేమైనా ఉంటే, అది మూడేళ్లకంటె యెక్కువ బతకటానికి సరిపోదు. ఉమ సంపాదనమీద ఆధారపడాల్సిందే! ఇదివరకులాగా ప్రత్యేకంగా ఉండే ఇంట్లో ఉండాలన్నా జరగదు.

కాని శ్యామకి నమ్మకం కలగలేదు. అందుకనే ఆమె తల్లివెంట వెడుతోంది. ఇంకా యెంత డబ్బు ఉందో యేమేం ఉన్నాయో, అన్నీ సరీగ్గా తెలుసుకోవాలని ఆమె కోరిక. ఇంద్రిల పెళ్లి బాధ్యత కనుక ఆమె మీద పెట్టగలిగితే బాగుండును, కాని ఇంద్రిల యింకా మరీ చిన్నపిల్ల.

కమల, గోవిందు వారిని రైలెక్కించి రావటానికి వెళ్లారు. వారితో ఆ వీథిలో ఉండే మరో కుర్రాడుకూడా వెళ్లాడు. తిరిగి వచ్చి పల్లకి దిగగానే ముందు యెదురుగా కన్పించిందెవరంటే నరేన్. ముఖమంతా గడ్డం మీసాలు, కాళ్లకి మోకాళ్లదాకా మట్టి, చెప్పులులేని కాళ్లు. పొట్టికోటుతో అరుగుమీద కాళ్లు ముడుచుకుని కూచుని ఉన్నాడు. పక్కన తువాలుతో కట్టిన చిన్న మూట యేదో ఉంది.

కమలను చూడగానే లేచి నిలబడి, ఉపోద్ఘాతం యేమీ లేకుండానే "చూశారా వదినగారూ ఉమకి యెంత పొగరో! నన్ను చూసికూడా తలుపులు తియ్యలేదు. 'అక్కని రానియ్!' అన్నది. నేనేం పెద్దపులినా? యెలుగుబంటినా?" అన్నాడు.

"నీ పట్టు అనేది వాటికంటె యెక్కువది" అన్నది కమల.

"మీరూ ఆ మాటే అంటున్నారా వదినగారూ?" అన్నాడు దెబ్బ తిన్న కంఠస్వరంతో.

"నేనేం లేనిమాట అన్నానా? నువ్వే చెప్పు. సరెలే, లోపలకు రా"

లోపలకు వచ్చి తొట్టిలోంచి నీళ్లు తీసుకుని కాళ్లు కడుక్కుంటూ "ఇంటికి రాగానే హేమ చెపితే పరుగెత్తుకొచ్చాను. నడిచి రావటం కదా! మీలాగా పల్లకీలు, బళ్లు యెక్కే స్తోమత నాకు లేదు. సరీగ్గా మీరలా వెళ్లారు. నేనిలా వచ్చాను. ఇంతకీ మాఆవిడ నిజంగానే వెళ్లిందా?" అని అడిగాడు.

"వెళ్లకేం ? రైల్లో కూచోపెట్టి వస్తున్నాం"

"కాని అత్తగారు యిలా చెయ్యటం న్యాయమేనా ? మీరే చెప్పండి వదినగారూ ! ఆమె యెంతో సభ్యత, గౌరవంగల ఆవిడ. నా భార్యని నా అనుమతి లేకుండా యే చట్టం ప్రకారం ఆమె తీసుకెళ్లారు ?" అని అడిగాడు.

"నీ భార్యని నీ ఆజ్ఞప్రకారం నడిచే స్థితిలో ఉంచావా నువ్వు ? నీ పెళ్లానికి నువ్వు తిండి పెడుతున్నావా ?"

"పెట్టకేం ? హేమ నిత్యపూజలు చేస్తున్నాడు కదా ! అవి యెవరివి ? నేను వచ్చి అవి లాగేసుకుంటే ?"

"అలా అయినా బతికిపోయేది. నువ్వు కష్టపడి వాళ్లని పోషించాలి. ఇది కదా నియమం, విధి ! హేమ చేస్తున్నా డది. ఇది నీ అదృష్టం."

"ఊఁ గొప్ప నియమమే ? నేను కష్టపడతాను ! ఈ పశువుల్ని కూచోపెట్టి మేపుతాను !"

కమల మెదలకుండా ఊరుకుంది. నీచులతో అనవసరంగా మాట్లాడితే నోరు నొప్పెడుతుంది.

నరేన్ మూట విప్పి చిలుంగొట్టం, పొగాకు, చెకుముకిరాయి పైకి తీశాడు. చిలుంగొట్టంలో పొగాకు కూరుతూ "ఊఁ. అయితే వాళ్ల వెంట యెవరెవరెళ్లారు ?" అని అడిగాడు.

"అమ్మ, శ్యామ, రాఘవఘోషాల్, ఆయన చిన్నకొడుకు సత్యహరి"

"ఎవరెవరు ?" నరేన్ కంఠం తీక్ష్ణంగా మారింది.

"రాఘవఘోషాలా ? అతడెవరు ? యెన్నేళ్లుంటాయి ?"

"అరె బాబూ ! అతడే మా వృద్ధపురోహితుడు. నీ పెళ్లి ఆయనే చేయించింది. షుమారు అరవైయేళ్లుంటాయి."

"అరవై అయితే మాత్రం యేం ? అరవైయేళ్లంటే అంత ముసలితనం యేమీ కాదు వదినగారూ ! మా తాతల్లో ఒకాయన అరవైయేడేళ్లవాడు నాలుగో పెళ్లి చేసుకున్నాడు. ఆ తర్వాతకూడా ముగ్గురు పిల్లలు."

కమల అలసటతో గోడకి చేరగిలపడి కూచుంది. ఆమె అలాగే కూచుండిపోయింది. మనస్సు బాగుండలేదు. అమ్మ యే స్థితిలో వెళ్లింది ! తిరిగి వస్తుందో లేదో యెవరికి తెలుసు ? తనకి తల్లి తప్ప వెనక అండ యెవరూ లేరు.

ఇంతలో హఠాత్తుగా "అతడి కొడుకు సత్యహరో, నిత్యహరో యెవరో అన్నారు. వయస్సెంత ?" అన్న తీక్ష్ణకంఠం వినిపించింది.

" పదిహేనో, పదహారో ?" ముక్తసరిగా చెప్పింది జవాబు.

"అమ్మో ! అయితే యుక్తవయస్సే ! రైల్లో యెవ రెక్కడ కూచు న్నారు ?"

"అందరూ ఒక పెట్టెలోనే యెక్కారు. అమ్మ ఒంట్లో బాగుండలేదు కనుక ఆడవాళ్ల పెట్టెలో యెక్కించటానికి ధైర్యం చాల్లేదు."

"ఆలా అన్నారు బాగానే ఉంది ! అయితే నాభార్య ప్రక్కన యెవరు కూచున్నారు ?"

"అమ్మ"

"ఆవిడ ఒకప్రక్క కూచున్నారు. రెండో ప్రక్క ?"

"రెండో ప్రక్క పురోహితుడుగారు కూచున్నారు. భయం లేదు."

"అయితే నాభార్య అత్తగారికి. రాఘవఘోషాల్‌కీమధ్య కూచుంది. మరి ఆకు రాడు ? అతడు మధ్యదారిలో నాభార్యప్రక్కకి వచ్చికూచుం టాడేమో !

కమల ఈసారి లేచి నుంచుంది. కోపంతో "నాకంత తెలియదు. నీకు తెలుసుకోవాలని ఉంటే యెగిరివెళ్లి చూసి రా" అన్నది.

"అరె ! భలేతమాషానే ! నాభార్య యెవరిప్రక్కన కూచుని వెడుతోందో, అది నేనుతెలుసుకో అక్కర్లేదా ?"

అంతలో కమల లేచి పైకి వెళ్లింది. అటువైపే చూస్తూ చిలుం తాగుతూ కూచుని, తనలో తానుఅనుకున్నట్లు 'తిరిగిరానియ్ పశువుని. ఒక్కవేటుతో నరికి పోగులుపెట్టకపోతే నా పేరు నరేన్ కాదు' అని గొణిగాడు.

ఉమ పైకంటి "రాత్రికి యిక్కడే భోంచేస్తావా ?" అని అడిగింది.

"అరె ! అత్తారింటికి వచ్చినవాణ్ణి భోంచెయ్యనా ? మసాలా వేసి మిరప్పప్పు చెయ్యి. చాలా రోజులుగా తినలేదు"

# పదహారవ పరిచ్ఛేదం

## 1

ఉమ చదువు చెప్పేది మొత్తం తొమ్మిదిమందికి. ఇంతకంటె తక్కువమంది అయితే ప్రయోజనం ఉండదు. ఎందుకనంటే - యెవరింట్లోనూ జీతం యెక్కువలేదు. ఆమెకి యింగ్లీషు రాదు. మగపిల్లలకి చదువుచెప్పటం ఆమెకి సాధ్యం కాదు. ఈరోజుల్లో అందరూ తమ పిల్లలకి ఇంగ్లీషు చెప్పించాలని కోరుకుంటారు. ఎలాగో అలా రెండు ముక్కలు యింగ్లీషు చదువుకుంటే మంచి నౌకరీ దొరుకుతుంది. ఆడపిల్లలు యింగ్లీషు చదువుకోటం ఆరోజుల్లో యింకా పరిపాటి కాలేదు. ఆస్థితి యింక యెక్కువ రోజులుండదు. ఇప్పటికే కొందరు చదువుకోవటం మొదలెట్టారని వినికిడి. ఇదివరకులాగా యింక ఆడపిల్లల స్కూళ్లు ఖాళీగా ఉండవు. ఉమకికూడా ఆసక్తి ఉంది. చెప్పేవారెవరైనా దొరికితే యింగ్లీషు నేర్చుకోగలదు - కొద్ది రోజుల్లోనే. కాని చెప్పేవారేరి ? గోవిందు అప్పుడే ఆ వీధిలో ఉన్న బడికి వెళ్లటం మొదలెట్టాడు. అతడు చదువుతున్నది ఫస్ట్ బుక్కు. అతడికెంతవరకు వచ్చో అంతవరకు నేర్చుకుంది. అది అక్షరపరిజ్ఞానం మాత్రమే. ఉమ ఓర్పువహించలేక యింకా త్వరగా ముందుకి పోవాలని తహతహలాడుతోంది. అయిదారేళ్ల కుర్రవాళ్లకుండే గ్రహణశక్తిని బట్టి, మేష్టరు జాగ్రత్తగా పాఠాలు ముందుకు పోనిస్తారు. అంతేకాని ఉమ అవసరాన్ని గ్రహించి ముందుకుపోనివ్వటం కుదరదు. పూర్ణవయస్కురాలైన ఉమ అయిదు నిమిషాల్లో నేర్చుకో గలిగింది - కుర్రవాడికి నేర్చుకోటానికి యేడెనిమిది రోజులు పడుతుంది.

ఆడవాళ్లు చదువుకునే రివాజు అంతగా లేకపోయినా ఇప్పుడు చాలా మంది మేల్కొన్నారు. కాని ఈ పేటలో ఒక వర్గం గౌరవకుటుంబాలకి చెందినవారు. వారంతా కలకత్తాలోని వ్యాపారవర్గానికి సంబంధించిన వారు. ఆడవాళ్లు చదువుకుంటే లక్ష్మి స్థిరంగా ఉండదని వారి విశ్వాసం. వారి ఆచారవ్యవహారాలు, నీతి నియమాలు పదిహేడో శతాబ్దపు ప్రత్యేక పద్ధతినే అనుసరించి ఉంటాయి. వారు లక్ష్మి పారిపోతుందన్న భయంతో ముందుకు పోవాలని కోరుకోరు. వారు అలక్ష్మిని కట్టివేసుకోలేకపోయినా, కలకత్తాలోని వ్యాపారస్థుల వర్గం తమ స్థానాన్ని మార్వాడీలకు వదిలేసి వెనక్కిపోయారు.

ఏది యేమయినా కానియ్. ఉమ కొంచెం దూరదూరాలకి వెడుతూండాలి. పెద్దరాస్తా దాటి, అటువైపు రెండుసందుల్లోకి కూడా వెళ్లాలి.

కాని ఉమ యింక భయపడటం లేదు. భయపడితే అది మరింత భయాన్ని కల్గిస్తుందని ఉమ యెలాగో గ్రహించింది. ఆమె యెవరి నిషేధాల్ని, హెచ్చరికలను వినటానికి యిష్టపడదు. ఇవాళ జాగ్రత్తగా ఉండమని హెచ్చరించటానికి వచ్చినవారు - నిజంగా అలాంటి దుర్దినం వచ్చినప్పుడు చూడటానికి కూడా రారు. ఆ రోజున చీకటిగదిలో కూచుని చావవలసిందే. ఇంట్లో కూచునిమాత్రం చావగలరా? ఇల్లు స్వంతం కాదు. అద్దె యివ్వకపోతే వెళ్లగొడతారు. ఒక ఉపాయం మాత్రం ఉంది. కంఠానికి ఉరిపోసు కోవటం. ఆదారి యెప్పుడూ తెరిచే ఉంటుంది. చివరివరకు చూడకుండా, అదృష్టం ఆఖరి పరిణామం యేమిటో తెలుసుకోకుండా ఉమ ఆ మార్గాన్ని అనుసరించదు. ఆత్మహత్య మహాపాపమని ఆమె మహాభారతంలో చదివింది, మహాపాపాన్ని యింక ఆమె చెయ్యదు. గతజన్మలో యే మహాపాపం చేసిందో, యెవర్ని వంచించిందో? అందుకని ఈ జన్మలో యింత వంచితు రాలయింది. వివాహిత అయిన యువతి రూపయౌవనాలను ఉపహార పాత్రనిండా నింపుకుని కూచుని ఉంది. కాని యెవరి పాదాలముందూ దాన్ని సమర్పించుకోలేకపోయింది. ఈ జీవితం అస్పృశితంగానే ఉండిపోయింది. ఈ పుష్పం శాశ్వతంగా అనాఘ్రాతమే. మళ్లీ ఈ జన్మలో మహాపాపం చెయ్యటానికి ఆమె అంగీకరించదు. చేసినపాప మేదో ఈజన్మలో క్షాళితమై పోవాలి.

ఉమ తొమ్మిదిమందికి చదువు చెప్పటానికి ఆరుయిళ్లకి వెళ్లాలి. ఒక యింట్లో యిద్దరు, ఇంకొక యింట్లో ముగ్గురు పిల్లలు ఒకచోటే కలసి చదువుకుంటారు. ఇద్దరు ఒక డాక్టరుగారి కొడుకు కూతురు చదువుకుంటారు. వాళ్లు నాలుగు రూపాయలిస్తారు. ముగ్గురు చదివేచోట యిద్దరు ఆడపిల్లలు, ఒక మగపిలవాడు. వారు గౌరవకుటుంబానికి చెందిన కాయస్థులు. ఏదో పెద్ద విదేశీకంపెనీ యేజెంటు. పెద్దజీతం వస్తుంది, కాని పిసినిగొట్టులు. ముగ్గురూ కలసి నాలుగు రూపాయలిస్తారు. ఇహ నలుగురు ఆడపిల్లల్ని విడి విడిగా చదివించాలి. ఇద్దరు రెండురూపాయల లెక్కన యిస్తారు. తక్కిన యిద్దరు ఒకొక్క రూపాయి యిస్తారు. వాళ్లు చాలా సాంప్రదాయకులు. వీరి సంరక్షకులు సాహసించి లక్ష్మిని అలక్ష్యం చేస్తున్నారు. దానికి కొంత రాయితీని ఒత్తిడి చేస్తారు.

సాదిక్‌మియా యింట్లో చదువు చెప్పటానికి అంగీకరిస్తే యింత శ్రమ పడాల్సిన అవసర ముండేది కాదు. వాళ్లింట్లో యెనిమిదిమంది చిన్న పిల్ల లున్నారు. వృద్ధుడైన సాదిక్ యింకా జీవించే ఉన్నాడు. ఉమకి వారింటి కెళ్లటానికి అభ్యంతరమయితే - మనుమల్ని మనుమరాళ్లని యిక్కడికే పంపే యేర్పాటు చేస్తానని యీ మధ్యనే. ఆ ప్రస్తావన తీసుకొచ్చాడు. కాని

రాసమణి అందుకు ఒప్పుకోలేదు. ఆమె సాదిక్ ముందు చేతులు జోడించి, "మీ మనుమలకు మనుమరాళ్లకు చదువుచెప్పి డబ్బుతీసుకోవలసివస్తే, దానికి సిగ్గుపడాల్సిన విషయం అంతకంటె మరొకటి ఉండదు. అంతకంటె దాని కంఠానికి ఉరివెయ్యటం మంచిది పైగా మీకు అన్నీ తెలుసుగా బాబా! బ్రాహ్మలపిల్ల మీదగ్గిర నౌకరి చేస్తోందంటే, చివరికి అందుకు కులంలోంచి వెలేస్తారు. దానికి నాకు భయమేమిటి కాని, నాకు తక్కిన కూతుళ్లున్నారు. వారు సమాజంలోనే ఉన్నారు. వాళ్లకిబ్బందులు తెచ్చిపెట్టటం భావ్యమవుతుందా?" అన్నది. తర్వాత సాదిక్ యింక బలవంతం చెయ్యలేదు. నసిబెన్ పెళ్లి టెరిటి బజారులో ధనికుడైన ఢిల్లీవాలాతో అయింది. ఆమె భర్తకి తన తమ్ముడికి చెల్లెలికి – అంటే నసిబెన్ మరిదికి, ఆడబిడ్డకి – బెంగాలీ నేర్పించాలని కోరిక. నసిబెన్‌వాళ్లకి కారుకూడా ఉంది. ఆమె ఉమను కారులో తీసుకెళ్లి, మళ్లీ కారులో తీసుకొచ్చి దింపిస్తానన్నది. కాని అదీ జరగలేదు. రాసమణి స్నేహపూర్వకంగా నసిబెన్ వీపు నిమురుతూ, ఇదే కారణాన్ని వివరంగా చెప్పింది. అదీ కాక అపరిచితులైన ముసల్మానుల యింటికి వెళ్లటంలో మరో ముప్పు కూడా ఉంది. ముప్పు కాకపోయినా అప్రతిష్ఠ మాత్రం వస్తుంది.

గత్యంతరం లేక ఉమ ఈ ఆరుయిళ్లకి వెళ్లి చదువు చెప్పవలసి వస్తోంది. తమ యింట్లో చదువుచెప్పటం సాధ్యం కాదు. చిన్న చిన్న పిల్లల్ని యింట్లోంచి బయటికి పంపించటానికి యెవరూ ఒప్పుకోరు. అన్నిటి కంటె చిక్కు టైం లేకపోవటం. మధ్యాహ్నం పన్నెండు ఒంటిగంటకి యింట్లో పనులన్నీ పూర్తిచేసుకుని బయటికి వెడుతుంది. తిరిగి వచ్చేసరికి అయిదు, ఆరు అవుతుంది. వేసవికాలంలో కాస్త ఆలస్యమైనా పర్వాలేదు. ఆలస్యంగా చీకటి పడుతుంది. శీతకాలంలో గభాల్న చీకటి పడుతుంది. ఊపిరి తీసుకోటానిక్కూడా టైం ఉండదు. చీకట్లో వీధిలో తిరగటానికి ధైర్యం ఉండదు. ఉండటానికి వీలుకూడా లేదు. తేనెకోసం తారట్లాడే తేనెటీగలు అన్ని కాలాల్లోనూ ఉంటాయి. పనిలేకుండా తిరిగేవాళ్లకి అప్పుడూ కొదువ లేదు. ఇప్పుడు పనులు దొరకటం లేదు కనుక పనిలేనివాళ్లు తప్పనిసరి అయి ఉంటున్నారు. అప్పుడు పనిలేకపోయినా జరిగిపోతుంది కదా అని ఉండేవాళ్లు. అప్పుడు పనిలేనివాళ్లు నిశ్చింతగా ఉండేవాళ్లు. యౌవనం ఉన్నవాళ్లు చెడుతిరుగుళ్లకి అడ్డు-ఆపు ఉండేది కాదు. పట్టపగలుకూడా వాళ్ల సాహసానికి అంతు ఉండేది కాదు. అయితే ఈ విషయంలో ఉమకి కూడా ఒక నిబ్బరం ఉంది. రాసమణిని ఈపేటలో చాలామంది గౌరవించే వారు. ఆమె చరిత్ర అందరికీ తెలుసు. ఆమె చరిత్రలో మాధుర్యంతో దృఢత్వంకూడా మిళితమై ఉన్న సంఘటనలు కొన్ని చాలామందికి తెలుసు.

సానుభూతిని, గౌరవాన్ని సమానంగా సంపాదించుకో గలిగింది. కనుక అతిగా ధూర్తత్వానికి పూనుకుంటే తమసంరక్షకుల దగ్గర్నుంచి ఒత్తిడి వస్తుం దని అందరికీ తెలుసు. అదీకాక సాదిక్‌మియా, బలిష్ఠులైన అతడి కొడుకులు, మనుమలంటే భయం ఒకటుంది. అంచేత పగలు వీథుల్లో తిరగటానికి అంతగా భయముండేది కాదు. కాని రాత్రుల సంగతి వేరు. పగలయితే సాహసమే - రాత్రిళ్లు అదే దుస్సాహసం.

అయితే జీతమిచ్చేవారు రెండు రూపాయ లివ్వనీ - రూపాయే యివ్వనీ అందరూ గడియారంకేసి చూస్తూంటారు. ఒక గంట చెప్పి తీరాల్సిందే - మహాఅయితే రెండుమూడు నిమిషాలు కాజెయ్యొచ్చు. అంచేత ఒక యింటి నుంచి యింకొక యింటికి పరుగులెత్తుతూంటుంది. మెల్లిగా నడిచే అలవాటు ఈ కొద్ది నెలల్లో యెక్కడికో పోయింది.

అయినా ఒకొక రోజున చివరి యింటినుంచి బయలుదేరేసరికి - (చివరికెప్పుడూ డాక్టరుగారిల్లే పెట్టుకుంటుంది. అది అన్నిటికంటె దగ్గర యిల్లు. అదీకాక వాళ్లు మనుషులుకూడా మంచివాళ్లు, మర్యాదస్తులు. అలా ఆలస్యం కనుక అయితే దాసీని తోడు యిచ్చి పంపుతారు) బాగా చీకటి పడింది.

ఆరోజున ఇలా త్వరగా తెములుచ్చుకు రావాలని యెంత ప్రయత్నించినా ఆలస్య మయిపోయింది. ఆ రోజున వాళ్ల దాసీ - వియ్యాల వారింట్లో కానుక లిచ్చి రావటానికి వెళ్లింది. ఆ రోజున డాక్టరుగారి భార్య "మా అబ్బాయి నిన్ను దిగబెట్టి వస్తాడు. ఏమంటావ్ అమ్మాయ్ ?" అని అడిగింది. అబ్బాయి అంటే పదమూడు, పధ్నాలుగేళ్ల ఆమె కొడుకు. అతడి చూపులు ఉమకి యెప్పుడూ బాగుండేవికావు. అతణ్ణి నమ్మి చీకట్లో యింతదూరం నడిచి వెళ్లటంకంటె - కనిపించని దేముడిమీదే నమ్మకం పెట్టుకోవటం మంచిది. ఉమ తల తిప్పుతూ "అక్కర్లేదు పిన్నిగారూ, నేను వెళ్లగలను. కాస్తదూర మేగా !" అన్నది.

ఆమె వారింటినుంచి బయలుదేరి ఒకవిధంగా పరుగే మొదలెట్టింది దూరం యెక్కువ కాకపోయినా రెండు మూడు సందులు తిరగాలి. మొదటి సందు మరీ నిర్మానుష్యం. ఆసందులో యావేళప్పుడు కొంతమంది వృద్ధులు చేరి కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు. అదీ ఆమెధైర్యం ఇవాళ యెందుకనో - ఇంకెక్కడికైనా వెళ్లి కూచున్నారో, యెవరూ యింట్లోంచి బయలుదేరలేదో అక్కడెవరూలేరు. అప్పుడిక తిరిగి రావటం సాధ్యం కాదు. మనస్సులో దుర్గాస్మరణ చేసుకుంటూ ఆమె ముందుకు సాగి వెళ్లింది. సరీగ్గా అదే సమయంలో వెనక యెవరివో అడుగులు

చప్పు డవుతున్నట్లు విన్పించింది. ఎవరో తనని వెంబడించి వస్తున్నారు. ఒకవేళ బహుశా అంతా ఒట్టి భయమేనేమో ! అయినా వెనక్కి తిరిగి చూడటం సాధ్యం కాదు. ఆమె మరింత గబగబా యెగ శ్వాసతో పరుగెత్తసాగింది. దాని ఫలితంగా సందుమొగ దగ్గరవరకూ వచ్చి గట్టిగా ఒకపురుషుణ్ణి ఢీకొట్టింది. నిశ్చయంగా అపరిచితుడు. పరపురుషుడే. తప్పు అతడిది కాదు. అత డటు వైపునుంచి వస్తున్నాడు. అతడికయినా దూరంగా ఉండగానే ఉమను చూసి జాగ్రత్తగా రావటం సాధ్యం కాదు.

అతిపరిచయమైన కంఠం ఒకటి ఆశ్చర్యంగా - "ఇదేమిటి ? నువ్వా?" అన్నమాటలు వినిపించకపోతే - ఆమె భయంతో, సిగ్గుతో, సంకోచంతో తెలివితప్పి పడిపోయేదే !

ఇంక కొన్ని క్షణాలు ఆగి - "ఇక్కడ యిలా ఒంటరిగా ?" అని మిగిలిన సగం ప్రశ్న కూడా పూర్తిచేశాడు.

అతడు శరత్ ! ఆమె భర్త.

ఆ వ్యక్తితో ఆమెకి అతిస్వల్ప కాలపరిచయమే. అయినా అది విశ్వ సించ తగినంత ముఖ్యమైన దనిపించింది. ప్రత్యేకమైన కారణాలు యేమీ లేకపోయినా, అప్పటికి ఉమకి కలిగిన నిశ్చింతత ఊహకందేది కాదు. ఒక పెద్ద నిట్టూర్పు విడిచి కళ్లమూసుకుని నిలబడి, ఆమె దమ్ము తీసుకో టానికి ప్రయత్నించింది. కాని ఏమయినా నిలబడలేక పోయింది. ఇన్ని పరస్పర విరుద్ధమైన ప్రబల అనుభూతుల ఆఘాతంతో ఆమె కీళ్లన్నీ పట్టు తప్పి పోయాయి. ఆమె యెంత సంబాళించుకుందామని ప్రయత్నించినా - చివరికి సాధ్యంకాక తూలిపడటం కాదు, శరత్ గుండెల మీద వాలిపోయింది.

"ఇదిగో చూడు, ఏమిటీ పని ? ఏమయింది నీకు ?"

అమాయకుడిలా తడబడుతూ శరత్ ఆమెని పట్టుకున్నాడు, పర స్త్రీని పట్టుకున్నట్లు. మొద్దుబారిపోయి అలాగే ఉండిపోయాడు.

ఉమ కొన్నిక్షణాల్లో తనని తాను నిగ్రహించుకుంది. భర్త జడ త్వంలో ఉన్న తీవ్రమైన అవమానం - పట్టుతప్పిన ఆమె కీళ్లనన్నిటినీ మళ్లీ మామూలు స్థితికి తీసుకురావటానికి సాయపడింది. జరిగిన చరిత్రంతా మనస్సులోంచి చెరిగిపోయి, యుక్తితర్కాలను ముద్రించి భార్య మనస్సులో స్వాభావికంగా తలయెత్తే ఆశ-ఆశ్వాసాలే, బహుశా భర్త గుండెలమీద పడిపోయినప్పుడు ఉమ మనస్సులో రేకెత్తిఉంటాయి. అతడు భయపడి

పోయిన భార్య అవస్థ చూసి, కొంచెం స్నేహపూర్వకంగానే గుండెల మీద ఆశ్రయ మిచ్చాడు. పరాయి మనిషి అయినా ఇలాంటి సమయంలో ఆశ్రయ మిస్తాడు, ఓదార్పు కలిగిస్తాడు.

ఉమ కాసేపు మెదలకుండా ఊరుకుని, మామూలుగానే "చాలా భయపడిపోయాను" అన్నది.

"అది కన్పిస్తూనే ఉంది. కాని యెందుకని? ఇలా రాత్రి వేళ నిర్మానుష్యంగా ఉన్న సందులోంచి, అంత పరుగుపరుగున యెక్కడి కెడుతున్నావు ?"

"ఇంటి కెడుతున్నాను. తప్పుకోండి. దారి వదలండి. మరీ కటిక చీకటయిపోతుంది. ఇంక ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు."

"ఆగు, అంత పరుగెత్తాల్సిన అవసరం లేదు. పద, నిన్ను యింటి దగ్గర దింపించి వెడతాను"

పరమవిపత్తు వచ్చి పడిన రోజున అతణ్ణి కలుసుకోవటం జరిగింది. కాని ఇంతదుఃఖంలోకూడా అతడి మాటలు వింటూంటే ఆమెకి నవ్వొచ్చింది. ఏమి సంపర్కం! ప్రక్క ప్రక్కన నడవటానికి సిగ్గే వేసింది. శరత్ కొంచెం ముందు నడుస్తున్నాడు. ఉమ వెనక నడుస్తోంది.

"ఎక్కడినుంచి వస్తున్నావ్ ?" శరత్ మళ్లీ ప్రశ్నించాడు.

"ఆడపిల్లలకి చదువు చెప్పి వస్తున్నాను"

"ఏమిటి ? యేం చేసి.... ?" అంటూ గతుక్కుమని ఆగాడు శరత్.

"దారిలో యిలా ఆగి నుంచోకూడదు. పదండి, ఎవరయినా చూస్తే యేమయినా అనుకుంటారు. మిమ్మల్ని ఈ పేటలో యెవరూ యెరుగరు."

ఆమె కంఠస్వరంలో కొంచెం వ్యంగ్యం ధ్వనించింది.

శరత్ నడవటం మొదలెట్టాడు. కాని ప్రశ్నమాత్రం అలాగే ఉండిపోయింది.

"కాని యేం చేస్తున్నా నన్నావూ ? అర్థం కాలేదు"

"ఆడపిల్లలకి చదువు చెపుతున్నాను. పిల్లలకు పాఠాలు చెప్పే పని చేస్తున్నాను. రూపాయి, రెండురూపాయలు జీతం. ఆరుగంటలు శ్రమ పడి తిరిగివస్తున్నాను. అర్థమయిందా? శరీరం మనస్సు యెలా ఉన్నాయో !

మామూలుగా రోజూ యింకా వెలుతు రుండగానే తిరిగి వస్తూండేదాన్ని, ఇవాళ ఆలస్యమవటంతో భయమేసి పరుగెత్తుతున్నాను."

ఉమ కంఠస్వరం తీక్ష్ణంగా మారింది.

అయినా శరత్ అవిశ్వాసం తీరిపోలేదు.

"నువ్వు యింటింటికీ తిరిగి, పిల్లలకు చదువు చెపుతున్నావా ? ఈ వయస్సులో ? ఒంటరిగా ? అదేమిటి ?"

"ఏం ? అందులో ఆశ్చర్యపోవాల్సిం దేముంది ?"

"ఆశ్చర్యం కలగటం అన్యాయమా ?"

అప్పటికి ఉమ తమయింటి దగ్గిర కొచ్చేసింది. బయట గుమ్మం మెట్లమీద అడుగు పెట్టి తిరిగి నుంచుని "భార్యని పోషిస్తానని బాస చేసి కూడా - భర్త ఆ బాస నెరవేర్చకపోతే, ఆమెకింక మరో ఉపాయం యే ముందో చెప్పండి. వితంతువయిన మా అమ్మ నన్ను జీవితాంతం పోషిస్తుం దనుకున్నారా మీరు ? అమ్మ చచ్చిపోయింతర్వాతకూడా కూచుని తినటానికి సరిపోయేటంత డబ్బు యిచ్చి వెళ్లారా ? లేక వేశ్యావృత్తి చేస్తేనే బాగుండేదా ?" అన్నది. తెల్లబోయి, చెట్టు చిటారు కొమ్మమీదినుంచి గభాల్న పడ్డట్లయినాడు. "నన్నడిగిన ప్రశ్నలే నాభర్త నడిగి చూడక పోయారా ? ఆయన యేమనేవారో ?"

ఉమ మాట్లాడుతూ, మాట్లాడుతూనే ఉత్తేజంతో కంపించి పోయింది.

"పద, పద లోపలికి పద. నీ కంఠస్వరం యెంత తారస్థాయికి వెళ్లిందంటే - ఈ వీధిలో వాళ్లందరూ యిళ్లకిటికీల దగ్గిరకి వచ్చి నుంచుం టారు" తలవని తలంపుగానే అన్నాడు శరత్.

ఉమకూడా కొంచెం సిగ్గు పడింది. వసారాలోకి వెళ్లిపోయింది. శరత్ వెనకాలే కొన్ని అడుగులు ముందుకి వెళ్లాడు.

"పన్నెండింటికి బయటికి వెళ్లాను. ఆరింటికి తిరిగివస్తున్నాను. పిల్లలతో యింతసేపూ వాగటం, దానికి తోడు ఈ భయం. రాత్రింబగళ్లు నావెంటనే ఉంటున్నారు యిద్దరు శత్రువులు - రూపం, యౌవనం. ఇంక నాకు సాధ్యం కాదు" అన్నది.

సమాధానం చెప్పటం శరత్‌కి చాలా కష్టమయేది. కాని చెప్ప వలసిన అవసరం లేకపోయింది.

"ఎవరితోనే మాట్లాడుతున్నావ్ ఉమా ?"

కమల దీపం పట్టుకుని తెల్లబోయి చూసి, కిందికి దిగి వచ్చింది.

"అరె ! మీ ఆయన శరత్ ! రా, రా, పైకి రా. ఎంత అదృష్టం !"

"కాదు వదినగారూ ! ఇవాళ కాదులెండి, హఠాత్తుగా దారిలో కలుసుకున్నాను మీ చెల్లెల్ని. అందుకని -"

శరత్ మాటలు ఒకదాని కొకటి పొంతన లేకుండా పోయాయి.

కమల దగ్గిర కొచ్చి అతడి చెయ్యి పట్టుకుని, "నేను నీకు 'అక్క' లాంటి దానినయ్యా, ఒక్కమాట విను. రెండునిముషాలు భార్య దగ్గిర కూచుని వెడితే ఎవ్వరూ నిందించరులే, రా, పైకి రా" అన్నది.

'యంత్రచాలితవత్' అంటారే - సరిగ్గా అలా శరత్ పైకి వెళ్లాడు.

ఉమ దీపపు వెలుగులో శరత్‌ని సరిగ్గా చూసింది. శరత్ చాలా చిక్కిపోయాడు. ఏదో ముసలిరూపు వచ్చేసింది ఈ వయస్సులోనే, అంత అందమైన ముఖం - బుగ్గలు గుంటలుపడి, చర్మం ముడతలుపడి. అసహ్యంగా యేదో కుంచుకుపోయినట్లుంది. కమల వారిని కూచోపెట్టి "ఇప్పుడే వస్తా"నని బయటికెళ్లింది.

గదిలో యేకాంతంగా యిద్దరు. ఉమ తలవని తలంపుగానే-"ముఖం యిలా అయిందె యెందుకని ? మీ కేమయినా జబ్బుచేసిందా ?" అని అడిగింది.

"నాకా ? అబ్బే, లేదే !" అని కాసేపు ఆగి, "శ్రమ బాగా పెరిగింది. నేను స్వంతంగా చిన్న ప్రెస్ ఒకటి నడుపుతున్నాను. చాలా కష్టపడవలసి వస్తోంది. పెట్టుబడి తక్కువ" అన్నాడు.

తర్వాత యిద్దరూ మెదలకుండా ఊరుకున్నారు.

కాసేపు తల వంచుకుని, నేలమీద గీతలు గీస్తూ కూచుని "ఎటు చూసినా అప్పులు - లేకపోతే నీకున్న ఖర్చెంత ? అదే, రెండు మూడు రూపాయలు నీకేమైనా అవసరముందా ?" అని అడిగాడు.

"లేదు. నేనే సంపాదిస్తున్నానని యిప్పుడే కదా చెప్పాను. భర్త దగ్గిర్నుంచి భిక్ష యింకేమీ తీసుకోను. దాంతో నా దరిద్రం యేమీ తీరిపోదు"

'సరే, అయితే. ఇంక లేస్తాను'' అని శరత్ నిజంగానే లేచి నిలబడ్డాడు.

"అప్పుడేనా ?'' ఉమ అణమకున్న ఆర్తకంఠంతో అన్నది.

''ఎంతోమంది పెళ్లిచేసుకున్న భార్యల్ని యింట్లో పెట్టుకుని, వేశ్యల యిళ్లచుట్టూ తిరుగుతూంటారు. మీరు.... మీరు వేశ్యని వదిలి పెళ్లి చేసుకున్న భార్యదగ్గిర రెండు నిమిషాలుకూడా కూర్చోలేరా ?"

శరత్ తల వంచుకునే ఉన్నాడు. మరింత తల వంచుకుని, చాలా సేపు తటపటాయించి, అతికష్టంమీద "భార్యవి కదా అని నీ దగ్గర కూచోటం యిష్టం లేదు. ప్రేమించకుండా ఆడవాళ్ల దగ్గిరకి వెళ్లొచ్చు; కాని భార్య దగ్గిరకి వెళ్లకూడదు. ఆమెతో కాపురం చేస్తూ, ఆమె చేతి అన్నం తింటూ, ని దగ్గిరకి రావటం నిన్ను మరింత అవమానించటం కాదూ ? నేను నీ భర్తను కాతగినంత యోగ్యుణ్ణికాను. భర్తను కాలేకపోయినా నీ మర్యాద నాకు తెలియదని యెప్పుడూ అనుకోకు. ఎక్కడయినా ఉండనీ, ఏస్థితిలోనయినా ఉండనీ ప్రతిరోజూ మనస్సులో నన్ను త్వరగా చని పోయేట్లు చేయమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూంటాను. నువ్వు విధవవయినా యీ అవమానంనుంచి బతికిపోతావు'' అన్నాడు. చివరిమాట లంటున్నప్పుడు శరత్ కంఠం వణికింది. ఆ వణకుతున్న కంఠంనుంచి వచ్చిన మాటలు ఉమ దీపంకేసి చూస్తూ, స్తబ్దంగా నిలబడిపోయి వింటూ విహ్వలురా లయింది. అందువలన శరత్ యెప్పుడు బయటికి వెళ్లిపోయాడో ఆమె అంతగా గమనించలేదు. కమల చెల్లెలి భర్తకోసం ఫలహారం పళ్లెంలో పెట్టుకుని యెప్పుడు పైకి వచ్చిందో, అదీ ఆమె చూడలేదు.

''ఏమిటే ? మరిది వెళ్లిపోయాడా దౌర్భాగ్యురాలా ! రెండు నిమిషా లయినా పట్టుకుని ఆపలేకపోయావా ?''

ఉమ చెవులకి ఈ ఫిర్యాదు కూడా విన్పించినట్లు లేదు. ఆమె అలా రాతి బొమ్మలా కదలకుండా నిలబడే ఉంది.

## 2

ఉమ విహ్వలస్థితి రాత్రంతా తగ్గనే లేదు. ఆమె రాత్రంతా అలా నిశ్చలంగా కూర్చునే గడిపింది. ఆమె కిప్పు డది తరచు నిత్యకృత్యంగా పరిణమించింది. ఉమకి యేరోజునా బాగా నిద్రపట్టదు. అయినా యివాళ జరిగినదాంట్లో ఒక విశేషం ఉంది. ఆమె యివాళ నిద్రపోవటానికి ప్రయత్నంకూడా చెయ్యలేదు. రాత్రంతా కూచునే ఉంది. కమల మధ్య

మధ్య నిద్రమత్తులో "ఏమే ఉమా ! నువ్వింకా కూచునే ఉన్నావా ?" అని కొంచెం విస్మయాన్ని వ్యక్తం చేసింది. ఉమ ప్రతిసారి "ఇదిగో పడుకుంటున్నా అక్కా !" అని సమాధాన పరచేది. కాని పడుకోడానికి ప్రయత్నంకూడా చెయ్యలేదు. ఇవాళ రాత్రి నిద్రపోయి గడపటం ఆమెకి సాధ్యం కాదు.

శరత్ చివరికి అన్నమాటలు - మాటలుకూడా - అంతకాదు, అతడి కంఠస్వరం ఆమెని అణువణువునా కదిలించి వేసింది. చివరిమాటలు అంటున్నప్పు డతడి కంఠం కంపించింది. స్వరంకూడా కొంచెం బొంగురుపోయింది. అది యెంతవరకు - యేమిటో సరీగ్గా వినటానికి అప్పుడామెకి సమయం లేకపోయింది. అంత అనుకోకుండా హఠాత్తుగా, అతి స్వల్ప వ్యవధిలో శరత్ నోటినుంచి ఆ మాటలు వెలువడ్డాయి. ఆ మాటలు, ఆ స్వరం - ఆమె చైతన్యాన్ని యెంత స్పందింపచేశాయో ; ఆ స్మృతికూడా ఆమె మనసులో అపూర్వమాధుర్యాన్ని, ఇంద్రజాలాన్ని సృష్టించింది. ఎడారిలో దప్పికగొని దారి తప్పిన బాటసారి - హఠాత్తుగా కన్పించిన చెలమలో నీళ్ల మురికివా కావా అని ఆలోచించడు. ఉమ జీవితంలో భర్త ప్రేమంటే యేమిటో చవి చూడలేదు. ఇతరుల ముఖతః దాని అస్పష్ట రూపాన్నిమాత్రం పైపైన తెలుసుకుంది. కాని సహజమైన ఆతృష్ట, దాని తీవ్రత ఆమెలో యేమీ తక్కువ కాలేదు. తనకోసమే వెలువడిన ఆగొంతు, ఆ కంపనం - మనస్సులోని తృష్ణనంతటినీ పెనవేసి పట్టుకున్నాయి. కారుచీకటిలో తళుక్కుమనే వెలుగురేఖను చాలా సమయాల్లో మానవుడు పట్టుకోవాటానికి నిజంగానే చెయ్యి చాస్తాడు. క్షణం క్రిందటి ఒక కంఠస్వరాన్ని ఉమకూడా అలాగే మనస్సంతా పెట్టికాదు, ఒక విభ్రాంత - విమూఢతతో చెయ్యిచాచి పట్టుకోటానికి ప్రయత్నించింది.

చివరి కొకసమయానికి దూరంగా యెక్కడో చర్చిలోని గంట మూడు గంటలు కొట్టింది. మూడు కొట్టగానే ఉమ వీలయినంత సవ్వడి కాకుండా తలుపు తెరచుకుని, బయటికి వచ్చింది. రాత్రి-అపరాత్రి యీడొచ్చిన పిల్ల డాబామీదికి వెళ్లటానికి వీల్లేదని నిషేధాజ్ఞ ఉంది. బయటికి వెళ్లాలంటే తనను పిలుచుకుని వెళ్లమని కమల యెన్నోసార్లు చెప్పింది. కాని యివాళ కమలని పిలవటం యెలా సాధ్యం కాదో, అలాగే గదిలో ఈ మసకదీపం వెలుగులో పక్కమీద మెదలకుండా కూర్చుని ఉండటం కూడ సాధ్యం కాదు. కమలకు యేం చెపుతుంది ? వేళకానివేళలో పిలిచినందుకు సంజాయిషీ యేమిస్తుంది ? అంతకంటె ధైర్యం చేసి, బయటికి వెళ్లటం చాలా తేలిక. ఏమవుతుంది ? దొంగలు, దోపిడీగాళ్లు యీ వేళప్పుడు మీదికొచ్చి పడ

టానికి, రోజూ బయట సిద్ధంగా కూమని ఉంటారా ? అదీకాక యీ మానసికపరిస్థితిలో మరో వ్యక్తి మాటకాని కంఠస్వరంకాని వినట. యిష్టం లేదు. ఏదో అపూర్వమైన విరామంలేని మధురసంగీతం హృదయ తంత్రులమీద ధ్వనిస్తోంది. ఇంద్రియా లన్నిటినీ అటు మరల్చి చెవి ఒగ్గి కూచుంది. ఏ పరిచితమైన కంఠస్వరమయినా దానికి అడ్డు తగిలిందంటే ఆ తీగె తెగిపోతుంది. ఆ సంగీతం ఆగిపోతుంది.

డాబామీద చల్లగాలి రాత్రంతా జాగరణ చేసిన ఆమె శరీరాన్ని చల్లపరిచింది. ఆమె ముఖంమీద కళ్లమీద ఎవరో స్నిగ్ధమైన ప్రలేపనాన్ని రాచినట్లున్నారు. కృష్ణపక్షపు చంద్రుడు క్రొత్త బజారు చాటున యింకా అస్తమించలేదు. కాని వెన్నెల యెంతో లేదు. లేకపోయినా చీకటి అంత దట్టంగా లేదు. వీధిలో రెండు మూడు దీపాల కాంతిరేఖలు బోసుగారి మూడంతస్తుల మేడ గోడమీద పడుతున్నాయి. ఆ వెలుతురికి డాబా అంతా స్పష్టంగా కన్పిస్తోంది.

ఉమ ముందుకి వచ్చి డాబామీద పిట్టగోడని ఆనుకుని నుంచుంది. మహానగరం శాంతంగా స్తబ్ధంగా నిద్దరోతోంది. తన హృదయంవైపు చెవి ఒగ్గి వినటానికి అపూర్వమైన అవకాశం.

మల్లికగా రింట్లో కుక్ సర్దార్ నిర్విరామంగా, భయంకరమైన ధ్వనితో గురక పెడుతున్నాడు. వారి పక్షులగూళ్లలో రెండు బెగ్గురు పక్షులు తెల్లవారుతోందని కర్కశకంఠంతో అరుస్తూ ప్రకటించాయి. ఇది వరకు ఈ అరుపులకి ఉమకి భయం వేసేది. ముఖ్యంగా కుక్ సర్దార్ భయంకరమైన గురకకికూడా యిప్పుడు భయంవెయ్యటం లేదు. అంతే కాదు, ఆధ్వనులవల్ల ఇవాళ ఆమె ఆలోచనలకికూడా విఘాతం కలగలేదు. అలాగే నుంచుని నుంచుని, కొత్తగా లభించిన అభిజ్ఞతలోని అపురూపమైన నవ్యతను అనుభవించసాగింది. నిశీథసమయపు శాంతనిస్తబ్ధత ఆమె మేల్కొని కంటున్న కలలకు కొంతవరకు సహాయమే చేసింది.

ప్రొద్దున్నే లేచి కమల ఎర్రబడి వున్న ఉమ కళ్లకేసి చూసి విస్మితురాలు కాలేదు. అభాగ్యురాలయిన చెల్లెలి మానసికపరిస్థితి ఆమెకి తెలియనిది కాదు రాత్రి నిద్రపట్టక పోవటమే స్వాభావికం. వైధవ్యం ప్రాప్తించిన కొత్తలో యెన్నిరాత్రులు తాను కన్ను మూయలేకపోయింది ? అందుకని ఆమె ప్రశ్నించలేదు. సాంత్వననూ కలిగించలేదు. కాని కొంతసేపయాక ఆమె నిజంగానే విస్మితురాలయింది. ఉమకి యేమయింది ? ఆమెకి మతి చెడిందాయేం ? ఆమెని గమనించిన కొద్దీ కమల ఉద్విగ్నురాలయింది.

ఉమ మొదటినుంచి శాంతం స్థైర్యంకల మనిషి. ఆమెలో చాపల్యమనేది కమల ఎప్పుడూ చూడలేదు. కాని ఇవాళ ఉమ యింతగా ఎందుకిలా అయింది ?

మామూలు రోజుల్లో ఒక పూటంతా మెట్లు యెక్కుతూ దిగుతూ, యెగురుతూ, యేవేవో పనులు చేస్తూండేది. ఆ పనులలో యెన్నో పొరపాట్లు ఉండేవని వేరే చెప్పక్కర్లేదు. కాని అన్నిటికంటే ఆశ్చర్యం - వంటింట్లో పని చేస్తూ చేస్తూ అక్కడ యెవరూ లేరని, తనలో తాను కూని రాగం తీస్తూ పాటకూడా పాడుతోంది.

ఆదుర్దాపడాల్సిన సంగతే. తాను యిన్నాళ్లనుంచి చూస్తున్న ఉమలో ఇది అసహజమైన పరివర్తనే. కాని కొంచెం సేపయాక మనస్సులో - రెండు, రెండూ కలిపితే నాలుగని లెక్కవేసుకుని చూడటంతో కమల ముఖం కుతూహలపూర్వకమైన చిరునవ్వుతో మళ్లీ మామూలుగా వికసించింది. నిన్న చెల్లెలు, మరిది యేం మాట్లాడుకున్నారో ఆమెకి తెలియదు. సహజమైన సంకోచంతో ఆమె అడగలేదు. అయినా దెబ్బ తగిలినచోటనే మళ్లీ దెబ్బ కొట్టవలసిన అవసరమేముంది ? వాళ్లు యేం మాట్లాడుకున్నారో - దాని మూలంగా ఉమ ముఖంలో స్తబ్ధత, రెప్పవాల్చనిచూపు గమనించిన మాట నిజం. నిన్న ఇంకా దుఃఖకరమైన వేదనాదాయనమైన దేదో జరిగిఉంటుందని అనుకున్నది. శరత్ మాటల్లో ఉమ యింకా ఆశాభంగసూచన చూసి ఉంటుందని అనుకున్నది - ఇవాళ మొట్టమొదటిసారిగా. బహుశా అదికాక పోవచ్చు. శరత్ బహుశా కొంచెం సానుభూతిని, స్నేహభావాన్ని చూపించి ఉండవచ్చు ననిపించింది.

ఇవాళకూడా అడగటానికి సంకోచం బాధించింది. కాని కమల చాటుచాటుగా గమనించినదాన్నిబట్టి, ఆమె విశ్వాసం మరింత బలపడింది. మనస్సులో దక్షిణవాయువు వీచింది. అందుకనే బయటికి ఆ తేలిక రకపు చపలత్వం. ఏ వసంతస్పర్శ సోకిందో అది ఊహించటం యేమంత కష్టం కాదు.

ఉమ యివాళ చాలా పని చేసింది. మైదా అంతా తీసి కలపటం మొదలెట్టింది. ఏ అభ్యంతరాన్ని వినలేదు. వైభవ్యం వచ్చింది కదా అని శరీరంనిండా మట్టికూడా పేరుకోనివ్వాలా యేం ? అన్నది. మధ్య మధ్య గోవిందుని ఊరికేనే ముద్దు చేయసాగింది. మాటమాటకీ నవ్వుతూ తుళ్లటం మొదలెట్టింది. ఆమె విషయంలో యిది యెంత అసహజమో గమనించిన ముసలిదాసికూడా విస్మితురా లయింది. మాటిమాటికీ

కమల ముఖంకేసి చూడసాగింది. ఆమె చూపులో ఏమిటి సంగతి ? అని నీరవమైన ప్రశ్న.

దాని ఫలితంగా కమల రోజంతా ఖుషీగా ఉంది.

కాని ఆరోజున యింకా అనూహ్యమైన దేదో ఒకటి వారికోసం కాచుకుని ఉంది. సాయంత్రమయే ముందు - దాసీలాంటి స్త్రీ ఒకతె తలుపు కొట్టి, తెల్లటి కాగితం బంగీ యిచ్చి, 'మా బాబు శరత్‌బాబు పంపించారు భార్యకోసం. తనని యిక్కడ యివ్వమని చెప్పారు' అని చెప్పి వెళ్లిపోయింది. వారి దాసీ గిరిబాల మెట్లెక్కి వచ్చింది. ఆ మాట విశ్వసించ తగింది కాదని గ్రహించటానికి కమలకి చాలాసేపు పట్టింది. తర్వాత నిజంగానే గ్రహించి వ్యాకులపాటుతో "అరే! ఆమెని పిలు, పిలు ఆ మనిషిని. అంతా వినాలి. ఆమెకి ఫలహారం పెట్టాలి. కాస్త డబ్బు...." అన్నది.

అంతలో ఆ వ్యక్తి మాయమయింది. బహుశా శరత్ అలాగే నిర్దేశించాడేమో! కమల విలవిల్లాడసాగింది. దాసీ గిరిబాలకూడా కంగారు పడుతూ, "నేను ఆమెని వెళ్లమని చెప్పలేదమ్మా, ఆగమన్నాను. నువ్విక్కడే ఉండు. అమ్మగారితో చెప్పి వస్తానన్నాను. అయినా ఆమె చెప్పాలేదు - పెట్టాలేదు. ఆ వస్తువు అసలు వారికి చేరిందో లేదో తెలుసుకోకుండానే అలా వెళ్లిపోవటం -" అన్నది.

కమల పైకాగితం విప్పి చూస్తే - రెండు నల్లఅంచు మంచి 'పరాస్ డాంగా' చీరెలు. కొంచెం ఖరీదయినవి. కనీసం యేడెనిమిది రూపాయ లుంటాయి. శరత్ తన భార్యకోసం పంపాడు. ఆనందంతో కమల కళ్లల్లో నీళ్ల తొణికాయి.

అప్పుడు ఉమ లేదు. పాఠాలు చెప్పటానికి వెళ్లింది. ఆమె పాఠాలు చెప్పటం అయిపోయి, సాయంత్రం యింటికి తిరిగివచ్చేసరికి, కమల పరుగు పరుగున వచ్చి, "ఉమా! ఉమా! శరత్ నీకోసం ఒక జత చీరెలు పంపించాడు. చౌకరకం చీరెలు కాదు, మంచి ఖరీదయిన అసలు 'పరాస్ డాంగా' చీరెలు" అని చెప్పింది.

"ఎవరు ? ఎవరు పంపించారు ?"

ఆర్తధ్వనిలా విన్పించింది ఉమ ప్రశ్న.

"మీ ఆయన శరత్. ఎవరో ఒకామె తెచ్చి యిచ్చి వెళ్లింది."

ఉమ ఇంతవరకు తగిలిన దెబ్బల్ని అనాయాసంగానే సహించింది. కాని ఈ ఆకస్మిక స్నేహనిదర్శనం ఆమెలో విపరీత ముఖంగా రేగిన ప్రతిస్పందనను సహించలేకపోయింది. ముఖ్యంగా నిన్నసాయంత్రంనుంచి యీ యిరవైనాలుగు గంటలు – ఆమె మనస్సుమీద అవర్ణనీయమయిన తుపానుని రేకెత్తించాయి. ఆమె మరింత అలసటతో క్రుంగిపోయింది. దానిఫలితంగా ఆమె స్నాయువులు సడలిపోయాయి. ఈ ప్రచండమైన ఆఘాతానికి తట్టుకునేశక్తి ఆమె కింకలేదు.

ఉమ యేదో చెప్పాలని ప్రయత్నించింది. కాని చివరికి యేమీ చెప్పలేదు. సామాన్యమైన యేదో అస్ఫుటధ్వనిమాత్రం వచ్చింది. పెదవులు రెండూ వణికాయి. ఆమె స్పృహ తప్పి కమల గుండెలమీద పడిపోయింది.

## 3

కాశీ వచ్చాక పదిహేనురోజులకే రాసమణికి చాలావరకు స్వస్థత చిక్కింది. ఇంతకు ముందెప్పుడూ ఆమె యీ ప్రాంతానికి రాలేదు. అదీ కాక చాలాకాలంగా కలకత్తాలోని యిరుకువీథుల మధ్య, ముఖ్యంగా నాలుగు గోడల మధ్య బంధింపబడి ఉంది. కనుకనే యింత త్వరగా ఆమె ఆరోగ్యం అభివృద్ధి అయింది. అదీకాక యిక్కడ గాలి, నీరు వాటి గుణంకూడా ఉంది. ఇక్కడ నెయ్యి, పాలు, కూరలు అన్నీ చవక. ఆపైన గంగ, విశ్వనాథుడు! చాలారోజుల తర్వాత ఆమె మనస్సు తేలికయి, సహజమైన స్థితికి వచ్చింది.

కొంచెం స్వస్థత చిక్కినప్పట్నుంచి రాసమణి నడిచివెళ్ళి, విశ్వనాథుని దర్శనం చేసుకోవటం మొదలుపెట్టింది. మరొక అయిదారు రోజులు పోయాక, సాయంత్రం రాణిభవానీ గోపాలమందిరంలో పురాణం, దశాశ్వమేధఘట్టంలో రామాయణసంకీర్తనం వినటం మొదలెట్టింది. ఇదేదో కొత్తజీవితం. ఇందులో ఇదివరకెప్పుడూ చవిచూడని ఆనందం ఉంది. రాసమణి యీ ఆనందాన్ని యెప్పుడూ ఊహించలేదు. కలకత్తాలోని యింట్లో ఉన్న యిద్దరు ముగ్గురు ప్రాణుల్ని గురించిన ఆలోచన – ఆ యింటి వరకే పరిమితమైపోయింది. ఇంత దూరం రాలేదు.

కాని శ్యామ తొందరపడుతోంది. హేమ అక్కడ ఒకడే ఉన్నాడు. వాడికెవరు వండిపెడుతున్నారో! నరేన్ వచ్చాడో లేదో తెలియదు. వచ్చి హేమ నేమయినా కొట్టాడేమో! ఆ దిగులు ఉండనే ఉంది. ఇంట్లో

రెండు మూడు చెంబులు గిన్నెలూకూడా - బహుశా అతడు అమ్ముకుని తినేసి ఉంటాడు. ఎన్ని అన్నా భర్త కదా! అతణ్ణి చూసి చాలారోజు లయింది. ఆ సంగతికూడా మనస్సులో లేకపోలేదు. ఒకసారి కనుక వచ్చి వెడితే, తర్వాత మళ్లీ చాలా రోజులవరకు రాడు. ఆమె పేదరికపు భావన మధ్య మధ్య విచిత్రకారణాలవల్ల మరింత బలమయింది.

అదీకాక శ్యామ రాసమణి విషయంలోకూడా లోపల్లోపల ఆశాభంగం పొందింది. దాన్ని అంగీకరించటం మానేసీ లాభం లేదు.

నెల్లాళ్లు ఈ సేవ చేసే అవకాశంలో, వెయ్యి యితరసంగతులు మాటల మధ్య - శ్యామ మాటిమాటికీ ఈ విషయం యెత్తేది. రాసమణి చేతిలో సరీగ్గా యెంత ఉంది? ఆమెమీద యెంతవరకు ఆధారపడొచ్చు? రాసమణి సాధారణంగా అబద్ధా లెప్పుడూ చెప్పదు. కాని ప్రతిసారీ, "ఎంతో లేదు. చేతికి అడుగు తాకుతోంది. మహాఅయితే మూడు నాలుగేళ్లు జరుగుతుంది. అంతకంటె యెక్కువ రోజులు బతికితే, ఇంట్లో సామానులు అమ్ముకోవలసిందే" అన్న సమాధానమే వచ్చేది.

అటుత్రిప్పి, యిటుత్రిప్పి యెప్పుడూ అదేమాట వినివిని శ్యామకి మనస్సులో నిరాశ మంచుగడ్డలా పేరుకుపోయింది. రాసమణి అబద్ధాలు చెప్పదని ఆమెకి తెలుసు. డబ్బువిషయంలో ఇన్నాళ్ల తర్వాత అబద్ధం చెప్పిందంటే, అదీ నమ్మతగిందికాదు. యెన్నిసార్లు అడిగినా ఒకే సమాధానం వచ్చినప్పుడు రవంత అనుమానానికైనా అవకాశమెక్కడుంది? కేవలం అబద్ధాలకోర్లుకూడా యింత తరచి తరచి అడిగినప్పుడు, అబద్ధాన్ని అంటిపట్టుకుని ఉండలేరు.

అర్థాత్తూ - ఇంక ఆశ, విశ్వాసం యెక్కడా యేమీలేకుండా పోయాయి. ఏది చెయ్యాలన్నా యింక తానే చేసుకోవాలి. ఈసంశయం కాస్త కాస్తే మనస్సులో పాతుకుపోయింది. ఆమెకింక కాశీనివాసంమీదకూడా అయిష్టత యేర్పడింది. అమె యింటికి తిరిగివెళ్లిపోవటానికి తొందరపడ సాగింది.

సరీగ్గా పదమూడు రోజుల్లోగానే "అమ్మా! తిరిగివెళ్లటం మాట యేమాలోచించావ్?" అని అడిగింది శ్యామ.

రాసమణి గతుక్కుమంది. అప్పుడే తిరిగివెళ్లటమా? ఆమె అసలు తిరిగివెళ్లకుండా ఉంటే బతికిపోతుంది. ఆమె రాఘవకేసి జిజ్ఞాసాదృష్టితో చూసింది.

అప్పుడే వెళ్లటమేమిటి చెల్లెమ్మా! వచ్చి రెండువారా లయింది. అమ్మ ఆరోగ్యం కాస్త కోలుకోనియ్. ఇంతత్వరగా తిరిగివెళ్లిపోతే యింతడబ్బు ఖర్చూ వృథా అవుతుంది. అక్కడికెళ్లాక మళ్లీ పడిపోతుంది. అంతకంటె ఇంకా కొన్నాళ్లు బాదరబందీలన్నీ వదిలేసి -"

తర్వాత కొంచెంసేపు ఆగి, "ఇంకా రెండురోజులు పోతే రాంనగర్ వంకాయ లొస్తాయి. ఒకొక్క వంకాయ యేడెనిమిది శేర్లు తూగుతుందని విన్నాను. ఎంతో రుచిగాకూడా ఉంటుంది. ఇక్కడ శేర్లులెక్కన అమ్ముతారు. శేరు పైసా. ఆవంకాయలు తినకపోతే జీవితమే వృథా. పైగా క్యాబేజీకూడా వస్తుంది. అవన్నీ హాయిగా తినకుండా వెడతామా?" అన్నాడు.

శ్యామ గుచ్చుకునేట్లు చెప్పింది సమాధానం. "మీకేం ఘోషాల్ గారూ! ఇతరుల ఖర్చుమీద కూచుని హాయిగా తింటున్నారు. మీకు వెళ్లబుద్ధి పుడుతుందా? కాని నేను పిల్లల్ని అక్కడ వదిలేసి వచ్చాను. పసివాడు ఒక్కడూ ఉన్నాడు. రెండు నిత్యపూజలు. పైగాచదువు. యేంచేస్తున్నాడో. యేమో! ఏదైనా ఒకవేళ సుస్తీ చేస్తే? చిన్నపిల్లని దగ్గిర పెట్టుకుని అక్క యేం అవస్థపడుతోందో!" రాఘవఘోషాల్ వయసయినవాడు. పైగా వీరిని చాలా కాలంనుంచి ఆశ్రయించుకుని ఉన్నవాడు. అతడు కోపం తెచ్చుకోలేదు. చాలా ప్రశాంతంగానే, "అవునమ్మా శ్యామా! ఇతరుల ఖర్చుమీద వచ్చాను. సుష్ఠుగా తింటున్నాను. ఇలాంటి అవకాశం మళ్లీ వస్తుందా? ఆ ఆశ ఉండనే ఉంది. నీసంగతికూడా అంతే చెల్లెమ్మా. ఇతరులఖర్చు కాకపోతే నువ్వుమాత్రం వచ్చేదానివా? అదీకాక యిదికూడా ఆలోచించాలి. ఎవరి డబ్బో, యెవరికోసం యింతఖర్చో వాళ్లసంగతికూడా ఆలోచించాలి. ఇంకా కొన్నాళ్లయినా ఉండకపోతే, యింత హైరానపడి వచ్చినందువల్ల లాభ మేమిటి చెప్పు?" అన్నాడు.

శ్యామ బుంగమొహం పెట్టుకుంది.

"నీకూతురు బాగానే ఉంది. ఉన్నది ఒక్కకొడుకు. వాడుకూడా చెప్పాలంటే - పేదకుటుంబంలో పుట్టినవాడు. కష్టాలనుభవించాల్సిందే! ఈవయస్సుకుర్రవాడు యేంచెయ్యలేదు చెప్పు. వాడిది కష్టపడి సంపాదించి తినే వయస్సా!" అన్నాడు రాఘవఘోషాల్.

శ్యామ ఆరోజుకి మెదలకుండా ఊరుకున్నా, యెక్కువ రోజులు ఊరుకోలేదు మధ్యమధ్య - "అమ్మా! ఇంటికి వెళ్లటంమాట యేమా లోచించావ్?" అని తొందర పెడుతూనే ఉండేది.

చివరికి రాసమణికి విసుగెత్తింది. అయినా వెళ్లటానికి మనస్కరించ లేదు. చాలారోజులకి కాస్త శాంతి అనేది చూడగలిగింది. నీలసలిలస్వచ్ఛ మయిన గంగ - విశ్వనాథుడు; బాధలన్నీ తీర్చుకునేందుకిదేచోటు! గంగా జలంతోకలిపి కన్నీళ్లు విశ్వనాథుని శిరస్సునపోస్తే నిజంగాప్రాణాలు చల్ల బడతాయి. "ఒకనెల అద్దెయిటూ యిచ్చినప్పుడు మిగిలిన రోజులుకూడా ఉండే వెడదాం. లేకపోతే యెక్కువరోజులకి అద్దె యిచ్చేదాన్నేకాను." అన్నది రాసమణి.

శ్యామ యింక గత్యంతరంలేక, ముఖం చిన్నపుచ్చుకుని ఉండి పోవలసివచ్చింది.

చివరికి శ్యామ కొకరోజున చీకట్లో వెలుగురేఖ కన్పించింది. రాఘవ ఘోషాల్ ఒకరోజున భోజనమయాక, చిలుం తాగుతూ, "నీ చిన్నకూతురికి కాస్త చదువు చెప్పించరాదా శ్యామా? ఎంతవయసు? నాలుగేళ్లా! అయిదేళ్లా? లేక ఆపిల్లనికూడా యిలా చదువురాని మొద్దుగానే వుంచిపెళ్లిచేసి సాగనంపుతావా?" అని అడిగాడు.

"చదువు యెలాచెప్పించేది ఘోషాల్‌గారూ! ఆ అడవిఉళ్లో చదువు మాట యెప్పుడైనా యెవరయినా విన్నారా? కాని ఇంట్లో నాకు వచ్చినంత వరకు చదివించగలను. దానికిమాత్రం తీరిక యెక్కడ చెప్పండి. దరిద్రంతోనే పోరాడనా? ఇదే చెయ్యనా?"

"అదీ నిజమే"

శ్యామ హఠాత్తుగా "ఐంద్రిలను కొన్నాళ్లపాటు ఉమ దగ్గిరే ఉండనీ యమ్మా! అది వాళ్లపిల్లలకీ - వీళ్ల పిల్లలకీ చదువు చెపుతూనే ఉందిగా! తన అక్కకూతురికి కాస్త చదువు చెప్పలేదా?" అన్నది.

రాసమణి చకితురాలయింది.

"ఉమ దగ్గిరా? దానికి టైమెక్కడ? మధ్యాహ్నం పన్నెండింటికి వెడుతుంది. సాయంత్రం ఆరింటికి వస్తుంది"

"అదింకా మంచిదమ్మా ఆ సమయంలో యింట్లో నువ్వొక్కతెవే ఉంటావు. ఏదో చేతికి సాయం. దగ్గిర ఉంటుంది. దానికి వయస్సు తక్కువ నిజమే, కాని పేదయింట్లో పుట్టినపిల్ల - అల్లరి చెయ్యకుండా ఉంటుంది. కనీసం మంకుపట్టు పట్టి యేడుస్తూకూచోదు. నీకు కాస్త చిన్న చిన్న పనులు చేస్తుంది. గారాబంచేసే పరిస్థితి కాదుగా నాది. నా దగ్గిర రెండేళ్లప్పట్నుంచి కష్టపడటం నేర్చుకుంది."

రాసమణి మెదలకుండా ఊరుకుంది. కొత్తగా జంజాటం పెట్టు కోవటం ఆమె కిష్టం లేదు. మళ్లీ ఆలోచించింది. ఉమ నిజంగా ఒంట రిది. ఏదో చిన్నపిల్లంటూ దగ్గిరుంటే, దాంతో కాసేపయినా పొద్దు పోతుంది.

"ఏమంటావమ్మా ?"

"నీకు ప్రతిదానికీ తొందరేనే !" రాసమణి కొంచెం విసుక్కుంది. "ఆలోచిస్తాను. వెళ్లాక ఉమతో చెపుతాను, దాని యిష్టాయిష్టాలుకూడా తెలుసుకోవాలిగా ! బరువు దానిదేగా ! శ్యామ నిశ్చింతురాలయింది. ఉమని ఒప్పించటం అంత కష్టమేమీ కాదు. ఐంద్రిల అందమైన పిల్ల, కడుపున కన్నబిడ్డ. ఎలాగో ఇంకో మూడేళ్లు గడిచిందంటే పెళ్లి చేసి పంపించాలి. దాంతో వీరికీ అపేక్ష యేర్పడుతుంది. వీళ్లమాత్రం వదిలెయ్యగలరా ? పెళ్లి ఖర్చు యెలాగో అలా లాగుతుంది.

మనస్సులో అంచనా వేసుకుంది. ఇంకా యెన్నెన్నో లాభా లుంటాయి. ఇక్కడ ఉండటం ఆమెకింక దుస్సహమయింది. కమల దగ్గిర్నుంచి కొద్దిరోజులక్రితం ఉత్తరం వచ్చింది. అందులో నరేన్ సంగతీ ఉన్నది. శరత్ సంగతికూడా ఉంది. శరత్ ఉమ కోసం రెండు చీరెలు పంపించాడట, బహుశా ఇన్నాళ్లకి ఉమమీదికి మనస్సు లాగి ఉంటుంది. ఒకవేళ అదేకనుక అయితే – ఉమభర్త యింటికి కాపురా నికి వెడుతుంది. ఆమెకి త్వరలోనే బిడ్డలు పుట్టటం మొదలెడతారు. ఐంద్రిలను యెవరు చూస్తారు ? అహఁ. శరత్ దాన్ని తీసుకురానిస్తాడా ? తనకి తెలియకుండానే శంకితురాలయింది శ్యామ. తన దురదృష్టం ! లేక పోతే యిన్నాళ్లు గడిచాక. శరత్ యిప్పుడు....

'అహఁ అహఁ ఛీ ఛీ ! నేనేమిటి ఆలోచిస్తున్నాను' అని ఒక్కసారి గతుక్కుమంది. తన స్వార్థానికి చచ్చేంతసిగ్గు పడింది. ఉమ సుఖ పడాలి ! దానికేమీ కాకూడదు. తన అదృష్టం యెలా రాసిపెట్టి ఉంటే అలా అవుతుంది. అదీ కాక అన్నీ అనుకోగానే అయిపోతాయా ? శరత్ తీసుకెళ్లటానికయినా రెండు మూడు నెలలు పడుతుంది. ఈ లోగా ఉమకి అపేక్ష యేర్పడొచ్చు. అలాగే తల్లికి కూడా.

నరేన్ వచ్చాడు. ఎక్కడికి వెళ్లాడో తెలియదు. మళ్లీ యెప్పుడు వస్తాడో ! శ్యామ కిటికీలోంచి యెంతో దూరంవరకు వ్యాపించి ఉన్న రాం నగర్ మైదానంకేసి చూస్తూ, భర్త సంగతి ఆలోచిస్తూ ఉండిపోయింది.

# 4

శ్యామ ఉమను ఒప్పించటం యెంతతేలిక అనుకుందో - కలకత్తా తిరిగి వచ్చాక ఆమె దగ్గర ఈ ప్రస్తావన తెచ్చినపుడు - అది అంత సులభ కాదని గ్రహించింది. ఉమ మొదట్లో అర్థం చేసుకోలేక పోయింది. శ్యామ ముఖం కేసి వెలవెలపోయి చూస్తూ ఊరుకుంది. రెండోసారి సంగతంతా విడమర్చి చెప్పేసరికి, ఆమె తలెత్తి ఒకసారి తల్లివైపు చూసింది. ఆమె ముఖం భావశూన్యంగా ఉంది. జపమాల చేతిలో త్రిప్పుకుంటూ, శూన్య దృష్టితో కిటికీకేసి చూస్తూ ఊరుకుంది. అంటే - కూతుర్ని యేవిధం గానూ ప్రభావితం చెయ్యటం యిష్టం లేదన్నమాట! తల అటునుంచి యిటు త్రిప్పి, ఒకసారి అక్క ముఖంకేసి చూసింది. తర్వాత తల వంచు కుని మెల్లిగా "నన్ను క్షమించు అక్కా! అది నేను చెయ్యలేను. నా వల్ల కాదు" అన్నది.

ఏమయినా ఉమ యింత స్పష్టంగా చెప్పేస్తుందని శ్యామ అనుకో లేదు. ఆమె కొంచెంసేపు తెల్లబోయి, చెల్లెలికేసి చూస్తూ ఊరుకుంది. "నీవల్ల కాదా? ఏం? యెందుకని? ఉంటే మంచిదేగా...." శ్యామ యేదో తమాయించుకుని మాటకిమాట పొంతన లేకుండా ప్రశ్నించింది.

"నామంచి యేదో నన్నే చూసుకోనీండి. దాన్ని చూడటం యెప్పుడూ యెవరికీ సాధ్యంకాదు."

"అదే, యెందుకని? నీకు వచ్చిన యిబ్బం దేమిటో చెప్పు."

ఇన్నాళ్లూ తాను యెన్నో ఊహలలో నిర్మించుకున్నదంతా పేకమేడలా కూలిపోతుందా? ఆశాభంగంబాధమూలంగా శ్యామ కంఠం తీక్షణంగా విన్పించింది.

ఉమ కొంచెం కఠినంగానే సమాధానం చెప్పబోయినట్టుంది. దానివల్ల లాభమేముంది అని చెప్పబోయిందో, లేక బహుశా నా యిబ్బంది - సబ్బంది సంగతి నేను చూసుకుంటాను. నీకు సంజాయిషీ చెప్పాలా యేం? అని అనాలనుకుందో - కాని ముఖం త్రిప్పుకుని ఊరుకుంది. కాసేపు మెదల కుండా ఊరుకుని, "భగవంతుడు నాకు యేజంజాటాన్ని యివ్వనప్పుడు, అనవసరంగా పరాయివాళ్ల బాధ్యతను నెత్తిన పెట్టుకోవాల్సిన అవసర మేముంది?" అన్నది.

"అది నీకు పరాయిదా?" కమలకూడా యింతదురుసుగా తిరస్క రించినందుకు కొంచెం కోపం తెచ్చుకుంది.

"నా స్వంతబిడ్డయేం కాదక్కా ! ఎంత ఆపేక్షగా చూసుకున్నా ఆమె బిడ్డగానే ఉండిపోతుంది. పైగా దానిమీద నాకు నిజమైన అధికారం యెప్పటికీ రాదు.

"సరే, దాన్ని నువ్వుదత్తత తీసుకో" శ్యామ యెంతో ఆత్రంగా అన్నది.

"దానివల్ల ఈ 'దత్తత' అన్నపదం శాశ్వతంగా ఉండిపోతుంది. ఆమాట వింటేనే అసహ్యం నాకు"

"పాలరుచిని ఊహించుకోవాల్సిన అవసరం లేదు. భగవంతుడు నన్ను సంసారం చెయ్యటానికి పంపలేదు".

ఆమాట అన్నాక, అందరూ కాసేపు మెదలకుండా ఊరుకున్నారు. రానమణి జపమాల త్రిప్పుకుంటూనే ఉంది. ఆమె యేమనుకుంటోందో ముఖంకేసి చూసి తెలుసుకోవటం కష్టం. శ్యామ కొంచెం తన నేర్పరితనాన్ని మార్చింది. "కాస్త చదువు నేర్చుకుంటే మంచిదని, అమ్మ దగ్గిరుంటే మంచి మర్యాద అలవాటవుతాయనీ, చక్కటి పిల్ల, కాస్త చదువుకూడా నేర్చుకుంటే మంచి యింట్లో పడుతుందని.... అంతకంటె యేముంది ?"

కమల యీసారి సరాసరి తల్లిమీద దండెత్తింది. "ఏమంటావ్ అమ్మా ?"...

రానమణి శాంతంగానే "నేనేం చెప్పనమ్మా ? నాకిప్పుడు బరువు బాధ్యతలు పైన పెట్టుకునే శక్తి లేదు. ఇక్కడ ఉంచి వెళ్లు అని గట్టిగా చెప్పటానికి - చేసే వారెవరో వారే తమ సుఖదుఃఖలువులు చూసుకోవాలి. మధ్యలో నేను చెప్పటం బావుండదు ?" అన్నది.

ఇంతలో కమల మనస్సు కాస్త కరిగింది. ఆమె కొంచెం పట్టుపడు తున్నట్టుగా "అమ్మమాట నువ్వుకూడా ఆలోచిస్తే బావుంటుంది ఉమా ! నువ్వు అయిదారు గంటలు బయటే ఉంటావు. ఆసమయంలో యింత పెద్ద యింట్లో అమ్మ ఒక్కతే ఉండాలి. ఆమె ఆరోగ్యం చూస్తే యిలా ఉంది. అయినా యేదో పిల్ల కాస్త దగ్గిరుంటే, తలదగ్గిర విసురుతూనయినా కూచుంటుంది. కాసిని నీళ్లు కావాలన్నా యిస్తుంది" అన్నది.

ఉమ ఒక్కసారి లేచి నుంచుంది "మీకందరికీ యిష్టమయినప్పుడు యింక నాఅభిప్రాయం అడగటం దేనికి ? సరే, ఉండనీయండి. కాని అక్కా ! పరాయిపిల్లల్ని ఆడించాలి, నవ్వించాలి కాని, యేడిపించకూడదని అమ్మే యెపుడూ చెపుతూంటుంది. దండించే అధికారం లేకపోతే, చిన్నపిల్లల్ని ప్రయోజకుల్నిగా చెయ్యలేం" అన్నది.

శ్యామ ఆత్రంగా "నీయిష్టంవచ్చినట్టు దండించు, అదేం మాట! నువ్వుదాన్ని నరికి రెండుముక్కలు చేసినా సరే నేనేమీ అనను" అన్నది.

"అది జరగని మాటలే అక్కా!" ఉమ అలా నిలబడే జవాబు చెప్పింది." అది నీకూ తెలుసు, నాకూ తెలుసు. ఊరికే పైపైమాట లనుకుని లాభమేముంది? నువ్వు యెంతయినా అపేక్షగా చూడు అది యెవరూ జ్ఞాపకం ఉంచుకోరు. కాస్త దండించావంటే ఆచెడ్డపేరు మాత్రం శాశ్వతంగా ఉండిపోతుంది. పరాయిబిడ్డల్ని పెంచి పెద్ద చేస్తే యిదే దక్కే బహుమానం. అమ్మ యెదురుగానే ఉంది. ఇవి అమ్మ చెపితే నేను విన్న మాటలే. కావాలంటే ఆమెనే అడుగు".

ఆమె యింక నుంచోలేదు. ఇంట్లోంచి వెంటనే బయటికి వెళ్లి పోయింది. ఇంత జరిగాక శ్యామ బహుశా పిల్లను తీసుకువెడితేనే బాగుండేదేమో! కాని యిన్నాళ్ల దారిద్ర్యం ఆమెకు నేర్పిన గుణపాఠంలో స్వార్థసిద్ధే కావాలనుకున్నప్పుడు, మొహమాటం ఉండక్కరేదన్నదే ముఖ్యం. ఆమె ఉమ గుచ్చిన పోట్ల నన్నిటినీ మౌనంగా జీర్ణం చేసుకుని, ఇంద్రిలను అక్కడే విడిచిపెట్టి వెళ్లింది.

## 5

నిరంతరదారిద్ర్యంమధ్య శ్యామకి అలా యథాప్రకారంగానే జరిగి పోతున్నాయి రోజులు. అలాగే ప్రతిరోజూ యుద్ధం. రేపటి సంగతి యేమిటన్న ఆలోచనతో, ప్రతిరాత్రీ దిగులుతో ఉగ్గపట్టుకుని గడపటం.

హేమ చదువుకుంటున్నాడు. మామూలుగా పౌరోహిత్యం చేస్తుంటే స్కూల్‌కి ఒకపూట నాగా పడుతుంది. అదీకాక అతడు కుర్రాడు. దశకర్మలకే - అంటే వివాహాలు ఉపనయనాలకి అతణ్ణి పిలవరు. రెండు నిత్యపూజలు, పోతే లక్ష్మీపూజ, ఇవే ఆధారం. షష్ఠీపూజ, మానసా పూజలకి కూడా యిటీవల కొందరు కొందరు పిలుస్తున్నారు. బహుశా రెండు మూడేళ్ల పోతే సరస్వతీపూజకికూడా పిలవొచ్చు. అది యెప్పుడో ముందు జరగబోయే మాట. స్కందపూజ, లక్ష్మీపూజ, మానసాపూజలకి యెవరూ ధోవతు లివ్వరు. షష్ఠీపూజకికూడా అంతే. మహాయిస్తే మూడు మూళ్ల యెర్ర అంగవస్త్రం, నైవేద్యం, బియ్యం, పళ్లు, 'వాతాష్' యివే వచ్చేవి. ఇహపోతే నాలుగు పైసలు - మహాయిస్తే రెండణాలు దక్షిణ. అవీ భాద్రపద, పుష్య, చైత్రమాసాల్లో ఉండవు. లక్ష్మీపూజకూడా నియమంగానే కాక ఆకస్మికంగాకూడా - పిల్లలు పుట్టినప్పుడు చేయిస్తారు. అయితే అలాంటి

వాటికి హేమను పిలవరు. లక్ష్మీపూజ మానసాపూజ సంపన్నుల యిళ్లల్లో యింటుమించు ప్రతి యింట్లోనూ చేయిస్తారు. ఈ రోజుల్లోనే పురోహితులకి తాకిడీ వస్తుంది.

కనుక రోజులతరబడి సాగుతూండే ఉపోషాలు ఆగిపోయాయి. అంతే! అంతకంటె జరిగిందేమీ లేదు. ఉంఛవృత్తి అలాగే సాగుతోంది. అలాగే ఆకు లేరుకోవటం, కాయలు, పళ్లు దొంగిలించటం. పింటేకీ బాహాటంగానే - "అబ్బ! ఆ బాపనావిడ ఊళ్లో నెల్లాళ్లు లేదు, తోటలో నాలుగు పళ్లమొహాలు చూడగాలిగాను మళ్లీ నువ్వు కాశీ వెళ్లే అవసరం లేదా అక్కగారూ?" అని అంటూ ఉంటుంది.

ఈ మాటలన్నీ చెవిని పట్టించుకుంటే సాగదు. నవ్వుతూ, ప్రసన్న ముఖంతోనే, "అదా? యింక ఉండదు" అని వాటినన్నిటినీ పరిహాసంగా తీసుకుని వదిలేస్తూంటుంది.

ఈలోగా శ్యామకి మరొక సంతానం కూడా కలిగింది. ఆసమయంలో నరేన్ తరచు వెంటవెంటనే వస్తూండేవాడు.

మంగళ యేదో నిందించేది. శ్యామ గర్భవతి అని వినగానే మాయమయినవాడు మళ్లీ తిరిగి రాలేదు. అంతేకాదు, సామాన్లవీ అమ్మి అయినా పురిటి ఖర్చు గడుపుకోవచ్చు. కాని ఆ అవకాశం కూడా ఉండనివ్వలేదు. చివరిసారి కెళ్లేప్పుడు - రెండు మూడు దానాలకింద వచ్చిన యిత్తడిసామాన్లు ఉండేవి. వాటిని ఒక్కటి కూడా మిగల్చకుండా యెత్తుకుపోయాడు. కొన్ని పాతసామాన్లు శివపూర్ బజారులో మరమ్మత్తు కిస్తానని చెప్పి ముందు రోజునే ఇంట్లోంచి దాటించాడు. మిగిలిన నగం - అంటే కొత్తవి, శ్యామ స్నానానికి వెళ్లినప్పుడో, హేమ పూజలకి వెళ్లినప్పుడో - యెప్పుడు బయటికి దాటించాడో యెవరూ గమనించలేదు. శ్యామకూడా యిత్తడి సామాన్లు యెత్తుకుపోతాడని ఊహించలేదు. లేకపోతే జాగ్రత్తగా నయినా ఉండేది.

అన్నీపూర్తిగా పోయాయని శ్యామ గ్రహించలేదు. కాని మంగళ యిలాంటి విషయాల్లో ఆరితేరినమనిషి. ఆమె రెప్పపాటులో అంతా ఊహించింది. "శ్యామా! చిల్లులుపడ్డ పాతసామానులకికూడా యెంత దుర్గతిపట్టిందో వెళ్లి చూసుకో. ఒక్కరోజులో గంగాళాలు, బిందెలు తీసుకెళ్లలేడు కనుక మాయమాటలుచెప్పి సగం తరలించాడు. పథకం యెలా ఉందో చూడు. అతడు మనిషికాదు, యముడు. లేకపోతే పూచికపుల్ల నిరవనివాడు యిక్కడినుంచి క్రోసున్నర, రెండుక్రోసులదూరం నీ చిల్లు

సామానులు మరమ్మతు చేయించటానికి బుజాన మోసుకుని నడిచివెడతాడా ! నువ్వూ పిచ్చిదానివి !

ఆమాట నిజమే. ఇప్పుడు శ్యామకూడా అర్థంచేసుకుంది. అప్పుడతడి మాట నమ్మటం వెర్రితనమయింది. నరేన్ కింత మమకారమా ? సంసారంకోసం చిల్లులుపడ్డసామాన్లు మరమ్మతు చేయించటానికని బుజాన వేసుకుని శివపూర్‌బజారుకి వెడతాడా ? కాని ఆరోజున ఈమాట యెత్తినప్పుడు కాస్తకూడా అసంభవ మనిపించలేదు. మాట్లువేసే వాళ్లెప్పుడో వస్తారని వాళ్లకోసం యెదురు చూస్తూకూచుంటావా ! అదీకాక వాళ్లగొంతులు కోసే వెధవలు. శివపూర్‌బజారువెళ్లి బాగుచేయించుకుని వస్తాను. ఇలా వెళ్లి అలా వచ్చేస్తాను ? డబ్బుకూడా యెక్కువ అడగలేదు. "నాలుగు పైసలియ్. మిగిలింది జంధ్యం చూపించి జమవేస్తాను".

"జంధ్యం చూపించి అంటే ?"

"డబ్బులెక్కువ అడగకు బాబూ ! బ్రాహ్మడి దగ్గిర్నుంచి యెక్కువ డబ్బులు తీసుకోకూడదు. ఇచ్చింది తీసుకో. అప్పటికి వినకపోతే జంధ్యం చూపించి శపిస్తానని భయపెడతాను. తర్వాతడబ్బుఅడిగేంత ధైర్యం బజారులో యెవరి కున్నది చెప్పు. హిందువులు జంధ్యాలు తెంచి కోపాన్ని చూపింవారని వింటే, ముసల్మానులు కూడా భయపడతారు.

నరేన్ తన చతురతకు తానే హహహ అని నవ్వాడు. శ్యామ యిప్పటికీ భర్తని విశ్వసిస్తుంది. ఆశ్చర్యం ? విశ్వసించే అక్కడ యిక్కడ వెతికి నాలుగణాల డబ్బులు తెచ్చి యిచ్చింది. పెద్దబిందె లేకపోవటమే పెద్ద యిబ్బందయింది. ఒక్కసారి పెద్దబిందెడు నీళ్లు తెచ్చుకుంటే యింక నిశ్చింత ! చిన్నవాటితో మాటిమాటికీ వెళ్లి నీళ్లుతెచ్చుకోవటం కష్టం. వెళ్లటం రావటం శ్రమ సమానమే, ఒకేసారి చేసే పనిని - మూడుసార్లు చేసేటైం ఆమె కెక్కడుంది ?

సాయంత్రం నరేన్ వట్టిచేతులతో తిరిగివచ్చినప్పుడుకూడా శ్యామ సంశయించలేదు. అతడు తిరిగిరావటం చూసేసరికే మనస్సులోని అనుమానాలన్నీ యెగిరిపోయాయి. "ఏమండీ, నాబిందె యేదీ ? అమ్మేసి వచ్చారా యేం ?" అని ఊరికే అడిగింది.

నరేన్ హహహ అని నవ్వాడు. "దాన్నికూడా అమ్మారా ? అన్నావు కదూ ! చిల్లిపడ్డ యిత్తడిబిందెలు యెవరు కొంటారు చెప్పు. కొంటేమాత్రం యెంతిస్తారు ? అదికాదు. ఇవాళ శివపూర్‌బజారులో 'బారోయారీ' (సార్వజనీనపూజ) ఇవాళ, రేపు యెవరూ కొలిమి వెలిగించరు. ఎల్లుండి

పొద్దునేచేసిపెడతామన్నారు. అది అయిపోగానే వెళ్లి తీసుకొస్తాను" అన్నాడు. శ్యామ సంతృప్తిపడింది.

నిజమే ఈ విరిగిపోయిన బట్టలు, విల్లిపడిన బిందెలు గిన్నెలు యెవరు కొంటారు? వాటి ఖరీదుమాత్రం యెంత? ఒకవేళ అమ్మితే ఇంటికి యెందుకు తిరిగివస్తాడు? అటు నుంచి అటే ఉడాయిస్తాడు.

అందుకని మర్నాడు దొంగతనం సంగతి కాస్తకాస్తే బయట పడ్డప్పుడుకూడా క్రిందటిరోజు జరిగిన దానికి పొత్తు కనపడలేదు శ్యామకి. ఇప్పుడు మంగళ మాటలతో అంతా స్పష్టంగా బయటపడింది.

''ఇప్పుడు పురిటి ఖర్చులే చూసుకుంటావా? బిందే కొంటావా? ఏం చేస్తావో చెయ్యి'' అని తాంబూలం బుగ్గను పెట్టుకుని, మంగళ నిశ్చింతగా వెళ్లిపోయింది.

శ్యామ కింక నిద్రపట్టలేదు. ఎవర్నయినా అడిగినా, చేసినా కాస్త సర్దుబాటుచేస్తారు. మొత్తంఖర్చు అంతా సంతనా చేసుకోటం యెలా?

చివరికి తల్లికే ఉత్తరం రాయాల్సి వచ్చింది. తల్లి ఉత్తరానికి సమాధానంకూడా రాయలేదు. అయిదురూపాయలు మాత్రం పంపించింది. తల్లి చెపితే విని ఉండొచ్చు. ఉమ ఇంకో రెండురూపాయలు చాటుగా పంపించింది.

అహఁ! అక్కడి పరిస్థితి అయినా బాగుండి ఉంటేనా? మనస్సులోనే బాధపడింది శ్యామ.

నాకూ అంతే అయింది. నన్ను దయతలచగలిగిన ఆమెకి ముందుగానే సర్వనాశనం జరిగింది. నాకు యింకా కష్టాలు తెచ్చిపెట్టటానికి భగవంతుడీపని చేసివుంటాడు.

జీవితంలో దిక్కులన్నీ హద్దులు చెరిగిపోయి, నైరాశ్యపు తెరకప్పి వేయబడినప్పుడు, భవిష్యత్తు రేఖ యెటువైపునా లేనప్పుడు, హఠాత్తుగా ఒక వార్తవచ్చి శ్యామ చెవిన పడింది. రాత్రి తెలతెలవారబోతోంది. ఉష స్వర్ణరేఖ ధూమ్రధూసరితమైన తెర అనిశ్చయతను ముక్కలుచేసి, సుదూర వ్యాపితమైన ఉజ్వలమార్గాన్ని సూచిస్తోంది. రెండుసార్లు ఘర్ఘారం తప్పిన అంబికాపద్ స్కూల్‌లోకి వెళ్లే పర్వాన్ని ముగించాడు. అల్లుడు అభయపద్ తన తమ్ముణ్ణి తమ ఆఫీసులోనే చేర్పించాడు అంటే అంబికాపద్ యిప్పుడు ఆఫీసు ఉద్యోగి.

ఇదే మార్గం యెదురుగా విస్తృతమై ఉంది. ఈ మార్గం చివర అభ్యున్నతి. నిశ్చితమైన జీవనయాత్ర.

అంబికాపద్ కచ్చితంగా హేమకంటె నాలుగేళ్లు పెద్ద. అయితే యేం ఇంకా కొద్దినెలల్లో ధర్డ్‌ఫారం దాటేస్తాడు. చదువులో యేం వెనకపడి లేడు. అంబికాపద్ దొరల ఆఫీసులో పని చెయ్యగలిగితే హేమ యెందుకు చెయ్యలేడు. హేమ అతడికంటె తెలివయినవాడు. చురుకుతనం కూడా యెక్కువ.

ఒకరోజున హేమ ద్వారానే శ్యామ అల్లుణ్ణి కబురంపి పిలిపించింది. ఇప్పుడామె అల్లుణ్ణి అంతగా పిలవదు. అల్లుడు వచ్చాడంటే యేదో ఒకటి పట్టుకొస్తూంటాడు. అన్నిరకాల వస్తువులు. ఒకసారి లాంతరు - (ఆఫీసు నుంచి సంగ్రహించినది) ఒక్కొక్కప్పుడు కూరలు. ఎప్పుడైనా కాస్త కిరోసిన్. ఏ వస్తువు తెచ్చినా అన్నీ ఉపయోగపడేవే. ఉపయోగమనే తీసుకువస్తాడు. కాని శ్యామ కేమిటో సిగ్గేస్తుంది. లేమిని తెలుసుకుని అల్లుడు సహాయం చేస్తూంటాడు. అదీ చెయ్యిచాచి తీసుకోవాలి. ఇప్పటికీ ఆమెకి మాత్రం ఆత్మగౌరవ జ్ఞానం ఉంది.

అల్లుడు వచ్చి, వంటింటివసారాలో కాళ్లు కిందికి వేళ్లాడేసుకుని కూచున్నాడు చేతిలో చిన్నమూట. అందులో రెండు కొబ్బరికాయలు. కాస్త అచ్చుబెల్లం - చాలా గట్టిగా ఉంటుంది. (ఇది పెద్దబజారు ప్రాంతంలో దొరుకుతుందట. చెరకుతో చేసిన బెల్లం. అందులో బెల్లంకూడా బావుంటుంది. పూర్తిగా యెండపెట్టిన బెల్లం. శేరు పైసా, రెండు పైసలు) ఒక లావుపాటి తీగె. హేమ నుద్దేశించి ముక్తసరిగా "మీకు బట్టలు-ఆరేసుకోవటం యిబ్బంది అవుతోంది. ఈ తీగె దణ్ణెంలా కట్టుకోవచ్చని తీసుకొచ్చాను. పడుకునే గది కిటికీ చువ్వలనుంచి వంటింటి వసారాస్తంభానికి చక్కగా కట్టుకోవచ్చు" అని చెప్పాడు.

శ్యామ అల్లుణ్ణి కబురంపి పిలిపించింది. కాస్త ఫలారం కూడా యేర్పాటు చేసింది. నాలుగు చంద్రపులి. రెండు అరటిపళ్లు అల్లుడి ముందు పెట్టి, తల మీది చెంగు ముందుకు లాక్కుని, కాస్త యెడంగా కూచుంది. ఇంతపెద్ద అల్లుడితో తలమీద కొంగుతీసేసుకుని మాట్లాడడానికి లేదు. చాలా సిగ్గేస్తుంది.

అల్లుడు రెండు చంద్రపులి, ఒక అరటిపండు తిని, మిగిలినవి ప్రక్కకు జరిపి పెట్టాడు. ఎందుకు జరిపి వెయ్యడు? సగంకంటె అతడెక్కువ తినడు. ఇది లెక్కవేసి ఎక్కువగా పెడుతూండాలి.

విచిత్రమైన మనిషి. ఇప్పటికీ, శ్యామ అల్లుణ్ణి యింకా పూర్తిగా అర్థం చేసుకోలేదు. అంత అందం! ఎప్పుడూ తల దువ్వుకోడు. యెప్పుడూ గడ్డం చేయించుకోడు. ఒంటిమీద అదే జీనుకోటు, వారానికోసారి తానే స్వయంగా ఉతుక్కుంటాడు. పదిమూళ్ల ధోవతి కట్టుకున్నా, మడమల పైకి కుదించికట్టుకుంటాడు. పెళ్లయిన తర్వాత ఒకటి రెండు మాసాలు కొంచెం హూందాగా వచ్చి పోతూండేవాడు. ఆ తర్వాతనుంచి యెప్పుడూ ఒకే రకమైన వేషభాషలు.

అభయపద్ ఫలారం పూర్తిచేసి, రెండుసార్లు దగ్గి, గొంతు సాఫీ చేసుకుని, "నన్ను రమ్మని కబురంపారా అత్తగారూ?" అని అడిగాడు.

తల మీద చెంగు మధ్యలో కొంచెం జారిపోయినా, శ్యామ యివాళ పిల్లల్నెవర్నీ అడ్డం పెట్టుకోకుండా, అల్లుడితో సూటిగా మాట్లాడింది. "చెప్పవచ్చిందేమిటంటే - మన హేమకి యెక్కడా నౌకరీ - చాకరీ దొరకదా? అంబికాపద్‌ని యెక్కడో చేర్పించావని విన్నాను."

అభయపద్ కొంచెంసేపు ఊరుకుని, "అంబికాపద్ యేమైనా కాస్త చదువుకున్నవాడు. అందుకని వాణ్ణి గుమస్తా ఉద్యోగంలో చేర్పించాను. మా కమ్మరి - కూలిపనుల్లో తెలిసిన వారిని, ఆత్మీయుల్ని చేర్పించటం నాకిష్టం లేదు" అన్నాడు.

"కాని బాబూ!...." అని కొంచెం గర్వంగానే చెప్పింది శ్యామ.

"హేమకూడా తక్కువేమీ చదువుకోలేదు. వాడు కొద్ది నెలల్లో థర్డ్‌ఫారం గట్టెక్కి ఫోర్త్ ఫారంలోకి వస్తాడు. ఇదే, మన అక్షయబాబు పెద్ద చదువుకున్నారా యేం? ఒక ఉద్యోగంచేస్తున్నారు. అతడింకా తక్కువచదువుకున్నాడని విన్నాను."

"ఇదివరకంటే ఊరికేనే వచ్చేవి. ఇప్పుడింక కాస్త యింగ్లీషు నేర్చుకోందే తీసుకోటానికి దొరలు యిష్టపడరు. ఇప్పుడు అందరూ ప్యాస్ – గీసూ అయినవాళ్లే చాలామంది. హేమకి యెన్నేళ్లు?"

"ఎన్ని లేకేం? పధ్నాలుగు నడుస్తోంది"

"అదొక పెద్ద చిక్కు. అంత చిన్నవాళ్లను గుమస్తాసీట్‌లో కూచో పెట్టటానికి దొరలు యిష్టపడరు. సరే, చూస్తాను, యెంతవరకు చెయ్య గలనో?"

ఆరోజున అభయపద్ యేమీ ఊరట కల్గించకపోయినా, మూడు వారాలయింతర్వాత ఒక రోజున వచ్చాడు.

దొరల దగ్గిర ఉద్యోగాలేవీ ఖాళీల్లేవు. ఉన్నా అంత చిన్నవాడు. ఆఫీసులో పని అంటే యేమిటోకూడా తెలియదు. అలాంటివాడి కివ్వ తలచుకోలేదు. ఒక ఉద్యోగమయితే రంగుల ఫ్యాక్టరీలో ఉంది. లేబిల్స్ అంటించేపని. జీతం పదిరూపాయలే - ఇవ్వాలనుకుంటే యివ్వగలరు. ఒక సారి చేరగలితే యింకేం కావాలి ? అక్కడ పని కూడా నేర్చుకోవచ్చు. కళ్లు చెవులు తెరుచుకుని ఉండి, ఆఫీసు పని అంటే యేమిటో తెలుసుకో గలిగితే ముందుకి వెళ్లటం కష్టమేమీ కాదు. అక్కడ నాకు పరిచయం ఉన్నవాళ్లు న్నారు. లోపలదూరితే ఒక ఆశ్రయమంటూ యేర్పడుతుంది. ఏమంటారు ?" అన్నాడు.

శ్యామ కొంచెం వ్యథితురాలయింది. తన తమ్ముడి దగ్గిరకొచ్చేసరికి సరియైన మంచి ఆఫీసులో ఉద్యోగం దొరికింది. చదువేమో సమానమే. వయస్సుకి పెద్ద, అంతే ! అందువల్లనే తన కొడుక్కి ఆఫీసు ఉద్యోగం దొరకలేదు. ఇలాంటి విషయాల్లో శ్యామ సహజంగా అందరు స్త్రీలలాగానే యేమీ తెలియనిది. ఆమె యిప్పటికీ 'అతడి తమ్ముడు హేమకంటె ఒక క్లాసు యెక్కువ చదివాడు. అది తెలియచెయ్యటానికే అల్లుడు కావాలని హేమకి ఆఫీసు ఉద్యోగం యిప్పించలేదు' అనుకుంటూ ఉంటుంది.

శ్యామ కాసేపు మెదలకుండా ఊరుకుని,"మంచి ఉద్యోగం వచ్చేంత అదృష్టంతో పుట్టాడా వాడు ?" అన్నది.

"లోకంలో యెంతోమంది అలా వెళ్లి యిలా ఉద్యోగాలు తెచ్చు కుంటున్నారు. మా హేమకి అలా వస్తుందా ? వస్తే నా కడుపున యెందుకు పుట్టేవాడు ?"

అభయపద్‌కి కనుబొమలురెండు ఒకనిమిషంపైకి లేచాయి. అది ఒక్కనిమిషం మాత్రమే. శ్యామకది తెలియనే తెలియదు.

అతడు కొంచెంసేపు ఊరుకుని, "అయితే ఇది వద్దు, పోనీ ఇంకొక టేదయినా ఆలోచించి చూస్తాను" అన్నాడు.

శ్యామ వ్యాకులపడుతూ "వద్దు వద్దు బాబూ ! నువ్వింక వృథా ప్రయత్నం చెయ్యొద్దు - వాడి కాగీత లేదు. చివరికిదికూడా పోతుంది. నువ్విప్పుడేదయితే చూశావో, అందులోనే చేర్పించు" అన్నది.

అభయ్ అవసరానికిమించి మాట్లాడడు. అత్తగారు దురదృష్టం కొద్దీచేసిన ఆక్షేపణలోని యెత్తిపొడుపుని - అతడు గ్రహించాడో లేదో, అతడి ఆచరణలో యెక్కడా వ్యక్తంకాలేదు. ఎవరు అభిమానాన్ని, కోపాన్ని

వ్యక్తంచేసినా విచలితమయ్యే స్వభావాన్ని, భగవంతుడతడికి యివ్వ లేదు. అతడు తన సహజమయిన శాంతకంఠంతోనే "రేపుపొద్దున ఆరున్నరగంటలకు భోజనం చేయించి, అతణ్ణి సిద్ధంగా ఉంచండి. నేను వచ్చి వెంటపెట్టుకుని వెడతాను" అన్నాడు.

"ఆరున్నరకి సిద్ధంగా ఉండాలా ? అయితే మరి వాడి నిత్యపూజలు ?"

"వాటిని అంతకుముందే ముగించుకోవాలి. ఎనిమిదింటికి హాజర వాలి. సరిగ్గా క్రోసున్నరదూరం. మొదటిరోజున కొంచెం ముందుగా వెళ్లకపోతే కుదరదు. ఊరికే అక్కడకి చేరుకోగానే సరిపోదు. పని ప్రారంభించటానికి ముందు దొరగారితో కలుసుకునేట్లు చెయ్యాలి. అదీకాక నాకు ఆఫీసు ఉంది. నిన్న వెళ్లి ఒకగంట సెలవు తీసుకొని వచ్చాను. తొమ్మిదింటిలోపల నేనూ వెళ్లాలి."

అభయపద్ ఇంక నుంచోలేదు.

క్రోసున్నరదూరం రోజూ నడచి వెళ్లిరావటం, యెనిమిదింటికి హాజరవటం మొత్తానికి జీతం పదిరూపాయలు, పధ్నాలుగేళ్లవాడు తనకొడుకు.

శ్యామమనసు ఒకసారి యెలాగో అయింది. మళ్లీ అల్లుణ్ణి పిలిచి అవసరంలేదని చెప్పాలనుకుంది. కాని చెప్పలేకపోయింది. తాను ఒక్కతే యింక యీపోరాటాన్ని సాగించటం సాధ్యంకాదు. మంగళ విని - "ఎంత మంచివార్త శ్యామా ! ఒకసారి ఉద్యోగంలో దూరితే చాలు, యెలాగైనా ఉద్యోగం పరమాన్నం. ఇవాళ పదిరూపాయలు యిరవైరూపాయ లవటం యెన్నాళ్లు ? ఇంక నీ అదృష్టం మొదలయింది. ఇంకెందుకు చూస్తావ్ ? మొదటినెల జీతంరాగానే అయిదణాలకాణి పూజ చేయిస్తానని మొక్కుకో, సిద్ధేశ్వరుడిగుడికి వెళ్లిరా. పోతే మనదేముడి మందిరంలోకూడా కాస్త పూజ చేయించు. చెప్పాలంటే ఆ నిత్యపూజల మూలంగానేగా నీ కొడుక్కి యీ ఉన్నతి ?" అన్నది.

"తప్పకుండా చేయిస్తాను. అందులోంచి ఒకరూపాయితీసి, సత్య నారాయణస్వామి పూజకూడా చేస్తాను. ఎందుకు చెయ్యను ? ఆయన అను గ్రహంవల్లనే...."

ఆరాత్రంతా శ్యామకి నిద్ర రాలేదు. మనస్సులో యెన్నో ఆశలు రేగుతున్నాయి. మళ్లీ భయమూ వేస్తోంది. వాడిగీత - బహుశా యేదీకాదేమో ! హేమకి యే ఉన్నతీ రాదు. ఇప్పటీనుంచీ కలలు కనవలసిన అవసరంలేదని మనస్సుని శాసించేది ? తన రాత !

కాని మనస్సు అదుపాజ్ఞలను లెక్కచెయ్యదు. మనస్సు మళ్లీ తనకి తెలియకుండానే కలలుకనటం మొదలెట్టిందని ఒకసమయంలో గమనించింది. తనకీ యిల్లు యేర్పడుతుంది. స్వంతయిల్లు. భూమి, తోట, చెరువు.... తాను యెవరితిట్లను మూతివిరుపుల్ని సహించదు. తనయింట్లో, తన సంసారంలో తానే సర్వాధికారిణి. కోడలు, మనుమలు, మనుమరాళ్లతో నిండిన సంసారం.

మళ్లీ గతుక్కుమని ఆ ధ్యాస వదలగానే, తన ఊహాప్రవాహానికి తానే సిగ్గుపడింది. ఎక్కడో, యేమిటో! యింకా యే నిశ్చయమూ లేదు. ఇప్పటి నుంచీ అంత ఆశలు పెంచుకోవటం మంచిది కాదు. తన అదృష్టంలో యేం రాసిపెట్టి ఉందో యేం తెలుసు ?

ఆమె రాత్రి అంతా యిలా ఆశా-నిరాశల మధ్య ఊగిసలాడుతూ కూచుని గడిపింది. నాలుగు కొట్టటం విన్పించగానే, ఉలిక్కిపడి కంగారుగా లేచింది. అబ్బాయికి ఆఫీసు టైముకి వంట కావాలి. ఇప్పుడే వండటానికి కూచోవాలి.

# పదిహేడవ పరిచ్ఛేదం

## 1

మహాశ్వేత యెప్పుడూ భర్తని "ఏమండీ మరది పెళ్లి సంగతి యేం చేశారు ?" అని అడుగుతూంటుంది.

అభయపద్ నిద్రమత్తులో పరధ్యానంగా "ఈసారి అవుతుంది" అని సమాధానం చెప్పేవాడు.

"ఈసారి అవుతుందని రోజూ అంటూనే ఉన్నారు. ఎప్పు డవుతుంది ? ఇంచుమించు యేడాదినుంచి ఉద్యోగం చేస్తున్నాడు. ఇంకేం కావాలి ? ఇహ నావల్ల కాదు. చాకిరీ చేసి చేసి యేస్థితికి వచ్చానో చూడండి".

ఎదుటి వారినుంచి సమాధానం రాదు. అభయపద్ యీలోపల గాఢనిద్రలో ఒళ్లు తెలియకుండా పడి ఉంటాడు. మహాశ్వేత విసుగుకి అంతుండదు. కాని యేమిటి ఉపాయం ? పగలు ఒక్కసారి అతడి ముఖం చూసేందుకు ఆస్కారం లేదు. చెప్పాలంటే రాత్రి యింకా చీకటి ఉండగానే ఆఫీసుకి బయలుదేరుతాడు. శీతకాలంలో నిజంగానే యింకా

చీకటి ఉంటుంది. అన్నదమ్ములిద్దరూ ఒక ఆఫీసులోనే పని చేస్తారు. అయితే యేం? అంబికాపద్ ఉద్యోగస్థుడు. అందుకని తొమ్మిదింటికి వెళ్లాలి. అభయపద్ మేస్త్రీ. కనుక యెనిమిదింటికి హాజరవాలి. పైగా అంబికా పద్ కింకా యెంతపొగరని! "ఏదో వినటానికి చెవికి బాగుండదని మేస్త్రీ అనిపిలవటం కాని, దొరలు కూలీ అనే అంటారు. ఖాతాల్లో, రికార్డుల్లో కూలీఅనే రాసి ఉంటుంది" అని అంటూ ఉంటాడు. ఉద్యోగి! పద్దెనిమిది రూపాయలు జీతం తీసుకునే ఉద్యోగస్థుడు. అతడి ఉద్యోగదర్జా చూస్తుంటే మహాశ్వేతకి ఒళ్లు మండి పోతూంటుంది. ఈ ఉద్యోగస్థుడుగారికి రోజూ తెల్లచొక్కా కావాలి. పైన ఉత్తరీయంమడత కావాలి. అతడి జులుం అంతా మహాశ్వేతమీదనే. సోడావేసి తెల్లగా నిగనిగలాడేలా ఉతికిపెట్టాలి. ఒకొక్క రోజున చెయ్యి పైకి యెత్త లేదు. అదీకాక యెంత తిక్కమనిషో చూడరాదూ! ఈ మధ్య 'ఉన్సుని' స్టేషన్నుంచి రైలు పడింది. ఈ క్రోసుం బాతికదూరం నడిచి మరడిలాగా రైలెక్కే వెళ్లొచ్చు. అలా వెళ్లడు. నడిచే వెడతాడు. అదొక మొండితనం. ఆ కానిని పైసలు మిగల్చకపోతే సాగదు. కాని దొరలు దయతలచి, బగ్గీ ఆపి యెక్కించు కెళ్లినరోజున అవి మిగుల్చుకో. లేకపోతే నాలుగు క్రోసుల దూరం సాంరం నడిచి వెళ్లి మళ్లీ తిరిగిరావటం - మహాశ్వేత లోపల్లోపల రుసరుసలాడేది! కాని అభయ పద్ కివన్నీ చెవినిపడవు. అతడు యింకా రాత్రి ఉండగానే బయలుదేరు తాడు! మళ్లీ రాత్రిఅయాక తిరిగివస్తాడు. సెలవనేది ఒక్క ఆదివారమే. కాని ఆరోజునయినా మనిషి దగ్గిరకి రావటముందా? ఎక్కడినుంచో లోకంలో ఉన్న అనవసరమైన పనులన్నీ వెతికి తీసుకొచ్చి చెయ్యటం మొదలెడతాడు. బహుశా యెక్కడైనా అడవిగుట్టలు సాపు చేస్తూండొచ్చు. లేదా యెక్కడైనా విరిగి పడిపోయిన కొమ్మలు, యెండిపోయిన తీగెలు పోగుచేస్తూ ఉండొచ్చు. భూమి త్రవ్వటం, తోటవెయ్యటం పనులు ఉండనే ఉన్నాయి. ఈ మధ్య 'రాజమేస్త్రీ' పని నేర్చుకుని తన యిల్లు తానే స్వంతంగా కట్టుకోవాలన్న ఆలోచన బుర్రలో తొలిచింది. అందుకోసం సెలవు దొరికిందంటే - యెక్కడెక్కడ కొత్త యిళ్లు కడుతున్నారో వెతికి వెతికి, అక్కడికెళ్లి కళ్లప్పగించి చూస్తూ నుంచునిపోతాడు. అలాంటప్పుడు మహాశ్వేత యేం చెపుతుంది?

ఇలా పగటిపూట భర్తతో దగ్గిరకు వెళ్లి స్వేచ్ఛగా మాట్లాడే అధి కారం లేదు. చాటునామాటునా యెక్కడైనా ఒంటరిగా కలుసుకుని చటుక్కున రెండు మాటలు మాట్లాడొచ్చు. కాని యితడలా దొరికే మనిషా?

ఇహపోతే రాత్రివేళే ! ఎంత త్వరగా అయినా బెయ్యనీ అభయపద్ వచ్చి పడుకున్న తర్వాత కనీసం గంటన్నరయినా కానిదే మహాశ్వేతకి విముక్తి కలగదు. అన్నదమ్ము లిద్దరూ యించుమించు ఒకేసారి భోజనానికి కూచుంటారు. అయిదునిమిషాలయింతర్వాత అదే విస్తళ్లలో తినటానికి వచ్చి కూచుంటారు - చిన్నవాళ్లు, చిన్నమరది, ఆడపడుచు. వాళ్లు అటు యిటు కెలుకుతూ కీచులాడుకుంటూ అరగంటసేపు తింటారు. తర్వాత మహాశ్వేత తింటుంది. విస్తళ్లలో మిగిలినదంతా పోగుచేసుకుని తినాలి. అన్నం పారెయ్యటాని కామెకి అనుజ్ఞలేదు. తర్వాత చద్దిఅన్నం తినటం ఉండనే ఉంది. అత్తగారి ఆజ్ఞ ! 'గృహస్థుల యిళ్లల్లో అన్నం కొలతప్రకారం వండుకుంటే కుదరదమ్మా : అతిథులు, అభ్యాగతులు యెప్పుడెవరొస్తారో యేం చెప్పగలం ? మధ్యాహ్నంవేళ ఆకలితో యెవరయినా వచ్చినప్పుడు రెండు ముద్దలు లేకపోతే సిగ్గుపడాల్సిన విషయం. దానివల్ల గృహస్థుల గౌరవం నిలబడదు, లక్ష్మి ఉండదు. మిగిలితే నీళ్లలో వేసి ఉంచొచ్చు, నువ్వూ నేను ఉన్నాంగా !'

బిచ్చగాళ్లు తప్పకుండా వస్తారు. అయితే యీ యింట్లో విచిత్ర మయిన నియమం. గుప్పిటతో బియ్యం తీసుకెళ్లి వేసే రివాజు లేదు. విస్తరి ముందువేసి అన్నం పెట్టాల్సిందే, అది వాళ్లూ తెలుసుకున్నారు.

ఏ రోజునయినా భోజనం అవసరమున్నవాళ్లు సరీగ్గా మధ్యాహ్నం మప్పుడే వస్తారు. అలా యెవరైనా వచ్చిన రోజున బతికిపోయినట్లే; లేక పోతే ఆ మిగిలిపోయిన అన్నం నీళ్లలో వేసి ఉంచుతారు. రాత్రికి అదంతా మహాశ్వేత తినవలసివస్తుంది. మరీ యెక్కువగా ఉన్న రోజున అత్త గారు కూడా తింటుంది. కాని మామూలుగా ఆమె ఒక్కపూట మాత్రమే తింటుంది. అయినా ఓవేళ తింటేమాత్రం యెంత తింటుంది !

పల్లెటూళ్లల్లో వంటలసమయంలో యెవరూ వెనకా ముందు ఆలోచించుకుని గృహస్థుల యిళ్లకి వెళ్లరు. మెల్లాలో అడుగు పెడుతూనే "ఇంకా చారెడు బియ్యం పోసి పొయ్యి మీద పెట్టమ్మా" అని కేకేసి చెపుతారు. పొయ్యిలోకి కట్టెలు, ఎండిపోయిన ఆకులు యింట్లోనే ఉంటాయి. పొయ్యిలకు కొరత ఉండదు. ఎవరికైనా యిబ్బంది పెట్టట మవుతుందేమో అన్నమాట యెవరూ ఆలోచించరు. మహాశ్వేత కదే రక్షణ !

ఏమయినా యెంగిలి విస్తళ్లలోదే కానియ్, చద్ది అన్నమే దొరకనియ్ మహాశ్వేత కిప్పుడు అలవాటయింది. కాస్త ముందుగా తీరిక

దొరుకుతుంది. అందరి భోజనాలూ అయాక, అప్పుడు అత్తగారు 'వా కూ్కడా గుప్పెడు బొరుగులు తెచ్చిపెట్టు మహా!' అని ఆజ్ఞాపిస్తుంది. కాస్త ముందుగా చెప్పదు. మహాశ్వేత తాను అన్నం తినటానికి కూచునేముందే 'అత్తయ్యా మీకు తినటానికేమయినా తెచ్చిపెట్టనా?' అన్ని యెన్నిసార్లో అడిగేది.

"అగు అమ్మా! తినటమో మానటమో యింకా యేమీ తెలియటం లేదు. పాడుపొట్ట! యింత వెయ్యకుండా ఉండటానికీ లేదు. నోట్లో కేమీ పోయేట్లూ లేదు.

కాని రోజూ తింటూనే ఉంటుందామె. సాయంత్రం పూజ, జపం పూర్తి చేసుకుని, వంటింటి వసారాలో కూచుంటుంది. అక్కడనుంచి ఒక్కసారికూడా కదలదు. చేతిలో జపమాల తిరుగుతూనే ఉంటుంది. కాని అమె నోట్లోంచి యిష్టజపమంత్రంకంటె రుచులు, పిండివంటల పేర్లే యెక్కువ విన్పిస్తూంటాయి. తన పుట్టింటివారి స్థితిగతులు చాలా బాగుండేవని, తాను వయస్సులో ఉన్నప్పుడు యెన్నో రుచికరమైన తిను బండారాలు తినేదాన్నని - అ కథలే రోజూ చెపుతూంటుంది. ఈలోగా కుర్రాళ్లు వచ్చి సాయంత్రం దేవుడి ప్రసాదం తెచ్చి యిస్తారు. ఒక్కొక్కటే తింటూ కూచుంటుంది. తిండితోపాటు కబుర్లుకూడా సాగిపోతూనే ఉంటాయి. వాళ్లేమో వాళ్ల అఫీసు కబుర్లు మాట్లాడుకుంటారు. తనకి అవన్నీ తెలిసినా తెలియకపోయినా, శ్రద్ధగా మనసుపెట్టి వింటుంది. అప్పటికీ యింకా అమెకి రాత్రికేమయినా తినాలో లేదో తెలియదు.

మహాశ్వేతకూడా అన్నం తినట మయిపోయాక, చివరి కప్పుడు పురమా యిస్తుంది. అప్పుడు బొరుగులకి ఉప్పు, కారం, నూనె రాయాలి. వాటితో పాటు పప్పులు, పళ్లు కనుక యింట్లో ఉంటే తీసుకొచ్చిపెట్టాలి. లేకపోతే కొబ్బరి తురిమి యివ్వాలి. బొరుగులు యెప్పుడూ ఉండవు. వేయించిపెట్టిన మొత్తం పేలాలలో పెద్దపెద్ద సైజువి విడిగా తీసి, నూనె ఉప్పు కారం రాచి తినొచ్చు. చిన్నవాటిని పిండిచేసి బెల్లం కలుపుకొని తినొచ్చు. అలాగే కలిపి యివ్వాలి. దానికి మహాశ్వేతకి అభ్యంతరంలేదు. కాని కొంచెం ముందుగా చెపితే యేం? అంట్లగిన్నెలన్నీ పెద్ద గదిలో గడమంచెకింద పోగేసి పెట్టాలి. అక్కడినుంచి వచ్చి, కడిగి తుడిచి, మర్నాడు వంటకి కావలసినవన్నీ అమర్చి, బియ్యంకూడా యేరి చెరిగిపెట్టటం పూర్తయాక - అప్పుడు అత్త గారి దగ్గరకు వస్తుంది. అప్పటివరకు అత్తగారింకా అవి తింటూనే ఉంటుంది. ఊరికే తినటమైతే యెంతసేపు పడుతుంది? కబుర్లే యెక్కువ. అవి అన్నీ అమె చిన్ననాటి ముచ్చట్లు. అమె ప్రపంచం శాశ్వతంగా అక్కడే అగిపోయింది.

"కలకత్తా ఉందే మహా! పేరుకే పట్నం. 'శ్యాంపుకూర్' ఉంది చూశావ్? అక్కడి కిప్పటికీ పెద్దపులులు వస్తూంటాయి."

"ఏది? నేనెప్పుడూ అలా వినలేదే!"

"నువ్వెందుకు వినలేదో నాకు తెలియదుగాని, నేను పెద్దదానినయాక అక్కడ రెండు పులుల్ని చంపారు".

"అది చాలాకాలం క్రిందటి మాటండీ!"

"ఎంతకాలం అమ్మాయ్! నేనేం మరీ ఆదికాలంనాటి ముసలిదాన్నా?" కొంచెం కోపంతోనే అన్నది అత్తగారు.

మహాశ్వేత భయంతో మెదలకుండా ఊరుకుంది. ఒకొకరోజున "విలు మహా! గుర్రపుబగ్గీలో వెడదాం. ఆరుక్రోసులు యేడుక్రోసుల దూరానికి ఒకగుర్రపుశాల ఉంటుంది. దాన్నే తపాలాకచేరీ అంటారు. అక్కడ గుర్రాన్ని మార్చుకుని, మళ్లీ కొత్తగుర్రాన్ని కట్టుకుని బయలు దేరుతారు. దాన్ని 'తపాలామార్పిడి' అంటారు. ఈ తపాలాద్వారానే ఉత్తరాలు వస్తూంటాయి, వెడుతూంటాయి. గొప్పవాళ్లందరూ రాజులు మహారాజులుకూడా ఈ తపాలాలుమార్చి దేశవిదేశాలకి పంపుతూంటారు" అని చెప్పేది.

మహాశ్వేత నిద్ర కూరుకువస్తున్న కళ్లని వీలైనంత పెద్దవిగా తెరుచు కుని వింటూంటుంది. ఒకొకరోజున ఆమాటని ఖండిస్తూ "ఆ తపాలా ఇప్పుడు రైళ్లల్లో వెడుతోందని నేను విన్నా నత్తయ్యా!" అనేది.

అత్తగారు గట్టిగా వాదించేది. "నేను మానాన్న చెపుతూంటే యెన్ని సార్లు విన్నా నీసంగతి! అయనేం అబద్ధం చెపుతారా?"

"అది చాలారోజులకిందటి సంగతయి ఉంటుందత్తయ్యా? అందుకని అప్పుడలా వెళ్లేది."

"ఇదిగో మహా! యేం తెలివే నీది? సర్కారువారి నియమాలెందుకు మారుతాయి? అప్పు డొకరకంగా వెళ్లేవి. ఇప్పుడింకోరకంగా వెడతాయా? అలా జరుగుతుందా? ఇలాంటిమాట ఇంకెవ్వరి ముందు మాట్లాడకు, వింటే నవ్విపోతారు."

ఈ సంభాషణ రాత్రి చాలా ప్రొద్దుపోయేదాకా సాగుతూంటుంది. కాని సరీగ్గా యెంత ప్రొద్దుపోయిందీ మహాశ్వేతకి తెలియదు. అయితే అత్త గారు తినటం పూర్తయేసరికి నిశిరాత్రి గుయ్యిమంటూంటుందని మాత్రం తెలుసు. పాతయింట్లో మనుషుల అలికిడి ఉండదు. బహుశా కొందర్ను

మేలుకుని ఉండొచ్చు. వాళ్లఅస్తిత్వాన్ని తెలుసుకునే ఉపాయం యేమీ లేదు. అలికిడి ఉండదు. దీపం ఉండదు - టగర్‌తండ్రి తాగివచ్చి గొడవ చేసే ఒక్క రోజునతప్ప. వాళ్లఅమ్మ యేడుస్తూంటుంది. ఆరోజునమాత్రం వీధి అంతా యెంతో సంచలనంగా ఉంటుంది.

కాని తాగుబోతు అని వినేసరికి మహాశ్వేతకి భయంతో కాళ్లుచేతులూ మొద్దుబారిపోతాయి. ఇక్కడ ఇంతదగ్గిరలో తాగుబోతు చేసే చప్పుళ్లకి గుండె దడదడలాడుతుంది. ఇంతకంటె మిణుగురుపురుగుల మెరుపులతో, కీచురాళ్లరొదతో ఉండే చీకటిరాత్రే ఆమె మనస్సుకి మేలనిపిస్తుంది.

అత్తగారు నమలటమయాక అన్నీ సర్ది, వంటింటి తలుపు తాళంవేసి. మహాశ్వేత నియమానుసారంగా అత్తగారు పడుకునేగదిలోకి వెళ్లికూచో వాలి. అత్తగారు ప్రమిదదీపం వెలుగులో తడుముకుంటూ, తాంబూలం చుట్టుకుంటుంది. తర్వాత పిల్లలు యెలాయెలా పడుకున్నారోచూసి, వాళ్లని సర్ది పడుకుంటుంది. అప్పుడిహ కోడలివైపు తిరిగి, ఆదరంగా "వెళ్లమ్మా! నువ్వెళ్లి పడుకో. ఇంకా ప్రొద్దుపోవటం దేనికి? చిన్నపిల్లవి నిద్రతో తూలిపడిపోతున్నావు. నాకిక్కడ యింకా అవసరమేమీ ఉండదు" అంటుంది.

మహాశ్వేత కప్పటికి సెలవు దొరుకుతుంది. కాని అప్పటికి అభయ పద్ మరోరాజ్యంలోకి వెళ్లిపోతాడు. అతణ్ణి అంతతప్పు పట్టటానికి లేదు. అతడు తెల్లవారుఝామున పక్కమీదినుంచి లేస్తాడు. ఇంకయేకంగా రాత్రే వచ్చి పడుకుంటాడు. ఈలోపున విశ్రాంతి అనేమాట అతడికి తెలియదు. పడుకోటంమాట దేముడెరుగు - కూచోనుకూడా కూచోలేడు.

మహాశ్వేతకి యీ సమయంలో రోజూ కోపం వస్తుంది.

ఒకొకరోజున దుఃఖంతో యేడుపు వస్తుంది. అత్తగారిని లోపల్లోపల తిట్టుకుంటుంది. "రాక్షసి, దయ్యం మెక్కటం మాత్రం మెక్కుతుంది. ఆ మెక్కటం కాస్త పెందరాళే మెక్కరాదు?" దభీమని భడాల్న తలుపు మూస్తుంది. ఆగదిలోంచి అత్తగారు రోజూ వింటూంటుంది. "మెల్లిగాఅమ్మా! మెల్లిగా వెయ్యి. భయమేసిందా? అంతగట్టిగా వేస్తే వెక్కలు యెన్నాళ్లు ఆగుతాయి?" అంటుందాగదిలోంచే. మర్నాడు ప్రొద్దున కింక ఆమె మనస్సులో యేమీ ఉండదు. మహాశ్వేతకూడా అంతభయపడదు. దబదబ చప్పుడు చేస్తూ నడుస్తుంది. అకారణంగా పెట్టెలు దబదబకొట్టి చప్పుడుచేస్తుంది. అప్పటికీ అభయపద్‌కి మెలకువ రాకపోతే, పక్కమీదికి వచ్చి కాళ్లు గట్టిగా ఒత్తుతూ కూచుంటుంది.

అప్పటి కతడికి కాస్త చైతన్యం వస్తుంది. "ఎవరు ? ఎవరు ? మహా ? రా, రా, వచ్చిపడుకో, మళ్లీ నాకు కాళ్లు ఒత్తఖ్కర్లేదు, చాలా రాత్రి అయింది."

ఈ కాస్త చైతన్యస్థితిని అవకాశంగా తీసుకుని మహాశ్వేత రెండు మూడు మాటలు మాట్లాడగలుగుతుంది - బొత్తిగా ఊరుకుని ఉండలేకే. కాని కాస్సేపట్లో తన తెలివితక్కువని తానే తెలుసుకుని మెదలకుండా ఊరుకుంటుంది. బాగా కోపం వచ్చినరోజున అభయ్‌ని బుజంమీద పొడిచి "భలే మనుషులండీ! మీరు పడుకున్నారంటే పలకటమంటూ ఉండదు. ఇంతకంటె బండరాయితో కాపురం చెయ్యటం మేలు" అంటుంది.

అప్పుడు అభయపద్ బహుశా ఆమెకేసి ఓరగా చూడొచ్చు, ఒకటి రెండు మాటలు మాట్లాడొచ్చు. కాస్త అపేక్ష చూపించొచ్చు. ఆ రోజున ఆమె చెప్పదలచుకున్నదేదో చెప్పవచ్చు. దానికి ముక్తసరిగా సమాధానాలూ పొందవచ్చు. కాని అది దైవికం. ఎక్కువ రోజులు తన అదృష్టాన్ని తిట్టుకుంటూ, పక్కమీద పడుకునివుండే తనలో తాను పశ్చాత్తాప పడుతుంది. తాను పడుతున్నదీ రోజంతా తక్కువ శ్రమ యేమీ కాదు. అయినా తనకంత తేలిగ్గా నిద్ర రాదు. మనస్సులోని అభిమానం, ఆకాంక్ష, రోషం, క్షోభ అన్నీ వ్యర్థమయిపోతున్నాయన్న వేదన - ఆమెని ఉత్తేజితురాల్నీ, ఉద్భ్రాంతురాల్నీ చేస్తూంటుంది. అర్ధరాత్రి స్తబ్దతలో గాలి ఆడకుండా ఉన్నప్పుడు, వెదురుతోపులో పండిన వెదుళ్లు ఒరుసుకున్న ధ్వనికి భయంతో వణికిపోతూ భర్తను కావలించుకుని, అతడి గుండెల్లో ముఖం దాచుకుంటుంది. అప్పుడింక చూస్తూ చూస్తూండగానే ఆమె కళ్లలోకి నిద్రమత్తు వచ్చేస్తుంది. భర్త శరీరస్పర్శతో, వాసనతో ఆమె వేదన అభిమానమంతా తుడుచుకుపోయి, ఆశ - ఆశ్వాసాలతో, ఆమె నవ వయస్సు ప్రాణకుసుమం యేదో కొత్తగా సంజీవిత మయినట్లుంటుంది.

## 2

ఇలాంటి ఒక దుర్లభమైన క్షణంలో, అభయపద్ పూర్తిగా సచేతనంగా ఉన్న సమయంలో, మహాశ్వేత ప్రశ్నకి "ఉండు, ఇంకొక గది కడతాను. లేకపోతే అబ్బాయి యెక్కడ పడుకుంటాడు ?" అని బదులు చెప్పాడు.

అభయపద్ తమ్ముణ్ణి యిప్పటికీ అప్పుడప్పుడు అబ్బాయ్' అని పిలుస్తూంటాడు.

మహాశ్వేతలోని ఉత్సాహదీపశిఖ ఒక్కసారి ఉఫ్‌మని ఆరిపోయి నట్లయింది. "గది కట్టిస్తారా?' అయితే మరిదికి మరి పెళ్లి చెయ్యరూ? దాని కింకా ఆలస్యం ఉంది."

"అహఁ ఇంక ఆలస్యం లేదు. చూడు, త్వరలోనే మొదలెడతాను. అబ్బాయి జీతండబ్బు నేను ముట్టుకోలేదు. అది వాడిదగ్గిర నిల్వఅయి ఉంది. దాంతోనే గది కడతాను."

మహాశ్వేతకి తన భర్తమీద అపారమైన విశ్వాసం. అయినా ఆమె కొంచెం ఆశాభంగం పొంది, తనలో తానే దానికింకా ఆలస్యముంది అనుకున్నది.

కాని అభయ్ నిజంగానే కొన్నినెలల్లో పని మొదలుపెట్టాడు. అతడు చేసే పనులన్నీ విచిత్రమే. సహజంగా యెవరయినా మేస్త్రీని పిలుస్తారు. ఇల్లు కట్టటానికి కావలసిన సామగ్రి అంతా సమకూర్చుకుంటారు. అభయ్ పద్ ఆ పద్ధతి అనుసరించలేదు. జనాన్ని - అదే కూలీలను పునాదులు తవ్వటానికి, ఇటిక, సున్నం దట్టించటానికి కొద్దిరోజులు మాత్రమే పెట్టాడు. అదికూడా వాళ్లతోకలిసి తానుకూడా పని చెయ్యొచ్చునని ఆదివారాల్లోనే చేయించేవాడు. తర్వాత యిహ పని అంతా పూర్తిగా తానొక్కడే చేశాడు. ఆఫీసునుంచి రాగానే నాలుగుమూళ్లపంచె ఒకటి కట్టుకుని, గోడ కట్టటం మొదలెట్టేవాడు. ఇసుక, సున్నం, ఇటికముక్కలు అన్నీ తానే కలిపి పెట్టేవాడు. ఇటికెలుకూడా ముందు తెచ్చిపెట్టుకుని, కలిపిన సున్నం తెచ్చి, చేతిదగ్గిర పెట్టుకునేవాడు. తర్వాత యిహ కట్టటంపనిలో మునిగేవాడు. తెచ్చిపెట్టుకున్న సున్నం అయిపోగానే, అంబికాపద్ ఖాళీఅయిన బేసిన్ తీసుకెళ్లి, మళ్లీ తీసుకొచ్చి పెట్టేవాడు.

మొదట్లో మహాశ్వేతకి నవ్వొచ్చింది. అతడి కేమయినా పిచ్చా? నిజానికి అతడికి చాలా పనులు చేతవును. కాని అలా అని మేస్త్రీలాగా యిల్లు కడతారా?

"ఏమిటండీ మీరు? అనవసరంగా డబ్బు తగలేస్తున్నారు" అని ఆమె నవ్వింది. తర్వాత కాస్త కాస్తే గోడలు పైకి లేచాయి - మామూలుగా అన్నియిళ్లకీ లేచినట్లు. ఆశ్చర్యంతో కళ్లు యింతింత చేసుకుని చూసింది.

ఒకరోజున పనిసందు చూసుకుని దగ్గిరకెళ్లి, మెల్లిగా "ఏమండీ సరీగ్గా అచ్చం గోడలాగానే కన్పిస్తోందండీ" అన్నది.

కాసేపు ఆగి మోచేత్తో ముఖంమీద పోసిన చెమట తుడుచుకుని ముసిముసినవ్వు నవ్వి "మరి యేమనుకున్నావ్? ఇటికెలతో కట్టింది వెదుళ్లతో కట్టిన తడికెలాగా ఉంటుం దనుకున్నావా ?" అన్నాడు.

మహాశ్వేత తెల్లబోయి, "అహఁ అందుకే అంటున్నాను" అన్నది.

ఆఫీసునుంచి చాటుగా తెచ్చిన తాపీలూ అవీ - పనిముట్లన్నిటితో సునాయాసంగా పని చేస్తున్నాడు. మహాశ్వేత అతడికేసి తెల్లబోయి చూస్తూ నిలబడిపోయింది.

వెనకనుంచి అతడు బరువైన సామాన్లు యెత్తి అటుయిటు సర్దుతున్నప్పుడు - నున్నటి వీపుమీద కండరాలు ఉబ్బటం తగ్గటం మేలి ముసుగు చాటునుంచి గమనించేది. అందమైన ముఖంమీద చెమట బిందువులుకూడా యెంతో బాగుండేవి.

'అహఁ అతడు చూడటానికి అందంగా ఉంటాడనటంలో సందేహం లేదు' అని మహాశ్వేత తనలో తాను అంగీకరించింది. మధ్యమధ్య ఆ గడ్డం లేకపోతే యింకా యెంతో అందంగా ఉండేవా డనుకునేది. మళ్లీ ఒకొక్కప్పుడు ఆ తెల్లటిరంగుమీద నల్లటి గడ్డంకూడా బాగానే ఉందనిపించేది.

నిద్రపోతున్న భర్త వీపుమీద చెయ్యేసి, "ఏమండీ కాళ్లు చేతులు కాస్త ఒత్తనా? అంతకష్టపడి పనిచేస్తున్నప్పుడు ఒళ్లు నొప్పులుండటం సహజంగా!" అనేది.

నిద్రమత్తు కంఠస్వరంతో "వద్దు వద్దు. నువ్వింక యింత రాత్రివేళ ఒళ్లు ఒత్తుతూ కూచోనక్కర్లేదు. నువ్వెళ్లి పడుకో" అనేవాడు.

కొంత సిగ్గుతో, కొంచెం భయంతో వెనకనుంచి మెల్లిగా కావలించుకుని పడుకునేది.

"ఆయన ముందు నేనెంత ?"

చివరలో కొద్దిరోజులు మేస్త్రీని పిలవటం జరిగింది. ఇద్దరు కూలీలను కూడా పెట్టాడు. గది నిజంగా ఒకరోజున పూర్తి అయింది. ఇరుగు పొరుగువాళ్లు - "ఎలాగయినా యింక వారి అదృష్టం తిరిగింది. ఏమయినా అనండి కోడలు రావటంతో అదృష్టం వచ్చింది' అని చెప్పుకునేవాళ్లు.

ఆ మాటవిని మహాశ్వేత సంతోషంతో ఉబ్బిపోయేది.

ఇంటికి సున్నాలవీ వెయ్యటం పూర్తి అయినరోజున మహాశ్వేతవ అటు చూసి యిటు చూసి, ఒక్కసారి భర్త పాదాలకి నమస్కరించింది.

"ఇదేమిటి మళ్లీ ?"

"కాదండీ, మీరెలాగయినా సమర్థులు"

కోపంకూడా తక్కువేమీకాదు. అత్తగారు తనంతట తానే "ఇంత కష్టపడి గది కట్టావ్, అందులో నువ్వుండు. అంబిక ప్రస్తుతం యీ చిన్న గదిలోనే పడుకుంటూ వుంటాడు" అన్నది.

అతడు ఉదారభావంతో "అహఁహఁ. నాకిక్కడ బావుంది. అంబికనే అక్కడ పడుకోమను. నా కవసరం లేదు" అన్నాడు.

"ఏం ? ఎందుకని బాబూ ? ఇంత ఆధిక్యత చూపించటం ? నువ్వేం సన్యాసివి కావుగా ! నువ్వే పెద్దవాడివి. ముందు రావల్సింది నీకే."

చెరువురేవులోకి పాత్రలు తోముకోటానికి వెళ్లి, ఏకాంతంగా బహుశా చెరువులోని చేపలతో చెప్పుకుంటుం దనిపిస్తుంది. ఇన్నాళ్ల నుంచి జీతం తెచ్చి అత్తగారి కిస్తూండేవారు. కొన్ని నెలలనుంచి ఆప్యాయంగా తమ్ముడి చేతికిస్తున్నారు. "నువ్వే సంసారాన్ని నడిపించు. ఇహ ఆ జంజాటమంతా నేను పెట్టుకోలేను. నువ్వుకూడా నేర్చుకోవటం అవసరం. అమ్మ యింక యెన్నాళ్లని యీ బరువంతా మోస్తుంది" అన్నారు.

"ఏం ? అత్తగారి తర్వాత యింటికి యజమానురాల్ని నేనేగా ! నా. కివ్వరాదూ?"

ఒకరోజున నోరు తెరిచి చటుక్కున అడిగేసింది. దానికి ఠపీమని సమాధానం వచ్చింది. "ఆఁ. ఇహ అయితే అయినట్లే. చిన్నదానివి ఒకటి, దానికితోడు చదువురాని దానివి. నువ్వు లెఖ్ఖ అదీ సరిగ్గా చూడగలవా !"

ఆ మాటంటే ఒళ్లు మండకుండా ఉంటుందా ? వాళ్ల అమ్మ యేం చదువుకున్నారు ! ఆమె యిన్నాళ్లనుంచి సంసారం యెలా నడుపుకొస్తున్నారు !

కాని కోపం తెచ్చుకోటం వృథా ! అవసరమైన సంగతులే వినిపించ టానికే టైంలేని వారికి, తగవులాడేంత తీరిక యెక్కడుంటుంది ! పైగా యిలాంటిమాటలు మాట్లాడితే, నోటికి తాళం వేసుకుంటారు. ఇహ తల పగలకొట్టుకున్నా నోరు తెరిపించలేం, ఎక్కడో రాతిమనిషి ! మహాశ్వేతకి మనస్సులో మంట మండిపోతోంది. ఏమయినా గదికేసి సరిగ్గా చూడలేక పోయింది.

## 3

అంబికాపద్ వివాహం దూరపు చుట్టరికంకల మేనకోడలితో నిశ్చయ మైంది. చుట్టరికం ఉన్నా, ఇంతదూరం. అది పెళ్లికి అడ్డు కాలేదు. అది యీ రోజుల్లో అడ్డు కాదు, అప్పుడూ అడ్డు కాలేదు.

పదకొండు పన్నెండేళ్ల బొద్దుగా ఉండే పిల్ల. పేరు ప్రమీల. నూట ఒక్కరూపాయల రొఖ్ఖం, లాంఛనాల సామగ్రి, పట్టుబట్టలు వచ్చాయి కుర్ర వాడికి. "ఉలూఖడ్"లో దిగి, క్రోసున్నరదూరం వెడితే, అక్కడ వారిల్లు. అంబిక చాటుగా చాలా విసుక్కున్నాడు, "బాగా అయింది. అయింది బాబూ! అత్తారింటి కెళ్లాలంటే చద్దిమూట కట్టుకుని వెళ్లాలి. మోకాళ్లపైకి పంచె యెగ కట్టుకుని, కర్ర పట్టుకుని మూడు క్రోసుల దూరం నడిస్తే - అప్పుడు అత్తా రింటికి చేరుకోవటం. అన్నయ్య కసలు బుద్ధి-శుద్ధి యేమయినా ఉంటేగా?"

ఇంచుమించు మహాశ్వేత యీడుదేకాని, ప్రమీ - ఆమెకంటె బాగా ధైర్యంకలది. చాలా చిన్నప్పుడే యిక్కడికి రావటంవల్ల కానీ - సహజంగా భయపడే స్వభావంకలదవటంవల్ల కానీ - మహాశ్వేత యిప్పటికీ అత్త గారి యెదుట ధైర్యంగా అన్నీ మాట్లాడలేదు. ప్రమీల చాలా సునాయా సంగా మాట్లాడేస్తుంది. కొంచెం దుస్సాహసంకూడా ఉంది. పెళ్లి కూతురుగా వచ్చినది ఒకరోజున చెట్టెక్కింది. ఈత కొట్టటంలో చాలా ఆరితేరినది. తోటికోడలి చేతకానితనానికి తెగ నవ్వేది. "అవును అక్కా! నీకు యీతకొట్టటం రాదా? రా, నీకు నేను నేర్పుతాను, ఏం భయంలేదు. ఇలా తలపైకి యెత్తు, ఇలా చూడు, తేలావుగా! ఇప్పుడింక రొమ్ము ఆనించి, కాళ్లు చేతులు చాచు, భయమెందుకు? నేనున్నానుగా!"

కాని మహాశ్వేత భయంతో యేడుపొచ్చి "వద్దు చెల్లీ! అహఁ నా వల్ల కాదు. వద్దువద్దు, నీకాళ్లు పట్టుకుంటాను. నాకు - నాకు చెడ్డభయ మేస్తోంది" అన్నది.

ప్రమీల నవ్వి, నీళ్లు చేత్తో ఆమెముఖంమీదికి చిందకొట్టి, "నువ్వు ముట్టుకుంటే ముడుచుకుపోయేరకం. ఇవాల్టికి చాల్లే. కొత్త, మొదటి రోజు కదా! కాని యీతనేర్పి కాని నిన్ను విడిచిపెట్టను, చూస్తూ ఉండు" అన్నది.

పెళ్లియింటి హడావిడి, సందడి పూర్తిగా తగ్గిపోయిన తర్వాత ప్రమీల యీ యింట్లో జీవితసరళి చూసి తెల్లబోయింది.

"అక్కా! రోజూ రెండుపూటలా యీ 'పూతిక' గడ్డేనా? అమ్మో! వాళ్లు కూరలవీ యేం తినరా? చేపలేవీ?"

"అయితే యిహ అయినట్లే. చేపలా? కాస్త కూర దొరికితేనే బతికి పోతాం. ఈ యింటితీరే యిది, కూర యేదయినా ఉంటే అది మగాళ్ల విస్తట్లో పడుతుంది. మనకి మొండిచెయ్యే. చూడుచూడు, ఇప్పుడేగా మొదలు. ఇంకా కొన్నాళ్లు పోతే నీకే తెలుస్తుంది."

మహాశ్వేత ఆరిందాలా తలతిప్పుతూ చెప్పింది.

"ఏమిటి తెలిసేది? వీటితో ఎందుకు తినాలి. రేపట్నుంచి చూడు ఏం చేస్తానో!"

మర్నాడు ప్రమీల స్నానానికి చెరువులో దిగి, "అక్కా: ఈ తువాలు అంచులు సరీగ్గా పట్టుకో" అన్నది.

"ఎందుకు చెల్లీ?" మహాశ్వేత తెల్లబోయింది.

"చేపలు పడతాను. చూడు యెన్ని చేపలు యెలా యెగురుతూ దుముకుతున్నాయో."

"అమ్మో! తువాలుతో చేపలు పడతావా? ఛీఛీ, అలా యెక్కడ యినా వీలవుతుందా యేం?"

"పడతానో లేదో నువ్వు చూడరాదూ? నాలుగైదు చేపలయినా పడతాను తప్పకుండా. వాళ్లు తినటం అయిపోయింది. ఇహ నువ్వు నేనూ మిగిలాం. నాలుగయిదు చేపల్ని పట్టుకుంటే, 'చచ్చడీ' చేస్తాను, లేక పోతే తినకుండా చచ్చిపోతామా యేం? నీలాగా వేళ్లు నాకుతూ తినటం నా వల్ల కాదు."

కొద్దిసార్లు ప్రయత్నంచేసి, ప్రమీలనిజంగానే గుప్పెడు చేపలు పట్టింది. చేపల్ని పచ్చి ఆకుల్లో చుట్టి, ఇటికలు బరువు పెట్టి నిశ్చింతగా స్నానం చెయ్యటం మొదలెట్టింది. ఆమె స్నానంకూడా తక్కువసేపు యేమీకాదు. కనీ సం గంటసేపు యీ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకి, ఆ ఒడ్డునుంచి యీ ఒడ్డుకి యీతలు కొడుతూ తిరిగింది. మహాశ్వేత ఆమె దుస్సాహసాన్ని కళ్లప్పగించి చూస్తూ నుంచుండిపోయింది. లోపల్లోపల మాత్రం భయంతో బిక్కచచ్చిపోయింది.

"చేపలు చట్టితో పొయ్యిమీద పెడతావా? అత్తగారేమయినా అనరూ?"

"ఏమంటారు? అంటే అది నేను చూసుకుంటాను."

ప్రమీల యింటికి రాగానే సరాసరి అత్తగారి దగ్గిరకు వెళ్లి "ఇవాళ కాసిని చేపలు దొరికాయి అత్తగారూ! తువాలుతో పట్టాను. వాటిని వం డటం గిండటం హంగామా చెయ్యకుండా గిన్నెడు 'చచ్చడీ' చేస్తాను" అన్నది.

అత్తగారు తప్పనిసరి అయి "అలాగేనమ్మా !" అన్నది. "ఏం చేపలు 'మౌరలా'? (ఒకరకమైన చేపలు) యెన్ని చేపలు? వీలయితే ఒకటి రెండు బూడీకి దుర్గకి అట్టేపెట్టు. రాత్రి అన్నంలో తింటారు."

చేపల్ని కడిగి చట్టిలో వేసి పొయ్యిమీద పెడుతూ "ఈసారి మళ్లీ యిక్కడకి వచ్చేప్పుడు, గాలం, వంకి, దారాలు పట్టుకొస్తాను. ఇంక చేపలకి కరువుండదు" అన్నది.

"అమ్మో ! ఆడపిల్లవై ఉండి, గాలంతో చేపలు పడతావా ? లోకు లేమయినా అనరూ ?"

"ఏమంటారు ? యే చట్టం ప్రకారం అంటారు ? అదీకాక మిట్ట మధ్యాహ్నమప్పుడు పడతాను. ఎవరికీ తెలియదు. గాలం ఉంటేగా తెలిసేది ? కొన్నిమూరల కాస్త లావు దారాలు వారికి కనిపిస్తేగా !"

కొన్ని నెలలు పోయినతర్వాత, ప్రమీల మళ్లీ యిక్కడికి కాపురానికి వచ్చేప్పుడు కొన్ని గాలం కొక్కేలు, దారాలు తీసుకుని వచ్చింది.

మహాశ్వేత బతికిపోయింది. అన్నిరోజులూ చేపలు పట్టేందుకు తీరిక ఉండదు. కాని ప్రమీలకింకా చాలా చేతవును. చిన్న సీసానిండా 'గుగ్‌లీ' (జలచరాల్లో ఒకరకం). నెత్తిన సూదిగుచ్చి కాస్త కాస్తే మాంసం తీసి, ఆకులో పెట్టి, తర్వాత చాటుగా ఉల్లిపాయలు తరిగివేసి పొయ్యిమీద పెట్టేది. మహాశ్వేతకి మొదట్లో యివన్నీ చూస్తే అసహ్యం వేసేది. కాని ప్రమీల బలవంతంమూలంగా తినక తప్పలేదు. క్రమంగా సంయించిందికూడా. వుల్లిపాయ యిదివరకు ఇంట్లోకే రానిచ్చేవారే కాదు. అదికూడా ప్రమీల భర్తతో తగవులాడటం మూలంగా తీసుకురావటం జరుగుతోంది. అదీకాక యిప్పుడు మామూలుగా వేసే వాటిలో కాస్త కూరకూడ వేస్తోంది. లేకపోతే ప్రమీల 'అన్ని కూరపాదులున్నాయి యెందుకండీ ? మేం కోడళ్లమేగా ! ఒట్టిఅన్నమే తింటాం' అంటుంది.

అత్తగారు కంగారుపడి 'అదేమిటమ్మా రేపటినుంచి కూర కాస్త యెక్కువ తరుగుతూ వుండు మహా ! నీది మరీ పిసినారితనం !' అనేది.

ప్రమీల దగ్గిర మరొక పాఠంకూడా నేర్చుకుంది. ఆమెకీ విషయమై యింతవరకు తెలియనే తెలియదు.

ఒకరోజున చెరువుకి వెళ్లినప్పుడు, ప్రమీల హఠాత్తుగా మహాశ్వేత మెడకి రెండుచేతులు లేసి కావిలించుకుని, "నీ దగ్గిర రెండు రూపాయలుంటే ఇయ్యి అక్కా : ఈ 'రాసూ' తిర్నాళ్లలో ఒకటి కొనాలి" అన్నది.

మహాశ్వేతకి ఆకాశం మీదనుంచి పడ్డట్లయింది. "నాకు డబ్బు ఎక్కణ్ణుంచి వస్తుంది ?"

"నటన ! ఆడవాళ్లకి డబ్బువెక్కడినుంచివస్తుందో తెలియదా ? బాల్లే"

ఈసారి తెలుసుకుంది మహాశ్వేత "ఆః. అలాంటి వారో మీ బావ గారు ? వచ్చిన జీతమంతా నీ భర్త చేతికే యిస్తూంటారు. తెలియదా నీకు ?"

"అది సంసారం గడిపేందుకిచ్చే డబ్బు. అలా అని నాలుగు పైసలు కూడా నీ చేతికిస్తూ వుండరా ?"

"ఒక్కపైసాకూడా యివ్వరు."

"అబద్ధం"

"నీమీద ఒట్టేసి చెపుతున్నా చెల్లీ; ఏ ఒట్టు వెయ్యమంటే ఆ ఒట్టు వేసి చెపుతాను."

ప్రమీల కిలకిల నవ్వింది. నవ్వి నవ్వి ఆమె కళ్లవెంట నీళ్లు వచ్చాయి. "నువ్వు ఉత్త అమాయకురాలివి అక్కా. నిన్ను చూస్తే జాలేస్తుంది"

"ఇవ్వకపోతే నేనేం చెయ్యను చెప్పు చెల్లీ ?"

"వెర్రిదానా ! ఊరికే యిస్తారా యెవరయినా ? వసూలు చెయ్యాలి. పోట్లాడాలి. కోపం తెచ్చుకోవాలి. మధ్యమధ్య నాలుగు పైసలు రాబట్టకపోతే నీ చేతిలో యేముంటుంది ? మనిషి జన్మ యెత్తాం. ఆడవాళ్ల మయితే యేం.... సరదాలూ కోరికలూ ఉండవా ? సంసారం ఖర్చులోంచి కాస్త వెనకేసి, దాంతో కోరికలు తీర్చుకోవచ్చులే అన్న ధైర్యంతో వున్నావా ? అయితే అయినట్లే"

ప్రమీల మళ్లీ నవ్వింది.

మహాశ్వేత కొయ్యబారిపోయింది. ఇదేదో ఆమెకి కొత్త ప్రపంచం లోకి తీసుకొచ్చినట్లు కనువిప్పు కలిగించిం దామె.

## పద్ధెనిమిదవ పరిచ్ఛేదం

### 1

ఇంతపిల్ల - వయస్సుతో పోల్చిచూస్తే, అంతకుమించి బాలా గడితేరిం దనిపిస్తుంది. ఆ పిల్ల అభిప్రాయాలు స్పష్టంగానూ, తీవ్రంగానూ

వుంటాయి. బాలిక పసికంఠంలోంచి ఆరిందామాటలు విన్పిస్తూంటే, రాసమణికూడా తెల్లబోయి చూస్తూంటుంది. దాసీ గిరిబాల వచ్చి, "అమ్మో! ఆ పిల్లని చూస్తే యెంతటి అత్తగారయినా భయంతో హడలిపోతుంది. ఆ మాటలతీరుచూస్తే మూడువంతులు వయస్సు అయిపోయి, ఒకవంతే మిగిలి వున్నట్లనిపిస్తుంది. ఆమె కెక్కడో గంపెడు కొడుకులు, కూతుళ్లు, మనుమలు, మనుమరాళ్లు వున్నారన్న ధోరణిలో వుంటాయి మాటలు.

మొదట్లో మూడు నాలుగేళ్ల వయస్సున్నప్పుడు అందరికీ ముద్దుగానే వుండేవి. ఇప్పుడు ఐంద్రిల పెద్ద ముదినాపసాని అనిపిస్తుంది. నలుపు రంగు అనేది కంటితో చూడలేదు. పాలుపోసేవాడు నల్లగా వుంటాడని అతడి దగ్గర తీసుకున్న పాలుకూడా మొదట్లో తాగేదికాదు.

"అమ్మో! ఎంత కారునలుపో. అసహ్యం. చెమటపోస్తే నల్లగా అచ్చం రాక్షసి బొగ్గే" అని అతడిముందే అన్నది. ఉమ తెల్లబోయింది.

రాసమణి ఆ రోజున గట్టిగా కేకలేసింది. అప్పటినుంచీ కాస్త జాగ్రత్తగా వుంటూంటుంది, అంతే! కాని ఆ రంగుమీద ద్వేషంమాత్రం పోలేదు. ఆ పిల్ల నల్లటిరకాల చేపలు తినదు. చేపలువండేచట్టి కింద కట్టెలమంటకి మసిబారుతుందని యెప్పుడూ తప్పు పడుతూంటుంది - కాని యెక్కువ అభ్యంతరం చెప్పటానికి ధైర్యం చాలదు. రాసమణి లేనప్పుడు మాత్రం "పిన్నీ! మీరిప్పటికీ చట్టిలో వండుతారెందుకని? పల్లెటూళ్లో వాళ్ల అక్కడ బొగ్గులు దొరకవుకనుక అలా వండుకుంటారు. మీకిక్కడ కావలసినన్ని బొగ్గులు. కట్టెలతో వండుకోవటం దేనికి?" అని ఉమను అడుగుతుంది.

కమల అప్పుడప్పుడు యిక్కడికి వచ్చినప్పుడు నవ్వుతూ (రాసమణి వుండగా అలా అనటం సాధ్యంకాదు. కనుక గొంతు తగ్గించి మెల్లిగా) "దౌర్భాగ్యురాలా! చూస్తూండు, నీకు నల్లటి మొగుడు వస్తాడు" అంటుంది.

ఐంద్రిల పల్చని యెర్రటి పెదిమలు విరిచి "నేనతడితో కాపరం చేస్తేగా! ఆరోజునే మంగలం మొహాన కొట్టి వచ్చేస్తా" అంటుంది.

"అయితే నీ మొహానకూడ మంగలమే పడుతుంది"

"ఎందుకని"

"నీకు తినటానికి కట్టుకోటానికి తిండి గుడ్డ యెవరిస్తారు?"

"ఏం? ఎందుకు?" తీవ్రకంఠంతో జవాబు చెప్పేది. "పిన్నిలాగా ఆడపిల్లలకి చదువు చెప్పి, సంపాదించుకుని తింటాను. పిన్నినికూడా ఆమె

మొగుడు తీసుకెళ్లటం లేదు. ఆమె ఉపోషాలు చేస్తోందా? తినటం లేదా? కట్టుకోవటంలేదా?''

''ఊరుకో ఊరుకో'' తెల్లబోయేది కమల. ఇంత ముదినాపసాని పిల్లను కదిలించడం నాదే పొరపాటు. ఒకవేళ ఉమ కనుక వింటే! ఛీ-ఛీ!

గొంతు తగ్గించి ''నువ్వలాంటి మాటలు మాట్లాడకూడదు. ఛీ చిన్నపిల్లవి, పెద్దమాటలు మాట్లాడితే అమ్మమ్మ కోప్పడుతుంది'' అన్నది.

ఐంద్రిల ముఖంతిప్పుకుని సమాధానం చెప్పింది. ''అమ్మమ్మ సంగతి వదిలెయ్. ఆవిడకి ప్రతిదానికీ కోపమే!''

కమల చెప్పాలనుకున్న మాటయిది. పిన్నిలాగా చదువుచెప్పాలంటే నువ్వు కూడ స్వయంగా చదువుకుని ఉండాలి అని. కాని ఏమైనా ఐంద్రిలకి చదువంటే ఉత్సాహం లేదు. ఆమె ఓటమిని ఒప్పుకుంది. రెండేళ్లనుంచి యెంతచేసినా రెండోక్లాసు గట్టెక్కలేక పోయింది. అయితే యింటిపనులు యేవి అన్నా చెయ్యమంటేమాత్రం రెట్టింపు ఉత్సాహం. తరచుగా తెల్లవారుఝామున నాలుగ్గంటలకే లేచి, అమ్మమ్మతో గంగాస్నానం చెయ్యటానికి వెడుతుంది. అలా లేవని రోజున ఆమె మళ్లీ తిరిగివచ్చేలోపున స్నానంచేసి, పూజకి యేర్పాట్లన్నీ సిద్ధంచేసి పెడుతుంది. లేకపోతే ఆమెతో తిరిగివచ్చి, గబగబ గంధంతీసి, పూలు, మారేడుదళాలు అమర్చి సిద్దం చేస్తుంది. రాసమణి ప్రతిరోజూ పూజచేస్తుంది.

అది అయిపోయాక ఉమతోకలసి వంటింట్లో పనులు చేస్తుంది. కూర తరగటం, పాలుకాచటం. ఇప్పుడు ఒకొకరోజున వంటకూడా చెయ్యటానికి సిద్ధమవుతుంది. ఉమ వారించటానికి ప్రయత్నిస్తుంది పరాయిపిల్ల యేం చెయ్యబోయి యేంచేస్తుందో, చెయ్యి కాల్చుకుంటుందో, వ్రేళ్లు కోసుకుంటుందో - చివరికి జీవితమంతా నేను మాటపడాల్సివస్తుంది. యెందుకొచ్చిందిబాబూ! కాని ఐంద్రిల యెన్ని చెప్పినా వినదు. కోపం తెచ్చుకుంటుంది. పోట్లాడుతుంది. అభిమానపడుతుంది. రాసమణి ''చెయ్యనియ్. వండుతానంటే వండనియ్యి! ఏ పేదయింట్లోపోయి పడుతుందో! అక్కడ అంట్లుతోమటమేకాదు, చెప్పులు కుట్టటందగ్గిర్నుంచి చండీపారాయణం వరకు అన్నీ చెయ్యవలసిరావొచ్చు. మహాశ్వేతలాగా కాస్త అలవాటవటం మంచిదే'' అంటుంది.

ఐంద్రిలకి సంసారానికి సంబంధించిన పనులన్నీ యిష్టమే. రాత్రి అంతా లాంతరుదీపం వెలుగుతుంది ఈమధ్య కిరోసిన్‌దీపాలు వచ్చాయ్. దీపాలు తుడిచి సిద్ధంచెయ్యటం, పక్కలు వెయ్యటం ఉమ లేనప్పుడు

యివన్నీ తానేచేసి పెడుతుంది. ఆపనులన్నీ అలసి అలసి తిరిగివచ్చిన ఉమకి చెయ్యాలంటే వీలుపడదు. అందుకు ఉమ కృతజ్ఞత చెప్పాలి. అదేమిటి, సాయంత్రం భోజనానికి యేర్పాట్లన్నీ కూడాచేసి వుంచుతుంది. కూరతరిగి, కుంపట్లో బొగ్గు లేసి, మైదా కలిపిపెడుతుంది. ఉమవచ్చి చీరె వుతుక్కుని పూజచేసుకోటానికి వెళ్లేప్పటికి కుంపటికూడా వెలిగించేది. ఇహ తర్వాత ఇద్దరికీ సరిపోను కూర రొట్టెలు - కాస్తవంట. యెంతసేపు పడుతుంది!

రాసమణి రాత్రిళ్లు పాలు తీసుకోవటంతప్ప యేమీతినదు. ఇప్పుడు పగలూ రాత్రి ఉండే దాసీని పెట్టుకోలేదు - ముఖ్యంగా స్తోమతలేక. గిరిబాల వచ్చి పనులుచేసిపెట్టి వెళ్లిపోతుంది. నెలకి రెండురూపాయలుజీతం. ఆమెకి తిండి, గుడ్డ యివ్వాల్సిన బాధ్యత లేదు. శీతకాలమయితే ఉమ ఒకొకరోజున మధ్యాహ్నమే వంటచేసి పెట్టేస్తుంది. ఐంద్రిల పొయ్యిమీద పాలు కాస్తుంది. మధ్యాహ్నం చేసిన కూర అవీ వేడిచేసి పెడుతుంది.

శ్యామ మధ్యమధ్య తల్లికి ఉత్తరాలు రాస్తూంటుంది. "ఐంద్రిలకు పట్నంవైపు సంబంధం చూడమ్మా. అది నాపిల్లలలో అందరికంటె అందమైన పిల్ల. ఈఅడవి ఊళ్లల్లో వడ్లు బాగుచెయ్యటం, గొడ్లచావడి ఊడవటంకోసం పెళ్లిచెయ్యటం యిష్టంలేదు. ఉమ రాసిన ఉత్తరాన్నిబట్టి దానికి చదువు అంట దనిపిస్తుంది. అలాంటప్పుడు దానికిపెళ్లి చేసెయ్యటం మంచిది."

రాసమణి ఉత్తరం చదువుకుని కఠినంగా నవ్వింది. ఉత్తరం హేమతీసుకొచ్చాడు. అతడి ఆఫీసుకి రకరకాల విదేశీసీసాలు వస్తూంటాయి. హేమ వాటిల్లోంచి ఒకటిరెండు సీసాలు తస్కరిస్తూంటాడు. కొన్నిసీసాలు పోగయాక, ఒక ఆదివారంరోజున వాటిని మూట కట్టుకుని, సరాసరి నడచి కలకత్తా వస్తూంటాడు. ఇక్కడ సీసాల ఖరీ దెక్కువట! అమ్మితే మంచిధర వస్తుంది. ఆడబ్బు తీసుకుని అమ్మమ్మ యింటికి వస్తాడు. భోజనంచేసి, సాయంత్రం మళ్లీ యింటిదారి పడతాడు.

రాసమణికీ సంగతేమీ తెలియదు. హేమకి వయస్సు తక్కువయినా, అమ్మమ్మ దొంగవస్తువుల్ని అమ్మటాన్ని యెన్నటికీ సహించదని తెలుసు కున్నాడు. ఆమె అతడేవో చెల్లెల్నిచూసి పోవటానికి వస్తున్నాడని అనుకుం టోంది. ఆమె మనస్సులో సంతోషించింది. చెల్లెలిమీద అపేక్ష వుండటం మంచిదే.

కాని అసంగతి వేరు. ఆమె శ్యామ రాసిన ఉత్తరం చదివి, హేమతోనే చెప్పింది జవాబు! "మీఅమ్మకి కష్టాల్లో దుఃఖాల్లో పూర్తిగా మతిచెడినట్లుంది. నేనిక్కడ వుండి, సంబంధం యెలా చూస్తాను? నాకెవరైనా మగదక్షత

వున్నారా? లేక నేనెవరి యిళ్లకైనా వెళ్లివస్తూంటానా? నేను సంబంధం చూడాలంటే - సంబంధాలు కుదిర్చే మగవాళ్లనో, ఆడవాళ్లనో పిలవటంతప్ప మరో ఉపాయం లేదు. సంబంధాలు కుదిర్చేవాళ్లమీద ఆశ - ఉమ సంబంధం కుదిర్చాకకూడా తీరలేదా? అంతకంటే తెలిసినవాళ్లలో పల్లెటూళ్ల లోనే యెక్కడయినా మంచిసంబంధం చూడమను. తనకూతురేం రాధా రాణా? గొడ్లచావడి ఊడవాలంటే చచ్చిపోతుందా?

హేమ తలవంచుకుని అన్నీ విన్నాడు. సమాధానం తీసుకుని తల్లి దగ్గిరకి వెళ్లాడు. శ్యామ కోపంతో - "అమ్మవన్నీ విచిత్రపు మాటలు! సంబంధాలు కుదిర్చేవాళ్లెప్పుడూ మంచిసంబంధాలు చూడరు. మన అదృష్టం యెలా వుందో అలా జరిగింది. వాళ్ల తప్పేముంది?" అన్నది.

హేమ ముసిముసినవ్వు నవ్వి "నీ కూతురి అదృష్టంకూడా యెలా వుంటే అలా జరుగుతుంది ఇక్కడే వరుణ్ణి చూడరాదూ?" అన్నాడు.

"నువ్వు నోర్మూసుకో" అని గద్దించింది శ్యామ.

"ఆఁ. అమ్మమ్మ ఇంకోమాటకూడా చెప్పింది. సంబంధాలు కుదిర్చే వారికి, మనకి సంబంధం కుదిర్చినంతమాత్రాన వారికి నోట్లోకి ముద్ద రాదు. వాళ్లకి డబ్బు అనేది యివ్వాలి. మీ అమ్మ యెంతఖర్చు పెడుతుందో చెప్పు?" అన్నది.

శ్యామ బుంగమొహం పెట్టుకుని, "డబ్బు ఖర్చు పెట్టగల తాహతే ఉంటే నా కూతుర్ని దాసీలా కష్టపడటానికి అక్కడ యెందుకు వదిలిపెట్టి వస్తాను?" అన్నది.

తల్లికి కాస్తయినా కృతజ్ఞత లేకపోవటం చూసి హేమకూడా చకితుడయినాడు. కాస్సేపాగి, "అలా అయితే దాన్నిక్కడికి తీసుకురారాదా అమ్మా? అక్కడ ఉంచటం దేనికి?" అన్నాడు.

"కాస్త ఆలోచించి చూస్తాను. కాశీమాత కాస్త కన్నెత్తి చూడదా?"

## 2

ఆరోజున మధ్యాహ్నమప్పుడు మబ్బులు నల్లగా కారుకమ్ముకుని వచ్చాయి ఉమ పనులన్నీ వదిలేసి, డాబామీదికి పరుగెత్తింది. ఆమె కిలా వేళకాని వేళప్పుడు మబ్బులుకమ్మటం చూడటం మహాయిష్టం. నాలుగువైపులా చీకటి యెలా కమ్ముతుందో, అలా మెల్లిగా చల్లటిగాలి

తెమ్మెరలు వస్తాయి. ఆ చీకట్లోకూడా దిక్చక్రరేఖవైపున యేదో విచిత్ర మైన వెలుగు కన్పిస్తుంది. మబ్బులుకూడా అలలమీద అలల్లాగా పేరుకుంటూ వచ్చి, ఒక సమయానికి ఆకాశమంతా అలముకుంటాయి. మధ్యమధ్య ఉరుములు గర్జిస్తాయి. ఉమకి మనస్సులో 'మహాప్రళయం ముంచుకొస్తుంది. ఇంక ఆలస్యంలేదు. నల్లటి బండరాళ్లలాంటి యీ మేఘాలు భూమి గుండెలమీద విరుచుకుపడి, అంతా ధ్వంసం చేస్తాయి' అనిపిస్తుంది.

ఐంద్రిల 'పిన్నీ !' అంటూ ఉమని వెతుక్కుంటూ డాబామీదికి వచ్చి "ఊఁ ఇహ మొదలయింది. నీకీ మబ్బులు చూడటం రంధి యేమిటో తెలియటంలేదు బాబూ! మబ్బులు కన్పిస్తే చేతిలోపని వదిలేసి, డాబా మీదికి పరుగెత్తుకు వచ్చేస్తావ్. ఏముంది? ఈ మబ్బుల్లో? నల్లగా అసహ్యంగా ఉండే మబ్బుల్ని చూస్తే భయమేస్తుంది" అన్నది.

కాని ఉమ కళ్లు దించటంలేదు. తృష్ణతో ఉక్కిరిబిక్కిరయే ఆమె హృదయం సజలమేఘాలమధ్యలోనే శాంతిని వెతుక్కుంటుం దనిపిస్తుంది. శ్యామలశోభను కళ్లనిండా చూస్తోంది. అసహిష్ణువయిన ఐంద్రిల మళ్లీ "ఇప్పుడు నా మాటలేం వినవాయేం? మేఘా లెక్కడికీ పారిపోవులే! అన్ని రోజుల్లోనూ ఉంటాయి" అన్నది.

ఉమ యిటుతిరిగి చూడకుండానే నవ్వి "నీ మాటలుకూడా రోజూ ఉండేవే. పగలూ రాత్రీ ఉండనే ఉంటాయి. అంతకంటే మేఘాలే పారిపోతాయి" అన్నది.

కొత్తబజారు కటువైపున పడమటిదిక్కున ఆకాశం అస్పష్ట మవుతోంది. అంటే గంగలో కురుస్తోందా వాన? ఇక్కడికి రావాలని!

"నీదంతా మరీ అతివృష్టి బాబూ!"

"ఊరుకో, రాజేన్ మల్లిక్‌గారి జంతుశాలలో నెమలి అరుస్తోంది, చెవి పెట్టి విను."

ఐంద్రిల అర్ధస్వగతోక్తిలో - "ఊఁ. నేను వినదగ్గకంఠమే. క్యాఁ క్యాఁ అని యెంత తియ్యటి కంఠం!" అన్నది.

ఎంతోసేపు యెదురు చూడాల్సిన అవసరం లేకపోయింది. తటాల్న పెద్ద పెద్ద చినుకులతో వర్షం ప్రారంభమయింది. ఐంద్రిల 'అమ్మో!' అని మూడు గెంతుల్లో యెగిరి వంటింట్లోకి పోయి నుంచుంది. కాని ఉమ మాత్రం ఇంకా యేదో ఆశగా అక్కడే నిలబడిపోయింది. చూస్తూ

చూస్తూండగానే వర్షం పెద్దదయింది. పరుగెత్తుకొస్తున్నా ఉమ చీరె తడిసి ఒంటికి అతుక్కుపోయింది.

"అయిందా ?" ఇంద్రిల కోపంతో, "ఏమిటో నీ బడాయి నాకర్థం కావటం లేదు. అప్పట్నుంచీ చెపుతున్నాను. చీరె సాంతం తడిసిపోయింది. ఇప్పుడేం చేస్తావ్ ? ఇంకోచీరె తీసుకురావటానికి యెవరెడతారు ? వెతేడి వాళ్లకూడా తడుస్తారు" అన్నది.

ఉమ ఒంటిమీది పైటచెంగు తీసి, మెలిపెట్టి పిండుకుంటూ, "నాకు యింకో చీరె యెవరు తీసుకురానక్కర్లేదు. నిప్పుసెగముందు కూచుంటే యిది యిప్పుడే ఆరిపోతుంది" అన్నది.

"ఆఁ ఆరిపోకేం ? తడిచీరెతో అస్తమానం అలాగే కూచో. తర్వాత యిహ జ్వరం వస్తుంది చూడు. మళ్లీ నేనే ఇంకా అవస్థపడాలి, అంతే. అంతకంటె యేముంది ?"

అంటూ ఉమ అడ్డురావటానికి ముందే, పెద్ద శాలువా ఒకటి ఒంటిమీద, తలమీద కప్పుకుని మెట్లవైపు వెళ్లింది. తర్వాత అలాగే ఒక పొడిచీరె గుండెల కదిమి పట్టుకుని, మళ్లీ పరుగెత్తుకు వచ్చింది. "తీసుకో, కట్టుకో ! ఎక్కడలేనిబాధ నాకొచ్చిపడింది" అని సణుక్కోటం మొదలెట్టింది.

ఉమ ఆమె మాటలతీరుకు నవ్వి, "ఊఁ. నీ బట్టలూ తడిసిపోయాయి. పప్పుడు నేను నీకు తీసుకురావటానికి వెళ్లనా ?" అన్నది.

"లేదు. లేదు. నేనేం తడవలేదు. రెండు కొత్త తువాళ్లు ఉన్నాయి."

"ఏమిటి ? అప్పుడు చెప్పాలనుకున్నావ్ ? అంత అవసరమైన సంగతి యేమిటి ?" చీరె విడుస్తూ, విడుస్తూ అడిగింది ఉమ.

"వినలేదా ? గిరిబాల ఉప్పు కొనుక్కురావటానికి వెళ్లింది. ఉప్పు దొరకలేదు."

"ఉప్పు దొరకలేదా ? అదేమిటి ?"

"దుకాణదారు చెప్పాడు. విదేశీఉప్పు యింకవాళ్లు అమ్మరట ! పేటలోని పెద్దవాళ్లు, చిన్నవాళ్లు అందరూ స్వదేశీలయారు. విదేశీ ఉప్పు, విదేశీబట్టలు ఇంక యీ పేటలో అమ్మనీయరు. సైంధవ లవణం కొనాలి."

"అది ఖరీ దెక్కువ. అంతేకాదు, యెర్ర యెర్రగా అసహ్యంగా ఉంటుంది. మట్టిగడ్డలు...."

"ఇంకో దుకాణంలో యెందుకు అడగలా? గిరిబాల అడగలేదా? రొఖ్ఖం యిచ్చి కొంటున్నప్పుడు -"

"అన్ని దుకాణాలు తిరిగిచూసింది. ఖాతూబాబూ బజారులో యెవ్వరూ విదేశీఉప్పు అమ్మరు. సరుకు అందరిదగ్గిర ఉంది. కాని సాహసం యెవరికీ లేదు. విదేశీ ఉప్పు, విదేశీబట్టలు అమ్మటానికి వీల్లేదు."

ఈ మాట ఇవాళకాదు, ఉమ కొన్నాళ్ల కిందటే విన్నది. తాను చదువుచెప్పే పిల్లల యిళ్లల్లో చర్చలు జరుగుతూంటాయి. చెవినిపడకుండా ఉండే ఉపాయం లేదు. గవర్నర్ జనరల్ బెంగాల్‌ను రెండుగా విభజించాడు. దానివల్ల బెంగాలీలకు సర్వనాశనం యేర్పడింది. బెంగాలీలను అణచటానికేనట యీ యేర్పాటు. అందుకని అందరూ రెచ్చిపోయారు. విదేశీవస్తువు లందరూ కొనటం మానేశారు. అందువల్ల విదేశీయులే అందరికంటె యెక్కువ నష్టపడేది. అందువల్ల వారి నోటిదగ్గిర తిండి పడిపోతుంది. విదేశీగుడ్డల సంగతి కొన్నాళ్లనుంచి వింటున్నదే. కాని విదేశీఉప్పు సంగతి యెప్పుడూ వినలేదు.

ఇంద్రిల తన మనస్సులోని మాటను ప్రతిధ్వనింపచేస్తూ "గుడ్డలనే కొననీయరట! అదే విచిత్రం!" అన్నది.

ఇంతపిల్ల ఇంద్రిల కాళ్లచేతులు "ఆడిస్తూ అందరికీ మీలాగా పరాసడాంగా గుడ్డలుకొని కట్టుకునే స్తోమతలేదు. మాలాంటి పేదవాళ్ల గతి యేమవుతుంది?" అన్నది.

ఉమ కొంచెం తెల్లబోయి, "అదీ విన్నాను. బొంబాయి అవతల యెక్కడో బట్టలమిల్లు పెట్టారట. ఆ ఏర్పాట్లు జరుగుతున్నాయి" అన్నది.

అవతల యెక్కడో బట్టలమిల్లు పెట్టారట. ఆ యేర్పాట్లు జరుగుతున్నాయి. 'ఆఁ. పెట్టారు'. ఇది గిరిబాల విని వచ్చింది. "అందులో వచ్చే గుడ్డలు గోనెసంచీల్లా అసహ్యంగా మొద్దుగా ఉంటాయి. అదీ రెట్టింపుధర. ఇప్పుడిహ పన్నెండణాలకి, పధ్నాలగణాలకి మంచి గుడ్డరాదు".

ఉమ ఆ మాటని యెగరకొడుతూ, "దానికి దిగులుపడటంవల్ల లాభ మేముంది? అందరి అదృష్టాల్లో యెలా రాసి పెట్టి ఉందో, అలాగే అవుతుంది. అంతకంటె యెక్కువేమీకాదు" అన్నది.

"ఈ సంగతి కనుక ఒకసారి అమ్మ చెవిని పడిందంటే - అమ్మయెగిరి గంతేస్తుంది."

ఐంద్రిల యింకా తన మనస్సులో తాను గొణుక్కుంది. కాని ఉమ దగ్గిర్నుంచి ప్రోత్సాహం యేమీ రాకపోవటంతో, కాసేపటికి తానే ఊరుకుంది.

శ్యామ నిజంగానే ఉత్సాహంతో ఒక్కసారి పొంగిపోయింది.

మంగళ చేతు లూగించుకుంటూ వచ్చి చెప్పటం మొదలెట్టింది. "విన్నావా శ్యామా! స్వదేశీవాలాల ఆందోళన ?"

"వినలేదే! యేమంటారు వాళ్లు ?"

"ఏమిటో బాబూ! స్వదేశీవేలంవెర్రి బయలుదేరింది. దేశంలో పెద్దవాళ్లు చిన్నవాళ్లు గొడవ చేస్తున్నారు. ఇంగ్లీషువాళ్లని యింక యీ దేశంలో ఉండ నివ్వరట! వాళ్లని వెళ్లకొట్టి కాని నీళ్లుకూడా తాగరట! పనిలేకుండా జులాయిగా, తిరిగేవాళ్లు. యేమీ చెయ్యటం చేతకాని చచ్చుదద్దమ్మలు, పాడుబుద్ధులున్న కుర్రాళూ అందరూ పోగయారు, ఏదో ఆందోళన సాగిస్తూనే ఉంటారు."

"వాళ్లు యేం కావాలంటారు ?" శ్యామకి అందులో ఉన్న గూఢార్థం యేమిటో బోధపడలేదు.

"కొందరేమో విదేశీగుడ్డలు కట్టుకోరట! విదేశీఉప్పు, విదేశీ పంచదార యేదీ తినరట : అంతా బాయ్‌కట్ చేస్తారట ! దాన్ని బాయ్‌కట్ అంటారట." ఏమాత్రం నమ్మకంలేని నవ్వొకటి నవ్వి, "ఆఁ. కొనక యేంచేస్తారు ? మీ కేమన్నాపిచ్చా యేం ?" అన్నది.

"అహఁ. అదికాదు. నిన్న మావారు పంచదార కొనుక్కువస్తున్నారు. చేతిలోంచి లాక్కుపోయారు. ఎంతో దబాయించి బయటపడ్డారు."

"అయితే మరి పంచదార లేకపోతే టీ యెలా తాగుతారు ? పైగా వీళ్లందరికీ టీ అలవాటుందిగా !"

"అదే చెపుతున్నా, బెల్లం వేసుకుని టీ తాగాలంటున్నారట !"

శ్యామ కాసేపు మెదలకుండా ఊరుకుని, "అది రెండు రోజుల ఆందోళనమ్మా ? రెండు రోజుల్లోనే ఆగిపోతుంది. మీరొకరు !...." అన్నది.

"ఆఁ. నేనూ అదే అన్నాను వారితో. విదేశీగుడ్డలు కొనకపోతే యేం కట్టుకుంటారు? యెంతమందికి పరాస్‌డాంగా, శాంతిపూర్ బట్టలు కట్టుకునే స్తోమత ఉంది? చెప్పండి. కాని" - అని గొంతుకాస్త తగ్గించి యీ సారి కొంచెం విచారంగా - "ఆయన కేమిటో ఆ నమ్మకం కలగటం లేదు. మీరేమనుకుంటున్నారో అదికాదు. ఇది చివరికి పెద్ద గొడవగా తయారవుతుంది. అప్పుడు చూడు, ఉద్యోగాలు కూడా పోవచ్చు అన్నారు" అన్నది.

ఆ మాట విని శ్యామ వణకిపోయింది. అక్షయబాబు ఉద్యోగాన్ని గురించి కాదు ఆమె భయం. ఉద్యోగం పోయినా అతడికి జరుగుతుంది. ఆమె దిగులు హేమ ఉద్యోగాన్నిగురించి. కిందటి నెలనుంచి పన్నెండు రూపాయలయింది జీతం. ఇంకా పెరుగుతుంది. ఎలాగో దొరలదగ్గిర మంచి అనిపించుకుంటే చాలు. (అలా అనిపించుకోవట మెలాగో శ్యామకి తెలియదు అయినా యేదో అస్పష్టంగా ఒక అభిప్రాయం ఉంది. అది యేదయినా జరగకూడని సంఘటన జరిగితే యింక ఆ ఆలోచనే అక్కర్లేదు) యీ సమయంలో యేమిటి యీ విఘ్నాలు.

ఆమె గొణుక్కుంటూ తిట్టుకోసాగింది.

స్వదేశీ అంటే యేమిటో ఆమెకి తెలియదు. వాళ్లు యిలా ఆందోళన చెయ్యట మెందుకో అదీ ఆమెకి తెలియదు. దేనిమూలంగా నష్టం కలుగుతోంది, వారికీ జాతికీ? జాతిక్షేమంకోసం కొందరు వ్యక్తులకు సంభవించే సామాన్యమైన కష్టాలను స్వీకరించక తప్పదు. ఈ సంగతులేవీ శ్యామకి తెలియవు. ఈ ఆందోళన ఫలితంగా హేమ ఉద్యోగం యేరోజున పోతుందో అన్న అనుమానంతో ఆమె ఉత్తేజితురాలయింది.

"వీళ్లమొహాలుమండ! చావాలి! అందరూ చావాలి! కలరా రావాలి! ఒక వైపునుంచి నేలమట్టమైపోవాలి! ఊరంతా క్రుంగిపోవాలి. ఆందోళన చెయ్యటాని కింతకంటె సమయం దొరకలేదా? బీదవాళ్లని అణచివెయ్యాలని తప్ప అంతకంటె యేం లేదు."

హేమ మధ్యలో "పోనీలే అమ్మా! పన్నెండు రూపాయల ఉద్యోగ మేగా మహా! పౌరోహిత్యం చేస్తే యింతకంటె యెక్కువ సంపాయించ గలను" అని సమాధానపరచబోయాడు.

"నువ్వూరుకో. పెద్దతెలిసినవాడిలా -" అని శ్యామ గద్దించి, అతణ్ణి మాట్లాడనీకుండా చేసింది.

కాని ఆమె తిట్లు బ్రహ్మాండమైన జనసమూహం కోలాహలాన్ని ఛేదించ లేకపోయాయి. ఆందోళన మరింత తీవ్రమయింది. చివరికి ఒకరోజున ఉద్యమకారులు అక్షయబాబుచేతిలోంచి విదేశీగుడ్డను లాక్కుని, తగల బెట్టారని తెలిసింది.

పుకార్లు, గాలి వార్తలు యెన్నెన్నో విన్పిస్తున్నాయి, కలకత్తాలో భయంకరమైన గొడవలు జరుగుతాయట, అగ్ని యెప్పుడు భగ్గుమంటుందో సరీగ్గా తెలియదు. ఈలోగానే ఉద్యమంలో చేరినందుకు అక్షయబాబు ఆఫీసులో, అయిదారుగురికి ఉద్యోగాలు పోయాయట.

చివరికి ఒకరోజున దొరలు - 'తమ ఫ్యాక్టరీలో పనిచేసేవాళ్లెవరూ యీ ఆందోళనలో పాల్గొనకూడదు, అలా పాల్గొనేవారికి ఉద్యోగాలుండవు' అని హెచ్చరించారని, ఆఫీసునుంచి వార్త వచ్చింది.

శ్యామ ఒక్కసారి వణకిపోయి, "ఇదిగో, నువ్వు ఆ పోకిరీసజ్జు కుర్రాళ్లనీడ కూడా యెప్పుడూ తొక్కొద్దు. మళ్లీ మళ్లీ చెపుతున్నా జాగ్రత్త" అని హేమను హెచ్చరించింది. దుర్గా! దుర్గా! మాతా! కాపాడు తల్లీ!

నరేన్ చాలారోజుల తర్వాత ఒకరోజున హఠాత్తుగా వచ్చాడు. తువాలుతో కట్టుకొచ్చిన మూటలో చాలా ఖరీదయిన విదేశీ పంచదార ఉంది.

"ఒక కత్తి లేదు! డాలు లేదు నిధీరామ్ సర్దార్! వీళ్లా యింగ్లీషు వాళ్లను వెళ్లకొట్టేది! కేవలం ఒట్టిమాటతో వెళ్లకొట్టగలిగితే ఇంక దిగులేముంది. పనిచేయని కబుర్లరాయుళ్లందరూ" అని గొణుక్కుంటూ యింట్లోకి వచ్చాడు.

శ్యామ తెల్లబోయింది. "ఇంత పంచదార యెక్కడ దొరికింది? విదేశీసరుకు యెవరికీ అమ్మనీయటం లేదని విన్నాను."

"హ హ హ! అదే కదా! అదే మంచివీలు కలసివచ్చింది. తెలిసిందా భార్యామణీ! తెలివి కావాలి, బుద్ధిఅనేది ఉంటే యెవరయినా అత్తారింట్లో (జైల్లో) కష్టంచేస్తూ తింటూ ఉంటారా?.... ఊ హూఁ. అందులో చెయ్యి పెట్టటానికి వీల్లేదు. దాన్ని నేను అలా సర్కార్‌కి అమ్ముతాను, టీ తాగే నిషా ఉన్న బాబుగారికి పంచదార యెక్కడా దొరకటంలేదు ఎక్కువధర తీసుకుంటాను"

"కాని యెక్కడ దొరికిందో అది చెప్పండి"

"అది ఒక దొరగారి చప్రాసీ కొని తీసుకెడుతున్నాడు. కుర్రాళ్లందరూ పోయి అతణ్ణి చుట్టు ముట్టారు. నేను చూశాను. ఆ సరుకు యెలాగో నష్టమై

పోతుంది. దొరగారికి ఉపయోగపడే అవకాశం లేదు. నేనుకూడా ఆ జట్టులో చేరి ముందు లాక్కున్నాను. తర్వాత అరుపులు కేకలు మధ్య నందు మూసుకుని తప్పించుకోటం యెంతసేపు ? తెలిసిందా ? సరుకు బాలా ఉంది. అయిదారు శేర్లకి తక్కువుండదు హి హి హీ !''

ఆత్మసంతృప్తి కల నవ్వుతో మొహం యింతయింది !

తర్వాత కాళ్లు వ్రేళ్లాడేసుకుని కూచుని, శ్యామని పొగాకు కూరి యిమ్మని పురమాయించి, మళ్లీ పొగరుబోతు కుర్రాళ్లను ఒక వరుస తిట్టి పోశాడు.

చాలారోజుల తర్వాత భర్త అభిప్రాయంతో యేకీభవించటంతో శ్యామకూడా సంతోషించింది. ఇద్దరూ కలిసి మనస్సులో కసి తీరేవరకు తమకు తెలియని స్వదేశీవాలాలను తిట్టిపోశారు.

## 3

రాసమణిలో మాత్రం యెలాంటి ఉత్తేజన వ్యక్తం కాలేదు. ఆమె అంతావిన్నది. ఏమీ మాట్లాడలేదు. తల్లి అభిప్రాయమేమిటో ఉమ తెలుసుకోలేకపోయింది. అమ్మ యిదివర కిలా ఉండేదికాదు. ఆమెకేమిటో యేవిషయంలోనూ కుతూహలంలేదు. ఆసక్తి లేదు. నిస్పృహగా ఉదాసీనంగా తయారయింది. రాసమణిలోని యిలాంటి భావపరివర్తన చూస్తే, ఆమెకేదో భయభయంగా ఉంటోంది. ఉమ తనభయాన్ని కమలకు ఒకసారి తెలియచేసింది. కాని కమల అంత పట్టించుకోలేదు. ''అదేం లేదు. ముసలి తనంలో ఆరోగ్యం బాగాలేనప్పుడు యిలాగే ఉంటారు'' అన్నది. ఉమ భయాన్ని తేలిగ్గా కొట్టిపారేసింది.

ఆమెకి ఆరోగ్యం నిజంగానే క్షీణిస్తోంది. కాశీనుంచి వచ్చాక ఒక్క సంవత్సరం ఆరోగ్యం చాలా బాగుంది. తర్వాత మళ్లీ పాడవటం మొదలెట్టింది. ముఖ్యంగా యిటీవల మరీ కృశించిపోయింది. తరచు జ్వరం వస్తోంది. డాక్టరు పాతమలేరియాయే అన్నాడు. క్వినైన్ యివ్వాలనుకున్నాడు. రాసమణి అదితీసుకోదు. ఆమెకోపంతో "క్వినైన్ వేసుకుంటే తల తిరుగుతుంది. చెవులు దిబ్బెళ్లు వేస్తాయని విన్నాను. ముసలితనంలో యిదితిని చావటం - అంతకంటె యేముంది ? పోండి పోండి'' అన్నది.

ఆయుర్వేదం మందు తీసుకోటానికి ఒప్పుకోదు. "పథ్యం అనుపానాలు అవన్నీ యెవరుచేస్తారు ?'' అన్నది తల తిప్పుతూ.'' ఇంక హంగామా పెంచుకోవద్దు, అదీకాక అవసరమేముంది ? వ్యాధి పట్టుకుంటే మందులు

వదివిస్తాయి. యముడు పట్టుకుంటే యింక వదలిపెడతాడా? ఇప్పుడు నన్ను యముడు పట్టుకున్నాడు. తెలియటంలేదూ? సమయంకూడా వచ్చేసింది. ఇంకా యెన్నా   తాను? కొన్నాళ్లనుంచి జ్వరం వస్తోంది. మీ జన్మదాతను కల్లో చ  షి  ను. ఇన్నాళ్లకి తలపుకి వచ్చినట్లున్నాను" అన్నది.

భర్తని గురిం   ఁమణి నోటిమీదుగా యెప్పుడు యెవరూ వినలేదు. ఇది ఒక వ్యతిక్రమం. 'మీనాన్న' అని యెప్పుడూ అనదు భర్త ప్రసక్తి వచ్చినప్పుడు 'నాన్న' అన్నపదం - ఇతరులనాన్న అయినాసరే ఆమె ముందు ఉటంకించటం నిషిద్ధం. దాన్ని అసభ్యతకింద లెక్కేస్తుంది. అందరూ హేళన చేసేవాళ్లు. అయినా ఆమె 'జన్మదాత' అంటుంది.

కొత్తగా హోమ్యోపతి అని ఒక వైద్యం వచ్చింది. ఆపేటలో కాళీపద్ వరాట్ అని ఆడాక్టరు ఒకరున్నారు. జ్వరం ఉధృతంగా వచ్చి ఒకరోజున వణకిపోతూ, పళ్లుకరచుకుపోయి, రాసమణి స్పృహతప్పి పడి, పోయింది. అప్పుడు ఉమ భయపడిపోయి, యీవరాట్‌ని పిలిపించింది. ఓ కుర్రవాడి నెత్తిన మందులపెట్టె పెట్టుకుని వచ్చాడు. ఆడంబరంగా, రోగి దగ్గిర కూచుని, వారిని రకరకాల ప్రశ్నలువేశాడు. (వీలయితే రోగినికూడా) ప్రతిసమాధానం విని విజ్ఞుడిలాగా 'ఊఁ. ఊఁ.' అనేవాడు. తర్వాత మళ్లీ ఒకే క్రొత్త ప్రశ్న వేశాడు. ఇలా ఇరవై, ఇరవైఅయిదు నిమిషాలు గడిచింది.

చాలాసేపయాక, చివరికొకసారి 'హుఁ' అని కొయ్యపెట్టె తెరిచాడు. "శుభ్రమైన గాజుగ్లాసుతో నీళ్లు తీసుకురా బుల్లెమ్మా!" అని ఐంద్రిలను ఆజ్ఞాపించాడు.

గ్లాసుతో నీళ్లు వచ్చాక సావకాశంగా ఒకసీసా బయటికితీశాడు. తర్వాత అందులో నీటిలా స్వచ్ఛంగావున్న మందును జాగ్రత్తగా సీసామూతతీసి ఒకమాత్ర అందులో వేశాడు.

"శ్రీవిష్ణు! ఇదితీసుకుని అమ్మగారిచేత మింగించండి."

మొదట రాసమణి తీసుకోటానికి ఒప్పుకోలేదు.

"ఇదేమిటి? యేదో ఒకరకమైన వాసనవేస్తోంది డాక్టరుగారూ?"

"మధ్యంలాంటి వాసన అంతేనా?" డాక్టరుమాటను మధ్యలోనే అందుకుని "అది వేస్తుందమ్మా! అది మందువాసన" ఇది సురాసారంలోంచి

తయారయిన మందు. దానివల్ల దోషం లేదు. 'ఔపదార్థం సురాపానం' అన్నారు శాస్త్రంలో'' అన్నాడు.

అప్పుడింక అభ్యంతరం చెప్పలేదు.

కాని దానివల్లకూడా రోగం తగ్గలేదు.

మూడు నాలుగురోజులు బాగానే ఉండేది. మళ్లీ రోజువిడిచి రోజు జ్వరం వచ్చేది. ఈసారి మళ్లీ పశ్చిమప్రాంతానికి తీసుకెడితే బాగుండేది. కాని తీసుకెళ్లే వారెవరు ? రాఘవఘోషాల్‌కి పక్షవాతంతో కాలు, చెయ్యి పడి పోయింది. ఇప్పుడు ఆయన కొడుకే పౌరోహిత్యం చూసుకుంటున్నాడు. ఉమకి వెళ్లేందుకు వీల్లేదు. అదీకాక అన్నిటికంటె ముఖ్యమైనది ఖర్చు. అంతఖర్చు యెవరిస్తారు ! ఇప్పుడు పరిస్థితి సంసారం గడుపుకోటమే భారంగా ఉంది.

కనుక యేదీ జరగలేదు. రాసమణి జ్వరంతో తీసుకుంటోంది. కొంచెం బాగావున్నప్పుడు అవసన్న భావంతో, స్థిరదృష్టితో దూరాన్ని చూస్తూకూచుని, జపమాల త్రిప్పుకుంటూ ఉంటుంది.

ఇప్పుడు అన్నిరోజులూ గంగాస్నానానికికూడా వెళ్లలేకపోతోంది. రెండు మూడురోజులు గడిచాక, అన్నంతిన్నా జ్వరంరాకుండా ఉంటే రహస్యంగా ఐంద్రిలను వెంటపెట్టుకుని బయటికి వెడుతుంది. ఒకవేళ నడిచికనుక వెళ్లలేకపోతే, తిరిగివచ్చేప్పుడు - తరచు మళ్లీ తిరిగి నడిచి రాలేదు - పల్లకి చేయించుకుని వస్తుంది. నడిచి తిరిగివచ్చిన రోజునకూడా సరాసరి నడిచిరాలేదు. దారిలో చాలాచోట్ల కూచుంటూ ఉంటుంది. కాసేపు కూచుని విశ్రాంతి తీసుకుని మళ్లీ నడవటం మొదలెడుతుంది.

ఒకరోజున స్నానానికి వెళ్లినప్పుడు గంగ స్నానాలరేవులోకూడా స్వదేశీఆందోళన సంగతి విన్నది. సురేన్ బెనర్జీ, బిపిన్‌చంద్రపాల్, రవీంద్రనాథ్‌ఠాగూర్ యువకుల్ని పురికొల్పారట ! విదేశీవస్తువులేవీ కొన కూడదు. దొరల నోటిమీద దెబ్బకొట్టాలి అని ఆందోళన. ఉప్పు, పంచ దార, విదేశీవస్త్రాలు కొనకూడదు కొనటం సాధ్యంకాదు. కొందరు చాటుగా కొనటానికి ప్రయత్నిస్తున్నారట ! పట్టుపడితే ఉద్యమ యువకులు వాటిని ధ్వంసం చేస్తున్నారు. కొన్నవారిని అవమానం చేస్తున్నారు.

ఈ వార్తలు యిలా విని, అలావదిలేస్తుందంతే ! ఈవార్తలు ఆమె నేమీ చలింపచెయ్యలేవు. ఆమెమనస్సు కొంచెంకూడా ఉద్విగ్న మవదు. కాని ఒకప్పుడు ఆమె వార్తాపత్రికలు చదవటం చాలాయిష్టపడేది. వార్తా

పత్రిక ఒకటి యెప్పుడూ తీసుకుంటూ ఉండేది. చదవటం ఆమెకి అలవాటుండేది. 'తిలోత్తమాసంభవకావ్యం', 'గులేబకావళి', 'హార్‌దర్వేష్'. 'వ్రజాంగనా కావ్యం', బంకించటర్జీ 'దుర్గేశనందిని' ఇప్పటికీ ఆమెపెట్టెలో వెతికితే దొరుకుతాయి. 'పయార్' గేయరూపంలో అనువదించిన భేతాళ పంచవింశతి ఒకప్పుడామెకి నోటికి వచ్చేది. కాని కొన్నాళ్లనుంచీ ఆమె అన్నీ మరచిపోయింది. పుస్తకాలు చదవటంకూడా ఇప్పుడామెకి బాగుండటం లేదు. ఒకొకరోజున ఉమ తానే "యేమైనా చదివివినిపించనా అమ్మా ?" అని అడిగేది. రాసమణి తలత్రిప్పుతూ "వద్దులే, నాకిప్పుడేది బాగుండటం లేదు" అని అయిష్టాన్ని వ్యక్తంచేసేది.

ఆమెకేది బాగుంటుందో ఉమ తెలుసుకోలేక పోయింది. రాత్రింబగళ్లు యేదో ఆలోచిస్తూనే ఉంటుంది. కిటికీలోంచి బోస్‌గారి డాబామీది పిట్టగోడకేసో, లేదా పైకప్పుకేసో చూస్తూకూచుని ఉంటుంది. ఇంత యేమి ఆలోచిస్తూంటుందో ! ఉమ యెన్నివిధాల ప్రయత్నించినా తెలుసుకోలేక పోయింది. ఇంతకీ తానుగడిపిన సుదీర్ఘజీవితపు సంగతుల్ని గురించి ఆలోచిస్తూంటుందా ? లేక తాను చనిపోయిం తర్వాత యీ ముగ్గురికూతుళ్ల భవిష్యత్తు యేమవుతుందని ఊహించటానికి ప్రయత్నిస్తుంటుందా ?

ఆమె యీ ఉదాసీనభావం చూస్తూంటే యేమీ అర్థంకావటంలేదు. అడగటానికి ధైర్యం చాలటంలేదు. మొదట్నుంచీ తల్లిఅంటే భయపడటం ఆమెకి అలవాటు. ఆ అలవాటు స్వభావంగా మారిపోయింది. భయం తీర లేదు.

ఐంద్రిల ఒకరోజున "ఏమిటమ్మమ్మా ! అంత ఆలోచిస్తూంటావ్ ?" అని అడిగింది.

'ఆఁ.' అని యేదో అప్పుడే నిద్రలోంచి లేచినట్లు - ఆ పిల్లముఖం కేసి చూడటానికి ప్రయత్నిస్తూ "ఏమిటన్నావ్ ? ఆలోచిస్తున్నానా ?" అహఁ "నేనెక్కడ ఆలోచిస్తున్నాను ?" అన్నది రాసమణి.

మళ్లీ అలా మౌనంగా ఉండిపోయింది.

ఒకరోజున మాత్రం ఉమ ఆమెలో మార్పు గమనించింది. ఆరోజున ఆశ్వయుజమాసం చివరిరోజు, ఆ రోజున బెంగాలీలందరూ - అందరు బెంగాలీలకి 'భాయీ !' అని రాఖీ కట్టటం ఆచారం. తమ అనుబంధాన్ని మరింత పటిష్ఠం చేసుకుంటారు. రాసమణికి అంతకుముందు నాలుగైదు రోజులు జ్వరం రాలేదు. స్నానానికి వెడుతూ దారిలో - 'ఇవాళ యెవరిళ్లల్లోనూ గిన్నెలు పొయ్యిమీద యెక్కవు. ఆరోజు యెవరూ వంటలు చేసుకోరు

అందరూ గంగాస్నానం చేస్తారు. స్నానం చేసి, చెప్పులులేని కాళ్లతో ఒకొ జట్టు ఒకొక ప్రాంతానికి వెళ్లి, దారికి రెండు వైపులా ఉన్నవారికి రాఖీలు కట్టుకుంటూవెడతారని విన్నది.

ఇంటికి వచ్చికూడా ఉమని గ్రుచ్చిగ్రుచ్చి అడిగింది. అంతకుముందే పొయ్యిలో నిప్పు రాజెయ్యద్దని ఉమని వారించింది.

"అయితే నువ్వు యేమీ తినవా అమ్మా? అంతగా అయితే పోనీ రెండు కట్టెలు వెలిగించి, కాసిని పాలు కాచి యిస్తాను" అన్నది ఉమ.

"వద్దు వద్దు. అదేమీ అవసరంలేదు" అని తల విసురుగా త్రిప్పుతూ "నీకేమయినా పిచ్చాయేం? నాకీ వయస్సులో రెండుమూడు రోజులు తినకపోయినా నష్టమేమీలేదు. అంతకంటె యింట్లో తీపి తినుబండారాలేమయినా ఉంటే పిల్లలకు పెట్టు. చిన్నపిల్ల నీరసపడుతుంది" అన్నది.

స్వదేశ ఉద్యమం విషయంలో ఐంద్రిల కేమీ సానుభూతి లేదు. ఉండాల్సిన మాటకూడా కాదు. అదంతా యేమీ ఆ పిల్లకి కొంచెంకూడా తెలియదు. కాని ఆందోళనంటే హుషారుగా ఉండాల్సిన వయస్సే. అయితే అమ్మమ్మ యేమీ తినటంలేదు. కనుక చిన్నపిల్లనికదా అని తినదు. యేమయినా సరే తినదు. "నాకేమీ అక్కరేదు అమ్మమ్మా! నేను హాయిగా ఉండగలను. ఒక్కపూటే కదా! కిందటిసారి శివరాత్రి ఉపవాసం చేశాను" అన్నది.

రాసమణి అడిగిన దానికి ఉమ తనకి తెలిసినంతవరకు చెప్పింది. "ఎవరో గవర్నరు జనరల్ కర్జన్‌దొర. బెంగాలీలను అణచిపెట్టటానికి బెంగాల్‌ను రెండుముక్కలుగా విభజించాడు. బెంగాలీలు యింత యెక్కువగా చదువుకున్న వాళ్లకనుక, ఈ దేశంలో యింగ్లీషువారు రాజ్యం చెయ్యటానికి బాధ్యులవుతారు. ఈ దేశాన్ని రెండుముక్కలు చేసి, బెంగాలీలను శాశ్వతంగా అణచివెయ్యా లనుకుంటున్నారు. అందుకనే దేశమంతా రెచ్చిపోయింది. ఇంగ్లీషువారి ధన, ప్రాణాలకి క్షేమం లేదు. అందరి ముఖాలూ వాడిపోయాయి."

దేశం ఉద్రిక్తమయిందన్న సంగతి రాసమణికూడా గమనించింది. ఇప్పుడు గంగాస్నానానికికెడితే దారిలోనూ, రేవులోనూ ఒక విచిత్రమైన దృశ్యం కంటపడుతూంటుంది. ఇద్దరు కుర్రవాళ్లు కనుక కనిపించారంటే, విడిచిపెట్టేదిలేదు. వారికొకరికొకరు తెలిసిన్నవారో, తెలియనివారో తెలియదు.

ఒకరు 'వందే' - అని ఆగిపోతారు. మరొకరు - 'మాతరం' అని పాద పూరణ చేస్తారు. ఇదేట ఈ యుగం ఒకర్నొకరు పలకరించుకునే మర్యాద. దణ్ణాలు, నమస్కారాలు యెవరూ చెయ్యరు. 'వందేమాతరం' అంటే చాలు. అన్ని మర్యాదలూ అయిపోయినట్లే.

రాసమణి బంకించంద్రుని 'ఆనందమఠం' నవల చదివింది. వందేమాతరం గేయంకూడా చదివింది. కాని ఆ గేయమే దేశంలోని జనానికందరికీ మంత్రంగా పరిణమిస్తుందని అంత తెలుసుకో లేకపోయింది. ఆ మాట యిప్పుడు విన్నది. థియేటర్‌లో ఆనందమఠం నాటకంగా ప్రదర్శించారట ! అందులో ఆ గేయానికి స్వరంకూర్చి, పాటగా పాడటం జరిగింది. ఆ పాటవినే దేశమంతా ఉత్తేజితమయింది. అందుకని యిప్పుడు దొరలు వందేమాతరం వింటే చాలు, ఉలిక్కిపడతారు. తుపాకీగుళ్లకంటె 'వందే - మాతరమ్' అన్న రెండుపదాలూ భయోత్పాదకా లయినాయి. ఒకటి రెండు చోట్ల దొరలను చంపనుకూడా చంపారుట !

శ్రద్ధగా విన్నది రాసమణి. ముఖంలో సంశయంకూడా లీలగా తొంగిచూసింది. మహారాణి (విక్టోరియా) రాజ్యంలో సూర్యుడస్తమించడు. ప్రపంచమంతా ఆమె రాజ్యమే అని అంటారు. ఆ మహారాణిజనంతో వీళ్లు ఒట్టిచేతులతో పోరాడగలరా ? యెవరికి తెలుసు !

మహారాణి చనిపోయిందన్న సంగతి రాసమణికి గుర్తుండదు. మొదట్లో ఉమ ఆమె తప్పుని సవరించటానికి ప్రయత్నించేది. ఇప్పుడు వదిలేసి ఊరుకుంది.

అయినా యిప్పుడేమిటో రాసమణికి ఉత్సాహంగా ఉంటోంది. ఇన్నాళ్ల తర్వాత ఒక కొత్త ఉద్దీపన. మనస్సు యెక్కడో ఒక కుతూహల కేంద్రాన్ని వెతుక్కుంది. జీవితానికి ఒక క్రొత్తప్రాణం వచ్చినట్లుంది. ఆమె ముఖంలో కళ్లలో క్రొత్త ఉత్తేజనకాంతి మెరిసింది.

ఆమె తొమ్మిది గంటలప్పుడు ముందు చావడిలో కూచుంది. జనం జట్లు జట్లుగా గంగాస్నానానికి వెళ్లారు. ఇంక తిరిగి వస్తారు. ఈ దారినే వస్తారు. రాఖీలు కడతారు. ఐంద్రిల వెళ్లి అమ్మమ్మ ప్రక్క మెదలకుండా కూచుంది.

కాని పెద్ద రాస్తా దూరం. ఒక యిల్లు దాటితే తర్వాత పెద్దరాస్తా. గంగానదికి వెళ్లేదారి. ఆ దారిలోనే యివాళ పెద్ద ఉద్రిక్తత. అక్కడి అభినవదృశ్యం యిక్కడికి కనపడుతోంది. కుర్రాళ్లందరూ జట్లు జట్లుగా

వెడుతున్నారు. చెప్పుల్లేని కాళ్లు, రేగిపోయిన జుట్టు - ఇవాళ వీధిలో బళ్లు, వాహనాలు లేవు. జీవితంలో యెప్పుడూ నడవని వాళ్లుకూడా ఇవాళ వీధిలో అడుగుపెట్టారు.

ఐంద్రిల ఉండి ఉండి, "అమ్మమ్మా! బోసుగారి అరుగుమీదికి వెళ్లి కూచుందాం, రారాదూ" అన్నది.

"నీకేం పిచ్చా?" అంటూ రాసమణి ఆ పిల్లని ఆపింది. "వాళ్ల అరుగులమీద జనం కిటకిటలాడుతున్నారు. వాళ్లల్లోకి నేనెక్కడ వెళ్లి కూచోను? ఇక్కణ్ణుంచే బాగా కన్పిస్తుంది" అన్నది.

మధ్య మధ్య వందేమాతరం నినాదఝుంకారం లేస్తోంది. "బోలో భాయ్ ఆబార్ బోలో (అనుసోదరా, మళ్లీ అను) వందేమాతరమ్."

రాస్తామీద నడుస్తున్న జనంరద్దీ కాస్త తగ్గింది. ఇంక తిరిగి వస్తారు వాళ్లు. రాసమణి దుర్బలశరీరం మరింత నీరసంగా ఉంది. అయినా ఆమె లేవలేదు. ఆమె జీవితానికి మళ్లీ కొత్త అర్థాన్ని వెతికి తెలుసుకుంది. గదిలో పడుకుని ఉండటం సాధ్యంకాదు.

దూరంగా మేఘగర్జనలా యేదో ధ్వని విన్పించింది. చెవి ఒగ్గి విన్నది. వందేమాతరం. ఆ గేయంస్వరం ఆలకించి విన్నది. వాళ్లు యిటువైపుగానే వస్తున్నట్లున్నారు. రాసమణి ద్వారబంధం పట్టుకుని లేచింది.

అహా! ఏమి వారందరి రూపాలు! అందరూ బంగారుచంద్రులు! ధనవంతుల బిడ్డలు! ఎండలో కాళ్లు కింద మోపలేకపోతున్నారు. అయినా చెప్పుల్లేకుండానే నడిచి వెడుతున్నారు. వారిలో ఒకర్ని చూసి, రాసమణి చూపు మరల్చుకోలేకపోయింది. మన్మధుడిలాంటి రూపం. ముఖం పాలరాయి చెక్కినట్లుంది. గౌరవర్ణం, నల్లటి మీసం, పిన్నవయసు, అతడి శరీరమంతా ఒకవిధమైన గాంభీర్యం వెల్లివిరుస్తోంది.

అతడుకూడా వెడుతూ వెడుతూ యిటుతిరిగి చూశాడు. ఒక వృద్ధురాలు, ఒక బాలిక. వృద్ధురాలు రోగిష్టి మనిషి. ముఖం చూస్తేనే తెలుస్తోంది. రోగశయ్యమీదనుంచి లేచి వచ్చినట్లనిపిస్తోంది - మృత్యుశయ్యమీదనుంచైనా కావచ్చు! దేశం పిలుపుకి ఉత్తేజితురాలయి, దేశవ్యాప్తమయిన మహోద్యమంనుంచి తాను దూరంగా జరిగి ఉండలేకపోయింది.

పక్కనున్న జనం ముఖాలకేసి చూసి, అతడేదో మెల్లిగా మాట్లాడాడు. బహుశా ఈ సంగతులే అయి ఉండొచ్చు. తర్వాత టక్కున ఆగి, కొంచెం ముందుకి వచ్చాడు సందువైపుకి. స్వయంగా తనచేత్తో రాసమణి, ఇంద్రిల చేతులకి రాఖీలు కట్టాడు. కట్టటం పూర్తికాగానే అతడే చేతులెత్తి నమస్కరించాడు. పెద్దరాస్తాలో ఉన్నజనం పెద్దజట్టు - దిక్కులు పిక్కటెల్లేటట్లు 'బోలో వందేమాతరం' అని అరిచారు.

ఆమధ్యలోనే రాసమణి "నీపేరేమిటిబాబూ ?" అని అడిగింది. "నాపేరా ?" అని కాస్త తటపటాయించి, తర్వాత అతడు చిరునవ్వుతో, తలవంచుకుని "నాపేరు శ్రీ రవీంద్రనాథ్ ఠాగూర్" అని చెప్పాడు.

"ఓ ! నువ్వేనా 'జోడాసాంకా' ఠాకూర్ గారింటి బిడ్డవి. ద్వారకానాథ్ ఠాకూర్ మనువడివా నువ్వు ? నీ పేరు రవిఠాకూరా ? ఆయుష్మాన్ భవ. చిరంజీవీ భవ. నీ తల్లి జన్మసార్థకం !"

రాసమణి నిండుమనస్సుతో ఆశీర్వదించింది.

రవీంద్రనాథ్ స్తబ్ధంగా నిలబడిపోయాడు. ముఖంలో ఆ మధురమైన చిరునవ్వు అలాగే ఉంది. తర్వాత మళ్లీ ఇంకోసారి చేతులెత్తి నమస్కరించి, మళ్లీ వీధిలో ఉన్న జట్టుతో కలిసిపోయాడు. తక్కిన కుర్రవాళ్లు మిగతా యిళ్లల్లో వారికి రాఖీలు కట్టి తమ పని పూర్తి చేసుకున్నారు. మళ్లీ అవ్రజ నిర్ఘోష 'వందేమాతరం'.

రాసమణి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అందమైన కుర్రాడు స్వయంగా వచ్చి తన చేతికి రాఖీ కట్టాడు. నవ్వుతూ మాట్లాడాడు. నమస్కారం చేశాడు. తాను కృతార్థురాలయింది. తనకీనాడు యిలాంటి కొడుకువుంటే ! ఆడపిల్లలు కేవలం బరువే. ఈనాడు తాను పరలోకానికి వెళ్లే మార్గంలో ఉన్నా, తన దౌర్భాగ్యం కొద్దీ కాళ్లకి సంకెళ్లలా చుట్టుకుని ఉన్నారు. తనకి చచ్చిపోయినా శాంతి లేదు. పైకిరాబోయిన దీర్ఘనిశ్వాసాన్ని అణచుకుని ఆమె మళ్లీ వీధిగుమ్మందగ్గిర కూర్చుండిపోయింది.

# పంథొమ్మిదవ పరిచ్ఛేదం

## 1

ఇంద్రిల పెళ్లి ఒకవిధంగా హఠాత్తుగానే నిశ్చయమైంది. శ్యామకి జ్వరం వస్తూండటంవల్ల, ఇంద్రిల పద్మగ్రామానికి వచ్చింది. 'అడ్గోడా'

గ్రామస్థుడు మాధవఘోషాల్ శివపూర్‌నుంచి కాలిదారిన వస్తున్నాడు. ఆ సమయంలోనే చూశాడు. మధ్యాహ్నం యెండలో అంతదూరంనుంచి నడిచివస్తే దాహం వెయ్యటం సహజం. దాహం బాగా యెక్కువవటంతో అతడికి అక్షయబాబు యింటిసంగతి గుర్తుకొచ్చింది. ఇందులో మాత్రం ఆశ్చర్యపడాల్సిందేముంది ? అక్షయబాబు, మాధవఘోషాల్ మొదట్లో ఒక ఆఫీసులోనే పని చేసేవాళ్లు. తర్వాత యిక్కడ రైల్వే ఆఫీసు కొత్తగా పెట్టటంతో మాధవఘోషాల్ వెళ్లిచేరాడు. అక్షయబాబు మాత్రం చేరలేదు. ఎందుకనంటే అప్పుడు అందరికంటె పైఉద్యోగికి, అతడికి మధ్య ఇద్దరు ఉద్యోగుల స్థానాలే ఉన్నది.

అప్పటి నుంచే అక్షయబాబుతో అతడు విడిపోవటం. అయితే రాక పోకలున్నాయి. కార్యకరామతులున్నప్పుడు సరే ఊరికేకూడా ఒకసారి వచ్చాడు. ఇల్లు అతడికి గుర్తుంది. పరిచయంలేనివారి యిళ్లల్లో అడిగి మంచినీళ్లు తాగడంకంటె, పరిచయమైన వారి యిళ్లకి వెళ్లటమే మంచిది. కావాలంటే బ్రాహ్మణ వంటమనిషి ఉంటే నాలుగు మెతుకులు భోజనం దొరకటంకూడా విచిత్రమేమీ కాదు. తాను వెళ్లిన చోట కొంచెం ఆలస్య మైంది. ఇంత ఆలస్య మవుతుందని అనుకోలేదు. ఇక్కడికి 'అడ్‌గోడ్యా పక్కా రెండున్నర క్రోసులుంది. అలసిపోయి, అభోజనంగా ఉన్నస్థితిలో నడిచి వెళ్లేసరికి ప్రొద్దు తిరిగిపోతుంది. చాలా ఆలోచించి, ఆలోచించి మాధవఘోషాల్ అక్షయబాబు యింటి దారి పట్టాడు.

తెలిసినయిల్లే అయినా, అతడయిదేళ్లుగా యిటువైపు రానేలేదు. దారి సరిగ్గా యిదే అని నిశ్చయించుకోలేక, కొంచెం తిరిగి పెరటివైపున ఉన్న తోటలోకి వెళ్లాడు. అక్కడ ఓ చెట్టుగుబురు దాటగానే - అతడికి అపురూపదృశ్యం కంటపడింది.

నిర్జనంగా ఉన్న చెరువురేవులో రాతికట్టడపు మెట్లమీద పది పదకొండేళ్ల పిల్ల కూచుని ఉంది. కావిరంగుచీరె కట్టుకుని ఉంది. ఆ చీరెలో ఆమె యెర్రటి యెరుపురంగు మరింత విచ్చినట్లుంది. నల్లటి ఒత్తయిన పొడుగు జుట్టు, కళ్లు రెండూ బాగా పెద్దవి. అయినా అందవికారంగా లేవు. కనురెప్పలు కోలగా పొడుగ్గా - వాటిఛాయ యెర్రటి బుగ్గలమీది దాగా వ్యాపించి ఉంది. ఇక్కడనుంచి వాటి నీడ కన్పిస్తోంది. ముక్కు అంత కోటేరేసి నట్లుండదు. అయినా మరింత బాగుంది.

పక్కన యిన్నిగిన్నెలు చెంబులూ నీళ్లలో తడిపి పడేసి ఉన్నాయి. వాటిని తోమటానికే వచ్చి ఉంటుంది. కాని ఆతోమే లక్షణాలేవీ

కన్పించటం లేదు. కాళ్లు రెండూ నీళ్లలో పెట్టుకుని, దోరజామపండు కొరుక్కు తింటూ పరధ్యానంగా కూచుంది. ఇంకొక చేత్తో యెండిపోయిన మారేడు రెమ్మను మెల్లిగా ఆడిస్తోంది. ఎంత స్థిరంగా కూచుందంటే చేతులు కదలినా కాళ్లు కదలటం లేదు. ఫలితంగా నీళ్లలో కొంచెం ప్రకంపన మాత్రం ఉంది. అటుయిటు తిరిగే చేపల సూక్ష్మశ్వాసలకి నీళ్లలో చిన్న చిన్న బుడగలు లేస్తున్నాయి. దానివల్ల చెరువులోని నల్లటి నీళ్లలో ఆ దృశ్యాన్ని చెరిపేసే తరంగాలు లేవటం లేదు. పెద్ద సీమమారేడుచెట్టు సందులోంచి నీడపైన యెండ ఆమె ముఖంమీద కళ్లమీద పడుతూ, ఆ దృశ్యమంతా నిశ్చలంగా ఉన్న చెరువునీటి అద్దంలో ప్రతిబింబిస్తోంది. స్తబ్ధంగా ఉన్న మధ్యాహ్నవేళ యెక్కడా గాలి లేదు. చెట్ల ఆకులుమాత్రం మధ్యమధ్య కాస్త కదులుతున్నాయి. దానివల్ల ఆడుతున్న వెలుగు నీడల బొమ్మ కూడా చెరువు నీళ్లల్లో పట్టుబడుతోంది.

అపూర్వమైనచిత్రం అది. మాధవఘోషాల్ మైఖేల్ (మైఖేల్ మధుసూదనదత్తు) హేమేన్‌బెనర్జీ (వీరిద్దరు సుప్రసిద్ధ బెంగాలీ కవులు) పేర్లు బహుశా విని ఉండొచ్చు. కాని వారి కవితావాసన అతడికి రవంతయినా అబ్బలేదు. అయినా అతడు చూపు మరల్చుకోలేక పోయాడు. ఆచిత్రాన్ని కదలకుండా చూస్తూ నుంచున్నాడు.

జామపండు తింటూతింటూ, పండుతోసహా చెయ్యి కిందికి దించి మెదల కుండా యేదో ఆలోచించసాగింది. దాంతో చిత్రం మరింత అందంగా కన్పించింది. మాధవఘోషాల్‌కూడా దాహం సంగతి మరిచిపోయి అలాగే నుంచున్నాడు. జీవితంలో యెన్నడూ ప్రకృతికేసి, సౌందర్యంకేసి చూసే అవకాశం లేనివారిమీద, ఒకొక్క దుర్లభమైన క్షణంలో ప్రకృతి యిలాగే బదులు తీర్చుకుని, పనిలో నిమగ్నులైనవారి నిలాగే హఠాత్తుగా విస్మితుల్ని, స్తబ్ధుల్ని చేస్తుంది. వారి కళ్లమీద మనస్సుమీద మాయ అనే కుంచెను ఆడిస్తుంది. మాధవఘోషాల్ ఆక్షణంలో తన దాహాన్ని మరచిపోవటమే కాదు, తన అర్జంటు దావా సంగతీ మరచిపోయాడు. తన పెద్ద "ఫజ్‌లీ" (ఒకరకం మామిడిపండు) చెట్టు వ్యవహారం – (గడచిన నాలుగేళ్ల నుంచి ఆచెట్టు ఒక్కకాయ కాయలేదు, పూతకూడా పూయలేదు. అలాంటి చెట్టుని యింకా ఉంచి యేం లాభం ?) ఆచెట్టుని యివాళ కొనటానికి వస్తారు. బేరం కుదుర్చు కుని బయానా డబ్బు తీసుకుని భార్యచేతిలోపెడితే తాను బయటపడతాడు – అదీ మరచిపోయాడు. అంతేకాదు ప్రహరీగోడ ప్రక్కన సరిహద్దులో ఉన్న వెదురుచెట్టునిగురించి ఆర్నెల్లనుంచి మల్లిక్‌గారితో దావా జరుగుతోంది. ఇవాళ మధ్యాహ్నం మధ్యవర్తి హృదయబాబుతో మంతనాలు జరిపి, రాజీ

చేసుకోవాలి - అదీ మరిచిపోయాడు. అతడు అన్నీ మరిచిపోయి, ఈ చిత్రం చూస్తూ ఉండిపోయాడు. దేవశిల్పి చిత్రించిన ఈ అపూర్వచిత్రంకేసి సౌందర్యముగ్ధుడై చూస్తూ ఉండిపోయానని తెలుసుకోలేకపోయాడు. తెలుసుకుంటే తన కవిసులభదౌర్బల్యానికి లజ్జితుడవుతాడో లేదో తెలియదు.

అత డిలా యెంతసేపటినుంచి నిల్చుని ఉన్నాడో, ఇంకెంతసేపు నిల్చుండేవాడో తెలియదు. హఠాత్తుగా ఆ పిల్లకళ్లు అతడిమీద పడ్డాయి. తియ్యని లేతగొంతుతో, కటువైనధోరణిలో "ఏం అల్పాయుష్కుడివైన మనిషివయ్యా! అలా గుడ్లప్పగించి చూస్తూనుంచున్నావు? నీయింటికెళ్లి చూస్తూనుంచోరాదూ?" అన్నది. దృశ్యభంగ మయింది.

కాని మాధవఘోషాల్ కప్పటికీ మత్తు వదలేదు. అతడు రెండు అడుగులు ముందుకి వచ్చి, మృదువుగానే "బుల్లెమ్మా! అక్షయబాబుగారిల్లు యిదేనా? నేను దానికోసమే వెతుకుతున్నాను" అన్నాడు.

కాని బుల్లెమ్మ యేమాత్రం మెత్తపడలేదు. అలాగే విసురుగా - "దానికోసమే వెతుకుతున్నారా? ఏం దానికి వీధిగుమ్మంలేదూ? ఆదారివిడిచి పెట్టి, ఇలా పెరటిగుమ్మంవైపు వచ్చి చూస్తూ నిలబడవలసివచ్చిందా?" అన్నది.

"ఎవరితో అలా తగవులాడుతున్నావ్ ఖేందీ?"

మంగళ భోజనంచేసి లేచి, చెయి కడుక్కోటానికి వస్తోంది. దగ్గిరకు రాగానే, ఆమె దృష్టి మాధవబాబుమీద పడింది. గబగబా తలమీది చెంగు ముఖంమీదికి లాక్కుంటూ, గుసగుసలాడుతున్నట్టు "అమ్మో ఈయన మా ఫాదర్‌బాబు. ఆయనతో నువ్విలా నడుం బిగించుకుని తగవులాడుతున్నావా?" అన్నది.

మాధవ్ ఆమె పెదమామగారి పేరు.

ఇంతలో ఐంద్రిలకూడా కొంచెం తెల్లబోయింది. చటుక్కున తాను నడుం బిగించుకుని ఉన్నసంగతి గుర్తొచ్చింది. గబగబా నీళ్లలోంచి లేచి వచ్చి అవతలవైపు గట్టుమీద నుంచుంది. కంగారుగా నడుంకి బిగించుకుని ఉన్న చెంగు విప్పుకుంటూ, "నేను - నేను యెవరో మామూలు మనిషి అనుకున్నాను" అన్నది.

మాధవఘోషాల్ ఇంకొంచెం ముందుకు వచ్చి, "అమ్మా మంగళా! అక్షయబాబు యింట్లో ఉన్నాడా?" అని అడిగాడు.

మంగళ బాగావినపడేట్లుగానే "ఆయన వీథి అరుగుమీద విలుం తాగుతూ కూచున్నారని చెప్ప ఖేందీ ?" అని సమాధానం చెప్పింది.

ఇంక సంభాషణ పొడిగించకుండా మాధవఘోషాల్ ముందుకు సాగిపోయాడు.

## 2

అప్పటికీ మాధవఘోషాల్ పిల్లవిషయంలో ఆశ పెంచుకోలేదు. కాయస్థులపిల్ల - బాగానచ్చింది. అంతవరకే. ఆమెతో సంబంధం పెట్టుకోవటం సాధ్యమవుతుందని అతడు ఊహించనేలేదు.

కాని మొదట కుశలప్రశ్న లయిపోయాక, "అవును. అక్షయ్ ! చెరువురేవులో చక్కగా తెల్లగాఉన్న ఒకపిల్లను చూశాను. యెవరాపిల్ల ? నీకేమయినా మేనకోడలా ? మనుమరాలా ?" అని ఆపిల్లనుగురించి మొదటి ప్రశ్న వేశాడు.

ఎత్తిపొడుపుని మాట్లాడకుండా జీర్ణించుకుని అక్షయ్ హుక్కా కిందికి దింపి, "తెల్లగాఉన్న పిల్లా ? మాచెరువులోనా ? ఎవరబ్బా ?" అన్నాడు.

మాధవఘోషాల్ ఆ పిల్ల రూపురేఖలు కొంచెం వర్ణించి చెప్పగానే అక్షయ్ "ఓ ! ఆపిల్లా ! ఇహ నువ్వేం చెప్పఖ్కర్లేదు. ఆ బ్రాహ్మడావిడ రెండోకూతురు. కొద్దిరోజుల కిందటే యిక్కడికి వచ్చింది. అవును. నిజమే. ఇక్కడ ఉండటంలేదు కనుక వెంటనే ఆ పిల్ల సంగతి గుర్తు రాలేదు" అన్నాడు.

"బ్రాహ్మణావిడ కూతురా ? ఆమె యెవరు ? మీ వంటావిడా ?"

"కాదు కాదు. అంతకంటె కాస్త పైమెట్టే. మాదగ్గిర నిత్యపూజలు చెయ్యటానికి ఓ బ్రాహ్మణ్ణి తీసుకొచ్చిపెట్టటం జరిగింది. కాని అతడు చెప్పులు కుట్టేవాడికంటె అధముడు, ఎక్కడో తాగి పడిఉంటాడు. ఆ పిల్ల అన్నయ్య యిప్పుడు పూజలు చేస్తున్నాడు."

"ఆఁ. పూజారి బ్రాహ్మడా ? యేం గోత్రం, వారిది ?"

"ఎందుకోయ్, కొడుకు పెళ్లి చేస్తావా యేం ? ఊరు, గోత్రం అన్నీ అడుగుతున్నావ్ ?"

"చేసినా చెయ్యొచ్చు. పిల్ల చూడటానికి బాగుంది."

అక్షయ్ మళ్లీ హుక్కా కిందికి దింపాడు. అతడు కాసేపు మెదలకుండా ఊరుకుని, "మీది శ్రీవత్సగోత్రమేగా! గోత్రం అడ్డురాదులే. కాని నీ కొడుక్కి వాళ్ల సంబంధం చేస్తావా? తండ్రి చాలా అల్పుడు, నీచుడు. ఇహ పిల్లలంటావా, దరిద్రకుటుంబంలో పుట్టటంవల్ల పెద్దదొంగలు. మాతోటలో పళ్లు, కాయలే కాదు, పిందెల్నికూడా దక్కనివ్వరు. చాటుగా దొంగతనంగా కోస్తారు. వాటిని తీసుకెళ్లి అమ్ముకుని వస్తూంటారు. పిల్లకూడా వాగుడు పిట్ట. పెద్దగయ్యాళి. ఆఁ, కాని వాళ్ల అమ్మ మాత్రం చాలా గౌరవకుటుంబంలో పుట్టినామె అనిపిస్తుంది. చదవటం వ్రాయటం వచ్చు. మనవైపు యిళ్లలో అలాంటి వాళ్లు అరుదు" అన్నాడు.

"అలాంటప్పుడు యిలాంటి భర్త చేతిలో యెలా పడింది?"

"అప్పుడు వాళ్లస్థితి బాగుండేదట! ఇల్లు-వాకిలీ, భూమి-పుత్రా సంపద బాగానే ఉండేది. వాళ్లది గురువంశం. అన్నదమ్ములిద్దరూ అంతా తుడిచి పెట్టేశారు. బ్రాహ్మణయింట్లో పశువులయితే యేమవుతుంది? పరమ మూర్ఖులు!"

ఇంతలో ఫలహారం వచ్చింది. అక్షయబాబు-మంగళ కళ్లతో మాట్లాడుకోవటం అయిపోయింది. అంటే భోజనం యేర్పాటు వీలుండదా అని. ఆ సంగతే ఆలోచిస్తున్నానని అని తలతిప్పుతూ వ్యక్తం చేసింది.

బ్రాహ్మణావిడకి రెండు రోజులనుంచి జ్వరం. మంగళ వాళ్లింట్లో భోంచెయ్యడు. పూరీలుచేసి, పెట్టొచ్చు. ఇంట్లో మైదా ఉంది. కాని ఈ మధ్యాహ్నమప్పుడు పూరీలు -"

అదీకాక వాళ్లు మాట్లాడుకున్న మాటలు ఒకటిరెండు మంగళ చెవిన పడ్డాయి. ఆలోచన వచ్చిందామెకి. ఆనందోద్వేగంతో ఆమెకళ్లు మెరిశాయి. ఇలాంటి తంత్రాలు చెయ్యటమంటే మంగళకు మహాయిష్టం!

ఆమె రొప్పుకుంటూ - రోజుకుంటూ, శ్యామ దగ్గిరకి వచ్చింది. ఆమె అప్పుడే కాస్త భోజనంచేసి వసారాలో కొంగుపరచుకుని పడుకుంది.

"శ్యామా! శ్యామా! చప్పున లే. పొయ్యివెలిగించి కాసిని సన్నబియ్యం కడిగిపెట్టు. రెండు బంగాళాదుంపలు వేసి అన్నం వండు, మా వంటింట్లోని 'అపప్డి' మంచి 'చచ్చడి' (బెంగాలీ బోజన పదార్థాలు) తీసుకొచ్చి యిస్తాను. కాసిని పాలుకూడా తీసుకొచ్చి యిస్తాను. లే. లే. కళ్లమూసుకుని పడుకుంటే కాదు" అన్నది.

"ఇదిగో లేస్తున్నా, కాని మా వంటింట్లో భోంచేస్తారా? బ్రాహ్మలా?"

"అవును. అమాయకపు మొహమా! బ్రాహ్మడు. మీరు సంబంధం చేసుకో తగినవోటే. ఘోషాల్ బ్రాహ్మలు. అయినా బ్రాహ్మలేగా: మీరు మాత్రం యేం పరిశుద్ధమైన కులీనులా? పూజారి బ్రాహ్మలుకూడా బ్రాహ్మలే. లే. లే. జడభరతుడిలా చూస్తూ కూచోకు. ఆయన పెద్దకొడుక్కి యింకా పెళ్లి కాలే దనుకుంటాను. అయినా యింకా యిద్దరున్నారు. అందరూ రైల్వే ఆఫీసులో పని చేస్తున్నారు. నీ కూతురు 'ఖేంది' ని చూశాడు. బాగా నచ్చనుకూడా నచ్చింది. అందుకనే నీ దగ్గిరకు తెచ్చి అప్పగిస్తున్నాను. ఆడించగలవేమో చూడు, మా వంటింట్లో భోజనం పెట్టలేను. బ్రాహ్మణ వంటావిడకు జ్వరం. మేము చేసుకున్న వంట. ఇది ఒకవిధంగా శాపంలో వరమే అయింది. యేమంటావ్?"

మంగళ కింతలోనే యెక్కడిలేని సంతోషం కలిగింది. ఇది ఒక ఆట! వైవిధ్యంలేని జీవితంలో రంగురంగుల విచిత్రత! ఆమె తన భారీ శరీరాన్ని ఊగించుకుంటూ, చెయ్యటానికి వీలైనంత సహాయం చేస్తుంది.

"పొయ్యిలో కట్టెలు సర్ది మంట యెగసం తొయ్."

శ్యామకూడా ఆమె యింగితాన్ని గ్రహించింది.

కేవలం బంగాళాదుంపలతో వండిన అన్నమే కాదు, కొద్దిరోజుల క్రితం హేమ కెక్కడినుంచో మోయిన వచ్చింది. అందులో కాస్త ఆవు నెయ్యి రెండు 'పాంపర్' (ఒక విధమైన రొట్టె) కూడా ఉన్నాయి. అవి యిక్కడ సాధారణంగా దొరికేవికావని, అల్లు డొస్తాడేమో అని శ్యామ తీసి భద్రంగా ఉంచింది. మంగళ వారి వంటింట్లోంచి పప్పు, 'చచ్చడి' తీసుకు వచ్చి యిచ్చింది. శ్యామ గబగబా 'బొడి భాజా' 'పాంపర్ భాజా' 'బొడి ఝూల్' (బెంగాలీ భోజన పదార్థాలు) తయారుచేసింది. శ్యామ పీటవేసి, వేడి అన్నంలో ఆవునెయ్యి వేసి భోజనం వడ్డించింది. మంగళ యాలోగా ఐంద్రిలను కొంచెం ముస్తాబు చేసింది. శ్యామ మాధవఘోషాల్ యెదుటికి రాదు, మళ్లీ మారు యేదయినా కావలసి వస్తే ఐంద్రిలాయే వడ్డిస్తుంది.

మాధవఘోషాల్ వంటింటి వసారాలో భోజనంముందు కూచుని, కొంచెం ఆశ్చర్యపోయాడు. కప్పుతో బోర్లించినట్లు అన్నం కుప్పగా పెట్టి దాని మీద చిన్నగిన్నెతో ఆవునెయ్యి, అన్నం, చుట్టూ కూరలు అవీ శుభ్రంగా అమర్చి, కంచం పక్కన అరటిఆకుముక్క, వేసి అందులో ఉప్పు నిమ్మకాయ డిప్ప పెట్టి ఉన్నాయి. అన్నిటిలోను ఒక నాగరీకత స్పష్టమవుతోంది.

మాధవఘోషాల్ తృప్తిగా భోంచేశాడు. ఆకలిమీద ఉండి, భోజనం చెయ్యటం కాదు, పదార్థాలన్నీ కూడా రుచిగా ఉన్నాయి.

మంగళ కాసిని పాలు తెచ్చి యిచ్చింది. ఆ పాలకప్పుతోపాటు బాగా పండిన ఒక అరటిపండు, బెల్లం ఐంద్రిల తీసుకొచ్చి, ఆమె దగ్గిర పెట్టి, "ఇంకొంచెం అన్నం వడ్డించనా ?" అని అడిగింది.

ఆమె వినయభంగిమ, తెల్లటి చెక్కిళ్లమీద సిగ్గుమూలంగా యేర్ప డిన రక్తిమ - అన్నీ కలిపి మాధవఘోషాల్ కెంతో బాగున్నాయి. "కొంచెం వడ్డించమ్మా !" అన్నాడు.

తర్వాత భోజనంచేసి, లేచి చెయ్యి కడుక్కుని, తాంబూలం వేసుకునే సమయంలో ఆ పిల్ల గడ్డంపైకెత్తి "నువ్వు మాయింటికి వస్తావమ్మా లక్ష్మీ ?" అని అడిగాడు.

ఐంద్రిల వెంటనే - "ఎందుకురాను ? మీరు రమ్మంటే వస్తాను, కాని మీరు కూడా మళ్లీరావాలి. ఇవాళ భోజనం కొంచెం యిబ్బం దయిందని చెప్పింది మా అమ్మ. మరొక రోజున యెప్పుడైనా, కబురు చేసి రండి, యేం ?" అన్నది.

మాధవబాబు చిరునవ్వు నవ్వి "ఎందుకురాను ? తరచు వస్తూంటాను" అన్నాడు.

అక్షయబాబు గదిలోకి వెళ్లి కూచుని కాసేపు యేం మాట్లాడకుండా హుక్కాత్రాగి - "నా మనస్సులో నిశ్చయించుకున్నాను. నువ్వు వాళ్ల అమ్మతో మాట్లాడతావా భాయీ !" అన్నాడు మాధవబాబు.

"ఎవరితో ?"

"మా పెద్దబాబు హరినాథ్‌తో. వాడికింకా పెళ్లికాలేదు."

"అతడి వయస్సెంత ? యీడేనా ? ఆ పిల్లకి మహా ఉంటే పదేళ్లు."

"వాడికి కొంచెం వయస్సు యెక్కువే, నాకు సరీగ్గా గుర్తులేదు ఇరవై మూడు, ఇరవైనాలుగేళ్లకి తక్కువఉండవు. ఇరవైఅయిదుకూడా ఉండొచ్చు. అయితే యేం ? లోకంలో రెండోపెళ్లి చేసుకునేవాళ్లు యింతకంటె యెక్కువ వయస్సు ఉన్నవాళ్లు, తొమ్మిది, పదేళ్ల పిల్లల్ని చేసుకుంటున్నారు. మా పేటలో గోకుల్‌ముఖర్జీ నలభైయేళ్ల వయస్సులో యేడేళ్ల పిల్లను చేసుకున్నాడు. ఉహూఁ అదేమీ అడ్డుకాదు"

"కాని డబ్బు మాత్రం సున్న. ముందే చెపుతున్నాను. కేవలం భోజనం పెడితే చాలా వదినగారికి ?"

"ఆఁ. ఆవిడ కొంచెం గొడవ చేస్తుంది. అయితే నేనుమాత్రం నిర్ణయం చేసుకున్నాను. కాని నా భార్య మాత్రం నల్లరాయి. పిల్ల లేమయి పోతున్నారనేది ఆమెకి అఖ్ఖర్లేదు. అంచేతనే కాస్త డబ్బు మార్పిడి చేద్దామనుకుంటున్నాను."

తర్వాత మానసదృష్టితో భార్య ఉగ్రరూపాన్ని చూసి - "ఆఁ. ఏమవుతుందిలే. అంతగా అయితే దసరాకాళిక అయి, ధఁయ్ ధఁయ్ మని కాసేపు గంతులు వేస్తుంది. అంతకంటె యేమీ చెయ్యలేదు. నువ్వు మాట్లాడు" అన్నాడు.

మాధవఘోషాల్ హుక్కా కింద పెట్టేసి, మళ్లీ 'ఆడ్‌గోదా' దారి పట్టాడు.

## 3

మంగళ పరుగు పరుగున వచ్చి, కబురు అందించింది.

"దేముడిమొక్కు చెల్లించుకో శ్యామా! ఆఁ. ఇది నీ కూతురి అదృష్టమే అనాలి. వరుడివైపువారే ఆయాచితంగా వచ్చి అడగటం నేనెక్కడా వినలేదు. ఆఁ. తమంతట తామే ఒప్పుకున్నవాళ్లు డబ్బు కోసంకూడా పీక్కు తినరు."

శ్యామ ఆనందంతోపాటు కలిగిన ఉక్కిరిబాటు కాస్తతగ్గాక, కుర్ర వాణ్ణి గురించి గుచ్చిగుచ్చి అడగటం మొదలెట్టింది. మంగళ కేమీ తెలియదు. మాటిమాటికీ వెళ్లి అక్షయబాబుని అడిగి రావలసివచ్చింది. అక్షయ బాబుకికూడా పెద్దగా యేమీ తెలియదు. అతడికి తెలిసిందల్లా - వారికి మంచి ఆస్తి ఉంది. భూములమీదనుంచి సంవత్సరం పొడుగునా భోజనానికి సరిపోయే ధాన్యం వస్తుంది. నలుగురు అన్నదమ్ములు. ఇతడు పెద్దవాడు. ఇంగ్లీషుస్కూల్లో కొన్నేళ్లు చదివాడట! రైల్వే ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాడు. అన్ని విధాల యోగ్యుడైన వరుడు. ఉన్న దోషాలల్లా వయస్సుకి కొంచెం పెద్దవాడు. రంగుమాత్రం నలుపు.

"నలుపా? వయస్సు యెక్కువను గురించి నేను ఆలోచించటం లేదమ్మా. కాని మా అమ్మాయికి నలుపంటే యెంత అసహ్యమని! చివరి అల్లుడితో హేళనగా మాట్లాడదు కదా!"

"చాల్చాల్లే. ఆగు, ఇలాంటి అసహ్యాలు చాలా చూశాను అన్నీ సర్దుకు పోతాయి. మగవాడి రూపాన్నిగురించి వ్యాఖ్యానమా? ఊఁ కలకత్తా ఉత్తరం రాయి. మీ అమ్మ దగ్గిర్నుంచి నేర్పుగా యేమయినా రాబట్టుకోటానికి వీలవుతుందేమో చూడు.

శ్యామ ఆ సలహాయే విన్నది. రాత్రి ప్రమిద దీపంముందు కూచుని, ఉమకి పెద్ద ఉత్తరం రాసింది తల్లి ఆరోగ్యం యేమీ బాగుండటం లేదు. అదీకాక ఆమె యిటీవల ప్రతివిషయంలోనూ ఉదాసీనురా లయింది. ఏం చేసినా ఉమ చెయాల్సిందే!

వరుణ్ణి గురించి స్థూలంగా వివరణ యిచ్చి, ఆనాడు జరిగిన సంఘటనను అనుపూర్వికంగా రాసి, చివరలో -

"ఇలా అయాచితంగా వరుడివైపువారు రావటం, వారంతటవారే ప్రస్తావన తీసుకు రావటం బ్రహ్మలిఖితమని నే ననుకుంటున్నాను. ఈ ప్రస్తావన కభ్యంతరం చెప్పటానికి యేమీ కన్పించటం లేదు. నాలాంటి భిక్షుకురాలి కూతురి కింతకంటె మంచిసంబంధం యేం దొరుకుతుంది? నువ్వు కాని, అమ్మకాని యీ వరుణ్ణి గురించి అయిష్టత చూపరని ఆశిస్తున్నాను. ఒకటిమాత్రం యేమిటంటే వరుడు నల్లగా ఉంటాడు. అన్నీ మనకి నచ్చినట్లు కుదురుతాయా? అయితే ఆరోగ్యం చాలా మంచిదని విన్నాను.

ఇది నీ కూతురే, నీకు అయిష్టంగా యేదీ జరుగదు. నీ దగ్గిర్నుంచి సమాధానం రానిదే నేనే ప్రయత్నమూ చెయ్యను. అమ్మ ఆరోగ్యం బాగుండ లేదు. కనుక యీ పెళ్లి కలకత్తాలో మన యింట్లోనే చెయ్యాలని నా కోరిక. అలా జరగకపోతే, అమ్మ యే మనుమరాలి పెళ్లి చూడలేకపోయిందే అవుతుంది. ఇందుకు నీ కభ్యంతరం యేమీ ఉండదని ఆశిస్తాను"

శ్యామ యెంతో లౌక్యంగా రాసింది ఉత్తరం. ఇచ్చి పుచ్చుకోవటాల విషయమై ఒక్కమాటకూడా రాయలేదు. కలకత్తాలో పెళ్లి చెయ్యటం మొత్తం బరువు వారి నెత్తిన వెయ్యటం. అప్పుడిహ చేతులు ముడుచుకుని కూచోగలరా? శ్యామ ఉత్తరం మడుస్తూ తనలో తాను నవ్వుకుంది.

ఉత్తరం చదివి ఉమ కూడా నవ్వింది. శ్యామ తన చతురత యిప్పటికీ తెలుసుకోలే రనుకుందా? తన నింత అమాయకురాలినిగా భావించిందా? ఆశ్చర్యం!

రాసమణి కూడా ఉత్తరం చదివించింది. ఐంద్రిలమీద యీ కొన్ని సంవత్సరాలతో ఆమెకికూడా ఒక మమకారం యేర్పడింది. పైకి ఒప్పుకోకపోయినా మనస్సులో అంగీకరించక తప్పలేదు.

ఆ రోజున యింకేమీ మాట్లాడలేదు. మర్నాడు ఉమ వచ్చి "చిన్నక్కకి యేం రాయమంటావమ్మా?" అని అడిగింది. రాసమణి

కొంచెం సేపు ఊరుకుని, "నేను యాభైరూపాయలు, నా చెవుల కమ్మలు యిస్తాను. అయితే ఆజంజాటమంతా యిక్కడ వీలుకాదు, అని దానికి రాయి" అన్నది.

ఉమ యీ సంగతి రాసి, తన ఉద్దేశంకూడా జతపరచింది. ఆమె చేతిలో తన సంపాదన డబ్బు పదిహేనురూపాయలుంది. ఆ డబ్బుతో మంచిచీరె ఒకటి కొని, హేమచేత పంపిస్తుంది. అమ్మ ఆరోగ్యం బాగుండలేదు. కనుక ఆమె రాలేదు. పెళ్లి యిక్కడ చెయ్యటం సాధ్య పడదు. అరుపులు, కేకలు, హడావిడి ఆమె సహించలేదు. కనుక తమ విషయం వదిలి, ఆమె పెళ్లిప్రయత్నాలు చేసుకోవచ్చు. అంతకంటె కూతుర్ని అల్లుణ్ణి ఒకసారి యిక్కడికి తీసుకు వస్తే, బాగుంటుంది. వారికి ఆదరఅప్యాయతలతో తగిన యేర్పాట్లు తాను చేస్తుంది. అలా అయితే రాసమణి మనుమరాల్ని, మనుమరాలి మొగుణ్ణి చూడటం జరుగుతుంది.

శ్యామ యీ కఠినమైన ఉత్తరానికి సిద్ధంగా లేదు. ఆమె యింకా చాలా యెక్కువ ఆశపెట్టుకుంది. కాని యేమీ పొందలేకపోయింది. అయినా ఊరికే రావడంకూడా ముప్పాతిక లాభం. మంగళ కొంత అప్పు యిస్తుంది. హేమకూడా తాను పౌరోహిత్యం చేసే యిళ్లల్లో - అడిగి, అర్థించి కాస్త యేదో తీసుకురాగలడు. ఎలాగో అలా ఒకరకంగా అయిపోతుంది.

ఏమీ యివ్వలేనని చెప్పినా శ్యామకి విముక్తి కలగలేదు. అత్తగారు బతికే ఉంది. మరీ యెక్కువగా గీసిగీసి తగ్గించాలని చూస్తే బహుశా సంబంధం చెడిపోవచ్చు. అప్పుడు మామగారుకూడా బహుశా వెనక్కి తగ్గచ్చు. నూటఒక్కరూపాయలు రొక్కం, యెనిమిది గాజులు, అల్లుడికి ఉంగరం, పట్టుబట్టల జత - ఇహ లాంఛనాలు ఉండనే ఉన్నాయి. అన్నీ కలిపి చాలా అవుతుంది. కాని గత్యంతరం యేముంది?

శ్యామ ఒక్కసారి చివరి ప్రయత్నం చేసి చూసింది.

ఇంద్రిల పెళ్లి నిశ్చయమయాక కలకత్తా వచ్చింది. ఆశీర్వాదం కోసమని తీసుకెళ్లవలసి వచ్చింది. శ్యామే స్వయంగా తీసుకుని వచ్చింది. కలకత్తాలో కావల్సినవి కొని హేమ తీసుకువెడతాడు. వాళ్లు కూడా మళ్లీ అతడితో తిరిగివస్తారు.

శ్యామ నడిచే వచ్చింది. ఎప్పుడూ అలాగే వస్తుంది. చంటిబిడ్డ కాంతను బుజాన యెక్కించుకుని నడవాల్సివచ్చింది. కాని అంతకంటె ఉపాయం యేముంది?

"నువ్వు యింత దూరం శ్రమపడి రావలసిన అవసరం యేమొచ్చింది. చిన్నక్కా ?" అని ఉమ మృదువుగా మందలించింది.

"రాకపోతే యెలాగే ! అలా అని పెళ్ళికి ముందు మిమ్మల్ని ఒకసారి కలుసుకో అఖ్ఖర్లేదా ?"

శ్యామ బడలిక తీర్చుకుని, భోజనం చేసి తల్లి దగ్గిరకి వచ్చి కూచుంది.

రాసమణి యించుమించు పూర్తిగా మంచంలో పడింది. ఆ రోజున జ్వరం రాలేదు. అయినా పడుకునే ఉంది. శ్యామ పక్కమీదికి వచ్చి కాసేపు మెదలకుండా కాళ్లు నిమురుతూ కూచుని "అమ్మా : నిన్నిక్కడ నుంచి సరాసరి బండి చేయించి తీసుకెడతాను. రాలేవా నువ్వు ? పెళ్లి చూడటానికి ?" అని అడిగింది.

రాసమణి కళ్లు మూసుకుని పడుకుని ఉన్నది - అలాగే పడుకుంది. ఆమె ముక్తసరిగా 'వద్దు' అన్నది.

"ఏం యెందుకని ?" అని మళ్లీ అడిగింది శ్యామ.

"ఇష్టంలేదు" ముక్తసరి జవాబు.

కొంచెంసేపయాక కళ్లు తెరిచి - "అల్లుడింటికి నేను రానని నీకు బాగా తెలుసుగా అమ్మ ! నా శరీరంకూడా తట్టుకోలేదు. నువ్వు అందుకు రాలేదు. నీ ఉద్దేశం యేమిటో దాపరికం లేకుండా చెప్పు, నన్ను నువ్వు కడుపున కనలేదు. నిన్ను నేను కడుపున కన్నాను. నన్ను మభ్యపెట్టలేవు" అన్నది.

శ్యామ కొంచెం బాధపడింది. నిజంగా అంతా తన స్వార్థమే ! చిన్నక్కదంతా పూర్తిగా స్వార్థమే. ఆమె కంతకంటె మరో ఆలోచనే లేదు, అని ఉమ బహుశా రాత్రిం బగళ్లు చెప్పి చెప్పి ఉంటుంది.

శ్యామ చూస్తే బాగా దెబ్బతిన్నట్లు కన్పిస్తుంది. చెప్పతలచుకున్నవన్నీ కొన్నిక్షణాలు మనస్సులోనే పొందికగా కూర్చుకుని వచ్చింది. అంతా పాడుచేసింది దౌర్భాగ్యపుపిల్ల. ఇక్కడికి వచ్చే ముందు శ్యామ మంగళ మాట్లాడుకున్న సంగతులు కొంచెం కొంచెం ఆ పిల్ల చెవిన పడ్డాయి." "అమ్మ యెందుకు వచ్చిందో తెలుసా అమ్మమ్మా ? లాంఛనాలుగా యిచ్చే సామానులు వీలయితే రాబట్టుకోటానికి" అని చెప్పింది.

"చిన్నదానివి నువ్వు. ప్రతిదాంట్లోనూ పెద్ద పెద్ద మాటలు మాట్లాడతావ్ దేనిక ? వెళ్లు యెదురుగా కూచోకు, బయటికి వెళ్లు, చెపుతున్నా. దౌర్భాగ్యపుకోతివి యెక్కడో !"

తర్వాత కాసేపు ఆగి, అటువైపు గోడకేసి చూస్తూ "నిజమే అమ్మా! నేను వారినీ వీరిని అర్థించి కూతురి పెళ్లి చెయ్యవలసి వచ్చినప్పుడు, యింక మొహమాటపడితే యెలా సాగుతుంది? సామాన్లు కనుక కొన్ని యివ్వ గలిగితే - నిజంగా పెద్ద ఉపకారం చేసిన దానివవుతావ్?" అన్నది.

"అది యిప్పుడుపడదు అమ్మాయీ!" అని మళ్లీ ముక్తసరిగానే చెప్పింది రాసమణి.

ఈసారి శ్యామ సహనం యింక కట్టలు తెంచుకుంది. "నీకు ఓ భోషాణంనిండా ఉన్నాయి సామానులు. నేను వాటిలో రెండు తీసుకో కూడదా? నాకూ వాటిలో ఒ భాగం ఉందిగా!"

రాసమణి ఈసారి శ్యామకేసి కళ్లు విప్పార్చుకుని చూసింది. నేను బతికి ఉండగా, నీకు భాగమేమిటి? అదీకాక నేనింకా యెన్నాళ్లు బతుకుతానో తెలియదు. బహుశా అవి అన్నీ అమ్ముకుని తినాల్సి వస్తుందేమో! మనిషి జీవితంలో చావు యెప్పుడు వస్తుందో చెప్పలేం. ఉహూఁ. వాటిని నేనిప్పుడు చెయిజారి పోనివ్వతలచుకోలేదు" అన్నది.

శ్యామకి తల్లి స్వభావం తెలుసు. ఆమె ఆ కంఠస్వరం విన్నాక, ఇంకేం మాట్లాడటానికీ ధైర్యం కలగలేదు. మనస్సులో బాధపడుతూనే యాభైరూపాయలు, కమ్మల జత తీసుకుని చెంగున మూటకట్టుకుంది. ఉమకి మాత్రం విముక్తి కలగలేదు. కేవలం పదిహేనురూపాయలివ్వటంతో తీరి పోలేదు. ఒకటి రెండు చిన్న వస్తువులు కొని యివ్వాల్సివచ్చింది. పాఠాలు చెప్పే పిల్లల యిళ్లల్లోంచి, నాలుగయిదు రూపాయలు అడ్వాన్సు తీసుకుని యివ్వవలసివచ్చింది.

ఐంద్రిల చివరిదాకా ఉమ రావటానికి ఒప్పుకుంటుందని ఆశపెట్టు కుంది. ఈ కొన్నేళ్లలో ఉమతో అనుబంధం పెరిగింది. తిరిగివెళ్లేప్పుడు "నువ్వు నిజంగా రావా పిన్నీ! అమ్మో, రాకపోతే యెలా?" అన్నది.

"రావే ఉమా! నీ కూతురిదేనే పెళ్లి!" అన్నది శ్యామ.

ఉమ తలవంచుకుని మెల్లిగా "నానీడ యే పెళ్లిలోనూ పడకూడదు చిన్నక్కా! వాళ్లందరూ కావలసినవాళ్లు. పరమశత్రువయినా సరే, పెళ్లిలో నా మొహం చూడకూడదు" అన్నది.

శ్యామ యీ మాటకి సరియైన సమాధానం చెప్పటానికి సంసిద్ధురాలై లేదు. ఈమాట అన్నాక, ఇంకా బ్రతిమాలటానికి ఆమెకి నోరురాలేదు. కాసేపు మాట్లాడకుండా తలవంచుకుని ఊరుకుని ఒక్క నిట్టూర్పువిడిచి దిగి వెళ్లింది.

ఏం జరిగిందీ ఇంద్రిల సరీగ్గా తెలుసుకోలేకపోయింది. ఉమ కంఠస్వరం వినటంతో, అకారణంగానే ఆమెకికూడా గుండెలుపొంగి, కళ్ల నిండా నీళ్లు తిరిగాయి. ఆ పిల్లకి పిన్నిమాటలన్నీ అర్థంచేసుకునేంత వయస్సు లేదు. అన్నీ వినుకూడా వినలేదు. ఆమె రోజూ నవ్వుతూ ఉత్సాహంగా ఉండే ప్రవర్తన వెనుక, శోచనీయమైన వ్యర్థజీవితచరిత్ర ఉందని, అందులోని యే చిన్న తునకయినా సరే, ఆడదాని జీవితంలోని సుఖ సౌభాగ్యాలను హరించగలదని మాత్రం తెలుసుకుంది. అందుకని పిన్ని తన పెళ్లిలో ఆమె దౌర్భాగ్యపునీడ కూడా పడనీయతలచుకోలేదు.

మెట్లు దిగి వస్తూ వస్తూ, తన భావిజీవితం విషయంలో, యేదో ఇదమిత్థం అనిచెప్పలేని భయం తనకి తెలియకుండానే మనస్సుని తొలచ సాగింది. అది ఆమె అంతగా తెలుసుకోలేకపోయింది. ఆమె మనస్సు మాత్రం చాలాసేపు బరువెక్కి ఉండిపోయింది.

## 4

పెళ్లి అయిన నెలరోజులలోగానే, శ్యామ ఒకరోజున కూతుర్నీ అల్లుణ్ణి తీసుకుని వచ్చింది. మహాశ్వేత పెళ్లి అయింతర్వాత వీరు ఆహ్వానించటంతో ఆమె ఒకసారి వచ్చింది. నిజమే కాని, అప్పుడామె ఒక్కతే వచ్చింది. ఇలా ఆడంబరంగా కూతుర్నీ అల్లుణ్ణి తీసుకుని శ్యామ యెప్పుడూ రాలేదు. హఠాత్తుగా ఆమెకింత ఆసక్తి కలగటానికి కారణమేమిటో - అర్థం కాక ఉమ యెన్నోరకాల అంచనా వేసుకోటానికి ప్రయత్నించింది.

శ్యామ ఒక కైఫియ్యతు సిద్ధంచేసుకునే ఉంది. తల్లి పరిస్థితి చూసి వచ్చిన మీదట ఖేందీ భర్తను తల్లికి చూపించగలనన్న ఆశ శ్యామకి లేదు. అందుకని హడావిడిగా కాళ్లు తొక్కుకుంటూ పరుగెత్తు కొచ్చింది. అదీకాక ఆ తర్వాతయితే అల్లుడికి మళ్లీ శెలవు దొరకాలికదా! ఈసారి ఆదివారంతో పాటు ఇంకొకరోజు శెలవు కలిసి వచ్చింది. అందుకని యింక ఆలస్యం చెయ్యలేదు. ఇంద్రిల మొగుణ్ణిచూసి ఉమ స్తంభితురా లయింది.

అసలు శివుడికి వ్యతిరేకం. నల్లగా మసిబారిన గిన్నెలతో వండి నవే తిననిది, నల్లచేపలు కంచంలో వేస్తేనే కంచం ముందునుంచి లేచిపోయే పిల్లకి యిలాంటి మొగుడా?

హరినాథ్ మరీ కారు నలుపు, ఎంత నలుపంటే చీకట్లో అతడికళ్లు ముఖం తెలుసుకోవటం కష్టం.

కాని మంచి ఆరోగ్యవంతుడైన యువకుడు. అలాగే నమ్రత, మంచి మర్యాద తెలిసినవాడు. ఏదయినా మాట్లాడేప్పుడుకూడా అభయపడ్ అంత గంభీరుడు మితభాషీ కాదు, నవ్వుతూ హుషారుగా ఉండే స్వభావం. కొంచెంసేపు మాట్లాడాక ఉమకి బాగా నచ్చాడు అల్లుడు. శ్యామకూడా మాటిమాటికీ - "చెప్పాలంటే ఈమె నీకు అసలు అత్తగారు నేను పిల్లనంటే కన్నాను అంతే!" అని అనటం మొదలెట్టేది. ఆమె ఈ అతిశయోక్తికి ఉమకి సిగ్గేసేది. ఆ మాటతో ఒక కుతూహలం కలగటం స్వాభావికం. ఉమ పుట్టింట్లోనే యెందుకు ఉంటోంది? ఐంద్రిల పెళ్లికి యెందుకు రాలేదు? ఆ ప్రసక్తి అంతా వచ్చిందో లేదో, హరినాథ్ విన్నాడో లేదో తెలియదు. ఒకవేళ వినేకనుక ఉంటే యెంత సిగ్గుచేటయిన విషయం!

ఛీ! భర్త అంగీకరించని స్త్రీయే గౌరవసమాజంలోనూ ముఖంచూపించటం భావ్యం కాదు.

కాని హరినాథ్ మాటల్నిబట్టి యేమీ తెలియలేదు. అతడు మామూలుగానే అవీ యివీ మాట్లాడుతూండేవాడు. రాసమణితో రెండు మూడు పరిహాసాలాడటానికికూడా ప్రయత్నించాడు. అయితే రాసమణి సహజమైన గాంభీర్యానికి, నిస్పృహ నిరాసక్త స్వభావానికి ఖంగు తినటంతో ఆ పరిహాసాలు ఫలించలేదు, అయితే రాసమణికి హరినాథ్ బాగానే నచ్చాడు.

ఆమె యెదురుగా కూచుని భోజనం చేయించింది. తలనిమురుతూ ఆశీర్వదించింది.

వారి యింటిని కుటుంబాన్ని గురించి రెండుమూడు ప్రశ్న లడిగింది రాసమణి. హరినాథ్‌కూడా అన్ని స్పష్టంగా చెప్పాడు. చాలాసేపు మాట్లాడుకున్నారు.

వారిది పెద్ద ఉమ్మడికుటుంబం. అతడి తండ్రి పినతండ్రులు యీ మధ్య వేర్లుపడ్డారు. కాని తండ్రి దావాలు, వ్యాజ్యాలు వెయ్యనీయలేదు. మూడు సమానవాటాలు వేసి, పినతండ్రుల్ని మీ యిష్టంవచ్చిన వాటా తీసుకోండి అన్నాడు. వారు కోరుకున్న వాటాలే తీసుకున్నారు. అందువల్ల మాధవఘోషాల్ యేమీ వంచితుడు కాలేదు. పైగా కొంచెం విజయాన్నే సాధించాడు. వాళ్లందరూ రైల్వేలో ఉద్యోగాలు చేస్తూంటారు. ఒక్కచిన్న తమ్ముడుమాత్రం స్కూల్లో చదువుతున్నాడు. వారికి ఉన్న పొలంమీద యేటా భోజనానికి సరిపోయే ధాన్యం వస్తాయి. ఆవులూ, గేదెలూ ఉన్నాయి. మేకలు, గొర్రెలు కూడా ఉండేవి. కాని వారి గురువులువచ్చి. మేకల్ని పెంచటం పూర్వాచారాలను ధ్వంసం చెయ్యటమే అని వాదించారు. అందు

కని తండ్రి వాటిని వదిలేశాడు. మొత్తానికి వారిది సుఖసంసారం. ఒక ముసలమ్మ ఉంది తండ్రి మేనత్త. ఆమెకూడా మంచిదే. తనలో తాను గొణుక్కుంటుంది. అంతేకాని యెక్కువగా తగవులకి పోట్లాటలకు దిగేమనిషి కాదు.

హరినాథ్ అనర్గళంగా మాట్లాడేస్తున్నాడు.

పెళ్లికేంతక్కువ విఘ్నాలు వచ్చాయనా? పెళ్లి అసలు ఆగిపోవాల్సింది. పెళ్లికి సరీగ్గా రెండు రోజులు ముందు - అతడి ఒక తమ్ముడు విపిన్ శివపూర్‌నుంచి వస్తునాడు. దారిలో ఒక పోలీసుకేసులో యిరుక్కున్నాడు. కొందరు స్వదేశీఉద్యమం యువకులు ఆ దారినే వస్తున్నారు. అతడు కన్పించటంతో అతడితో కలసి మాట్లాట్టం మొదలెట్టారు. విపిన్‌కి అంతయేమీ తెలియదు. హఠాత్తుగా పోలీసులు వచ్చి, వారిని చుట్టుముట్టారు. వారిమీద మూడునేరాలు మోపారు. దోపిడీ, హత్య - ఇంకేదో ఒకటి. ఆ వార్త యింట్లో తెలియటంతో ఇంట్లో ఒకటే యేడుపులు, శోకాలు! వాళ్ల నాన్న వెంటనే ఠాణాకి పరుగెత్తారు. అదృష్టవశాత్తూ పెళ్లి వస్తువుల జాబితా ఉంది.

పోతే దోపిడీ జరిగిన రోజున అతడు ఆఫీసులో ఉన్నాడు. అది దొర స్వయంగా రాసి యిచ్చాడు. అందువల్ల యెలాగో లంచమదీ యిచ్చి మాధవబాబు విడిపించి తీసుకురాగలిగాడు. అయితే ముప్ఫయి గంటలు పోలీసుల ఆధీనంలో ఉండవలసివచ్చింది. విపిన్ కనుక విడుదల కాకపోతే - బహుశా పెళ్లే జరిగేదికాదు. వాళ్ల అమ్మకి కొడుకులంటే చాలా ప్రేమ కదా!

హరినాథ్ యిలా యెన్నో సంగతులు చెపుతున్నాడు. రాసమణి అర్ధనిమీలితదృష్టితో, అన్నీ వింటోంది. ఆమె ఇహలోకంనుంచి యాత్రకి సంసిద్ధురాలై, ఒక అడుగు ముందుకు వేసి ఉంది. ఈ మాటలన్నీ యేదో పసివాడి కంఠంలోంచి వచ్చేముద్దుమాటల్లా విన్పిస్తున్నాయి. వింటూంటే తియ్యగానే ఉన్నాయి. వీరిది ఆశా - ఆకాంక్షలతో నిండిన నవీనజీవితం. వీరు దీర్ఘజీవులు కావాలి! జీవితాన్ని అనుభవించాలి. వారిలో ఉడుకురక్తం ఉందనే భయం వేస్తోంది. వారి జీవితాల్ని దరిద్రం, దౌర్భాగ్యం స్పృశించకుండా ఉండాలి. సుదూరప్రసారితమైన వారి జీవితపథం ఛాయాశీతలం కావాలి. ముళ్లు అనేవేవో తల్లీకూతుళ్ల జీవితాలతోనే పూర్తి అయిపోయాయి. మృత్యువు నిలిచిన ఆమె కళ్లలో స్నేహమూ - ఆశీర్వాదమూ అణగిపోయాయి.

## 5

ఉమ యెవరూ లేనప్పుడు ఇంద్రిలను పట్టుకుని - "ఏమే ! వరుడు నీకు నచ్చాడా ? నిజం చెప్పు" అని అడిగింది.

ఇంద్రిల తెల్లటి బుగ్గలు రెండూ యెవరో గులాంచల్లి నట్లయాయి. సిగ్గుతో తల కిందికి దించుకుంది. అయితే ముదినాపసానిలా "అదేమిటి ? నచ్చకపోతే మాత్రం తప్పే దేముంది ? అయినా ఆడదానికి నచ్చటం నచ్చకపోవటం యేమిటి చెప్పు ? అది ఒక జన్మకి సంబంధించింది కాదు. అదేం చీరె, జాకెట్టు కాదు నచ్చకపోతే వదిలెయ్యటానికి ? ఇది జన్మాంతర సంబంధం" అన్నది.

ఉమ ముఖంకూడా యెర్రపడింది.

జన్మాంతరసంబంధమేనా ? అయితే జన్మజన్మలకీ తాను యీ అభి శాపాన్ని మోస్తూనే వస్తోందా ? ఇంకా మోస్తూనే ఉండాలా ? కాని యీ ఆడ వాళ్లందరూ జన్మజన్మలకీ తమ భర్తలను అనుసరిస్తూనే ఉన్నారా ? అతడిది జన్మాంతర సంబంధం అయితే. యే శాపంవల్ల యీసారి యింత తక్కువ యింట్లో పుట్టాడు. కాని యే అపరిమితమైన ఆసక్తి ప్రేమ భర్తను కిందికి లాక్కెళ్లింది. అయితేమరి ఉమ సంపర్కం యెలాంటిది ?

అంతు దొరకని ప్రశ్నలెన్నో మనస్సులో ఒక్క నిమిషంలో అలా లేచి మళ్లీ అణగిపోయాయి. కాసేపట్లో తనను తాను సంబాళించుకుని నవ్వుతూనే "అయితే యింత నలుపుని యెప్పుడైనా చూశావా ? నల్లటి వస్తువుని చూసి యెంత విమర్శించేదానివి ! నల్లచేపల్నే తినే దానివి కావు, ఇంత నల్లటివాణ్ణి యెలా సహిస్తున్నావు ? అని" అని ప్రశ్నించింది ఉమ.

ఇంద్రిల చేతులు త్రిప్పుతూ - "ఈ సిగ్గయిన సంగతి యింక అడగకు పిన్నీ ! నలుపు అని విన్నానంతే ! పెళ్లి సమయంలో సరీగ్గా తేరిపార చూడలేకపోయాను. భయంతో, సిగ్గుతో కళ్లేవో మూసుకు పోయినట్లయినాయి. కళ్లెత్తి యెలా చూడను. శుభదృష్టి సమయంలో ఒకసారి కళ్లెత్తి చూశాను, కాని నిజం చెప్తున్నా పిన్నీ ! అప్పుడూ సరీగ్గా కన్పడలేదు. లాంతరువెలుతురులో అంతా మసకమసకగా అయోమ యంగా అయిపోయింది. మర్నాడు తలపూర్తిగా వంచుకుని కుచున్నాను, అమ్మ ముందుగా 'జాగ్రత్త ! తల యెత్తకు తలెత్తావంటే పెళ్లి కూతురు సిగ్గు లేనిదంటారు' అని చెప్పింది. ఒక్కసారి పూలపాన్పు నాటిరాత్రి మాత్రం సమయం దొరికింది. అందరూ పొంచి చూస్తారని గ్రహించి నేను జాగ్రత్తగా

ఉన్నాను. నేను పక్కలో దిండులో తలదూర్చి నిద్రపోతున్నట్లు నటిస్తూ పడుకున్నాను. ఊరికే నటనే. రాత్రి చాలా ప్రొద్దుకూడా పోయింది. నిజంగా నేనెప్పుడు నిద్రపోయానో నాకే తెలియదు"

ఒక్కగుక్కలో అన్నిమాటలూ చెప్పేసింది. ఇంద్రిల దమ్ముతీసుకో టానికి ఆగినట్లుంది. కాని ఆగితే వీల్లేదు ఉమకి. ఈ బాలిక అనందపు మత్తు తన మనస్సుకి పట్టుకుంది. ఆమె యెంతో ఆసక్తితో "ఊఁ తర్వాత ?" అని అడిగింది.

"తర్వాత అర్థరాత్రి వేళ దానంతటదే నిద్రమెలకువ వచ్చింది. కంగా రుగా లేచి కూచుని సరీగ్గా చూశాను. అమ్మో ! చెపితే నువ్వు నమ్ముతావో నమ్మవో కాని పిన్నీ ! సరీగ్గా నా పక్కన దున్నపడుకుని ఉంది. నా కెంతో భయమేసింది. వెక్కివెక్కి యేడవటం మొదలెట్టాను, కాని ఆయన చాలా చతురులు తెలుసా ? నా యేడుపు ధ్వనికి ఆయనకుకూడా మెలకువ వచ్చింది. ఇంకేం లేదు, మెలకువ రాగానే అసలు సంగతేమిటో గ్రహిం చారు. లేవగానే ఒకసారి మంచం దిగి వెళ్లి గదిలో ఉన్నదీపాన్ని ఉఫ్‌న ఊది ఆర్పేసి, మళ్లీవచ్చి మంచంమీద పడుకున్నారు. నా రెండు చేతులూ పట్టుకుని "భయమెందుకు ? నన్నుచూస్తే నీకు భయం వేస్తోందా ? నేనేం పెద్దపులినా ? యెలుగుబంటినా ? చూడు, ఇంకెప్పుడూ యిలా భయపడకు" అన్నాడు.

"అప్పుడు నువ్వేమన్నావ్ ?" ఊపిరి బిగపట్టుకుని అడిగింది ఉమ. అప్పుడు నాకు మరో భయం పట్టుకుంది "మీరేమిటి దీపాన్ని ఉఫ్‌న ఊది ఆర్పేశారు ? అమంగళంకాదూ ? పూలపాన్పు రోజున దీపాన్ని ఆర్ప కూడదు" అన్నాను.

అప్పుడు ఆయన నా తల ఒళ్లు నిమురుతూ, "ఇంకా రాత్రి యెక్కడుంది ? తెల్లవారటానికి యెంతోసేపు లేదు. నువ్వు కావాలంటే దీపం మళ్లీ వెలిగిస్తాను. కాని నన్ను చూసి భయపడవుకదా !" అన్నారు. నేనప్పుడు "ఇంద్రిల ముఖమంతా సిగ్గుతో యెర్రపడిపోయింది. మాట సగంలోనే ఆగి పోయింది. ఉమకూడా యింక ప్రశ్నించలేదు. కాసేపు మెదలకుండా ఊరుకుంది. "ఆఁ అల్లుడు మాత్రం చాలా మంచివాడు. నాకు చాలా నచ్చాడు" అన్నది.

ఇంద్రిల మళ్లీ ఉత్సాహంతో, అరమరిక లేకుండా "ముమ్మాటికీ ఆయన చాలా మంచివారు పిన్నీ ! యెంత మంచివారో పైకి చూస్తే తెలుసుకో

కోలేరు ఆయనకి అలవాటుంది తెలుసా? 'నేను ఆపాడువన్నీ యెందుకు తినటం? నోరుపాడు వాసనేస్తుంది' అన్నాను. అప్పటినుంచి రాత్రి భోజన మయాక అసలు తినటమే లేదు - నోరెక్కడ వాసనేస్తుందో అని. మళ్లీ నాకు జాలేసింది. 'పోనీ తినండి మీ కెన్నాళ్లనుంచో అలవాటుందిగా' అన్నాను. అయినా తినటంలేదు, నా అలవాటు యెక్కువకాదు, నీ కష్టం యెక్కువ అన్నారు.

ఉమకి గుండెలదగ్గిర శ్వాస ఆగిపోయిందా యేం?

"నువ్వు కాపురానికి యెప్పుడు వెడతావ్? యేడా దయాకనా?" అని అడిగింది.

ఐంద్రిల అటుయిటు చూసి, చెవిలో రహస్యంగా "అమ్మ అలా అనే అన్నది. నాకు మాత్రం అది యిష్టంలేదు బాబూ! 'మీరు బలవంతం చెయ్యండి' అని చెప్పానాయనతో. ఆయన పట్టుపడితే అమ్మ యింక ఆపదు. 'ధూలో పాయే దిన్' ఉందిగా! అక్క పెళ్లి అయినప్పుడు అలాగే జరిగింది. కాయస్థుల అక్క 'యీసారి కూడా అలా చెయ్యండి' అని చెప్పింది. అసల సంగతేమిటో తెలుసా పిన్నీ! మొదట్లో అత్తారింట్లో ఒక్క రోజు కూడా ఉండలేను అనుకున్నాను. ఇప్పుడది తారుమా రయింది. ఇప్పుడు వారిని ఒక్క క్షణంకూడా విడిచిపెట్టి ఉండటానికి యిష్టం లేదు. మనస్సెలాగో ఉంటుంది" అన్నది.

ఉమ ముఖం మ్లానమయింది. అయినా కుతూహలంతో "వారెవరే?" అని అడిగింది. ఐంద్రిల నవ్వు ఆపుకుంటూ ముఖం అటు త్రిప్పుకుని నిర్లక్ష్యంగా "ఇంకెవరు? ఆ అడవి మనిషి" అన్నది.

..............

శ్యామ కూడా యెవరూ లేనప్పుడు ఉమని వచ్చి పట్టుకుంది.

"అవునే ఉమా! నిన్నటి నుంచి ఒకమాట డుగుదా మనుకుంటున్నాను. అమ్మ యేమో మంచంలో పడింది. నీకేమో బయట నాలుగయిదు గంటలు పని. కాస్త చేతికింద ఉండటాని కెవరినయినా పెట్టుకోవాలికదా! నేననేది యేమిటంటే - తరూని పంపిస్తాను. ఏమంటావ్?" అని అడిగింది.

ఉమ చేతులు రెండూ జోడించి "ఈ విషయంలో మాత్రం క్షమించు అక్కా! ఇంక వద్దు. భగవంతుడు యివ్వనిదాన్ని బలవంతంగా పొందటం యిష్టం లేదు. నాకు ఐంద్రిల వెళ్లిపోయినప్పుడు వారంరోజులు నిద్ర పట్టలేదు. వద్దు. నా కదంతా వదిలిపోయింది" అన్నది.

శ్యామ అప్రసన్నముఖంతో - "అమ్మకి జబ్బుగా ఉంది కదా అని అన్నాను కాని అంతకంటె యేముంది? చదువు నేర్చుకుంటుందని ఆశ పెట్టుకోలేదు. ఖేందీ యెంత నేర్చుకుంది? అయినా వాళ్లని చదివించగలమా? జీతం యిస్తే అప్పుడొస్తుంది ఉత్సాహం" అన్నది.

ఉమ సమాధానం చెప్పబోయికూడా తమాయించి ఊరుకుంది. ఆమె మామూలుగానే "అమ్మకోసం బెంగపెట్టుకో అఖ్ఖర్లేదు. పెద్దక్క మధ్యాహ్నమప్పుడు వచ్చి ఉంటుంది. ఈసారి యింక అక్కను యిల్లు ఖాళీ చేసి, యిక్కడకి వచ్చి ఉండమని బలవంతం చెయ్యతలచుకున్నాను" అన్నది.

అక్క - గోవింద్!

అమ్మ యెప్పుడు చచ్చిపోతుందో అప్పుడు శ్యామకి కబురుకూడా అందదు. బహుశా చనిపోయేముందే అమ్మకి బుద్ధి పుట్టి, ఉన్నవేవో వాళ్లందరికీ పంచి యివ్వొచ్చు. చెప్పలేం, చనిపోయే ముందు మతి ఉండదు అని సామెత ఉంది అమ్మ దగ్గిర యింకేమీ లేదు అన్నది నిజం కాదు. అప్పుడు యీ ప్రవృత్తి యిలాగే ఉండదు. ఇంకా మరో సారి ప్రయత్నం చేసి చూసింది: శ్యామ. "అక్క కనుక వస్తే సౌకర్యంగానే ఉంటుంది. చేతికింద -"

ఉమ మెదలకుండా ఊరుకుంది.

"అక్క వచ్చి ఉంటుందో లేదో అడుగుతాను." శ్యామ కొంతవరకు తనలో తాను అనుకుంటున్నట్లు అన్నది.

"నీకో నమస్కారం చిన్నక్కా, నన్ను వదిలెయ్. నీ కాళ్లు పట్టుకుంటాను. నేనింక యీ బాధలన్నీ సహించలేను."

"నాకేమిటో తెలియకుండా ఉందే! అయినవాళ్లంటే అసహ్యం. పరాయివాళ్లు మంచివాళ్లు. ఇంకా ముందు యెన్ని చూస్తానో! నువ్వు నా పిల్లల్ని యెందుకు సహించలేకపోతున్నావో తెలియదు. వాళ్లు నీకేం చేశారు?"

శ్యామ కోపం తెచ్చుకునే అక్కడనుంచి లేచి వెళ్లిపోయింది. ఉమ అక్కడే కూచుని కొయ్యబారిపోయింది.

బహుశా ఆ మాటలన్నీ అనవలసిన అవసరంలేదేమో; కాని శ్యామ నిజంగానే అనకుండా ఉండలేకపోయింది.

# ఇరువదవ పరిచ్ఛేదం

## 1

రాసమణి రోజు రోజుకీ మంచానికి అంటుకుపోతోంది. ఇంక ఆశ లేదని ఉమకూడా ఒక సమయంలో గ్రహించింది. గ్రహించటంతో ఆమె గుండె ఒక్కసారి యేదో మంచుగడ్డలా అయిపోయింది. తన ఆశ్రయం, అవలంబనం రెండూ ఒక్కసారిగా జారిపోతున్నాయి.

కాని ఆమె యేం చెయ్యగలదు ?

ఎంతో కష్టంమీద ఆమెకి నచ్చచెప్పి హెూమ్యోపతి డాక్టర్ని మానిపించి, ఆయుర్వేద వైద్యుణ్ణి పిలిపించటం జరిగింది. ఆయుర్వేద వైద్యుడి తర్వాత డాక్టరు. రాసమణి జీవితంలో యెప్పుడూ యింగ్లీషు మందు తీసుకోలేదు. చాలా అభ్యంతరం చెప్పింది. చివరికి ఉమ కన్నీళ్లే ఆమెని ఒప్పించాయి. నిజానికి చెప్పాలంటే పాపం ఉమని నడి వీథిలో కూచోపెట్టి వెళ్లిపోతోందామె. ఆమెని పట్టుకుని ఉంచాలని ఉమ ప్రయత్నం చెయ్యటం సహజం. డాక్టర్ని పిలిచి కాస్త మనశ్శాంతి పొందితే పొందనీ ! చాలా ఘాటు, చేదయిన డాక్టరు తేజంకర్ మందులు వేసుకుంటే ఆమెకి డోకు వస్తోంది. కళ్లవెంట నీళ్లొచ్చేవి. అయినా బల వంతంగా మింగేది.

కాని వీటివల్ల యేమీ ప్రయోజనం లేకపోయింది.

జ్వరం నియమంగా సాయంత్రం వచ్చి, చీకటి పడ్డాక కొంతసేపటికి తగ్గేది. అపరిమితమైన నీరసం మాత్రం అలాగే ఉండిపోయేది. ఈ స్థితిలో "నిన్ను దేవఘర్ తీసుకెడతాను రామ్మా ! ఉన్నవన్నీ అమ్మి అయినా సరే నయం చేయించి తీసుకొస్తాను. దేవఘర్ గాలి చాలా మంచిదని విన్నాను. వెళ్లినవాళ్లందరూ నయమయి తిరిగి వస్తుంటారు: బద్రీనాథుని దయవల్ల నీకు తప్పకుండా నయ మవుతుంది" అన్నది.

రాసమణి నవ్వింది - "నీకేం పిచ్చా యేమే ? నేను శవాన్ని. శవాన్ని తీసుకుని యెక్కడి కెడతావ్ ? వెడుతూనే దారిలో అయిపోతాను. వద్దు. బలవంతంగా లాక్కెళ్లాల్సిన అవసరం లేదు." కమలకూడా పట్టుపట్టింది. "రామ్మా ! పోనీ సెకండ్ క్లాసులో పడుకోపెట్టి తీసుకెడతాను. అందులో అంత జనం, గుంపు ఉండరు. ముందుగానే రిజర్వ్ చేయిస్తాను. అంతగా అయితే నా నగ ఒకటి అమ్ముతాను".

ఆమె మాట పూర్తిచేసే లోపుగానే రాసమణి గద్దించింది. "నువ్వు నాకోసం యెవరి నగ అమ్ముతావో చెప్పు. ఇవి నీ కొడుకు నగలు. కుర్రవాణ్ణి నువ్వు పైకి తీసుకురావాలి. కాట్లో శవాన్ని కాటికి తీసుకెళ్లే ప్రయత్నం చెయ్యి. ఇంకా యెందుకు? అన్నం నోటికి చేదయినదాన్ని నేనింకా బ్రతుకుతానా? నాకు నూకలు చెల్లిపోయాయ్"

నూకలు చెల్లిపోయాయి అనటానికి యితర లక్షణాలు కూడా క్రమంగా కన్పించాయి.

పసిపిల్లలా అయిపోయింది. ఆ గాంభీర్యం, స్థయిర్యం యేదో యెక్కడికో పోయినట్లున్నాయి. ఆ మనిషే యీమె అని యెవరు చెప్ప గలరు? ఆమె కెప్పుడూ తిండిమీద వ్యామోహం వుండేదికాదు. క్రమంగా అదీ కన్పించసాగింది. ఎప్పుడు అపథ్యాన్నే తింటా ననేది. పెట్టకపోతే కోపం తెచ్చుకునేది. డాక్టరు గుజ్జులా వండిన అన్నం తినమన్నాడు. 'కాంచ్‌కలా ఝోల్' (ఒక రకమైన పల్చగాఉండే వ్యంజన పదార్థం). కాని దాన్ని చూడగానే కోపంతో మండిపడేది. చేతిలో యేదిఉంటే దాంతో అన్నిటినీ పగలగొట్టేది. యేడ్చి మారాం చేసేది. పాలు తాగమని గ్లాసు నోటి కందిస్తే పళ్లు గట్టిగా కరచుకుని, మూతి బిగించుకునేది. ఏకాదశి రోజు ఒక్కటి మాత్రం తరచుగా జ్ఞాపకం ఉండేది. "ఏకాదశి యెప్పు డయింది? మీరు యేకాదశి రోజున నాకు భోజనం పెట్టటం లేదు కదా!" అని అడిగేది.

వాళ్లు ముగ్గురు నచ్చచెప్పటానికి ప్రయత్నించేవారు. "ఇంతకాలం యేకాదశి ఉపవాసాలు చేస్తూనే వచ్చావు, ఒంట్లో వోపిక తగ్గినప్పుడు ఇంక యిప్పు డెందుకు? 'ఆతురే నియమో నాస్తి'" అనేవారు. కాని రాసమణి యెన్ని చెప్పినా సమాధానపడేది కాదు. "ఇన్నాళ్లు యేకాదశులు ఉన్నదాన్ని యిప్పుడు మానెయ్యనా? ఈ కొద్ది రోజులకోసం: ఏమిటి లాభం? తనువు వెళ్లిపోవటానికి సిద్ధంగా ఉంది. దాన్నింకా రెండురోజులు ఆపటం కోసం ధర్మాన్ని వదిలెయ్యనా?" అనేది.

గత్యంతరం లేక అబద్ధం చెప్పవలసివచ్చేది. 'ఇంకా ముందు ఉంది' అని చెప్పి దాటేసేవాళ్లు. కొద్దిరోజులయాక 'ఏకాదశి యెప్పుడో వెళ్లి పోయిందిగా!' అనేవాళ్లు.

"అదేమిటి? నాకెందుకు చెప్పలేదు?" అనేది రాసమణి.

"ఆఁ. ఏకాదశి ఉన్నావు. నీకీ మధ్య మరీ మతిమరపు వచ్చింది."

చిన్నపిల్లలాగా ఊరికేనే సమాధానపడేది సహజంగా. "అవును, అయివుండొచ్చు. చావబోయేముందు మనిషికి మతిమరుపు వస్తుంది. అందరూ పొరపాటు పడుతూంటారు. ఏదయినా జ్ఞాపకం ఉంటుందా? ఏదీ వుండదు" అనేది.

ఒకనాడు సరిగ్గా యేకాదశి ముందురోజున హఠాత్తుగా - "పంచాంగం తీసుకురండి. నేను చూస్తాను" అన్నది.

తప్పనిసరి అయి పంచాంగం తీసుకురావలసి వచ్చింది. చేతులు వణికాయి. పంచాంగం పట్టుకోలేకపోయింది. గోవిందు ఆమె గుండెలకి దగ్గిరగా కొంచెం యెత్తి పట్టుకున్నాడు. చూపు అలుక్కునిపోయిన ట్లయింది. సరిగ్గా యేమీ కనపడలేదు. అతికష్టంమీద బాగా దూరంగా పట్టుకుని చూస్తే, తారీఖులవీ యేదో కలిసిపోయినట్లయాయి. చివరికి గోవిందుని "ఇవాళ యే తారీఖో చూడు. అబద్ధం చెప్పావంటే యింక యెప్పుడూ నీతో మాట్లాడను" అన్నది.

కమల కనుసైగ చేస్తే, గోవిందు అది గమనించలేదు. చెప్పేశాడు తారీఖు.

రాసమణి లెక్కపెట్టి చూసుకుని, "రేపే యేకాదశి. సరిగ్గా వచ్చింది. జ్ఞాపకం పెట్టుకుంటాను" అన్నది.

మర్నాడు ఆమెనింక యేమీ తినిపించటం సాధ్యం కాలేదు. సాయంత్ర విపరీతమైన జ్వరం మూలంగా దాహంతో గుండెదాకా యెండి పోయినప్పుడు, ఆయాసపడుతూ "కాసిని గంగనీళ్లు ఇయ్యి ఉమా! గంగా జలం దోషం లేదంటారు. ఇంక ఆగలేకుండా ఉన్నాను" అన్నది.

ఒక్క గుక్క గంగాజలంతో ఆరోజున పగలూ, రాత్రి గడిచాయి. ఆశ్చర్యం యేమిటంటే - వాళ్లెంత భయపడ్డారో, అంత యేమీ జరగలేదు. ప్రతిరోజూ యెలా ఉండేదో ఆ రోజూ అలాగే ఉంది.

## 2

మధ్య మధ్య పాతవ్యక్తులు మెరుపులా గుర్తుండేవాళ్లు.

జ్యేష్ఠమాసం మొదట్లో రాసమణి హఠాత్తుగా ఒకరోజున - "శ్యామకి కబురు చెయ్యి ఉమా! నేను బ్రతికుండగానే చిన్నం - చితుకు యేమున్నాయో వాటిని భాగాలు చేసి పంచి యిచ్చి పోతాను. లేకపోతే దాని స్వభావం నేనెరుగుదును. మీరు దానితో నెగ్గలేరు" అని చెప్పింది.

ఉమ నిస్పృహతో, "అసలే నీరసంగా వున్న శరీరాన్ని ఎందుకమ్మా అనవసరంగా హైరాన పెట్టుకోవటం, పోనీ దాన్నే తీసుకోనీ. నాకెందు కింకా ?" అన్నది.

"నువ్వేదో పెద్ద గృహిణిలాగా నాకు చెప్పబోకు. నేను చెప్పినట్లు చెయ్యి. సామానులుంటే అవసర మొచ్చినప్పుడు అమ్ముకుని తినొచ్చు. జబ్బుచేస్తే డాక్టర్ని పిలిపించి చూపించుకోవచ్చు. నాకంటె నీకు యెక్కువ తెలుసా ?"

"దానికి పిల్ల లున్నారు" - ఉమ యింకా యేదో చెప్పబోయింది. "దానికి అవసరాలు ఎక్కువ."

"నేనింక నీతో వాగలేనే తల్లీ ! నా నోరు నొప్పెడుతోంది. దానికి పిల్లలున్నారు కనుకనే అవసరాలు తక్కువ. వాళ్లు పెరిగి పెద్దవాళ్లయి దాన్ని చూస్తారు. నిన్నెవరు చూస్తారు ? నువ్వు నాలుగొందలు, అయిదొందలు సంపాదించి కూడబెట్టుకునేంత ధనవంతురాలివా ?"

గత్యంతరంలేక శ్యామకి ఉత్తరం రాయటం జరిగింది.

శ్యామ కంగారుగా వచ్చింది. ఇంచుమించు పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆమెకి ఎన్నాళ్లనుంచో వున్న ఆశ, భయం - ఆశే ఎక్కువ. అయితే అమ్మ చెప్పింది నిజమేనా ? మనస్సుకి అలా అనిపించటం లేదు.

రాసమణి కూచోమని సైగచేసింది. మూడు నాలుగు తలగడాలు ఎత్తుగా వేసి, వీపుకి ఆనుకునేటట్లు జరిపి, ఆమెని కూచోపెట్టారు. తర్వాత ఉమ, కమల భోషాణం తెరచి, సామానులన్నీ తెచ్చి ఆమెముందు కుప్పగా పెట్టారు. శ్యామకూడా పరుగెత్తుకొచ్చి వారికి సాయపడింది. ఢాకా సామానులు, కటక్ సామానులూ వున్నాయి. అవి చాలా తక్కువ. అన్నీ పెద్ద పెద్ద పళ్లాలు.

అవిగాక పింగాణీ సామాను - తెల్ల పింగాణీసెట్.... రంగు పింగాణీ సెట్ జయపూర్, గయ, ముంగేర్‌లలో తయారయిన అందమైన విలువైన సామానులు. ఆశతో శ్యామకి కళ్లు మిరుమిట్లు కొల్పుతున్నాయి.

భోషాణమంతా ఖాళీ చేసి, అన్నీ తీసుకొచ్చి పెట్టారు.

తర్వాత కళ్లతో సైగ చెయ్యటంతో ఉమ - దంతపు నగిషీ చేసిన కొయ్యపెట్టె తీసుకొచ్చి ఆమె ముందు పెట్టింది. అది నగల పెట్టె. శ్యామ

ఊపిరి బిగపట్టుకుని చూసింది. అనూహ్యమైన రహస్యం అందులో యేముందో యెవరికి తెలుసు ?

రాసమణి వేలితో సూచించింది. కమల మూడుభాగాలు చేసింది. మూడేసి వస్తువు లున్నవన్నీ వాటంతటవే కేటాయింపు అయాయి. ఒక సైజు పళ్లాలు ఆరున్నాయి. రెండు రెండు చొప్పున వాటా వేశారు. భాగాలు చేయటానికి వీల్లేని వేవయితే ఉన్నాయో, వాటిని రాసమణి మనస్సులో లెక్కవేసి పెట్టుకుంది.

నాలుగు చిన్నగిన్నెలు రెండు భాగాలు చేసి, మూడోభాగం కింద వాటికి బదులు ఓ పెద్ద గిన్నె వేశారు. ఈ కాస్తచెయ్యటానికికూడా ఆమెకి అలసట కలిగింది. మధ్యమధ్య కళ్లు మూసుకుని కొంచెం విశ్రాంతి తీసు కుంది. మళ్లీ కళ్లు తెరిచి వాటాలు వేయటం మొదలెట్టింది.

చాలాసేపు భాగాలు పంచటం చూసి చూసి, శ్యామ యింక ఉండపట్ట లేకపోయింది. "భాగాలు సమానంగా చెయ్యటం భావ్యమా అమ్మా ! నాకు పిల్లలున్నారు. ఉమకి అసలే లేరు. అక్కకి ఒక్కడు. అవసరాలు నాకే యెక్కువగా !" అన్నది.

ఉమ, కమలల ముఖాలు సిగ్గుతో యెర్రపడ్డాయి. శ్యామ యింత సిగ్గు విడిచి యెలా అడిగిందా అని వాళ్లు ఆలోచించసాగారు. శ్యామకి కేటాయించ లేదనటానికి వీల్లేదు. కాని ఆమెకి వక్రించిన అదృష్టం యిలాంటి శిక్షణే కలిగించింది. ఇలాంటి విషయాల్లో మొహమాటానికి చోటు యివ్వకూడదు. సిగ్గుపడితే వంచితు లవుతారు.

రాసమణి జబ్బుతో లోతుకు పోయిన కళ్లు రెండు తెరిచి, శ్యామ ముఖం కేసి ఒక్కక్షణం రెప్పవాల్చకుండా చూసింది. మాట్లాడాలంటే యిప్పు డామెకి వ్యవధి పడుతుంది. మనస్సులోని శక్తినంతా కూడతీసుకోవాలి. "నీ పిల్లల సంగతి నువ్వు ఆలోచించుకోవమ్మా. నేను నా పిల్లల సంగతి ఆలోచించుకుంటాను. అంతకంటె యెక్కువ ఆలోచించటం నా వల్లకాదు. యెంతదూరమని ఆలోచించను చెప్పు. ఈ గోవిందుకి పదిమంది పిల్లలు కలగొచ్చు. హేమకి ఒక్కడు కూడా కలగకపోవచ్చు. ఉమ భర్త వచ్చాడు, చూసి వెళ్లాడు. మళ్లీ తిరిగి వస్తాడో రాడో తెలియదు. ఈ ఉమకి ఒకరోజునాటికి యెంతోమంది పిల్లలు కలగొచ్చు. అదీకాక నీకు పిల్లలున్నారు కనుకనే, నీకింక యేమీ యివ్వటం భావ్యంకాదు. నీ హేమ యిప్పట్నుంచి సంపాదించి నిన్ను పోషిస్తున్నాడు. ఉమను యెవరు చూస్తారు ?" అన్నది.

శ్యామది ఊరుకునే స్వభావం కాదు. "హేమే చూస్తాడు" అన్నది.

"నాకది తెలుసు. అశక్తురాలై నీ కొడుకు నెత్తినెక్కితే, అతడు గుప్పెడన్నం పెట్టొచ్చు. కాని, జబ్బుచేస్తే డాక్టర్ని మాత్రం పిలవడు. అంతవరకు నిజం. ఒవేళ హేమకనుక చూస్తే అప్పుడివన్నీ వాడికే వస్తాయి - ఉమ అదృష్టం ఎప్పటికీ మారకపోతే!"

శ్యామ యింకా యేదో మాట్లాడబోయినట్లుంది. రాసమణి వణుకుతున్న చెయ్యి యెత్తి చూపుడు వ్రేలితో వారించింది. తర్వాత భాగాలు యిచ్చివేయమని కమలకి సూచించింది.

అన్నిసామానులూ పంచటమయాక, రాసమణి మరోసారి శ్యామ ముఖంకేసి చూసింది. వాడిపోయిన యీసడింపు నవ్వొకటి ఆమె పెదిమల మీద విరిసింది.

"నాకు తెలుసమ్మా: నువ్వు వాళ్లకి సాయం చెయ్యటానికెందుకు పరుగెత్తావో! ఆ పెద్ద 'ఖగడాయీ', మూతఉన్న గ్లాసు తీసుకొస్తూ - యెక్కడ దాచావో చెప్పు. గోవిందు వెళ్లి తీసుకొస్తాడు".

కమల, ఉమ నివ్వెరపోయారు. అమ్మకి నిజంగానే మతిపోయిందా అని వారికి ఓసారి అనుమానం కలిగింది. ఆమె యీమాట యెలా అన కలిగింది! కాని అవనతమైన శ్యామ అరక్తముఖంకేసి చూసి వారు మరీ స్తంభితు లయినారు. అపరాధాన్ని ఒప్పుకోవటం యింత స్పష్టంగా వ్యక్తం కావటం వారింతకుముం దెప్పుడూ యెవరి ముఖాల్లోనూ చూడలేదు. శ్యామ ముఖం అగ్నివర్ణానికి మారింది. ఈ కొద్దిక్షణాల్లోనే ఆమె నుదుటి మీది చెమట బిందువులు ముత్యాలంత పెద్దవయాయి.

శ్యామ రెండుసార్లు గుటకలు వేసి, "నువ్వు నన్ను నిష్కారణంగా అనుమానించావమ్మా. తీసుకొస్తుంటే బరువు అనిపించింది అందుకనే, - తర్వాత దాని సంగతి మరచిపోయాను" అన్నది.

"సరే! యెక్కడ పెట్టావో చెప్పు."

"నేను తీసుకొస్తాను."

శ్యామ యించుమించు పరుగెత్తుకుంటూనే వెళ్లింది. ఉమ వంగి చూసింది. శ్యామ ఛోషాణం కిందినుంచి వాటిని బయటికి తీసింది.

రాసమణి నవ్వింది.

"మరచిపోయావు! నిజమే! అది సహజమే! రోజులు నిండిపోయాక మళ్లీ అన్ని జ్ఞాపకం వస్తాయంటారు. నాకు ఇంక ఆలస్యం లేదు. అన్ని మళ్లీ లెక్కప్రకారం జ్ఞాపక మొస్తున్నాయి."

ఉమకళ్లల్లో నీళ్ల తొణికిసలాడుతున్నాయి. ఆగేట్లు లేవు. ధారా ప్రవాహమవుతున్నాయి. అమెవైపు చూసి, రాసమణి మరోసారి నవ్వింది.

శ్యామ ఆ 'ఖగడాయీ' గ్లాసు తెచ్చి యెదుట పెట్టి తల వంచుకుని కూచుంది. అమెకింక మాట్లాడే శక్తి లేదు.

"కమలా! ఇవి రెండూ మహాశ్వేత మొగుడి కివ్వాలని నా ఉద్దేశం. యేమంటావ్?" అని అడిగింది రాసమణి.

కమల వెంటనే "సరేమ్మా. ఇయ్యి" అన్నది.

"ఈ పువ్వులు చెక్కిన పెద్దపళ్లెం - పురమాయించి చేయించింది. రెండు శేర్లకి తక్కువ బరువుండదు. దీన్ని ఖేందీ మొగుడికి ఇయ్యి. అమ్మమ్మ స్మృతి చిహ్నాలు. అంతకంటె యేముంది?"

ఈసారి నగలపెట్టె తెరవటం జరిగింది. శ్యామ అన్నీ మరచి పోయి తల యెత్తి లోపలదృష్టితో చూసింది. మళ్లీ ఆశ - ఆ శంక! యేది ఫలిస్తుందో తెలియదు. పెట్టెలో బయటపడినవి చూస్తే నిరాశా జనకంగానే ఉన్నాయి. నిజంగా పదినవర్సుల గొలుసు, ఒక జత పెద్ద చెవుల రింగులు, రెండు జతల జుమ్కీలు, గాజులు, రెండు ఉంగరాలు, వజ్రాల ముక్కుపుడక ఒకటి, చిన్న చిన్న బంగారు వస్తువులు, మంచి ముత్యాలనత్తు ఒకటి. ఒక గాజు - ఒకటి యిటీవల అమ్మటం జరిగింది. లేకపోతే జత ఉండేవి.

రాసమణి వాటికేసి కన్నార్పకుండా చూస్తూ ఊరుకుంది. చూస్తున్న కొద్దీ కళ్లలో నీళ్ల తిరిగాయి. ఆమె మనస్సులో యెన్నెన్ని జ్ఞాపకాలున్నాయో యెవరికి తెలుసు? ఎన్నో పాతస్మృతులు, గడిచిపోయిన దాంపత్య ప్రేమ చరిత్ర చిన్నదో, పెద్దదో ప్రతి నగవెనుకా ఉన్నది.

ఆ కథలన్నీ యిన్నాళ్ల తర్వాత - మృత్యుపథగామిని మనస్సులో గుంపుగా వచ్చి నిలిచాయేమో! అది మాత్రం యెవరికి తెలుసు? ఇవన్నీ ఆడ వాళ్లకి అతిప్రియమైన వస్తువులు. కేవలం అంతేకాదు, ఆమె దీర్ఘనిరాధార జీవితంలో యివి అవలంబనాలు. ఆమె జీవితంలో వంచితురాలు. యెన్నో కష్టాలు యెదుర్కొంది. అయినా యెవర్ని చెయ్యిచాచి అడగకుండా, గౌర వంగా జీవితం గడపగలిగింది. అదే గొప్పలాభం! అది వీటి మూలం గానే సాధ్యమైంది. అదీకాక ఆమె ఒకప్పుడు భర్తకి అతిప్రేమపాత్రురాలు. ఈ నగల్లో ఆ ప్రేమచిహ్నాలన్నీ ముద్రితమై ఉన్నాయి. అకారణంగా గాని, సకారణంగా కాని ప్రియమైన భార్యని సంతోషపెట్టటానికి, ఈ ఆభరణా

లన్నీ అతడు కానుకలుగా యిచ్చాడు. అతడి ప్రేమ కివి నిదర్శనాలు. అందు కనే యివి మామూలు నగలకంటె ఆమె కెంతో విలువయినవిగా ఉండేవి.

రాసమణి చాలాసేపు వాటికేసి అలా చూస్తూ ఉండిపోయింది. కన్నీళ్లు ఆమె దృష్టికి మసక కల్పించాయి. ఆమె కళ్లు క్రిందికి వాల్చలేకపోయింది.

చివరికొక పెద్ద నిట్టూర్పు విడిచి, తలగడాలకి చేరగిలబడింది. ఏమీ మాట్లాడలేకపోయిందో, ఏదైనా మైకం కమ్మినట్లయిందో యేమీ తెలియలేదు. ఇంట్లో అందరూ ఆమెకేసే చూస్తున్నారు ఒక్క ఉమ తప్ప. ఆమెకి కన్నీళ్లు యెంత ఆపుకోవాలన్నా ఆగటం లేదు. ఆమె లేచి బయట వరాండాలోకి వెళ్లి వెక్కి వెక్కి యేడవటం మొదలెట్టింది.

చివరికి ఒకసమయంలో రాసమణి మళ్లీ కళ్లు తెరిచి చూసింది. కమలను దగ్గిరగా రమ్మని వేలితో సైగ చేసింది. శ్యామకూడా ఉత్కంఠ ఉండపట్టలేక ముందుకి వచ్చింది.

రాసమణి గుసగుస లాడుతున్నట్లు - ఈ గాజు ఒకటి ఇంకా బతికి ఉండే కొద్ది రోజుల ఖర్చుకీ ఉపయోగపడుతుంది. ఉన్న నవర్సులు శ్రాద్ధ ఖర్చులకి. అంతకంటె యెక్కువ ఖర్చు పెట్టొద్దు. ఈ మురిడీలు అక్కర్లేదు. ఆ బంగారు గొలుసు ఉమకి ఇయ్యి. దాని కవసరానికి ఉపయోగ పడుతుంది. చెవుల రింగులు రెండు గోవిందుకి ఉండనియ్. జుమ్కాలు రెండు శ్యామకి. ఇహ మిగిలిన చిన్నంచితుకు. ఉంగరం ఉమకి ఉండనియ్. దాన్నే అందరికంటె నిస్సహాయురాల్ని చేసి పోతున్నాను. వీటిని దాని కివ్వటం మీకు అభ్యంతరం ఉండవలసిన సంగతి కాదు. మీయెవరి పెళ్లికి యెక్కువ యేమీ యివ్వలేకపోయాను. కాని నా తప్పు యేమీ లేదు, భగవంతుడికి తెలుసు. ఉమ దౌర్భాగ్యం విషయం పరలోకానికెళ్లినా నాకు శాంతి కలిగించదు. మీ కష్టాల దిగులుతోనే కుమిలి కుమిలి అకాలంలో ముసలి దాన్నయాను. ఇది అర్థం చేసుకుని మీరు నన్ను క్షమించండి'' అన్నది.

రాసమణి మళ్లీ చేరగిలపడింది. స్పృహ లేనట్లుం దామె. కమల పరుగెత్తి కెళ్లి విసనకర్ర తీసుకొచ్చి విసురుతూ కూచుంది.

శ్యామ యేదో రాతిబొమ్మయి పోయినట్లు కదలకుండా కూచుంది. ఆమె యెంత ఆశాభంగం పొందిందీ, వివర్ణమైన ఆమె ముఖంకేసి చూసి ఒక్క రాసమణి మాత్రమే ఊహించగలదు. కాని యిప్పు డామెకి ఆశ క్తి లేదు.

## 3

రాసమణి యిప్పుడు మందులు తినటం మానేసింది. అంతేకాదు, వరాట్ హూమ్యోపతి మందులు చూసినా ఆమె మండిపడుతోంది. ఆహారం తీసుకోవటంకూడా మానేసింది. నోటి కేమీ సయించటం లేదు. కమల బలవంతం చేస్తే - "ఎందుకు బలవంతం చేస్తావు ? ఇంక నాకిక్కడ తిండి తీరిపోయిందని తెలియటంలేదూ ? లేకపోతే నోటికన్నీ చేదుగా యెందు కుంటాయి ? వరి అన్నం యెప్పుడైతే నోటికి వెగటుగా ఉండటం మొద లెట్టిందో, అప్పుడే నాకు భూమ్మీద గింజలు నిండిపోయాయని గ్రహిం చాను. ఇంక బలవంతం చెయ్యకు" అనేది రాసమణి.

"కాని యీ శరీరం ఉండేంతవరకు -" అని కమల బ్రతిమాలితే - "ఉండేంతవరకేమిటి ? శరీరాన్ని అంతమైపోనియ్, లోకంలో తిండిలేకుండా ఉండగలగటంకూడా చూశాను. శరీరాన్ని కాపాడిమాత్రం యేం లాభం ? మిమ్మల్ని బాధపెట్టటానికి తప్ప -" అనేది.

ఇప్పుడు జ్వరం చూసేందుకుకూడా ఉపాయంలేదు. ధర్మామీటరు చూస్తేనే మండిపడుతుంది ఉడిగిపోయిన ఆ శరీరంలోకి శక్తి యెలా వచ్చేదో, ఉమకి యెంత అలోచించినా తెలిసేది కాదు. వరుసగా రెండు మూడు ధర్మామీటర్లు పగలకొట్టింది. చిక్కిశల్యమై ఉన్న చేతిని హఠాత్తుగా చాచి, అజాగ్రత్తగా ఉన్నప్పుడు విసిరి నేలకేసి కొట్టేది. ఉమకి జాగ్రత్త పడే వ్యవధి ఉండేదికాదు. ముఖం చిట్లించుకుని, "ఇది ఒకటి మాత్రం నేర్చుకున్నారు. మాటిమాటికీ ధర్మామీటరు గొట్టం తెచ్చి నోట్లో గుచ్చటం. పనీలేదు, పాటూ లేదు. దానివల్ల యేమవుతుంది ? జ్వరమెంతో కొలిచి చూడగానే, నయమై మళ్లీ లేస్తానా ?" అనేది.

చివరిరోజున కుత్సితమైన విమర్శ ఒకటి చేసింది. ఉమ సహించలేక గదిలోంచి బయటికి పారిపోయింది. ఏమిటిది ? జీవితమంతా నిగ్రహంగా, మహిమాన్వితమైన దేవిలాంటి తన తల్లి కేమిటీ అధఃపతనం ? దీన్నే మతి భ్రంశం అంటారా ?

కమల ఆమెని ఊరడించింది. "చనిపోయేముందు యిలాగే అవుతుంది. అందుకే చావుకిముందు మతిభ్రంశం అంటారు. దీన్ని సహించి ఊరుకో వలసిందే. మరో ఉపాయం లేదు."

చికిత్సకి సంబంధించిన విషయంలో రెచ్చకొట్టకుండా ఉంటే రాసమణి మామూలుగానే వుండేది. మాట్లాడేదికాదు. యిటు తిరిగేదికాదు.

ఊరికే గుండెదగ్గిర మాత్రం ప్రాణాలు కొట్టుకుంటున్నాయి. ఇంకా యెక్కువ రోజులు లేవని యింట్లో అందరూ స్పష్టంగా గ్రహించారు. "ఆత్మీయులకి, బంధువులకీ ఉత్తరాలు రాయి ఉమా! ఇలా అధైర్యపడితే సాగదు. కర్తవ్యాన్ని నెరవేర్చి తీరాలి. ఎవరైనా చూసి వెళ్లాలనుకుంటే వెళ్లనియ్" అన్నది కమల.

ఉమ శాంతకంఠంతో "గోవిందుకి చెప్పు అక్కా! ఆత్మీయులు చుట్టాలు యెవరో అదికూడా తెలియదు" అన్నది.

కమల గత్యంతరంలేక ఉత్తరాలు రాయమని గోవిందుకు కొన్ని పోస్ట్‌కార్డులు తెచ్చి యిచ్చింది. వారికి ఆత్మీయులు మాత్రం యెవరున్నారు?

కమల కొంచెం తటపటాయించి, "అయితే శరత్‌కికూడా కబురు పంపిస్తే బాగుంటుంది. అవునా కాదా?" అన్నది.

ఉమ గతుక్కుమంది. కొన్నిరోజులనుంచి రాత్రింబగళ్లు జాగరణతో వాడి పీక్కుపోయిన ముఖంలో ఒక్కసారి రక్తం పొంగినట్లయింది.

తర్వాత మామూలుగా "వద్దు వద్దు. అవసరమేముంది? అమ్మ మృత్యువు ముందర - ఊరికే తెగిన గాయంమీద కారం చల్లుకోవటం" అన్నది.

ఆమె మాటలోని ఆంతర్యాన్ని కమలకూడా లోపల్లోపల అంగీక రించింది.

హేమ వచ్చి దగ్గిర కూచుని అమ్మమ్మ చేతిని తన చేతిలోకి తీసు కున్నాడు. భయంతో సంకోచంతో. అమ్మమ్మ దగ్గిర యింతచనువు తీసుకో టానికి అతడికేమాత్రం ధైర్యం లేకపోయింది. ఇవాళ తప్పనిసరి అవటం మూలంగానే - ఇన్నాళ్లనుంచి ఉన్న సంకోచాన్ని దూరం చేసుకున్నాడు. మెల్లిమెల్లిగా 'అమ్మమ్మా!' అని పిలిచాడు.

ప్రాణం ఉన్న లక్షణాలు పెదిమలమీద కన్పించాయి. పెది మలు కాస్త వణికాయి. ఏదో మాట్లాడబోతున్నట్లు ఎవరు అన్నది. పళ్లులేని నోటితో. పెదిమలు లోపలికి తీసుకోవటం వీలుకాలేదు. తర్వాత కళ్ల రెప్పలు కదిలాయి. కొంచెం కొంచెంగా సగం విప్పారుకున్నాయి. చివరికి "ఎవరు?" అన్న ప్రశ్న వెలువడింది.

"నేను హేమను అమ్మమ్మా! నాకేమయినా చెపుతావా?"

ఆమె వివర్ణమైన దృష్టి హేమని దగ్గిరకి పిలిచింది. హేమ బాగా దగ్గిరకి జరిగి, ముఖం ఆమె దగ్గిరగా పెట్టాడు.

రాసమణి మెల్లిమెల్లిగా "నాకొక మాటఇయ్యి బాబూ! నే చెప్పినట్లు చేస్తావా ?" అన్నది.

"తప్పకుండా చేస్తాను అమ్మమ్మా! మాట యిస్తున్నాను"

"పిన్నిని కాస్త కనిపెట్టి ఉండు బాబూ! నీకెంతవరకు సాధ్యమయితే అంతవరకే. మీ అమ్మ బహుశా చెల్లెల్ని మరచిపోవచ్చు. కాని నువ్వు చూస్తావా ? చెప్పు. మాట ఇయ్యి"

"నాకు స్తోమత ఉన్నంతవరకు చూస్తాను అమ్మమ్మా! నువ్వు నిశ్చింతగా ఉండు".

"బతికించావు బాబూ! బహుశా యిందుకోసమే ప్రాణాలు పోలేకుండా ఉన్నా యనుకుంటాను. నువ్వు చిన్నవాడివి అయినా నీమాట నాకు కాస్త ధైర్యాన్ని యిచ్చింది. చచ్చిపోతున్నదానికి మాట యిచ్చావు. జ్ఞాపకం ఉంచుకో"

మళ్లీ కళ్లు మూసుకుంది. పెదిమలుకూడా లోపలికి పోయి, బిగుసుకు పోయాయి. కళ్లలోంచి మాత్రం రెండు నీటిచుక్కలు చెక్కిళ్లమీదికి జారాయి.

మళ్లీ కళ్లు తెరిచింది. అభయ్‌పద్ దగ్గిరకొచ్చి కూచున్నాడు.

అభయపద్ వచ్చి, ఆమె పక్కమీదనే ఒకవైపున కూచుని "మామ్మగారూ!" అని పలకరించాడు.

ఆ జడత్వస్థితిలోకూడా - యేదో కొత్తకంఠమని గ్రహించగలిగింది.

ఈసారికూడా కనురెప్పలు కంపించాయి. కాస్తకాస్తే కళ్లు తెరిచింది. కనుబొమలు చిట్లించింది. అంటే ఆశ్చర్య పడుతోందన్నమాట.

"నేను అభయపద్‌ని మామ్మగారూ!"

కమల ఆమెతల దగ్గిరగా ముఖంపెట్టి, "నీ మనుమరాలి మొగుడు వచ్చాడమ్మా! పెద్ద మనుమరాలు మహాశ్వేత మొగుడు"

ఆమెముఖంలో ప్రసన్నమైన నవ్వు వ్యక్తమయింది. పెదిమలు సరిగ్గా తెరవలేకపోయింది. అతికష్టంమీద యేదో అన్నట్లు వినిపించింది. బహుశా ఆశీర్వదించి వుంటుంది.

"ఇప్పు డెలావుంది? బామ్మగారూ!" అని అడిగాడు అభయపద్.

ఈసారి ముఖంలో నవ్వుబాగా కన్పించింది. కొంచెం తలకూడా ఆడించింది.

తర్వాత యెలాగో "చాలా బాగుంది బాబూ! ఇంక ఆలస్యం లేదు" అన్నది.

"మామ్మగారూ! మీకేమయినా తినాలని ఉందా? ఏది తినాలని వుందో చెప్పండి" అభయపద్ కొంచెం తటపటాయిస్తూ అడిగాడు. ఈ స్థితిలో ఇంకేం మాట్లాడాలో అతడికే తెలియలేదు.

విస్మయంతో కళ్లురెండూ విప్పారాయి రాసమణికి. మొదట్లో అతడి మాటేమిటో అర్థమే కాలేదు. తర్వాత అతికష్టంమీద "నువ్వు నాకు తెచ్చి పెడతావా? నీ డబ్బుతో?" అని అడిగింది.

"అవును మామ్మగారూ! నేనే తెచ్చిపెడతాను తప్పకుండా."

"రాజరాజేశ్వరోభవ! దీర్ఘజీవీ భవ! మహా అదృష్టం కొద్దీ నీచేతిలో పడింది."

"కాని మీకేం తినాలని ఉందో చెప్పలేదు"

చాలాసేపు మెదలకుండా ఊరుకుంది. చనిపోతున్న ఆమెకి బహుశా అలుక్కు పోయినట్లయిన గతజీవితపు జ్ఞాపకాల మధ్య తనకిష్టమైన తినుబండారాలను వెతుక్కుంటున్నట్లుంది. తర్వాత మళ్లీ ఇష్టమూ అయిష్టమూ అన్నీ యేకమై పోయాయి. స్మృతి, ఆలోచనాశక్తి యెక్కడ అట్టడుక్కిపోయాయో, వాటి అంతు చిక్కలేదు. చివరికి పెదిమలు కొంచెం కదిపి, "అనాసపండు తెచ్చిపెట్టగలవా బాబూ? అనాసపండు, వేడివేడి 'సందేష్' తెచ్చిపెట్టగలవా?" అన్నది.

"ఇప్పుడే తెచ్చిపెడతాను మామ్మగారూ!"

అప్పుడింకా అనాసపళ్లు వచ్చే రోజులు రాలేదు. అది వైశాఖ మాసం. అయినా అభయపద్ నూతనబజారు కెళ్లి గాలించి గాలించి, బాగా పండిన అనాసపండు సంపాదించాడు. తిన్కడి మిఠాయి కొట్లోంచి సందేష్‌ల ప్యాకెట్ తీసుకొచ్చాడు.

కమల అనాసపండు కోసి, ముక్కనోటికి అందించబోయేసరికి హఠాత్తుగా మండిపడింది. "మీరందరూ కలసి యేకాదశిపూట నన్ను తినిపించటానికి వచ్చారా? వెళ్లండి. తీసుకెళ్లండి."

ఘూ.... ఘూ....

కమల ఆత్రతతో - "ఇవాళ చతుర్దశి అమ్మా! నేను నీమీద ఒట్టేసి చెపుతున్నాను. ఇవాళ యేకాదశి కాదు. మొన్ననే నువ్వు యేకాదశి ఉపవాసమున్నావ్. ఇవాళ చతుర్దశి. తిను" అని నచ్చచెప్పబోయింది.

"నేను చెపుతున్నా మామ్మగారూ! ఇవాళ యేకాదశి కాదు. యేకాదశి అయితే నేనెందుకు తీసుకువస్తాను?" అని అభయపద్ నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు.

"మీరందరూ విశ్వాసహీనులు, నాకు తెలుసు, పోండి." రాసమణి శక్తి కొద్ది పెదిమలు గట్టిగా మూసుకుంది. ఎంత ప్రయత్నం చేసినా, ఆ రోజున యేకాదశి కాదని యెవరూ ఆమెని నమ్మించలేకపోయారు.

పూర్ణిమరోజు తెల్లవారుఝామున రాసమణి చనిపోయింది. కిందికి మూసుకుపోయిన నోరు మళ్లీ యింక తెరవనేలేదు. కళ్లు యెత్తికూడా చూడలేదు. నిస్తబ్ధంగా చైతన్యం లేకుండా పడి ఉంది. అయినా అందరూ యెలాగో అంతిమక్షణం వచ్చేసిందని తెలుసుకున్నారు. ఇంచుమించు రాత్రంతా అందరూ ఆమె చుట్టూ కూచున్నారు. ముగ్గురు కూతుళ్లు, మనుమలు, మనుమరాళ్లూ, ఇద్దరు మనుమరాళ్ల భర్తలు. అల్లుళ్లు మాత్రమే యెవ్వరూ రాలేదు. నరేన్ జాడ తెలియలేదు. శరత్‌కి బుద్ధిపూర్వకంగానే కబురు పంపలేదు. తెల్లవారకట్ల యెగశ్వాస లక్షణాలు కన్పించాయి. ముక్కు లొత్తపడింది. రాఘవఘోషాల్ పక్కనే కూచున్నాడు. "ఇంక ఆలస్యం లేదు" అని చెప్పాడతడు. "ముక్కు లొత్తపడింది. ఇంక అయిపోయింది. గోవిందూ: నువ్వు కాసిని గంగనీళ్లు నోట్లో పొయ్యి. బాబూ! మీరందరు హరి నామస్మరణ చెయ్యండి మెల్లిగా. నారాయణ! నారాయణ! గంగాయాత్ర చేయిస్తారా?"

కమల కళ్లనీళ్లతో, గట్టిగా తల అడ్డం త్రిప్పింది. పెద్దమ్మతో అయిన అనుభవం చాలు.

వేకువవేళ హఠాత్తుగా శ్వాస మళ్లీ మామూలుగా అయింది. ఒకసారి మళ్లీ పెదిమలుకూడా కదిలాయి. ఏదో చెప్పబోతోందేమో అనిపించింది.

అభయపద్ ఒకసారి ఆమె ముఖం దగ్గిర చెవి పెట్టి విన్నాడు. నామస్మరణ చేస్తోందామె.

"హరే కృష్ణ, హరే కృష్ణ, కృష్ణ కృష్ణ హరే హరే!

హరే రామ, హరే రామ, రామ రామ హరే హరే"

అభయపద్ గొంతు సవరించుకొని, "ఆమె నామస్మరణ చేస్తోంది మీరు కూడా -"

ఇంక అతడు మాట్లాడలేకపోయాడు. ఏడుపు రొదల మధ్య రాఘవఘోషాల్ కంఠస్వరం వినిపించింది.

"హరే కృష్ణ, హరే కృష్ణ, కృష్ణ కృష్ణ హరే హరే !
హరే రామ, హరే రామ, రామ రామ హరే హరే"

గోవిందు గంగనీళ్ల నోట్లో పోయబోయాడు. చెయ్యి వణికి నీళ్లు గొంతుమీద పడ్డాయి. రాఘవఘోషాల్ చెయ్యి పట్టుకుని గంగనీళ్ల నోట్లో పోయించాడు.

కాని ఆ గంగనీళ్లు యింక గొంతు దిగలేదు. పెదిమలమీది నుంచి కిందికి జారిపోయాయి.

దీర్ఘకాలపు అనిర్వచనీయమైన వ్యథ వేదనలను మూట కట్టుకుని రాసమణి ఏ తెలియని సాంత్వనపథంలో పయనించిందో తెలియదు.

## ఇరువది ఒకటవ పరిచ్ఛేదం

శ్మశానానికి తీసుకెళ్లటానికి జనానికేమీ కొరతలేదు. రాఘవఘోషాల్ కొడుకు, ఇద్దరు అల్లుళ్లు - హరినాథ్, అభయపద్, హేమ. రాఘవఘోషాల్ కూడా ఉన్నాడు. కాని యేడుపులు వినిపించగానే ఆ వాడలో ఉండేవాళ్లు చాలామంది వచ్చారు. ఆ వాడలో ప్రధానంగా ఉన్నది కాయస్థులే అయినా, ఇద్దరు ముగ్గురు బ్రాహ్మణకుర్రాళ్లకూడా దొరికారు. వాళ్లు తమంతట తామే వెంటరావటాని కిష్టపడ్డారు. రాసమణి యీవాడలో చాలాకాలంనుంచి ఉన్నది. తెల్లవారకట్ల గంగాస్నానం చేసి, పట్టుచీరె ధరించి వచ్చే ఆమె రూపం యీవాడలో చాలామందికి పరిచయమే. ఆమెని దూరంనుంచి చూడగానే ప్రక్కకు తప్పుకుని దారి యిచ్చేవారు. నిర్విరోధి. ఆత్మగౌరవంకల ఆమెని లోపల్లోపల చాలామంది గౌరవించేవారు. కనుక ఆమె మరణానికి చాలామంది హృదయపూర్వకమైన విచారాన్ని వెల్లడించసాగారు.

సాదిక్‌మియా యిప్పటికీ యింకా బతికి ఉన్నాడు. రెండు మూడేళ్లనుంచి అతడికి స్మృతి పూర్తిగా పోయింది. ఎవర్నీ గుర్తు పట్టలేడు. యేమీ తెలుసుకోలేడు. కాని యెందుకనో తెలియదు. యివాళ యీ యింట్లో

యేడుపులు విన్పించగానే యేమనుకున్నాడో బావురుమని యేడ్చాడు. 'నిజంగా నా కూతురు చచ్చిపోయింది. నా కూతురు దగ్గిరకు నన్ను తీసుకెళ్లండి. నేనొక్కసారి చివరిచూపు చూస్తాను'.

ఉమ నిశ్చయంగా యింక మృత్యువు తప్పదు అని తెలియగానే ఒక్కసారిమాత్రం యేడ్చింది, తర్వాత యింక యేడవలేదు. నిజమే, తల కూడా పైకియెత్తలేదు. ఆమె తల్లిని గట్టిగా వాటేసుకుని పట్టుకుని ఆమె గుండెలమీద ముఖాన్ని ఆనించి కూచుని ఉంది. ఆమెలో ప్రాణసంచారం ఉన్న లక్షణాలేవీ కన్పించలేదు. ఆమె కఠినబంధంలోంచి రాసమణి మృతదేహాన్ని బయటికితీసే ప్రస్తావన వచ్చేసరికి చాలామంది ముఖాలు వాడిపోయాయి.

అభయపద్ ఒక్కడు మాత్రమే విచలితుడు కాలేదు. అత డిప్పటివరకు నిర్లిప్తుడిలా ఉదాసీనభావంతో, ఒకవైపుకి తప్పుకుని నుంచుని ఉన్నాడు. కాని ప్రస్తుతం విషయం తెలుసుకున్న వెంటనే ముందుకి వచ్చి ప్రక్కన నిలబడి మామూలు కంఠస్వరంతో 'చిన్నత్తయ్యగారూ' అని పిలిచాడు.

ఉమ శరీరం ఒక్కసారి కంపించింది. అంతకంటె ఆమెలో ప్రాణ స్పందన రేకెత్తలేదు.

అత్తగారికి నమస్కరించటం తప్ప. ఆమెని స్పృశించే సంప్రదాయం లేదు. అభయపద్ కాసేపు తటపటాయించాడు. తర్వాత వంగి, ఉమ పాదాలమీద చెయ్యివేసి కొంచెం కదలించి, "అత్తయ్యగారూ! మీరింక కొంచెం ప్రక్కకి తప్పుకోవాలి. మీకు అన్నీ తెలుసు. ఇంక పట్టుకుని ఆపటానికి లేదు" అన్నాడు.

ఉమ ఈసారి తలయెత్తింది. ఏదో విహ్వలదృష్టితో ఒకసారి నాలుగువైపులా చూసింది. తర్వాత యెవరూ యేమీ తెలుసుకోకముందే, హఠాత్తుగా రాసమణి కాళ్లదగ్గిర తల నేలకేసి గట్టిగా కొట్టుకోసాగింది.

అభయపద్ ఒక్క రెప్పపాటు చకితుడై ఆమెతల గట్టిగా పట్టుకున్నాడు. "ఛా! ఏమిటత్తయ్యగారూ! మీరు చదువుకున్నవారు. ఇంత అజ్ఞానంలో పడితే యెలా?"

ఇంతలో కమలకూడా సంగతి తెలుసుకోగలిగింది. ఆమె వచ్చి ఉమను గట్టిగా తన గుండెలమీదకి లాక్కుని పట్టుకుంది. అప్పుడిహ ఉమ పట్టు వదలిపోయింది. మళ్లీ ఒకసారి బావురుమని యేడ్చింది.

అభయపద్ తక్కినవారి కందరికి సైగ చేశాడు. మృతదేహాన్ని యీ అవకాశంలో తప్పించమని. రాఘవఘోషాల్ దగ్గి గొంతు సవరించు కొని "అమ్మా కమలా, నువ్వుకూడా రావాలి. తలకొరివి యెవరు పెడతారు ?" అన్నాడు.

కమల గతుక్కుమని, "నేనే రావాలా? గత్యంతరం లేదా? సంతానం ఉంటే - సరే గోవిందు వస్తాడు" అన్నది.

శవయాత్రికుల హరిధ్వని సందు మలుపు తిరిగాక విన్పించక పోవటంతో, ఉమకి యేదో మత్తు వదిలినట్లయింది. చటుక్కున లేచి నుంచుంది.

కమల కొంచెం భయపడి, 'ఉమా !' అని పిలిచింది.

ఉమ సహజమైన కంఠస్వరంతో - "నేను శ్మశానానికి వెడతాను అక్కా !" అన్నది.

"వద్దు. వద్దు. నువ్వు వెళ్లక్కర్లేదు. గోవిందు వెళ్లాడు.

"నేను మళ్లీ సరిగ్గా తిరిగి వస్తాను. నాకోసం దిగులు పెట్టుకోకు. ఇక్కడ యిలా కూచుని - కాదు అక్కా! ఇది నా వల్ల కాదు, నన్ను విడిచిపెట్టు."

ఆమె గబగబా మెట్లుదిగి కిందికి వచ్చింది. కమలకాని, శ్యామకాని అడ్డం వచ్చేలోపుగానే వీథిలోకి వచ్చి నడిచి వెళ్లసాగింది. కమల ఆదుర్దా పడుతూ "గిరీ! గిరీ! కాస్త దానివెంట వెళ్లు మళ్లీ యేమవుతుందో!" అన్నది.

గిరి పరుగెత్తుకుంటూ బయటికి వెళ్లింది. కాని కాసేపట్లోనే తిరిగి వచ్చి "ఎవరూ వెళ్లక్కర్లేదు పెద్దమ్మాయిగారూ! ఎవరి సొత్తో వారే వెంట ఉన్నారు" అని చెప్పింది.

"వారెవరే? ఎవరి సంగతి నువ్వు చెప్పేది?"

"చిన్నఅల్లుడుగారు. వారేదో బయట సిద్ధంగానే ఉన్నారు. ఆయనే వెంట వెడుతున్నారు"

శరత్ నిజానికి సంసిద్ధుడై రాలేదు. తన పనిమీద పెద్ద రాస్తా దారినే వెడుతున్నాడు. హఠాత్తుగా హరిధ్వని విన్పించటంతో గతుక్కు మని తిరిగి చూశాడు. రాఘవఘోషాల్‌ని, గోవిందుని అతడు గుర్తుపట్టాడు. ఎవరిశవమో తెలుసుకోటాని కెంతోసేపు పట్టలేదు. ఒక్క నిమిషం అక్కడే ఆగి కాస్త తటపటాయించాడు. ఇప్పుడు యిన్నాళ తర్వాత యీ

సమయంలో ఆమె ప్రక్కన వెళ్లి నిలబడటానికి కొంచెం సిగ్గుపడ్డాడు. చివరికి సిగ్గుకంటె కర్తవ్యజ్ఞానం ప్రబలమయింది. అయితే తన అవసరం శ్మశానంలోకంటె యింటిదగ్గిరే యెక్కువనికూడా తెలుసుకున్నాడు.

కాని యింట్లోకి వెళ్లలేదు. ఉమ అంతకుముందే బయటికి వచ్చింది. శరత్‌కి యెదురుపడి తలెత్తి ఉదాసవిహ్వల దృష్టితో ఒక్కసారి చూసినా, పక్కకి తప్పుకుని శ్మశానం దారిన నడిచి వెళ్లసాగింది. ఆమె భర్తను గుర్తు పట్టిందో లేదో, ఆమె ముఖం చూస్తే తెలియలేదు.

శరత్ యిరకాటంలో పడి, కాసేపు అలాగే నుంచున్నాడు. ఉమని పిలవాలో వద్దో అదీ తెలియలేదు. అయితే ఉమ మాత్రం వడివడిగానే వెడుతోంది. చివరికి అతడు ఉమని అనుసరించాడు.

శ్మశానంలో చితి కాలుతున్నంతసేపూ ఉమ అటువైపే చూస్తూ స్థిరంగా కూచుని ఉంది. శరత్ ఆమె వెనక నుంచుని ఉన్నాడు. కొంచెం సేపయాక రాఘవఘోషాల్ గుర్తుపట్టి, ముందుకి వచ్చి మాట్లాడటం మొదలెట్టాడు. తక్కిన అల్లుళ్లతోకూడా పరిచయం చేశాడు. శరత్ తప్పనిసరిగా కాసేపు వాళ్ల దగ్గిరకికూడా వెళ్లి నుంచోవలసివచ్చింది. అయితే యెక్కువసేపుకాదు. కొంచెంసేపు అవగానే అతడు తిరిగి మళ్లీ వెనక్కి వచ్చి నుంచున్నాడు.

బహుశా అతడు యేదో ఓదార్పుగా మాట్లాడాలని అనుకుని ఉండొచ్చు. ఈ సమయంలో ఆమె రెండుచేతులూ పట్టుకుని కొంచెం ఆశ ధైర్యం కలిగించే మాటలు చెప్పాలని అతడికి మనస్సులో అనిపించింది. కాని ఇంతకాలం తర్వాత ఆ ప్రయాస నిష్ఠురమయిన పరిహాసంగా వినిపిస్తుంద నేమో అతడు స్థిరంగా నుంచుని ఊరుకున్నాడనిపిస్తుంది. అతడి నుదుటి మీద లజ్జారుణరేఖలు ప్రస్ఫుటమయినా, గొంతు పెకలి ఒక్కమాట కూడా రాలేదు.

చివరికి ఒక సమయానికి చితి ఆరిపోయింది. రాసమణి తుది చిహ్నంకూడా బూడిదగా పరిణమించింది. చితిమంట ఆరిపోగానే ఒక్కరొక్కరే అందరూ గంగలో దిగారు.

శరత్ యిప్పుడు మొదటిసారిగా నోరు తెరిచాడు. తలవంచి ఉమ తలదగ్గిర పెట్టి "ఇంక నువ్వు కూడా స్నానం చెయ్యాలి" అన్నాడు. ఉమ గంగ అవతలి ఒడ్డువైపు స్థిరదృష్టితో చూస్తూ కూచుని ఉంది. ఆమె

గతుక్కుమనలేదు. యెలాంటి చాంచల్యమూ కన్పరచలేదు. సహజమైన అకంపితకంఠస్వరంతో 'వెడుతున్నాను' అన్నది.

ఆమెకోసం యెవరూ వేరే బట్టలు తీసుకురాలేదు. ఉమకి కూడా ఆ సంగతి గుర్తులేదు. ఆమెకట్టుకున్న చీరెతోనే వచ్చేసింది. ఆమె నీళ్లలో దిగగానే శరత్‌కే ఆ సంగతి గుర్తుకొచ్చింది. పరుగెత్తుకెళ్లి యెదురుగా ఉన్న దుకాణంలోంచి, యెర్ర అంచు కోరారంగు చీరె ఒకటి కొనుక్కుని వచ్చాడు.

భర్తచేతిలోంచి చీరె ఉమ మామూలుగానే తీసుకున్నది. శోకంతో స్తంభితురాలయిపోయిన ఆమె ముఖంలో యెలాంటి భావమూ వ్యక్తం కాలేదు.

తిరిగి వచ్చేప్పుడు మగవాళ్లందరూ ఇచ్ఛాపూర్వకంగానే ముందు నడుస్తున్నారు. ఉమ వచ్చేప్పుడు యెంత గబగబా నడిచి వచ్చిందో, తిరిగి వెళ్లేప్పుడు సరిగ్గా అంత మెల్లిమెల్లిగా నడుస్తోంది. ఎటువైపూ ఆమె కన్నెత్తి చూడటంలేదు. ఎదుటి వైపూకేసి సూటిగా చూస్తూ, అలసిపోయిన కాళ్లని యీడ్చుకుంటూ యెలాగో ముందుకి సాగి వెడుతోంది.

శరత్ ఆమె ప్రక్కప్రక్కనే మెల్లిగా నడుస్తూ సరాసరి వీధి గుమ్మంవరకు వచ్చాడు.

అంతలో ముందు వచ్చిన వాళ్లందరూ పరిశుద్ధులయి, లోపలికి వెళ్లారు. లోపలికి వెళ్లగానే, మళ్లీ ఒక్కసారి యేడుపులు బిగ్గరగా విన్పించాయి.

ఉమ సరాసరి వీధిగుమ్మందాకా వచ్చి ఒక్కసారి టక్కన ఆగిపోయింది.

ఒకవైపున గాడిపొయ్యి మండుతోంది.

ఉమ యంత్రచాలితవత్‌గా మామూలు పనులు నిర్వర్తించింది.

ఇంకా కాసేపు ఆ పొగవస్తున్న కట్టెలకేసి చూస్తూ మెదలకుండా ఊరుకుంది. కళ్లురెండూ కొంచెం యెర్రగా ఉన్నాయి. ఇంక ముఖంలో యెక్కడా శోకచిహ్నాలేం లేవు. ధూసరితమయిన ఒక వర్ణహీనత ఆమె శరీరాన్నే కాదు, మనస్సునికూడా కప్పివేసినట్లుంది.

శరత్ ఇంకొంచెం దగ్గిరకివచ్చి నుంచున్నాడు. చాలా మెల్లిగా "నాకేమైనా చెపుతావా ?" అని అడిగాడు.

మొదటిసారిగా యిప్పుడే ఉమ శరీరంలో ఒక వణకు కన్పించింది. అది శరత్ ప్రక్కన ఉండి గమనించాడు.

ఉమ సమాధానం యేమీ చెప్పలేదు. అలాగే ఇంకొక క్షణం నుంచుని మౌనంగా లోపలికి వెళ్లిపోయింది.

హఠాత్తుగా గట్టిదెబ్బతగిలితే ముఖం యెలా అవుతుందో, ఒక్క నిమిషంలో శరత్ ముఖం అలా అయింది. కాని అతడు యెలాంటి బాధనూ వ్యక్తం చెయ్యలేదు. ఊరికే తలవంచుకుని, ఇంకా కాసేపు నుంచుని యింటిదారి పట్టాడు.

## 2

శ్రాద్ధక్రియలు యేదో విధంగా జరిపించివేసినా, అన్నిటికంటె పెద్ద ప్రశ్న త్రోసివెయ్యటానికి వీల్లేనిదయింది. ఈసారి అది తన భయంకర రూపంతో, సూటిగా యెదుటికి వచ్చి నిలబడింది. ఇంత పెద్ద యిల్లు, రాత్రింబగళ్లు ఉండేదాన్నీ, ఈ రెండు అలవాట్లలో యేదీ యింక సాగదు. కమలకు ఉమకి నెలసరి వచ్చేఆదాయంలో వారికి ఒక్కవారం గడవటం కూడా కష్టమే.

శ్రాద్ధంరోజున నరేన్ హఠాత్తుగా యెక్కడినుంచో వచ్చి పడ్డాడు. బహుశా పద్మగ్రామం వెళ్లి అక్కడ కబురు తెలియటంతో వచ్చి ఉంటాడు. భోజనానికి కూర్చుని, అరిటాకులో రాశిగాపోసి ఉన్న పూరీలకేసి చూడ గానే - అతడి మనస్సు చాలా ఉదారమయింది. పీటముందు నుంచుని చెయ్యి ఊపిస్తూ "కాదు వదినగారూ! యజ్ఞభోజనం, అరిటాకు విస్తరే తల్లి హస్తం (వడ్డన ?) అంటారు. యజ్ఞభోజనం - అన్నం కాకపోయినా పూరీలు ఉన్నాయి మరీ ప్రశస్తం. అరిటాకు విస్తరి ఉండనే ఉంది తల్లి హస్తం. అత్తగారు (తల్లి) లేకపోతేయేం. వదినగారు అత్తగారితో - (తల్లితో సమానమే). ఇవాళ సంతోషంగానే భోజనం చెయ్యాలి. కాని భోజనంచేసిన సుఖం లేదు. ఇక్కడికి వచ్చినప్పట్నుంచి మిమ్మల్నిగురించే బెంగగా ఉంది. అత్తగారంటే వెళ్లిపోయారు ? కాని యిప్పుడ మీరెక్కడ నిలబడటం ?" అన్నాడు.

మ్లానమైన కమల ముఖంలో నవ్వు తొణికింది. "నువ్వు భోజనం చెయ్యి బాబూ! ఏమయినా మమ్మల్ని గురించి ఆలోచించేందుకు ఓ మంచి వాడున్నాడు" అన్నది.

పీటమీద కూచోగానే ఆచమానమైనా చెయ్యకుండానే ఒక పూరీ నోట్లో కుక్కుకుని, యించుమించు పూడుకుపోయిన గొంతుతో, "ఆలో చించనా ? ఏమిటి మీరనేది ? ఇది నా కర్తవ్యం - పరాయివాళ్లం కాదుగా,

డబ్బు లేకపోవటం మూలంగా యేం చెయ్యాలో తోచక, నాలో నేను చచ్చి పోతున్నా ; లేకపోతే కర్తవ్యం తెలియ కనా ? ఎంత వంశం మాది'' అన్నాడు.

వెనకనుంచి శ్యామ అర్ధస్వగతోక్తిలో అన్నమాటలు విన్పించాయి. "మీ వంశంమొహాన మీ మొహాన నిప్పెట్ట !"

నరేన్ నిమిషంలో మండిపడ్డాడు. ''విన్నారా విన్నారా వదిన గారూ ? ఆదౌర్భాగ్యురాలి మాటలు ? ఈనాడు నాకీ స్థితి యెందుకు వచ్చిం దంటారు ? అదీ ఆ పందుల్లాంటి పిల్లలమూలంగానే. ఈ దరిద్రులే లేక పోతే నాకు దిగులేముంది ? నేనేం తక్కువ సంపాదిస్తున్నాననా ? యేం చెయ్యను ? బయటినుంచి వచ్చిందంతా బయటే యెగిరిపోతోంది. ఇంట్లో సుఖముంటే కదా తిరిగివస్తాను. వాళ్ల బాధపడలేకనే నేను బయట బయటే తిరగాల్సి వస్తోంది'' అన్నాడు.

మళ్లీ మరో పూరి నోట్లో కుక్కుకుని నరేన్ శాంతించాడు. గొంతు మరింత తగ్గించి కాదు వదినగారూ ! చాలా ఆలోచించి చూశాను. ఇంత పెద్దయిల్లు యేవిధంగా చూసినా సరే, ఉంచుకోటానికి వీలుపడదు. అద్దె యెక్కడినుంచి తీసుకొచ్చి కట్టగలరు ? అంతకంటె యీ ప్రక్కనున్న మురికివాడలో యేదయినా పూరిపాకయినా దొరక్కపోతుందా ! వెతికి చూడరాదూ ? అద్దె తగ్గుతుంది. అక్కడుంటే దాసీకూడా అక్కర్లేదు. పనులన్నీ మీ అంతట మీరే చేసుకోవచ్చు యేమంటారు ?'' అని అడిగాడు.

''మురికివాడ ! మేం మురికివాడలోకి పోయి ఉండమా !'' కమల స్తంభితురాలయి ప్రశ్నించింది.

''యేంచేస్తారు చెప్పండి. అంతా తలరాత ! లేకపోతే అన్నగారప్పుడే యెందుకుపోతారు ? ఉమ పరిస్థితికూడా యిలా యెందు కవుతుంది'' చాలా నిశ్చింతభావంతో అన్నాడు నరేన్.

శ్యామ యింక సహించలేకపోయింది. గబగబా ముందుకు వచ్చి తినాలనుకుంటే పిండం నోరు మూసుకుని తినండి ! లేకపొతే లేచి వెళ్లండి. మా వంశంలో యెవరిమీదా జాలి చూపించటానికి రాకండి. కసాయి వాళ్లెక్కడో !'' అన్నది. ''ఎవరికోసం దొంగతనం చెయ్యాల్సి వచ్చిందో వాళ్లే దొంగ అనటం. నేనేం తప్పు మాటన్నాను ? ఎక్కడ సంపాదించి అక్కడే ఖర్చు పెట్టాలి, అని శాస్త్రంలోనే రాసి ఉందిగా అన్నాడు.

ఏం నా ఖర్మ ! శాస్త్రాల్లో రాసి ఉందో మీనోటి మీదుగావినాలా ? మాట్లాడకుండా తినండి. లేకపోతే యీ విస్తరినిలాగే తీసుకెళ్లి పెంట పోగుమీద పడేస్తా' అన్నది

"ఆగు. ఆగు, బంగారక్కలా ఆడకు ఊరికే" అని గదమాయించాడు నరేన్. కాని ఆ గొంతులో బలం లేదు. అతడు ఆశ్చర్యపోయేంత శాంతంగా తినసాగాడు."

"ఇదేమిటి అనాసచట్నీయా ? చాలా బావుందే! ఇంకొంచెం వెయ్యమని చెప్పండి వదినగారూ! మామిడిపళ్లు ఉన్నాయా! మంచి మంచివి యేరి మూడు నాలుగు తెమ్మనండి.

పనులన్నీ పూర్తి చేసుకుని, అక్క చెల్లెళ్ల ముగ్గురూ డాబామీదికి వెళ్లి కూచున్నారు. రాత్రి చాలా ప్రొద్దుపోయింది. మల్లిక్‌గారి తోటలోని బెగ్గురుపక్షులు యిప్పుడే అరిచాయి. అవి జాము జాముకీ అరుస్తాయి. రాత్రి పన్నెండు తక్కువయి ఉండదు. అయినా - పగలంతా రెక్కలు ముక్కలు చేసుకుని కష్టపడి పనులు చేసుకుని ఉన్నా, వారి కంటికి నిద్ర రావటం లేదు. కాసేపు చల్లగాలిలో కూచున్నాక, కమల పెద్ద నిట్టూర్పు విడిచి "వినటానికెంత సిగ్గుగా ఉన్నా శ్యామా ! నరేన్ సరైన మాటే అన్నాడు. ఈ యింటిని మనం యీ నెల్లోనే ఖాళీ చెయ్యటం మంచిది. ఈ నెల అద్దె యెక్కడినుంచి తెచ్చికట్టడమా అనే ఆలోచిస్తున్నాను" అన్నది.

"అలా అని నిజంగా పూరి పాకలోకి వెళ్లి ఉండలేం అక్కా! ఇలాంటి గౌరవకుటుంబీకులయిన వారిల్లు చూసి రెండు గదులు అద్దెకి తీసుకోవాలి."

"అదీ ఆలోచిస్తున్నాను. ఇన్ని సామానులెక్కడ పడతాయి. అదొక బెంగ"

"సామానుల సంగతంటావా ?" శ్యామ ఒక గుటకమింగి, "కొన్ని సామానులు అక్కడ మాయింటికైనా తీసుకెళ్లి ఉంచగలను. మళ్లీ గోవిందు పెద్దవాడయి, ఇల్లూవాకిలీ కట్టుకున్నాక - అప్పుడు పోనీ తిరిగి యిచ్చేస్తాను" అన్నది.

"అది చెప్పింది - బేసబబుగా యేం లేదు. ఏమంటావ్ ఉమా ?"

"చిన్నక్కవాళ్లుండే యిల్లుకూడా ఒక గదే అక్కా! కాని అదీ పరాయి యిల్లే. అదీకాక యివన్నీ యిక్కడినుంచి తీసుకెళ్లటం మాత్రం మాటలా ?" అని మెల్లి మెల్లిగా సమాధానం చెప్పింది ఉమ.

"లేదు. లేదు. ఫర్వాలేదు. వాటిని నేనిప్పుడే యెలాగో అలా తీసుకెడతాను - అంతగా అయితే గుర్రపుబండి ఒకటి కట్టించుకుని -"

ఈసారి ఉమ కంఠంలో ఇంకొంచెం దృఢత్వం కన్పించింది. "వద్దు అక్కా! ఈ సామానులన్నీ అమ్మకి ప్రాణాల్లాంటివి. ఆమె యేం చెప్పిందో దానికి అక్షరం వ్యత్యాసం జరగటానికి వీల్లేదు. చిన్నక్కకి యివ్వాలని ఉంటే అప్పుడే యిచ్చేది. మనకి యెక్కడో అక్కడ తల దాచుకోటానికి చోటు దొరికితే వాటిని కూడా అక్కడే ఉంచొచ్చు"

వాతావరణం అనారోగ్యంగా మారింది, కమల ప్రసంగాన్ని మార్చింది. "శరత్ యివాళ వచ్చాడు. ఉమా! నాలుగు గంటల ప్రాంతంలో వచ్చి రెండు తీపి వస్తువులు నోట్లో వేసుకుని వెళ్లిపోయాడు."

ఉమ అలసట వ్యక్తమవుతున్న కంఠంతో 'తెలుసు' అన్నది. తర్వాత కాసేపు ఊరుకుని - "మళ్లీ యెందుకు బలవంతంగా అనుబంధాన్ని పెన వేసుకోటం అక్కా!" అన్నది.

"అహఁ. అది కాదు." అని కొంచెం తెల్లబోయి "ఆ రోజున శ్మశానానికి వచ్చాడు. మనకికూడా కర్తవ్యం అంటూ ఒకటుందిగా! అందుకని అతణ్ణి పిలవటానికి హేమను అతడి అచ్చాఫీసుకి పంపించాను" అన్నది.

ఉమ సమాధానం చెప్పలేదు. ఆకాశంలో తూర్పువైపు కొద్ది కొద్దిగా మబ్బులు పడుతున్నాయి. ఆమె అటుకేసి చూస్తూ కూచుంది. కమల కాసేపు మెదలకుండా ఊరుకుని, "శరత్‌తో - రెండుగదుల యిల్లొకటి లేదా ఒక పెద్ద గది ఉన్నదయినా సరే చూడమని చెప్పాను" అన్నది.

ఉమ దగ్గిర్నుంచి సమాధానం వస్తుందని ఆశతో కమల మధ్యలోనే ఆగిపోయిం దనిపిస్తుంది. కాని ఉమ అలాగే ఊరుకుంది. "దానికి అతడేమన్నాడు?" అని శ్యామే అడిగింది.

"చూస్తా నన్నాడు. ఎక్కడో వెతుకుతూ ఉండి ఉంటాడు. బహుశా రేపు కబురు పంపుతాడు."

ఇంకా కొంచెంసేపు నిశ్శబ్దంగా గడిచాక "మిమ్మల్ని యెవరు చూస్తారు?" అని అడిగింది శ్యామ.

"భగవంతుడు" అని కమల ముక్తసరిగా సమాధానం చెప్పింది.

## 3

శరత్ మర్నాడు నిజంగానే కబురంపాడు. బ్రాహ్మల కుటుంబాలుండే వాడలో మొదటి అంతస్తులో రెండుగదుల యిల్లు - పేరుకి రెండుగదులన్న

మాటేకాని నిజానికి ఒకటిన్నర గదులనే అనాలి. అద్దె యేడురూపాయలు. ఆ అద్దె యివ్వటంకూడా వారికి కష్టమే. కాని తప్పేదేముంది? ఇన్ని సామాను లెక్కడ పడతాయి? అయితే కొన్ని కొన్ని సామానులు - బల్ల, కుర్చీ, పీటల్లాంటివి సామానులుకొనే మనిషిని పిలిచి అమ్మటానికి నిశ్చయించు కున్నారు. అయినా ఇంకా మిగిలినవి, కమలకి ఉన్నవీ - అన్నీ యీ ఒకటిన్నర గదుల్లోనే... గోడౌన్ అనిపిస్తుంది. కమల యింక ఆలస్యం చెయ్యకుండా ఆ యిల్లే ఖరారు చేసింది. ఇంటివారిలో మగవాళ్లసంఖ్య తక్కువ. ఆడవాళ్లే యెక్కువ. ఒకరిద్దరు ముసలివాళ్లుకూడా ఉన్నారు. ఆశ్రయందృష్ట్యా యెలాంటి ఆపదలకు ఆస్కారంలేని యిల్లు. గదులు అంత ఆరోగ్యకరమైనవి కాకపోవచ్చు. కింద అంతస్తులో భాగం. గాలి, వెలుతురుకూడా కొంచెం తక్కువ. కాని యింకా ఆలస్యం చెయ్యటానికి వ్యవధిలేదు. అన్ని సౌకర్యాలూ ఉండటం సాధ్యం కానప్పుడు ఉన్నంత వరకే సంతృప్తిపడటం మంచిది.

ఈ యింటివారికి అక్కడ అడ్వాన్సు యిచ్చామని చెప్పటం జరిగింది. హేమ, అభయ్‌పద్ వచ్చి ఒక ఆదివారంనాడు సామాన్లవీ ఆ యింటికి చేర్చాలని స్థిర మయింది. ఆ రోజు దగ్గరకి వచ్చింది. కాని ఉమ యేమిటో రాయిలా అయిపోసాగింది. ఆమె కేదో ఒకవిధమైన నిర్లిప్తత అలముకుంది. కాళ్లూచేతులూ చచ్చుపడ్డట్లయినాయి. ఈ యిల్లు నిజంగా వదిలిపెట్టాలనేది ఆమెకేమిటో నమ్మకం కలగటంలేదు.

కమల ఒక్కతే అన్నీ చేస్తోంది. చాలాకాలంగా ఉన్న సంసారం. సీసాలు కొనేవాడిని కేకేసి, మూడునాలుగు తట్టల ఖాళీసీసాలు అతడికి అమ్మింది. పాత పంచాంగాలన్నీ ఒక కట్టఉన్నాయి. ఇంకా అవీ యివీ యెన్నెన్నో. ఇనుపతీగెకి ఉత్తరాలన్నీ గుచ్చి ఉన్నాయి. ఉత్తరాలు, అద్దె రసీదులు ప్రతిగూట్లోనూ దీర్ఘకాలపు జీవితయాత్ర చిహ్నాలు యెన్నో పేరుకుపోయాయి. సరుకులగదిలో ఉట్లూ, చెంబులూ యెందుకూ పనికి రావు. అమ్మటానికీ కుదరదు. వీటిలో కొన్ని మూతలు పెట్టిన డబ్బాలు విడిచిపెట్టారు. వాటిని తీసుకెళ్లాలి. ఎంత చిన్నసంసారమయినా, బియ్యం, పప్పులూ అవీ పోసుకోటానికి కావాలిగా!

ఉమ ఉదాసీనంగా ఈ యింట్లో గదులన్నీ తిరగసాగింది. ప్రతి చిన్నవస్తువు ఆమె జీవితంతో ముడిపడిఉంది. ఆమె చిన్నప్పట్నుంచీ యీ యింట్లో, యీ పరిసరాల్లోనే గడిపింది. పుట్టినప్పట్నుంచీ ఆమె పెరిగిన పరిధి యిదే. ఆమె అత్తవారింట్లో వేళ్లమీద లెఖ్ఖపెట్టేటన్ని రోజులే గడిపింది.

సరుకుల గదిలోకి వచ్చేసరికి, ఆమె కళ్లరెండూ జ్వలించి, కళ్లనిండా నీళ్లు నిండాయి. రాసమణి అన్నిటినీ అందంగా, పొందికగా అమర్చి పెట్టుకునే మనిషి. ఇటికలు యెత్తుగాపేర్చి వాటిమీద బల్ల అమర్చింది. దానిమీద లావుగా వుండే చుట్టుకుదుళ్లు పెట్టి వాటిమీద జాడీలు, వాటి పైన బిందెలు, బిందెలమీద మూతలు చక్కగా అమర్చింది. వాటిలో దేనిలో యేమున్నాయో ఉమకి అన్నీ కంఠస్థమే. ఆ వస్తువులన్నిటిమీద రాసమణి స్పర్శ ముద్రితమై వుంది. నియమంగా వాటిమీద దుమ్ము దులిపి, పాతగుడ్డతో తుడుస్తూంటుంది.

ఇల్లంతా బావురుమంటోంది. ఖాళీచేస్తున్న గాలి వీస్తుంది. కిటికీలు గుమ్మాలుకూడా యేదో బిక్కమొహం వేసుకుని, అదృశ్యదృష్టితో చూస్తున్నట్లున్నాయి. వీటికి ఆమె చిన్నతనంలోని స్వప్నకల్పనలు మొదలుకుని, యౌవనంలోని వ్యర్ధపరిణామంవరకు మధ్య ఉన్న చరిత్ర అంతా తెలుసు. ఆమె రహస్యంగా కార్చిన కన్నీటికివి సాక్ష్యాలు.

ఇల్లంతా మళ్లీ పూర్తిగా శుభ్రం చెయ్యలేదు. అనవసరమని వృథాగా శ్రమపడలేదు. కొన్నాళ్లనుంచి అన్నిగదుల్లోనూ దుమ్ము, చెత్త పేరుకు పోయాయి. తలుపులు, కిటికీలు తెరిచే ఉన్నాయి. గాలికి తలుపులు అటు యిటు కొట్టుకుంటూ ఉంటే అవి యెదో ఆర్తనాదం చేస్తున్నా యని పిస్తుంది. చిరిగిన పాతకాగితాలు గాలిలో యెగురుతూంటే, వాటికేదో దయ్యాలు పట్టినట్లనిపిస్తుంది. అవి యెందుకు పనికిరానివే అయినా, అవి అన్నీ యీ యింట్లోకి యెప్పుడెలా వచ్చాయో, ఉమకి యిప్పటికీ జ్ఞాపకం ఉన్నాయి.

చివరికి యిల్లిహ పూర్తిగా ఖాళీచేయాల్సిన రోజు వచ్చింది. ఉమ ఆరోజున ఒకపని చేసింది. తెల్లవారుఝామున లేచి నీళ్లు తోడుకుని వచ్చి, ఇల్లంతా కడిగి తుడవటం మొదలెట్టింది. శ్యామ పరుగెత్తుకుంటూ వచ్చి "ఏమిటే నువ్వు చేస్తున్నపని ఉమా! నువ్వు ఈ దయ్యానికి వెట్టిచాకిరీ చేయటందేనికి? ఆ పని గిరిబాలకి చెపితే పోయేదిగా! అది యివ్వాళకూడా ఉందిగా!" అన్నది.

"వద్దులే చిన్నక్కా! నేనే చేస్తాను. లేకపోతే మనస్సుకి శాంతి ఉండదు. ఇది యిన్నాళ్లూ మనకు ఆశ్రయ మిచ్చింది. దీన్నిలా వదిలేసి వెళ్లటం భావ్యంకాదు"

శ్యామ పెదవి విరిచి "నీకేమైనా మతిపోయిందా?" అన్నది.

శ్యామ కొద్దిరోజులూ తమ యింటికి వెళ్లలేదు. వీళ్లని యేకంగా కొత్తయింట్లో చేర్పించాక వెడుతుంది. ఆమెకి విచారంలేదనికాదు, ఆమె యిన్నాళ్లూ యిదే పుట్టిల్లుగా భావించుకుంటూ వచ్చింది. అదీకాక వీళ్లని గురించికూడా ఒక విచారం ఆమె అంతరాంతరాల్లో తొలుస్తూనే ఉంది. కాని భవిష్యత్తుని గురించిన స్వప్నం ఆమె మనస్సులో ఒక కొత్త ఆశ రేకెత్తించింది.

హేమ యింకొంచెం పైకి రాగానే, తాను వాడికి పెళ్లిచేస్తుంది. చిన్నవాడికి చదువు చెప్పిస్తుంది. తరూకికూడా చదువు చెప్పించాలని ఉంది. ఇప్పుడు ఆడపిల్లలు చదువుకోవటం తమ పల్లెటూళ్లలోకూడా పరిపాటి అయింది. స్వదేశీఉద్యమం యువకులు ఆడపిల్లల స్కూలు పెట్టించటం కోసం కిందామీదా పడుతున్నారు.

మళ్లీ అప్పుడప్పుడు - "సర్కార్‌గారి భార్యని పట్టుకుని, అల్లించి బెల్లించి కాస్త స్థలం సంపాదిస్తాను. తర్వాత తాను ఒక మట్టిగోడల యిల్లయినా కట్టుకోగలిగితే నన్నిహ యెవరు పట్టుకోగలరు? మట్టిగోడల యిల్లేమిటి? హేమపెళ్లికి నేను బాగా కట్నం తీసుకుంటాను. దాంతో గట్టి యిల్లే వస్తుంది" అంటూ ఉంటుంది.

ఉమ వింటూంటుంది. ఒక్క తల్లి కడుపున పుట్టిన అక్కచెల్లెళ్లు. పైగా యిద్దరు కవలలు. ఒకరి జీవితం ఉజ్వలమైన సార్థక్యంవైపుగా విస్తరించింది. కాని తన జీవితం? ముందువెనక, కుడియెడమ - యెటు చూసినా ఆశ అనేది లేదు. ఏదో ఒక సాఫల్యాన్నిగురించి కలలు కనటానికికూడా ఆధారం లేదు. ప్రభాతజీవితంలోనే నాలుగువైపులా కారుచీకటి. ఆమె మానసిక ఆకాశంలోని బంగారుకాంతులన్నీ చెరిగి పోయాయి. ఒకొక్కప్పుడు ఆమెకి క్రూరంగా తయారవా లనిపిస్తుంది. ఉన్మత్తమైన ఆక్రోశంతో సృష్టినంతా ధ్వంసంచేసి, సౌందర్యాన్నంతా తన గోళ్లతో చీరెయ్యా లనిపిస్తుంది.

భోజనాలవీ అయిపోగానే శ్యామ పిల్లల్ని తీసుకుని ఆ యింటికి వెళ్లి పోయింది. ఆమె - హేమ అక్కడ వీరి సంసారాన్ని చక్కదిద్ది వెడతారు. అభయ్‌పద్ ఒక్కడుమాత్రం వీరిని తీసుకెళ్లటానికి యిక్కడున్నాడు.

ఉమ యేమిటో తప్పించుకు తిరుగుతోంది. ఆమె వైఖరిచూస్తే, తాను కనబడితే వీళ్లు పట్టుకుని లాక్కుపోతారని భయంతో, యేదో తప్పించుకు తిరుగుతుందేమో అనిపిస్తుంది.

గిరిబాల కొన్నిసామానులు తోమి ఒక బస్తానిండా వేసి కట్టింది. ఇవి మధ్యాహ్నం వంటచేసుకున్న సామానులు, ఒక బాల్చీ. ఒక బిందెమాత్రం మిగిలాయి. ఆమె యివాళ ప్రొద్దుటినుంచి యేడుస్తోంది. ఆ యేడుపుకి యెడతెరపిలేదు. ఆమె చాలాకాలంనుంచి పనిచేస్తున్నది. మధ్య పరిమితమైన సమయంలో యితరుల యిళ్లలో పనిచేసే దాసిగా తిరిగేది. కాని యీ యింటిని పూర్తిగా వదిలెయ్యలేదు. రాసమణికి జబ్బు చేసి నప్పట్నుంచి మళ్లీ రాత్రింబగళ్లు పనిచేసే దాసిగా వుంటోంది. ఆమెకూడా మరొకచోట పనిచూసుకుని చేరటం జరిగింది. కొత్తయింట్లో రూపాయిన్నర జీతానికి నిర్దిష్ట సమయంలో పనిచేసే దాసిగా కుదిరింది. ఆమె కేవలం గిన్నెలూ, చెంబులూ తోమి వెళ్లిపోతుంది. గిరిబాల యీ వీథిలోనే మరొకరి యింట్లో రాత్రింబగళ్లు పనిచేసే దాసిగా కుదిరింది. మరొకపేటలో యింటికివెళ్లి పని చెయ్యటానికి వీలుండదు.

చివరికి ఒక సమయంలో ఆమెకూడా సెలవు తీసుకుంది. పమిట మెడచుట్టూ తిప్పుకుని కమలకి నమస్కరించబోయి వెక్కి వెక్కి యేడ్చింది· ఆయేడుపు కొంచెం తగ్గాక "పెద్దమ్మాయిగారూ నేను వెళ్లేముందు చిన్నమ్మాయిగారు కనిపించనేలేదు" అన్నది.

కమల కొంచెం తటపటాయించి, "ఎందుకులే గిరీ! అది తట్టుకోలేక పోతోంది. అందుకని తప్పించుకు తిరుగుతోంది, చూడటంలా? నువ్వు యిప్పుడు వెళ్లు, తర్వాత యెప్పుడైనా అయింటికి రా, చూసి వెళ్లొచ్చు" అన్నది.

"సరే" అని గిరిబాల పెద్ద నిట్టూర్పు విడిచి వెళ్లిపోయింది. కమల ఆమెకి కొత్త రేషన్ సిల్కుచీరె, అంచులేని పంచె కొని యిచ్చింది. చాలా కాలంనుంచి ఉన్నదామె. తల్లిలాగానే కనిపెట్టుకొని ఉంది. గోవిందు పెద్ద వాడయి ఉద్యోగం చేస్తున్నప్పుడు, గిరి కనుక బతికిఉంటే - అప్పుడు కమల మళ్లీ ఆమెని పిలిచి పెట్టుకుంటుంది. ముసలితనంలో ఆమెని కమలే చూస్తుంది.

అభయపద్ వచ్చి, "అత్తయ్యగారూ! వెళ్లి బండి పిలుచుకుని రానా? అని అడిగాడు.

కమల కళ్లు ఒత్తుకుని, "పిలుచుకుని రా బాబూ!" అన్నది.

కాని ఉమ యెక్కడి కెళ్లింది!

కమల పైకి వెళ్లి అగది యీగది వెతకటం మొదలెట్టింది. గదులన్నీ బావురు మంటున్నాయి. ఏదో భయభయంగా కమల ఒకసారి పిలవను

కూడా పిలిచింది. కాని బదులు రాలేదు. కమల ఉద్విగ్నురాలై గబగబా రెండో అంతస్తుపైన డాబామీదికి వెళ్ళింది.

డాబామీదినుంచి పెద్దరాస్తా కన్పించేమూల పిట్టగోడ కంతదగ్గిర బోర్లగా పడుకుని, ఉమ వీధికేసి చూస్తోంది. థియేటరు కడుతున్నప్పుడు ఆమె యిక్కడినుంచే చూస్తూఉండే దన్న సంగతి కమలకి జ్ఞాపకం వచ్చింది. దగ్గిరకు వచ్చి కమల ఆమె తలనిమురుతూ యెంతో ఆదరంగా "ఉమా ?" అని పిలిచింది.

ఉమ ఉలిక్కిపడి లేచింది. ఆమె యేకాగ్రతతో తన్మయురాలయి చూస్తోంది. అక్కడున్న చిన్నమైదానంలో సభఉంది. కుఱ్ఱవాళ్ళు అక్కడికే గుంపులు గుంపులుగా వెడుతున్నారు. వీధి నిండా జనం. కాని ఉమ యేమీ చూడటంలేదు. ఆమె దృష్టి అక్కడుందా ? ఆమె దృష్టి సుదూరమైన అతీతంలో ఉందో! అనాగతమైన అంధకారభవిష్యత్తుమీద ఉందో యెవరికి తెలుసు ?

"ఉమా ! లే చెల్లీ!" అన్నది, కమల ఆమె శిరస్సు నిమురుతూ

"నువ్వు వెళ్లు పెద్దక్కా నేను వస్తున్నా."

"కాదు రా, నువ్వు నాతో రా, అభయపద్ బండి పిలుచుకుని రావటానికి వెళ్లాడు."

"పద" ఉమ యేదో నిట్టూర్చలేకపోయింది. బలవంతంగా అణచు కుంది. ఏదోమైకంలో ఉన్నట్టు మెట్లుదిగి వచ్చింది. కిందిఅంతస్తు మెట్లమీదికి దిగబోతూ కాలుచాచి టక్కన ఆగిపోయింది.

"ఒక్కసారి అమ్మకి నమస్కరించి వెళ్లొద్దా అక్కా ?"

కమల సమాధానం చెప్పలేకపోయింది. ఆమె మాట్లాడకుండా తల్లి గదివైపు సైగతో సూచించింది. తానుకూడా ఆమెవెంట వెళ్ళింది. అది రాసమణి గది. ఆమె చాలాకాలం యీగదిలోనే ఉంది. చాలారోజులు యీ గదిలోనే రోగశయ్యమీద గడిపింది. ఇక్కడే యీమెకు పాతినచోటే ఆమె చివరిశ్వాస వదిలింది. ఈగదిలో అణువణువునా తల్లి స్మృతులున్నాయి. ఉమ కిప్పటికీ యిక్కడ గాలి తల్లి వాసన వస్తూన్నట్లుంటుంది.

ఉమ యింతవరకు బలవంతంగా అణచుకున్న కన్నీళ్లు యింక ఆగలేదు. మోకాళ్లమీద, కూచుని వంగి నమస్కరించబోయేసరికి ఆమెకి యేడుపు పొంగి వచ్చింది. "అమ్మా ! నన్నుకూడా తీసుకెళ్లమ్మా ! ఇహ నేను భరించలేను"

కమల యేమని ఓదారుస్తుంది? ఆమెకీ యేడుపు పొర్లి వచ్చింది. నిర్జనంగా నిస్తబ్దంగా ఉన్నయింట్లో యీ అభాగినుల యిద్దరియేడుపు గోడ గోడకి యెదురు తగిలి, యేదో బయటికి రాలేకపోయినట్లుంది. గాలితోనే అక్కడే సుడులు తిరుగుతోంది.

ఆయేడుపు ఆగలేదు. వారు ఆపుకోలేక పోయారు. అభయపద్ రాక పోయినట్లయితే, యెప్పు డాగేదో యెవరికి తెలుసు? అంతేకాదు. అభయపద్ వచ్చికూడా వారిని పిలవటానికి కాసేపు తటపటాయించాడు. చివరికెలాగో గొంతు సవరించుకుని, "పెద్దత్తయ్యగారూ! బండివాడు తొందరపెడుతూ గొడవ చేస్తున్నాడు ఇంక బయలుదేరాలి" అన్నాడు.

కమల సమాధానం చెప్పలేకపోయింది. కాని యెలాగో తననుతాను సంబాళించుకుని, లేచి నుంచుంది. తర్వాత ఉమను యించుమించు లాక్కుని వచ్చి బండిలో కూచోపెట్టి తానూ యెక్కింది.

అభయపద్ యింకోక్షణం ఆగాడు. ఇల్లంతా ఒక్కసారి కలయచూశాడు. అవసరమైనవి యేదీ విడిచిపెట్టలేదు. తర్వాత వంటింట్లో బిందెడు నీళ్లు కుమ్మరించి, ఆ బిందె బాల్చీ తీసుకుని, అతడు బయటికి వచ్చాడు.

తలుపు తాళంవేసి లాగి చూశాడు. ఆతాళంచెవి యివాళే యింటివారికి యివ్వాలి. వాళ్లెవరూ రారు. తానే వెళ్లాలి.

వారు శాశ్వతంగా ఆ వీధిని, యెన్నో యేళ్లుగా ఉన్న ఆ పురాతనపు యింటినీ వదిలి వచ్చేశారు. మబ్బులు కమ్మిన ఆషాడమాసపు అపరాహ్ణ వేళ ఆ యిల్లు మాత్రం అలాగే నిలిచి ఉంది. ఆ చీకటిగా ఉన్న లోపల బహుకాలపు స్మృతులు అలాగే నిలిచిపోయాయి. వానగాలికి ఆ కిటికీల తలుపులు టప టప కొట్టుకుంటున్నాయి. ఇవాళ ఆ యింట్లో దీపం వెలగదు. ఇవాళ యెవరూ డాబామీద పిట్టగోడకి తల ఆనించుకుని కన్నీళ్లు కార్చరు. బహుశా కొన్నాళ్లు పోయాక మళ్లీ కొత్త అద్దెవాళ్లు రావొచ్చు. మళ్లీ కొత్తవాళ్ల రాకపోకలు మొదలవుతాయి. అయితే వారు వేరు మనుషులు. అది వేరు చరిత్ర.

